శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. } సంచిక ౧.



కాకినాడ

క్రొత్తపల్లి సూర్యారావుచే పరిషత్కార్యాలయమున

ప్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

ఏప్రియల్, మే 1937.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.


సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు.


## విజ్ఞాపనము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికకు- ఇరువదియైదేండ్లు గడచినవి. ఇరువదియాఱవసంవత్సరములో నిది మొదటిసంచిక: పెద్దలగు భాషాభిమానుల యాదరమున నిట్లింతవఱకు జరుగుచున్నది. వార్షికమూల్యముల నీయవలసినవారికి ముందు జ్ఞాపికలు వ్రాయుచున్నారము. దయచేసి వారువారీయవలసిన ధనమును బంపఁగోరుచున్నారము. మఱియు నూతనసంవత్సరమునకుఁ బంపవలసినధనమును బంపఁగోరుచున్నారము. మరలఁ గాగితములకుఁ గఱవువచ్చుచున్నది. పత్రిక నడచుటకు ముందుగానే యేర్పాటులు చేసికొనక తత్తత్కాలములలోఁ జేసికొనుట కొంత తొందరకుఁ గారణము. కావున మాకుఁ బాఠకులు ముందుగానే తోడ్పడుదురుగాక. పాఠకులు స్వహస్తపరహస్తములచే సాయము గావింపవలయును. పరిషత్ప్రకటితగ్రంథములను గొనియుఁ బత్రికకుఁ బాఠకులయ్యు వారివారిమిత్రులు మాకుఁ బ్రోత్సాహ మొసంగ మఱిమఱి కోరుచున్నారము. ఉభయభాషావేత్తలు మాపత్రికకుఁ దగిన భాషావిషయకములు చారిత్రకములు నగు వ్యాసములను రచియించి పంపవేఁడుచున్నారము.

పరిషత్పత్రికలు ప్రాఁతవి కావలసినవారికి వెల సులభముగా నొసంగెదము. వెనుకటిసంచికలు తగ్గిపోవుచున్నవి. విద్యార్థులు, పఠనమందిరములవారు, భాషాభిమానులు వానిని సంగ్రహించి యుంచుకొని వానిలోఁగల యమూల్యవిషయవ్యాసములను గుర్తింతురుగాక యని మనవి.

# సత్యనారాయణా !

—శతావధాని- పిసుపాటి చిదంబరశాస్త్రిగారు, పిఠాపురము.—

---

మ. తొలఁగంద్రోయుటకుఙ్ విపత్తులు సంతోషంబు నెప్పట్ల వ
ర్ధిలఁగాఁజేయుటకుం ద్వదన్యుఁ డెవఁడుఙ్ దేవుండు నీవంటి వాఁ
డిలలో లేఁ డని లోక మంతయును నిన్నే కొల్చుచుండంగ న
న్యుల నే నేటికి నాశ్రయింతు శ్రితబంధూ సత్యనారాయణా !

మ. కలలో నీ వొకనాఁడు గన్పడినచోఁ గల్యాణముల్ పెక్కుఁజా
యలఁ బ్రాప్తించుచునుండ నిన్నెపుడుఁ బ్రత్యక్షంబుగాఁ గన్గొనం
గలుగం గల్గెడిభాగ్య మింత యని వక్కాణింపఁగా నెంతవా
రలకుఙ్ శక్యమె సర్వనిర్వహణధుర్యా సత్యనారాయణా !

మ తపముం జేయఁగఁజాల క్షేత్రములు సందర్శింపఁగాఁజాలఁ బా
పపరీహార మొనర్చుకర్మములు సల్పంజాల నే నెట్లు నీ
కృపకుం బాత్రుఁడనై తరింతు భవవార్ధిఙ్ ఈఁదు నావాఁ డట
న్నపితృప్రేమము నాపయిం గలుగకున్నఙ్ సత్యనారాయణా !

మ. కలిలోనఙ్ గలవార లుద్ధృతులు గాఁగఙ్ రెండుమార్గంబు లిం
దులసంసారవిరక్తుఁడై జగములందుఙ్ నిండు నిన్నాత్మగాఁ
దలఁపం గల్గుటయొండె బద్ధుఁడయినం ద్వద్భక్తిసామ్రాజ్యముం
గలకాలంబు వహించుటొండె భృతలోకా సత్యనారాయణా !

మ. నను నే స్తోత్రముచేసికొంటయును నన్యస్తోత్రముల్ చేసి య
న్యునిచే స్తోత్రము లందికొంటయును నెంచఙ్ నాకుఁ బ్రాపింపకుం
డను నీపైఁ గలభక్తియుం దొలఁగకుండంగం బ్రసాదింపు మె
ల్లను నే నైహికమైన తుచ్ఛసుఖమెల్లఙ్ సత్యనారాయణా !

---

# మాచద్దేవిశాసనము.

—పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. పిఠాపురము.—

---

"శ్లో॥ శ్రీశాకే రసబాణ రామశశి యు జ్యానందసంవత్సరే।
జ్యేష్ఠే(కృష్ణ)మృగాంకవారసహితే (దర్శే) ఖరాంశేగ్రహే।
సద్భార్యా పరదేశ మాచరమణీ రమ్యం శిలామందిరం।
ప్రాదా చ్ఛ్రీ గుడిమెట్టనామనగరే శ్రీకేశవస్వామినే॥
సప్తాంభోనిధిసంతతాంబుపటలీసంసక్త(ధీరా)చితః
......త్పరదేశమాచరమణీ రత్నేన యత్నాత్కృతే
భూయిష్ఠం గుడిమెట్టనామనగరే విద్యోతమానం నవం
నూనం ప్రాప్య శిలాగృహం విజయతే లక్ష్మీసఖః కేశవః॥
పరదేశే మాచమాంబా పుణ్యప్రారబ్ధసత్తకం
రాజుపాళేతొండిచెర్లాగ్రహారద్విజరాజేభ్యోమహేత(ది)రమదాత్॥
రమ్యాయాః పరదేశి మాచయువతేః బ్రహ్మప్రతిష్ఠాప్రపా
వాపీకూప తటాక సత్ర సుకృతోద్యానంచ విభ్రాజితం।
స్వామి శ్రీగుడిమెట్ట కేశవ............తకే
సించంతు ప్రతివాసరం ఘనకృపాసారై ర్మనోహారిభిః॥
శ్రీగుడిమెట్ట చెన్నకేని దేవర మారసాని దేవరముందర పరమనీచ సానుండదో—"

---

ఈశాసనము కర్నూలుజిల్లా సోమిదేవిపల్లె స్టేషనునకు నాలుగు మైళ్లు దక్షిణ భాగమం దున్న గుడిమెట్ట యను గ్రామమునందు శిథిలమైన చెన్నకేశవస్వామివారి యాలయమునం దున్నది.

నేను 1921 సంవత్సరమునందు శ్రీపిఠాపురము మహారాజావారి యాజ్ఞానుసారము ప్రాచీనగ్రంథసంపాదనము నిమిత్తము, ఆగ్రామమునకు వెళ్లినప్పు డీశాసనమును జూడం దటస్థించినది. గవర్నమెంటువారు

కర్నూలుమండలమునందలి ప్రాచీనశాసన పరిశోధనమును 1920 వ సంవత్సరప్రాంతమునకుఁ గాని ప్రారంభించినట్లు కనఁబడదు.

ఈశాసనము మాచల్దేవి యను నొకవారవనితచేత నెలకొలుపఁబడినది. ఈపెచే నాకాలముననే నిర్మింపఁబడిన పెద్దచెఱువు గూడ నాగ్రామమునందే ప్రసిద్ధికెక్కి యున్నది. మాచల్దేవి యనునామె రెండవప్రతాపరుద్రచక్రవర్తి యుంపుడుకత్తె యని క్రీడాభిరామమున నిట్లుగా వర్ణింపఁబడినది.

"శా. ద్వీపాంతంబుననుండి వచ్చితివె భూదేవా ప్రశాంతం మహా
పాపం సర్వజగత్ప్రసిద్ధుఁడనో బాణాసనామ్నాయ వి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీశోపాత్తగోష్ఠీప్రతి
ష్ఠాపారీణ నెఱుంగవయ్యెదవె మాచల్దేవి వారాంగనన్.

వ. చిత్రశాలాప్రవేశంబు చేయుచున్నది. మీరును.........జూడవచ్చునది యనిన.

గీ. లెస్సగాక కిరాట యీలేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన
దీనిఁ జూడంగఁబోదమా యీనెపమున
నరసి చూతము మనకేమి యచట ననుచు.

వ. అనుచు...బిల్లికూటంబున నిలువునం గైసేసి హంసతూలికాతల్పంబు మీఁదం గూర్చున్న హావభావవిభ్రమవిలాసనిధి మాచల్దేవిం గనుంగొని.

*    *    *    *    *    *

గీ. కల్లఁ జెప్పము విను నీకుఁ గలప్రసిద్ధి
డిల్లి సురతాణికిని లేదు పల్లవోష్ఠి
యాదిలక్ష్మికి నీకును భేదమేమి
యుదధి జనియింపకుండుట యొకటదక్క.

గీ. ఓరుగంటి మాచాంబ పయోరుహాక్షి
పంచబాణావతారుని మంచిఁ జూచి

కంకణాలంక్రియోర్ఘుణాత్కార మెసఁగ
నయ్యగారికి జోహారు లనుచు మ్రొక్కె."

మఱియు చిత్రశాలవర్ణనమును బట్టిచూడ నామె మహాధనికురా లనియు దానశీల యనియుఁ జెప్పవలసి యున్నది.

ఈమెశాసనములు పెక్కు లుండిన వని క్రీడాభిరామపీఠికలో బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు, కాని, శ్రీశాస్త్రిగారి యభిప్రాయము ననుసరించియు నీశాసనమునందలి శకవర్షముల ననుసరించియు మాచల్దేవి ప్రతాపరుద్రునినాఁటిది కాక యాప్రతాపరుద్రుని యనంతరము నూఱేండ్లనాఁటి దయి క్రీ. 1434 సంవత్సర ప్రాంతపుదిగాఁ గనఁబడుచున్నది. ఒకవేళ నీమాచల్దేవి పేరుగలది ప్రతాపరుద్రుని యుంపుడుకత్తెగా నుండిన నుండవచ్చును. ఈమె శ్రీనాథుని కాలపు దనుట మాత్రము నిశ్చయము.

ఈమెభర్తనుగుఱించి-యీశాసనమున "సద్బ్రాహ్మ్య" యనియును, "పరదేశమాచరమణి" యనియు నుదాహరింపబడియుండుటచే నామె గృహనామము పరదేశి యనియు, సత్పురుషులను జేపట్టునదియే యనియుఁ దోఁచుచున్నది. మఱియు శాసనమునడుగున "మాచసానిదేవర ముందర పరమనీచసానుండదో" యను నొకవాక్యమున్నది. దీనిని బట్టి యీమె వారవనిత యనియు స్వవృత్తిని నీచవృత్తినిగానే భావించుచున్న దనియుఁ దలంపఁ బడుచున్నది. వృత్తి యెట్టిదైనను- బ్రహ్మప్రతిష్ఠ ప్రపా వాపీ కూప తటాక సత్రప్రతిష్ఠాది సుకృతకార్యములను జేయు సద్వృత్తి గలది యని తలంపవచ్చును.

---

# శ్రీ కృష్ణభూపతిదేవుమహారాజులుంగారివర్ణన.

— శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు. —

---

సీసమాలిక.

సిరిమించు మత్స్యభూవరునియన్వయమునఁ
గలశాబ్ధిని దపాకరునికరణి
మంజుకళాగరిమంబున జనియించి
మాడువు లనఁ బ్రోల మహితలీలఁ
బ్రాజ్యసామ్రాజ్యధురంధరుఁడై జగ
న్నాథభూపతిదేవునందనుఁ డయి
పొలుపార శ్రీకృష్ణభూపతిదేవు సం
తత దానతోషితధరణిదేవుఁ
డఖిలమూర్ధాభిషిక్తాస్థానమండప
మాధురీధుర్యవాఙ్మహితలలిత
సంస్కృతప్రాకృతసంగీతవైకృత
సాహితీకవితారచన(సు)చణ
కల్పితాత్యనవద్యగద్యపద్యపదప్ర
బంధగీతవ్రాతబహుళవర్ణ
వర్ణ్యమానానూన వరగుణజాలుఁడు
సముదయోత్కీర్ణరసాప్రపూర్ణ
శీలుఁడు తేజోవిశేషసముత్సారి
తాశేషరిపుఁ డస్త్రకౌశలపరి
హసితకృపుఁడు హరిదంతరవలమాన
శారదనీరదపారదహార
హారనీహారసురాహారతారకా
కాశనీకాశప్రకాశమాన
యశుఁ డని తను నహర్నిశ మెల్లమానిసుల్
గొనియాడ బయలుప్రాఁకనలరుపస
దగు జళువాపైఁడితమ్మిమొగ్గలరేవఁ
బయిపయిఁబొల్చు పొంబనఁటుల ...

సొంపును దెసవవ్వు సొరిది నాడాడనేఁ
                    గెడు మొయిలందూలనడఁచుపసిఁడి
జండాలపెంపును జెలువగు నిలువగు
                    నలువగు బటువులైనాలచాలు
గని తమ్మునొక్కటఁ గలయు గాటపుటాస
                    నందటికి దగి నందమైన
చలువలవేల్పుసూపుల కోపు లని యెదం
                    దలఁచి వలచితమిఁదారుతార
కానికాయంబు నాఁగ్రాలురసపుబుడ్లు
                    బారులుభూస్థితి బంచజనుల
పాపములెడలించి పాలింప నవతరిం
                    చిన నిలింపులునాఁగఁ జెలఁగుచిత్ర
పుటఠంబుల (వగు) తవురులు బంగారుక
                    శీదాపనిహారంగు చెంగలించు
గజలక్ష్ము లలరు ఖీన్ఖాబుకల్వడములు
                    నపరఁజిగోలుసుల నంటిప్రేలు
గ్లోబులు లస్టర్లుఁ గొమరారునార్గను
                    లాంఁపులు, వాల్ సేట్లు నింపుఁబెంపు
గాంచనడోలికల్ కౌచీలు, కుర్చీలు
                    నపరఫీల్జవ్వాజి యగరుపుచుఁగు
తాషుదస్తులు మహాతాబుపోషకులు బ
                    నారసు వల్వాలు నాణెమైన
యూణికట్టాణి సువ్వాణి ముత్తియముల
                    హారము ల్పచ్చలపేరులు మగ
ఆలసర్ఫేషు తురాయీల రతనంబు
                    టొంటులు గెంపుల యుంగ్రములును
నింపిన మంజసల్ నిల్వుటద్దములను
                    గొనబుహొంబని పలంగులును గల్గు
కలువరాయని మానికమ్ములమేడలో

బంగరుతళ్కుపై రంగుమీఱు
నాసీనులై ప్రక్రియార్థికాంశములనై
పుణికించు వైయాకరణులు యుక్తి
శాలులౌ తార్కికుల్ జైమినిసూత్రప
విత్రపద్ధతి సక్త విశదమతులు
విమల వేదాంతకోవిదుల్ వేదవిదులు
హాయిగాఁ బాడుగాయకులుఁ గంపి
తారోహణావరోహాందోళమూర్ఛితా
ప్రత్యాహతాహతప్రముఖదశవి
ధగమకవిజ్ఞాన దక్షులౌ వైణికుల్
మాహార్తికాశ్రితమంత్రవేదు
లు రసజ్ఞులగుకవీశ్వరులు నొక్కొకవేళ
వచియించు పలుకులవలనడెంద
మానంద మొంద నొకప్డు డొంతే యస
మానలాస్యకళావిలాస...
సరసలై నట్టి యచ్చరల మచ్చరికించు
జట్టిపేమాటుల నట్టువులయుఁ
బాటల నాటల పరిపాటియింపొన
రింపఁగా బట్టుల గుంపొకయెడఁ
గై వారములుసేయఁగా వారివారికిఁ
దగుతెఱంగుల మంచిధరణులు రత
నాలుఁ దోడాలు దుశాలాల్బనారసు
దుస్తులు మొదలగు వస్తువుల వ
రాలు వజ్రాలసరాలు బిలాతిగు
ఱాలు జాల్వాపల్లకీలొసఁగుచు
నింద్రవైభవభోగనిస్తంద్రుఁ డగుచు
ననయముఁ బ్రజాళి ననురక్తి మనుచుచు వసు
ధాతలం బేలుఁగాత నిరీతిరీతి
నంచు మముఁ బల్కఁగల్గి పల్కించునెపుడు.

# ప్రకాశవర్షుఁడు–రసార్ణవాలంకారము.

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, యం. ఏ.,
ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకులు,
పిఠాపురరాజకళాశాల, కాకినాడ.

## — 1. మున్నుడి. —

రెండుసంవత్సరములక్రిందట నాంధ్రసాహిత్యపరిషత్పత్రికలో [సంపు. 23-24. (1934-35.)] ప్రకాశవర్షుని 'రసార్ణవాలంకారము' నాసంపాదకత్వమున వెలువడినది. నేఁటివఱకు దానికిఁ టీక వ్రాసి పుస్తకరూపమున నీకృతిపుష్పమును సహృదయలోకమున కర్పించుటకు యోగములు కూడినవి కావు. పలువురు రసజ్ఞు లీగ్రంథమును బంపుఁ డని పరిషదధికారులకుఁ జాలసారులు వ్రాయుచుండి రని విని దీనియెడఁ బాఠకలోకము చూపుసమాదరణమునకు సంతసించి, గ్రంథకర్తను, దత్కృతికాలాదులను, నీకృతివైశిష్ట్యమును గుఱించినసమాలోచనమును బండితలోకమున కర్పించుచున్నాఁడను.

## — 2. కృతజ్ఞత. —

ఈకృతిని మొట్టమొదట-మహోపాధ్యాయ-విద్యాభూషణబిరుదాంకితులు చెన్నపురివిశ్వవిద్యాలయసంస్కృతపండితులునగు వి. వేంకటరామశర్మగా రాంగ్లలిపిలో నుచ్చారణచిహ్నముల (Dia-critical marks) తోడను నుపోద్ఘాతముతోడను కలకత్తానగరమున ఆచార్య నరేంద్రనాథ లా[1] సంపాదకత్వమున వెలువడు 'భారతీయేతిహాసత్రైమాసికపత్రిక'[2]లో నేఁటి కెనిమిదివత్సరములకుఁ బూర్వము [మార్చి-1929 లో] ప్రకటించియున్నారు. ఈకృతి గుణోత్తరముగా నుండుట గాంచి యాంగ్లలిపిలో ముద్రింపఁబడినశ్లోకముల నాంగ్లభాషాభిజ్ఞులే యెంతయో పరిశ్రమ సల్పినఁగాని చదువనేర నప్పు డీక నాంగ్లభాషా

---

1. Dr. Narendranath Law, M. A., B. L., PH. D., P. R. S.
2. 'Indian Historical Quarterly'—Vol. V. No. 1. March, 1929.

గంథము నెఱుఁగని యాంధ్రదేశసంస్కృతపండితుల కీకృతి యన నచుం బిత్రప్రక్రియగా నుండు నని యెంచి దీనిని దెలుఁగు లిపిలో విపులసమాలోచనపూర్వకముగా రసజ్ఞలోకమునకు నివేదించుచున్నాఁడను. శర్మగారీకృతిని బ్రచురించినకొన్ని నెలలకే-ఆచార్య-సుశీలకుమార-డే-గారు[1] [డక్కావిశ్వవిద్యాలయమున గీర్వాణపీఠాధ్యక్షులు] శర్మగారిపీఠికలోని యనేకసిద్ధాంతముల ఖండించుచుఁ బైకలకత్తాపత్రిక[2]లోనే యొకవ్యాసమును బ్రకటించియున్నారు. 'డే'పండితు లిప్పటికి రెండుసంవత్సరములకుఁ బూర్వమే 'లండన్' నగరమునుండి వెలువడు 'ప్రాచ్యవిద్యాలయపత్త్రిక'[3]లోఁ బ్రకృతగ్రంథమును గూర్చి యించుక వ్రాసియున్నారు. ఈనడుమ చెన్నపురవిశ్వవిద్యాలయమున గీర్వాణశాఖలోఁ బరిశోధకులుగానుండిన ఆచార్య వి. రాఘవన్ పండితులు కూడ శర్మగారిసిద్ధాంతములను నిరసించుచు చెన్నపురిలోఁ బ్రకటింపఁబడు 'ప్రాచ్యపరిశోధనపత్త్రిక'[4]లో[1934]నొకవ్యాసమును బ్రచురించియున్నారు. సాహిత్యాచార్య, వేదాంతభూషణ నందకిశోరశర్మ యనుకాశీపండితులు ప్రాచ్యవిద్యావైభవ-మహామహోపాధ్యాయ, గోపీనాథకవిరాజ [యం.ఏ] మహోదయుని సంపాదకత్వమున 'సారస్వతాలోకము'నందలి ప్రథమకిరణమున కనుబంధముగా 'సంస్కృతకవిపరిచయము-భారవి'[5] యను కృతిని [1932] బ్రకటించియున్నారు. పైవ్యాసములు, కృతులును బ్ర

1. Dr. S. K. De, M. A., D. Lit., Head of the Department of Samskrit & Bengali, Dacca University.

2. 'Indian Historical Quarterly'–Vol. V. No. 4. December, 1929. (Pp. 770—80).

3. 'Bulletin of the School of Oriental Studies'–Vol. IV. Part ii, P. 283.

4. 'Journal of Oriental Research'—Vol. VIII. Part 3. Pp. 267—76 (1934).

5. 'The Sarasvataloka'–Kirana I (Supplement): 'సంస్కృతకవిపరిచయః-మహాకవిభారవిః'-నిబన్ధకః సాహిత్యాచార్య శ్రీనందకిశోరశర్మా. [Benares, 1932.]

కృతము విశేషముగా నుపకరించినవి. మఱియు 'డే' పండితుని 'అలంకారశాస్త్రచరిత్ర'[1], పాండురంగవామనకాణేపండితుని 'అలంకారశాస్త్రచరిత్ర'[2], ప్రకృతము ముద్రణమునందున్న డాక్టర్-మాడభూషి కృష్ణమాచార్యులవారి 'సంస్కృతసారస్వతచరిత్రము'[3] నాకుపకారకములయినవి. పాఠకులకు సుబోధముగా నుండుటకై శ్లోకముల ప్రక్క నాయాశ్లోకములందలి విషయములఁ దెలుపుసూచికలను జేర్చియున్నాఁడను. విజయనగరమహారాజసంస్కృతకళాశాలలోని 'రసార్ణవాలంకారము'యొక్క వ్రాఁతప్రతియందలి పాఠభేదము లనుబంధమునఁ జూపఁబడినవి.

## — 3. ప్రకాశవర్షులు. —

సంస్కృతవాఙ్మయమునఁ బ్రకాశవర్షుఁ డనునామముతో నలుగురు గ్రంథకర్తలు కన్పట్టుచున్నారు.

౧. వల్లభదేవుని 'సుభాషితావళి'[4]లోను, శార్ఙ్గధరుని 'శార్ఙ్గధరపద్ధతి'[5]లోను నుదాహరింపఁబడిన ప్రకాశవర్షుఁడు. ఈతఁడు కాశ్మీరదేశస్థుఁ డనియు, భట్టహర్షుని సుతుఁ డనియు, 'సుభాషితావళి'లో నుదాహరింపఁబడిన దర్శనీయకవి (=దోర్గతికాదర్శనీయకవి?)కి జనకుఁ డనియు, గౌడకవి భట్టనరసింహకవిపుత్త్రునికి శిష్యుఁ డనియు నందకిశోరపండితులు వ్రాసియున్నారు.[6] వల్లభదేవ [క్రీ. 1417-67] శార్ఙ్గధరులచే

---

1. 'Studies in the History of Sanskrit Poetics'- Vol. I (1923)- By Dr. S. K. De, M. A., D. Lit.

2. 'History of Alamkara Literature'-By Prof. P. V. Kane, M. A., LL. M. (1923.)

3. 'History of Classical Sanskrit Literature'- Second, revised and enlarged edition (now in course of publication)- By Dr. M. Krishnamachariar, M. A., M. L., PH. D., M. R. A. S.

4. Edited in the 'Bombay Sanskrit & Prakrit Series'- By Prof. Dr. P. Peterson. (1886).

5. Edited in the 'Bombay Sanskrit & Prakrit Series'- By Dr. Peterson. (1888).

6. సంస్కృతకవిపరిచయము-పు. 20.

[క్రీ. 1363] నుదాహరింపఁబడియుండుటచే నీప్రకాశవర్షుఁడు క్రీ. 1363 కంటెఁ బూర్వుఁ డని చెప్పఁదగును.

### ౨. భారవికృత 'కిరాతార్జునీయము' నకు వ్యాఖ్యాత.

ఈప్రకాశవర్షుని, దద్వ్యాఖ్యను దేవరాజయజ్వ తనభారవివ్యాఖ్య ('సుబోధిని') యందును,[1] గదసింహుఁడును[2] [క్రీ. 1200-1600] మల్లినాథుఁడును దమ 'కిరాతార్జునీయవ్యాఖ్యల'లో [IV స. 10 శ్లో.] ను బేర్కొనియున్నారు.

### 3. మాఘకృత 'శిశుపాలవధ'కు వ్యాఖ్యాత.

ఈప్రకాశవర్షుని వల్లభదేవుఁడు స్వకృతమాఘవ్యాఖ్యలోఁ దనకు గురువుగాఁ బేర్కొనియున్నాఁడు. ప్రకాశవర్షునకు మహోపాధ్యాయబిరుద మున్నటు లీతనియాకరమువలనఁ దెలియుచున్నది.[3] ఈగురుశిష్యులు సమకాలికులు గావున వల్లభదేవునికాలము నిట విచారింపఁజనును. [ఈతఁడు 'సుభాషితావళి'సంధాత యగువల్లభదేవునికంటెఁ బ్రాచీనుఁడు, భిన్నుఁడు నని యెఱుఁగునది.]

---

1. 'ప్రకాశవర్షప్రభృతిప్రణీతా, వ్యాఖ్యా న పూర్ణా ఇతి భారవీయే
కావ్యే ప్రభూతాం విదధాతి టీకాం, శ్రీదేవరాజో విదుషాం నిదేశాత్.'
   i. 'Triennial Catalogue of MSS.' of the 'Govt. Oriental Manuscripts Library-(Madras)-Vol. II. Part 1. C. (No. 1854 d)
   ii. 'Ibid—Vol. IV.' Part 1. (No 2912)
   iii. 'Travancore Catalogue'-P. 97. [Cantos I-IX & XV]. 1895.
2. 'సన్తి ప్రకాశవర్షాది టీకా అపి సువిస్తరాః
తథాపి లఘుబోధార్థం గదసింహోఽకరో దిమామ్'
'సంస్కృతకవిపరిచయము-భారవి'-పు. 47
3. (అ) 'శ్రుత్వా ప్రకాశవర్షాత్తు వ్యాఖ్యాతం తావ దీదృశమ్
విశేషతస్తు నైవాస్తి బోధోఽత్రానుభవా దృతే.'—చతుర్థసర్గటీకా.
(ఆ.) "అత్ర మహోపాధ్యాయః ప్రకాశవర్షః—
'షష్ఠీసమాసోఽప్యత్ర బహువ్రీహ్యర్థేఽన్తర్భవ త్యేవ. యోహి యస్య సఖా తస్యాసావపి భవత్యేవ.' ఏవ మత్రాపి. —20 సర్గే 71 శ్లోకటీకా.

వల్లభదేవుని పౌత్రుఁ డగు కైయటుఁడు క్రీ. శ. 977 లో నానందవర్ధనుని 'దేవీశతకము'నకు వ్యాఖ్యను రచించెను. ఆవ్యాఖ్యనుండి యీ ప్రమాణమును జూచునది.[1]

> శ్లో. 'వల్లభదేవాయనిత శ్చన్ద్రాదిత్యా దవాప్య జన్మేమామ్
> కైయటనామాఽరచయ ద్వృత్తిం దేవీశతకస్తోత్రే.
> శ్లో. వసుమునిగగనోదధి [4078] సమకాలే యాతే కలే స్తథా లోకే
> ద్వాపఞ్చాశే వర్షే రచితేయం భీమగుప్తనృపే'.

కైయటుఁడు క్రీ. శ. 977 ప్రాంతముల జీవించియుండుటచే నాతని పితామహుఁ డగు వల్లభదేవుఁడు క్రీ. శ. 927 ప్రాంతముల జీవించియుండె నని నిశ్చయింపనగును. కావున వల్లభదేవుని విద్యాగురు వగు ప్రకాశవర్షుఁడు క్రీ. శ. 875-925 నడుమ విలసిల్లియుండవచ్చు నని నందకిశోరశర్మగారు వ్రాసియున్నారు.

## ౪. రసార్ణవాలంకారకర్త యగు ప్రకాశవర్షుఁడు.

ఈనలుగురును భిన్నులా, కారా యనునది విమర్శనీయము. మాఘభారవుల కావ్యములకు వ్యాఖ్య వ్రాసి, సుభాషితావళి మొదలగు సంధానగ్రంథములలోఁ జేర్పఁబడిన ప్రకాశవర్షుఁడు కవి యనియు, నందువలన నాలంకారికుఁ డగు మనగ్రంథకర్తకంటె భిన్నుఁ డనియు వేంకటరామశర్మగారు వ్రాసియున్నారు.[2] భిన్నవాదమునకు తగినంతటి ప్రబలప్రమాణము నేమియుఁ జూపక సిద్ధాంతీకరించుట చింత్యమనుచు వీరియభిప్రాయమును ఖండించుచు పండితనందకిశోరశర్మగా రిట్లు నుడివియున్నారు;[3]

—కవి యగువాఁ డాలంకారికుఁడు కాఁ డనుట యపసిద్ధాంతము. కవి యైనవాఁడే యాలంకారికుఁ డగుటకు నిదర్శనము లనేకములు గలవు. దండి, భోజుఁడు, 'సాహిత్యదర్పణ' నిర్మాత యగువిశ్వనాథుఁడు 'రసగంగాధర' కారుఁ డగు జగన్నాథపండితరా

---

1. 'సంస్కృతకవిపరిచయము-భారవి'—పుట. 21.
2. Introduction to 'Rasarnavalankara'—P. IV.
3. 'సంస్కృతకవిపరిచయము'—22-23 పు.

యులు మొదలగు ననేకు లుత్తమాలంకారికులే కాక తమకావ్యనిర్మాణపాటవముచేతను ప్రసిద్ధులై యున్నారు. నామైక్యముండి, విరోధిప్రమాణము లేనప్పుడు వ్యక్తిద్వయకల్పన మసంగతము. కావున నిరువురు నొకఁడే—

కాని వీరిసిద్ధాంతముకంటె వేంకటరామశర్మగారి యభిప్రాయమే సరి యని తోఁచెడిని. మాఘభారవికావ్యవ్యాఖ్యాత లిరువురు నొకఁడే యనియు, నీతఁడు భోజునికంటెఁ [క్రీ. 1005-1054] ప్రాక్తనుఁ డనియు, భోజునికంటె మనయాలంకారికుఁడు భిన్నుఁ డనియు, బరుఁ డనియుఁ దోఁచుచున్నది. సుభాషితావళిలోఁ జేర్పఁబడిన ప్రకాశవర్షుఁడు పైవ్యాఖ్యాతయే కావచ్చును, లేక ప్రకృతగ్రంథకర్త యైనను గావచ్చును; వ్యాఖ్యాత యగుప్రకాశవర్షుని, యాలంకారికుఁ డగుప్రకాశవర్షునిపౌర్వాపర్యవిచారము క్రింది కాలనిర్ణయప్రకరణమునఁ గననగును.

## — 4. ప్రకాశవర్షునికాలము. —

భామహుని 'కావ్యాలంకారము'నను, దండి 'కావ్యాదర్శము'నను ప్రకాశవర్షుని 'రసార్ణవాలంకారము'నుండి పదవాక్యవాక్యార్థములనేకములు హరింపఁబడిన వనియు, ప్రకాశవర్షునికృతి దండిభామహుల కృతుల కుపజీవ్య మనియు నాఁడువలన వీ రిరువురును ప్రకాశవర్షునికంటె నవీను లనియు, భట్టబాణుని బేర్కొనుటచేఁ బ్రకాశవర్షుఁడు బాణుని కంటె నర్వాచీనుఁ డనియు నందుచే మనకవి బాణుని తరువాతను దండి భామహులకుఁ బూర్వమునను [అనఁగా-క్రీ. శ. 650-750 నడుమ] జీవించియుండవలె ననియు వేంకటరామశర్మగారి సిద్ధాంతము.[1] కాని యిది యవిమర్శపూర్వకము. సుశీలకుమారడే, రాఘవన్ పండితులవ్యాసములను బట్టి ప్రకాశవర్షుఁడు భోజునికంటె నవీనుఁ డనియు, భోజుని 'సరస్వతీకంఠాభరణము', 'శృంగారప్రకాశము'ను ప్రకాశవర్షుని కృతిలత కుపఘ్నము లనియు సుశీలకుమారడే, రాఘవన్ పండితు లనేకరచనాసామ్యప్రదర్శనపూర్వకముగా నిర్ధారణ చేసియున్నారు. వీరిమతమును బట్టి దండి-భామహ-బాణులకంటె ప్రకాశవర్షుఁడు నవీనుఁ డని వేఱె

1. Introduction to 'Rasarnava'—P. X.

చెప్పనవసరము లేదు. ఒక్క రచనాసామ్యము కాలనిర్ణయవిచారమునఁ బరమప్రమాణము కాఁజాలదు. వీరిసిద్ధాంతము సరియే కాని వీరు చూపిన ప్రమాణములు ప్రబలములు గావు. ప్రకాశవర్షుఁడు భోజునికిఁ బరుఁడనుటకు నొండురెండాంతరప్రమాణములు లభించుచున్నవి. వీని నేలకో పై పండితు లలక్ష్యము చేసిరి. ఇది చింత్యము. 'సరస్వతీకంఠాభరణము' న భోజుఁడు పదదోషప్రకరణమున-'అసాధు'వను దోషము నిట్లు వివరించెను.

> "శ్లో. 'శబ్దశాస్త్రవిరుద్ధం య త్త దసాధు ప్రచక్షతే
> యథా-
> 'శ్లో. భూరిభారభరాక్రాన్త బాధతి స్కన్ధ ఏష తే
> తథా న బాధతే స్కన్ధో యథా బాధతి బాధతే.'

అత్ర బాధతే రాత్మనేపదిత్వాద్ 'బాధతే' ఇతి స్యాత్, న పునర్ 'బాధతి' ఇతి." [I గుణవివేచనపరిచ్ఛేదము; 4 పుట. నిర్ణయసాగర ముద్రణము. 1934.] దీనికి రత్నేశ్వరుఁ డిట్లు వ్యాఖ్య వ్రాసియున్నాఁడు: "అత్ర కేచి దాహుః-'బాధతిధాతుం సంస్కారప్రచ్యావనేన బాధతే ఇతి బాధతిబాధ స్తస్య సంబోధనం బాధతిబాధేతి. తే=తవ. వచన మితి శేషః.'ఇతి. త దసత్. నేయార్థత్వప్రసఙ్గాత్. అన్యేతు'బాధతి ర్బాధతే యథా' ఇతి పఠ న్తి. ఇదం త త్త్వమ్. విద్యమాన స్యార్థవ త్త్వ స్యావివక్షాయాం గవిత్యయమాహేత్యాదావివ ప్రాతిపదికసంజ్ఞా న ప్రవర్తతే."

'భూరిభార' అను పైశ్లోకమును శబ్దశాస్త్రవిరుద్ధ మగునసాధుదోషమున కుదాహరణముగా భోజుఁడు చూపియుండ నందలి యుత్తరార్ధమును స్వీకరించి ప్రకాశవర్షుఁడు భోజుఁడు దోష మనిన దాని కపవాదము నిట్టులు నిపుణముగాఁ జూపియున్నాఁడు: [శబ్ద మసాధు వైనను ననుకరణమున గుణీభావము నందును.]

> శ్లో. 'పదం యాతి గుణీభావ మనుకర్తు రసా ధ్వపి
> యథా న బాధతే స్కన్ధో యథా బాధతి బాధతే.'
>
> ౨ పరి. 36-37 శ్లో. [7 పు.]

భోజుఁడే ప్రకాశవర్షునికృతినుండి శ్లోకార్థమును గ్రహించె నేమో యని శర్కగా రనవచ్చును. కాని యది సరి కా దని యీక్రిందిప్రమాణమును బట్టి తెలియనగును. ఈశ్లోకమును దానికి సంబాధించిన వైతిహ్యమును 'శార్ఙ్గధరపద్ధతి' యందు లభించుచున్నవి.[1]

ఒకనాఁడు వేఁటనుండి మరలుచు భోజుఁడు తనపల్లకిని మోయు వాహకులలోఁ గ్రొత్తవానిం గని- యాతఁడు మాఱువేషమున నున్న పండితుఁ డని యెఱుఁగక—'ఎక్కుడు బరువుచే నీభుజము బాధనొందుచున్నదా?' యని పృచ్ఛించె నఁట. దానికి బహుశాస్త్రవిశారదుఁడును, విశేషించి, శబ్దశాస్త్రనిష్ణాతయు నగుభోజుఁడు 'బాధతే' యనుటకు 'బాధతి' యని యపప్రయోగము చేసినందులకుఁ జింతించి రా జని యైనను జంకక యాపండితవాహకుఁడు వెంటనే "నీవుచేసిన 'బాధతి' యను నపప్రయోగము కలిగించి నంతబాధ నాభుజము కలిగించుటలేదు" అనె నఁట! రసికుఁ డగుభోజుఁ డందుల కమితానందము నంది యాతని సన్మానించియుండును.

తనకాలమున కప్పుడే ప్రచురప్రచారము నందిన ధ్వనిసిద్ధాంతమును భోజుఁ డెఱుఁగును. ధ్వన్యాలోకమునుండి కొన్ని కారికల నీతఁడు గ్రహించియు నీతఁడు ధ్వనిమతము నలక్ష్యముచేసి 'ధ్వనిమత్తాతు గాంభీర్యమ్' [I పరి. 73 శ్లో. 74 పు.] అని ధ్వనిని శబ్దగుణ మగు గాంభీర్యముగాఁ జేర్చెను. ప్రకాశవర్షుఁడుకూడ [౨ పరి. 20 శ్లో. 6 పు.] ధ్వనిని గాంభీర్య మనుశబ్దగుణముగా నుడివియుండెను. దీనినిబట్టి ధ్వన్యాలోకకారునికంటె [క్రీ. శ. 840-860.] నితఁడు నవీనుఁ డని తెలియుచున్నది.

'సరస్వతీకంఠాభరణము' మొదలగుకొన్ని సాహిత్యగ్రంథములలో నౌచిత్యము పేర్కొనఁబడినను 'ఔచిత్యవిచారచర్చ' లో నౌచిత్యసిద్ధాంతమును శాస్త్రదృష్టిని విచారించి, కావ్యమున కాత్మ యౌచిత్యమని నిర్ధారణచేసిన మహనీయుఁడు క్షేమేంద్రుఁడు. ఈసిద్ధాంతమును

---

1. 'భూరిభారభరాక్రాన్త బాధతి స్కన్ధ ఏష తే
న తథా బాధతే స్కన్ధో యథా బాధతి బాధతే.
పూర్వార్ధం మృగయాయా గృహమాగచ్ఛతః శిబికారూఢస్య భోజరాజస్యోక్తిః
ఉత్తరార్ధం చ రాజదర్శనార్థం ఛద్మశిబికావాహపండితస్య ప్రత్యుక్తిః'
[శా. ప. 562 శ్లో.]

ప్రకాశవర్షుఁడు గుర్తించియే యుండును; కాని 'అగ్నిపురాణము'నందు ఔచిత్య ముభయాలంకారములలోఁ జేర్పఁబడినట్లు లీతఁ డౌచిత్యమును శబ్దాలంకారములలోఁ జేర్చియుండెను. క్షేమేంద్రునికంటె[క్రీ.1025-75.] ప్రకాశవర్షుఁ డర్వాచీనుఁడు కావచ్చును.

భోజునికంటె మనకవి నవీనుఁ డనుటకుఁ బై ప్రమాణములకంటె బలవత్తర మైనగ్రంథస్థప్రమాణము లభించుచున్నది. కాని 'రసార్ణవము' పై విమర్శల వెలయించిన 'డే', రాఘవన్ మొదలగు పండితు లెవ్వరు నేకారణముననో దీనిని గుర్తింపరైరి:

ఆఢ్యరాజు, సాహసాంకుఁడు నను ప్రాకృతసంస్కృత భాషాపోష కులగు ప్రభుపుంగవులు, (మహా)భామహుఁడు, బాణుఁడు, వాత్స్యాయనుఁడు నను గ్రంథకర్తలు, మహేశ్వరుఁడు, స్వాయంభువు, వాతవ్యాధి, బృహస్పతి, కౌటిల్యులచేరచింపఁబడిన 'అర్థశాస్త్రములు', కామందకీయ 'నీతిసారము,' 'విదగ్ధముఖమండనము'[1] మొదలగు గ్రంథములును 'రసార్ణవము'నఁ బేర్కొనఁబడెను. ఈకృతు లన్నిటిలో 'విదగ్ధముఖమండనము' నవీనము. ఇది కవిశిక్షాగ్రంథము. దీనికర్త ధర్మదాససూరి యను బౌద్ధసన్న్యాసి. క్రీ. శ. 1293-1309 నడుమనుండిన జినప్రభుఁడు (జయసింహు నిశిష్యుఁడు) దీనికి వ్యాఖ్య రచియించెను. అందువలన ధర్మదాససూరి క్రీ. శ. 1190-1210 ప్రాంతముల జీవించి యుండె నని నిర్ణయింపఁజను ను.[2] కావున నీతనిగ్రంథమును బేర్కొనిన ప్రకాశవర్షుఁడు క్రీ. శ. 1210 ప్రాంతములకంటె నర్వాచీనుఁ డనిమాత్రము నిర్ణయింపవచ్చును.

### 5. గ్రంథపరిమాణము.

మనకు లభించినగ్రంథమున 4 పరిచ్ఛేదములు సమగ్రముగను, రసవిచారకము ను ముఖ్యము నగు 5 వపరిచ్ఛేద మసమగ్రముగ ను గలవు. ఈగ్రంథము పంచపరిచ్ఛేదాత్మక మనియే వేంకటరామశర్మగారు

1. 'రసార్ణవము'—3 పరి. 56 శ్లో.
2. S. K. De: 'Sanskrit Poetics'—Vol. I. P. 297.
Dr. M. Krishnamachariar: 'History of Classical Sanskrit Literature.'—P. 766.

ను, 'డే' పండితులును నుడివియున్నవారు. కాని దీనిని సూలంకషముగ గవేషణమొనర్చిన రాఘవన్ పండితు లివి యారుప్రకరణముల గ్రంథమై యుండవలె ననియు, నుభయాలంకారవిచారక మగు పంచమప్రకరణము పూర్తిగాను, రసప్రకరణమగు నాటవప్రకరణము[ముద్రితపుస్తకమున ౫ వ పరిచ్ఛేదము.] చాలవఱకును లోపించియుండవలె ననియు నిర్ణయించియున్నారు. అందులకు వారు చూపిన యుపపత్తులు[1] నిటఁ జూపుచున్నాను-

౧. పరిచ్ఛేదము దోషప్రకరణము. ౨. పరి. గుణప్రకరణము. 3-౪. పరి. శబ్దార్థాలంకారప్రకరణములు. ౫ పరి. శృంగారవ్యక్తియ ప౯బడు రసప్రకరణము. ఇందు 2 పుటలగ్రంథము మాత్రము లభించినది. మనకు లభించినస్వల్పగ్రంథమునుబట్టి చూచినను శృంగారప్రకాశమున భోజుఁడు విపులముగాఁజేసిన రసవిచారమును ప్రకాశవర్షుఁ డీప్రకరణమున సంగ్రహముగా నుడివి యుండె నని తోఁచకమానదు. అందువలన నీప రిచ్ఛేదము తక్కినవానికంటె మిగుల విపులముగా నుండితీరవలెను.

తృతీయపరిచ్ఛేదము మొదట నలంకారములు— బాహ్యములు, ఆభ్యంతరములు, బాహ్యాభ్యంతరములు నని మూఁడువిధము లని మన కవి పేర్కొనియున్నాఁడు. ఈయలంకారవిభజనము నీతఁడు భోజునినుండియే గ్రహించియున్నాఁడు. భోజుఁ డీమూఁడువిధము లగు నలంకారములను ద్రివిధము లగుస్త్రీలయలంకారములతోఁ బోల్చియుండ మనకవియు నట్లే నుడివియుండెను. చూడుఁడు: శృంగారప్రకాశము [చెన్నపురిలోని వ్రాఁతప్రతి II సం. 266 పు.]

అలఙ్కారాశ్చ త్రిధా—బాహ్యాః, ఆభ్యన్తరాః, బాహ్యాభ్యన్తరాశ్చ. తేషు బాహ్యాః వస్త్రమాల్యవిభూషణాదయః; ఆభ్యన్తరాః దన్తపరికర్మ-నఖచ్ఛేదా-లకపరికల్పనాదయః; బాహ్యాభ్యన్తరాః స్నానధూప (విలేపనాదయః).

చూ. రసార్ణవము [3 పరి. ౫-8 శ్లో. 12 పు.]

అందువలన ప్రకాశవర్షుఁ డీమూఁడువిధము లగునలంకారములను గూర్చియుఁ జర్చించి యుండు నని నొక్కి వక్కాణింపవచ్చును. కాని మనకు లభించిన వ్రాఁతప్రతిలో (3 వ పరి.) బాహ్యము లగు శబ్దాలం

1 'Journal of Oriental Research'—Vol, VIII. Part 3. P. 268-9.

కారములను, (4 వ పరి.) ఆభ్యంతరము లగునర్థాలంకారములను గూర్చిన చర్చమాత్రము గలదు. పిమ్మట రసప్రకరణముయొక్క యుపసంహారభాగముగల 2 పుటల గ్రంథము మాత్రము లభించినది. కావున బాహ్యాభ్యంతరము లగునుభయాలంకారముల విమర్శించు 5 వ పరి. కూడం బూర్తిగా నుత్సన్న మైనదని నిర్ణయింపఁదగుచు. దీనిని బట్టి రసప్రకరణమునసే కాక యలంకారప్రకరణమునఁ గూడ గ్రంథపాత మున్న దనియు, రసార్ణవ మాఁఱుపరిచ్ఛేదముల గ్రంథ మనియుఁ దేలుచున్నది.

6 రసార్ణవమీమాంస.

౧ వ పరిచ్ఛేదము [దోషప్రమోషము.]:-

దోషములు 3 విధములు-1. పదదోషములు. 2. వాక్యదోషములు. 3. వాక్యార్థదోషములు. ఇందు- పదదోషములు 14 తెగలు.

1. అసాధువు.
2. అనిబద్ధము.
3. కష్టము.
4. క్లిష్టము.
5. అనర్థకము.
6. అపుష్టార్థము.
7. గూఢార్థము.
8. అప్రతీతము.
9. ససంశయము.
10. నేయార్థము.
11. అసమర్థము.
12. అప్రయోజకము.
13. దేశ్యము.
14. గ్రామ్యము.

ఇందు, కడపటి గ్రామ్యదోషము- i. అసభ్యము. ii. అమంగళము. iii. ఘృణాకరము-అని 3 తరగతులుగా విభజింపఁబడెను.

వాక్యదోషములును 14 :-

1. శబ్దహీనము.
2 క్రమభ్రష్టము.
3. విసంధి.
4. పునరుక్తము.
5. వ్యాకీర్ణము.
6. భిన్నవృత్తము.
7. సంకీర్ణము.
8. గర్భితము.
9. భిన్నలింగము.
10 భిన్నవచనము.
11. ఖంజము.
12. న్యూనము.
13. అధికము.
14. శ్లేషాదిగుణహీనము.

ఇందాఱవది యగు భిన్నవృత్తము మరల వర్ణభ్రంశము, యతిభ్రంశము నని రెండువిధములు.

గుణములు 3 తరగతులు- 1. శబ్దగుణములు. 2. అర్థగుణములు. 3. ఉభయగుణములు.

1. శబ్దగుణములు 3 :- (అ) శ్లేష. (ఆ) సమత. (ఇ) సుకుమారత.

2 అర్థగుణములు 3 :- (అ) అర్థవ్యక్తి. (ఆ) ప్రసాదము. (ఇ) కాంతి.

3. ఉభయగుణములు 4 :- (అ) ఓజస్సు. (ఆ) మాధుర్యము. (ఇ) ఔదార్యము. (ఈ) సమాధి.

పై వాక్యదోషములలోని 'శ్లేషాదిగుణహీనము'నందలి 'ఆది'పదముచే నీ 10 గుణములయొక్క యభావమే 10 దోషములుగా నెంచఁబడెను. ఈదోషములేవన-

1. శ్లేషవిపర్యయము.
2. సామ్యవిపర్యయము.
3. సౌకుమార్యవిపర్యయము.
4. అర్థవ్యక్తివిపర్యయము.
5. ప్రసాదవిపర్యయము.
6. కాంతివిపర్యయము.
7. ప్రౌఢివిపర్యయము.
8. మాధుర్యవిపర్యయము.
9. ఔదార్యవిపర్యయము
10. నిస్సమాధి.

వాక్యార్థదోషములు 16 :-

1. అపార్థము.
2. వ్యర్థము.
3. ఏకార్థము.
4. ససంశయము.
5. అక్రమము.
6. ఖిన్నము.
7. అతిమాత్రము.
8. విరసము.
9. పరుషము.
10. హీనోపమ.
11. అధికోపమ.
12. విసదృశోపమ.
13. అప్రసిద్ధోపమ.
14. నిరలంకారము.
15. అశ్లీలము.
16. విరుద్ధము.

ఇందలి విరుద్ధదోషము 3 విధములు.

1. ప్రత్యక్షవిరుద్ధము. [3 విధములు.]
   ౧. దేశవిరుద్ధము.
   ౨. కాలవిరుద్ధము.
   3. లోకవిరుద్ధము.
2. అనుమానవిరుద్ధము. [3 విధములు.]
   ౧. యుక్తివిరుద్ధము.
   ౨. ఔచిత్యవిరుద్ధము.
   3. కామశాస్త్రవిరుద్ధము.
3. ఆగమవిరుద్ధము.

పై వానిలోఁ గాలవిరుద్ధ మిందు వివరింపఁబడలేదు. కాని ౩ వ పరిచ్ఛేదమునందు (85 శ్లో.) 'దోషః కాలే విరోధోఽపి న కార్యాన్తర హేతుతః' [కార్యాంతరహేతువులచేఁ గాలవిరోధము దోషముకాదు.] అని చెప్పఁబడియుండుటచేఁ గావలయు మొదటిపరిచ్ఛేదమున నీవివరణము కవిచే వదలఁబడియుండును.

భామహుఁడు 15 దోషములనే పేర్కొనియెను; కాని వానిని పద-వాక్య-వాక్యార్థగతము లని విభజింపలేదు. యుక్తి-ప్రతిజ్ఞావిరుద్ధముల నీతఁ డంగీకరించెను. 'పునరుక్త'దోష మర్థగత మగునప్పుడు 'నేయార్థ' మగు నని యీతఁ డనెను.

దండి యర్థ-శబ్దగతము లగు 10 దోషములనే పేర్కొనెను. యుక్తి (=హేతు) విరుద్ధ- ప్రతిజ్ఞావిరుద్ధములు గుణములా, కావా యనువిషయమున నాలంకారికుల విప్రతిపత్తిని సూచించియున్నాఁడు.

వాక్యదోషములు 2:-న్యూనము, అధికము. వాక్యార్థగతము లగుచో నివియే- న్యూనోపమ, అధికోపమ- అనుదోషము లగును. వాక్య-వాక్యార్థగతభేదమే తప్ప పై రెండుదోషములకు వ్యత్యాసము లేదు. వాక్యార్థదోషములలో నుపమాదోషములు నాలుగు పేర్కొనఁబడెను. ఇందు న్యూనోపమ, అధికోపమలను దండిభామహు లిరువురు నుదాహరించియుండిరి. అప్రసిద్ధోపమ, విసదృశోపమలను భామహుఁ డొక్కఁడే వివరించియుండెను. దండి వీనిని బేర్కొననే లేదు. ప్రకాశవర్షుఁడు పేర్కొనిన పై యుపమాదోషముల నాలుగింటినే కాక యుపమానము- ఉపమేయములలో లింగ-వచన-వ్యత్యాసమువలనఁ గలుగు మఱి రెండుపమాదోషముల దండిభామహులు నుడివియున్నారు. ఈరెండిటిని ప్రకాశవర్షుఁడు భిన్నలింగ-భిన్నవచనము లని నుడివి వీనిని వాక్యదోషములలోఁ జేర్చియున్నాఁడు. 'విపర్యయము' (అసదృశత ?) అను నేడవయుపమాదోషమును భామహుఁ డొక్కఁడే నుడివియున్నాఁడు. తనకంటెఁ బ్రాచీనాలంకారికుఁ డగుమేధావి యీయుపమాభేదముల నేడింటిని బేర్కొనె నని భామహుఁడు వ్రాసియున్నాఁడు.[భామహ. II పరి. 40 శ్లో.]

౨. వపరిచ్ఛేదము. [గుణోపాదానము.]

గుణములు 2 విధములు 1. శబ్దగుణములు. 2. అర్థగుణములు. మరల శబ్దగుణములలో 22 భేదములు, అర్థగుణములలో 22 భేదములు. ఈ 22 గుణభేదములపేళ్లు రెంటికిని సమానము—

1. శ్లేష.
2. ప్రసాదము.
3. సమత.
4. మాధుర్యము.
5. సుకుమారత.
6. అర్థవ్యక్తి.
7. కాంతి.
8. ఔదార్యము.
9. ఉదాత్తత.
10. ఓజస్సు.
11. ఔర్జిత్యము.
12. ప్రేయస్సు.
13. సుశబ్దత.
14. సమాధి.
15. సూక్ష్మము.
16. గాంభీర్యము.
17. సంక్షేపము.
18. విస్తరము.
19. సామ్మిత్యము.
20. భావికత్వము.
21. రీతి.
22. ఉక్తి.

ఈనామము లన్నియును సార్థకములు. ఈగుణములను దృష్టియం దుంచుకొని శబ్దములను వాక్యములను సరిగాఁ బ్రయోగించునది యని ప్రకాశవర్షుఁ డనుశాసించియున్నాఁడు.

భామహుఁడు మాత్రము కావ్యవిధాయకము లగు గుణముల నేప్రకరణమునను వివరించియుండలేదు; దండి యన్ననో వైదర్భమార్గమున కత్యావశ్యకములగు పదిగుణములను మాత్రము నుడివియుండెను. వైదర్భీ-గౌడీమార్గముల భేదములఁ గొన్నిటి నీతఁడు చెప్పియుండెను, గాని, గౌడమార్గప్రధానము లగుగుణములఁ గూర్చి యేమియు నెత్తుకొనలేదు. ప్రకాశవర్షునిచేఁ జెప్పఁబడిన గుణములు దండిభామహులకృతులలో నలంకారములుగా నెంచఁబడియుండెను. ఇట్లగుట కీముగ్గురకృతులలో నాయాగుణములకు నాపేరుగల యలంకారములకుఁ గలలక్షణ సామ్యమే హేతువు.

శ్లో. 'వదన్తి బన్ధవైకట్య మౌదార్యం కవిపుఙ్గవాః
శ్లాఘ్యై ర్విశేషణై ర్యుక్త ముదాత్త మితి తద్విదుః.'

అని ప్రకాశవర్షుఁడు [౨ పరి. 16 శ్లో.] చెప్పియుండఁ గొందఱాలంకారికు లీయుదాత్తలక్షణము నుదారము (ఔదార్యము)న కారో

పించినట్లు దండి వ్రాసియున్నాఁడు. 'శ్లాఘ్యైర్విశేషణై ర్యుక్తముదారం కైశ్చి దిష్యతే.' గుణవివరణమునకుఁ బిమ్మటఁ బ్రథమపరిచ్ఛేదమునఁ జేర్పఁబడిన దోషములు నలువదినాలుగింటిలో నొక్క 'విరస' మనునది తక్కఁ దక్కినవి కొన్ని యెడల గుణత్వము నొందు నని వివరింపఁబడెను. 'విరస' మింతలోఁ జేరకుండుటకు హేతువు 'కాలవిరోధము' నకు వలె గ్రంథపాతమో లేక కవియే దీనిని నపవాదముగా నెంచియుండెనో చెప్పఁజాలము.

శ్లో. 'దోషాణామపి యేషాం స్యాద్గుణత్వం కారణాత్క్వచిత్
చతుర్వింశత్త దుచ్యన్తే తేచ వైశేషికా గుణాః-' ప్రకాశ. ౨ పరి. 35-36.

దోషములు నలువది యని యిటఁ జెప్పఁబడినది. కాని క్రిందటి పరిచ్ఛేదమున 43 దోషములు వివరింపఁబడి యుండుటచేనిటఁ బూర్వాపరవైషమ్యము గానఁబడుచున్నది.

మొదట-పదదోషముల గుణత్వము, ఆపిమ్మట వాక్యదోషముల గుణత్వము, వాక్యార్థదోషముల గుణత్వము నిట్లు మొదటిపరిచ్ఛేదము నందలి క్రమమే పాటింపఁబడియెను. మొదటిపరిచ్ఛేదమున గుణములను జెప్పినపిమ్మట- (24-28 శ్లో.)

1. శ్లేషగుణాభావము- శైథిల్యదోషము.
2. సామ్యగుణవిపర్యయము- వైషమ్యదోషము.
3. సౌకుమార్యగుణరాహిత్యము- కఠోరము.
4. అర్థవ్యక్తిహీనత- నేయార్థము.
5. ప్రసాదగుణాభావము- అప్రసన్నము.
6. కాంతిగుణలోపము- అవ్యుత్పన్నత.
7. ప్రౌఢి(ఓజో)గుణవిహీనత- అప్రౌఢి.
8. మాధుర్యలోపము- అనిర్వ్యూఢము.
9. ఔదార్యవిపర్యయము- నిరలంకారము.
10. నిస్సమాధిగుణలోపము- ఋజుమార్గము.

ఇందు నేయార్థము ప్రత్యేకముగా వాక్యదోషముగాను, నిరలంకారము వాక్యార్థదోషముగాను గూడఁ జెప్పఁబడినవి. శ్లేషాదిగుణాహీ

నతవలనఁ గలుగు నీపదిదోషములను ప్రకాశవర్షుఁడు వివరించినపద్ధతిని బట్టి యాలోచించిన నాయాగుణముల యభావము నీతఁడు విశేషదోషములుగాఁ బరిగణించినట్లు లేదు. మఱి మన నీపదిగుణములును దక్కిన గుణములును గావ్యమున కత్యావశ్యకము లైన ట్లీతని దృఢాభిప్రాయముగాఁ దోఁచెడిని. దండియు నిట్టియభిప్రాయముతోడనే శ్లేషాదిదశగుణములను మాత్రమే పేర్కొనియుండెను, గాని, వానియభావమును దోషములుఁగా నెంచియుండలేదు.

వేంకటరామశర్మగా రిట్లు వ్రాసియున్నారు:-[1]

"భామహుఁడు దండియుఁ గావ్యలక్షణములను దద్భేదములను విపులముగాఁ జర్చించియుండిరి. వారి కుపజీవ్య మగు గ్రంథ మొకటి యుండవలెను. అది యీరసార్ణవమే. ఇందు ద్వితీయపరిచ్ఛేదము-

'నిర్దిష్టస్యాపి కావ్యస్య గుణోపాదాన మన్తరా'

అని ప్రారంభింపఁబడెను. దీనినిబట్టి మనకవి కావ్యలక్షణములను దద్భేదములను గ్రంథాంతరమున వివరించియుండుటచే నాప్రసంగము నిట విడిచె నని యూహింపనగును. మఱియు నితరాలంకారగ్రంథము లందువలె నిం దాశీర్నమస్క్రియాపూర్వక మగుకృత్యాది గాని, గ్రంథకర్తృప్రశస్తి గాని, యనుబంధచతుష్టయనిరూపణాదులు గాని లేవు. ప్రథమపరిచ్ఛేదము దోషవిచారకము. వీని నన్నిటింబట్టి చూచినఁగావ్యనిర్దేశప్రకరణాదులు గల మఱికొన్నిప్రకరణము లుత్సన్నము లైయుండితీరు నని నిర్ణయింపఁ జనును."

ఈయభిప్రాయములు చాలవఱకు విమర్శపూర్వకములు. రసార్ణవము దండిభామహుల కుపజీవ్య మెంతమాత్రమును గా దనియు, వీరిరువురకంటెను రసార్ణవకర్త చాల నవీనుఁ డనియుఁ గాలనిర్ణయాదిప్రకరణముల నిరూపింపఁబడినది. కృత్యాదిగ్రంథము కొంత లోపించిన లోపింపవచ్చును. మొదటి పరిచ్ఛేదమున దోషములు వివరింపఁబడెను. రెండవపరిచ్ఛేదమునగుణవిచారము చేయఁబడెను. అందువలనఁ గావ్యము నిర్దుష్టమైనను, గుణసహితము కానిచో సాధువు కానేర దనుపాత మే-

1. Introduction to 'Rasarnava.'—P. XVI.

'నిర్దుష్టస్యాపి కావ్యస్య గుణోపాదాన మన్తరా
శాస్త్రార్థకుశలో లోకః సాధుత్వం నా నుమన్యతే.'
సహేతుకముగాఁ జూపట్టుచున్నది.

3 వ పరిచ్ఛేదము. [శబ్దాలంకారప్రకాశనము.]

మొదట నలంకారసామాన్యలక్షణములు విశదముగాఁ జూపఁబడినవి. 1. బాహ్యములు. 2. ఆభ్యంతరములు. 3. ఉభయములు- అని యలంకారములు మూఁడువిధములు. బాహ్యములగు శబ్దముల కుత్తార్థాయకము లగుటచే శబ్దాలంకారములు బాహ్యము లనఁబడెను. ఆభ్యంతరము లగు కావ్యార్థముల కౌన్నత్యముం జేకూర్చునవి యగుటచే నర్థాలంకారము లాభ్యంతరకక్ష్యలోఁ జేర్పఁబడెను. ఉభయాలంకారకక్ష్యలో నేయలంకారములు చేరునో మనకవి చెప్పియుండలేదు. కాని యాతనివివరణమునుబట్టి యూహించిన, శ్లేషాదు లిందుఁ జేరునేమో యని తోఁచెడిని.

శబ్దాలంకారములు 18 :-

| | | |
|---|---|---|
| 1. జాతి. | 7. ఛాయ. | 13. ఔచిత్యము. |
| 2. రీతి. | 8. యుక్తి. | 14 ప్రశ్నోత్తరము. |
| 3. వృత్తి. | 9. భణితి. | 15. ప్రహేలిక. |
| 4. రచన. | 10. శ్రవ్యత. | 16. అనుప్రాస. |
| 5. ఘటన. | 11. శ్లేష. | 17. యమకము. |
| 6. ముద్ర. | 12. చిత్రము. | 18. గూఢోక్తి. |

సంస్కృతప్రాకృతాత్మకమగు 'జాతి' శుద్ధ, సాధారణి యని రెండు విధములు. దండిభామహులు భాషల సామాన్యనామమునుగాని, శుద్ధ, సాధారణి యను తద్భేదములఁ గాని నుడువక భాషాసామాన్యమును సంస్కృతప్రాకృతాపభ్రంశము లని విభజించియుండిరి. దండి మిశ్ర మను మఱియొకభేదమును గూడఁ గల్పించియున్నాఁడు. ఇవన్నియు వాఙ్మయభేదము లని యాతఁ డనియున్నాఁడు.

రీతులు 5 :-1. వైదర్భి. 2. గౌడి. 3. పాంచాలి. 4. లాటి. 5. ఆవంతి. ఆయాదేశములలోని జనుల యభిరుచుల ననుసరించి చేయుఁ

బహువచోవిన్యాసమే రీతి యనఁబడును. దేశము లనేకములు; అందలి జనులరుచిభేదములు ననేకములు. అందుచే రీతులభేదముల నెన్నుటకు సర్వజ్ఞుఁడగు నీశ్వరుఁ డొక్కఁడే సమర్థుఁ డని యాతఁడు నుడివియున్నాఁడు.

దండిమతమున రీతు లనేకములు. అందు సూక్ష్మభేదములు గల తక్కినవానిని వదలివైచి ప్రస్ఫుటవ్యత్యాసముగల వైదర్భ-గౌడీయముల మాత్రము దండి విశేషముఁగా వర్ణించియున్నాఁడు.

వృత్తులు:-1. కైశికి. 2. ఆరభటి. 3. భారతి. 4. సాత్వతి. ముద్ర (=సాభిప్రాయార్థవిన్యాసము) 4 విధములు:-1. విభక్తిగతము. 2. వచనగతము. 3. సంవిధానగతము. 4. సముచ్చయగతము.

అన్యోక్తుల ననుకరించుట ఛాయ. ఇది 5 విధములు-1. లౌకికము. 2. స్ఖలితము. 3. ఛేకము 4. ముగ్ధము. 5. వేటోక్తి. జను లసంఖ్యాకు లగుటచే నన్యోక్తిచ్ఛాయాభేదములు ననంతము లని యాతఁ డనెను.

విశేషము:-ఈఛాయ నితరాలంకారికులు శబ్దార్థహరణము, హరణము, ఉపజీవన శిక్ష మొదలగు పేళ్లతో వ్యవహరించిరి. వామనుఁడు నానందవర్ధనుఁడు తమకృతులలో నీవిషయమును స్పృశించియున్నారు. ఈవిషయమును గూలంకషముగ సోదాహరణముగఁ జర్చించిన మహనీయుఁడు రాజశేఖరుఁడు. ఈతఁడు కావ్యమీమాంసయందు మూఁడు ప్రకరణములు [XI—XIII] తద్విచారమునకు వినియోగించెను. హేమచంద్రుఁడు తన'కావ్యానుశాసనము'నకుఁ దాను రచించిన 'వివేక' మను వృత్తిలోను, వాగ్భటుఁడు'కావ్యానుశాసనము' నను నిందలివిషయము లనేకములఁ బరిగ్రహించియుండిరి. భోజుని 'సరస్వతీకంఠాభరణము'నందు నీవిషయ మించుక కలదు. క్షేమేంద్రుఁడు కవిశిక్షాగ్రంథమగు తన 'కవికంఠాభరణము'న నీవిషయమును విపులముగఁజర్చించియున్నాఁడు. రాజశేఖరుఁడు [XIఅధ్యా. 61 పు.] ఈవిషయమును గూర్చి యొకచక్కని యాభాణకమును క్రోడీకరించియున్నాఁడు: 'లోకమునఁ జోరుఁడుగాని కవి గాని, వర్తకుఁడు గాని యుండఁడు. ఎవఁడు తనచౌర్యమును గప్పిపుచ్చుకొనఁగలఁడో వాఁడు నింద నొందక యానందము నందును.'

యుక్తి 6. విధములు:-1. పద 2. పదార్థ 3. వాక్య 4. వాక్యార్థ 5. ప్రకరణ 6 ప్రబన్ధయుక్తులు.

భణితి 4 భేదములు:-1. సంభావనారూపము. 2. అసంభావనారూపము. 3. కల్పనారూపము. 4. విరోధరూపము.

శ్రవ్యత 6 తెఁగలు:-1. ఆశీరూపము. 2. నమస్క్రియారూపము. 3. నాందీరూపము. 4. వస్తురూపము. 5. బీజరూపము. 6. ప్రరోచనారూపము.

శ్లేష 6 రకములు:-1. ప్రకృతి, 2. విభక్తి, 3. పద, 4. వచన, 5. భాషా, 6. ప్రత్యయశ్లేషలు.

ఔచిత్యము 2 విధములు:-1. అభిధానౌచిత్యము. 2. బన్ధౌచిత్యము.

[ఔచిత్యమునుగూర్చి విపులముగ నెఱుఁగఁ గోరువారు క్షేమేంద్రుని 'ఔచిత్యవిచారచర్చ'ను బరిశీలింపఁదగును. ఔచిత్యమే కావ్యమున కాత్మ యని యీతనిమతము.]

ప్రశ్నోత్తరము 6 విధములు:- 1. అంతఃప్రశ్న. 2. బహిఃప్రశ్న. 3 ఉభయప్రశ్న. 4. పృష్టప్రశ్న. 5. ఉత్తరప్రశ్న. 6. జాతిప్రశ్న. ఈప్రశ్నోత్తరమునుగూర్చిన విశేషముల నరయఁగోరువారు 'విదగ్ధముఖమండనము'ను బఠింపఁజను నని ప్రకాశవర్షుఁడే చెప్పియున్నాఁడు. ప్రకాశవర్షునికాలనిర్ణయమున కీగ్రంథ మెట్లుపయోగించునో కాలనిర్ణయప్రకరణమునఁ జూచునది.

ప్రహేళిక 6 విధములు:- 1. పరివర్తితము. 2. విన్యస్తము. 3 లుప్తము. 4. వ్యుత్క్రమము. 5. బిందుకము. 6. అర్ధము.

[భామహుఁడు ప్రహేళికకు లక్ష్యముం జూపక, ప్రహేళికకు యమక మని నామాంతరము గల దనియుఁ దద్విశేషముల రామశర్మకృతమగు 'అచ్యుతోత్తరము'నఁ జూడఁదగు ననియు నుడివెను [భామహ. II. 19.] దండి యమక మేకాంతమధురము కాకపోవుటచేఁ దరువాత దీనినిగుఱించి చెప్పెద నని [కావ్యాదర్శ. I. 61] నుడివి, తృతీయపరిచ్ఛేదమున 14 ప్రహేళికాభేదములను సోదాహరణముగా వివరించియున్నాఁ

డు. విశ్వనాథకవిరాజు [సాహిత్యదర్పణము X. 13.] రసపరిపంథియగు టచేఁ బ్రహేళిక యలంకారము కా దనియు, నిది 'ఉక్తివైచిత్ర్య' మాత్ర ప్రయోజక మనియు వ్రాసియున్నాఁడు. అంతకుమునుపే భోజుఁడు 'సరస్వతీకంఠాభరణము'నఁ బ్రహేళికాప్రయోజనములకు దండిశ్లోకము నుదాహరించియున్నాఁడు:

'క్రీడాగోష్ఠీవినోదేషు తద్‌జ్ఞై రాకీర్ణమన్త్రిణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికాః.'

ఈశ్లోకము రసార్ణవమున గ్రహింపఁబడినది [3. 82.]

దండి చెప్పినప్రహేళికాభేదములకు ప్రకాశవర్షుఁడు చెప్పినవానికి సాదృశ్యము లేదు.]

యమకము 7 తరగతులు:

1. అవ్యపేతము. (నియతము).
2. అవ్యపేతము. (అనియతము).
3. వ్యపేతము. (నియతము).
4. వ్యపేతము. (అనియతము).
5. అవ్యపేతవ్యపేతకము. (నియతము).
6. అవ్యపేతవ్యపేతకము. (అనియతము).
7. సముద్గకము.

భామహునిమతమున యమకము 5 విధములు: 1. ఆది. 2. మధ్యాన్తము. 3. పాదాభ్యాసము. 4. ఆవలి. 5. సమస్తపాదయమకములు

సందష్టక- సముద్గకాదిభేదముల నీతఁ డీయైదింటిలోనే యిమిడ్చెను. ప్రకాశవర్షుఁడు పేర్కొనిన యేడిటికి నధికముగా దండికృతియందీ 5 ను వివరింపఁబడినవి: 1. సందష్ట, 2. సముద్గ, 3. శ్లోకాభ్యాస, 4. మహాయమక, 5. ప్రతిలోమయమకములు. ఇతరులు కొందఱు సందష్టమును దక్కినభేదములలో నంతర్భూతముగా నొనర్చినను దానుమాత్రము దీనికిఁ బ్రత్యేకస్థానము నొసఁగుచున్నాఁడ నని దండి చెప్పియున్నాఁడు. తనకృతిలో (III పరి.) నీతఁడు యమకభేదముల 78 శ్లోకములలో వివరించియున్నాడు.

'ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టి ర్న దృశ్యతే'

అని మఱియొక సాహిత్యవేత్త యమకచిత్రములు రసపోషకములు గా వనియే నుడివియున్నాఁడు. ప్రకాశవర్షుఁడు మాత్రము యమకము కవిపాండితికి గీటురాయివంటి దని

['కవివ్యుత్పత్తినికషం యమకం నామ తద్విధః'- 3. పరి. 61.] చెప్పియున్నాఁడు.

మఱకవి ప్రహేలికకుఁ బిమ్మట ననుప్రాసమును [3 పరి. 14.] బేర్కొనియుండినను మనకు లభించిన ప్రతిలోఁ బ్రహేళిక తర్వాత యమకము చెప్పఁబడినది; అనుప్రాస విడువఁబడినది. అనుప్రాసవివరణభాగ ముత్సన్నమైన దని చెప్పవచ్చును.

యమకభేదముల వివరించునవసరమున ప్రకాశవర్షుఁడు-

'లక్ష్యలక్షణబోధార్థం దిఙ్మాత్రం తు ప్రదర్శ్యతే'-[3 పరి. 64.]

అని చెప్పినను లక్ష్యలక్షణము లింకను మృగ్యములుగా నున్నవి.

గూఢోక్తి 5 విధములు: 1. క్రియాభేదము. 2. కారకభేదము. 3. సంబంధభేదము. 4. పదభేదము. 5. అభిప్రాయభేదములవలనఁ గలుగునవి.

ఈశబ్దాలంకారములు వాగ్దేవికి నవయువాలంకారాములుగాఁ జెప్పఁబడినవి. ఔచిత్యమును రసమును బాటించుచు సందర్భశోభకై వీనిని గవులు పద్యగద్యముల నుపయోగింపవలయు నని యాతనియభిప్రాయము.

పిమ్మట శ్లేషచిత్రముల ప్రాముఖ్యము, ననుప్రాసాక్లిష్టయమకముల ప్రాధాన్యము వివరింపఁబడెను. బాణునకుఁ బద్యరచనమునకంటె గద్యరచనమునఁ గలయధికకౌశలము, సంస్కృతప్రాకృతాదిభాషావిచారము, ఆఢ్యరాజ-శ్రీసాహసాంకప్రభువులకాలమునందలి భాషలను గూర్చినవివరములు గలవు. మంచిపుష్పముల నెంచి మాలనుగూర్చుమాలాకారునివలెఁ గవి కావ్యశోభాసంధాయకము లగువిషయముల గ్రహించి కావ్యనిర్మాణమును జేయఁదగు నఁట!

## ౪ వ పరిచ్ఛేదము. [అర్థాలంకారనిర్ణయము.]

అర్థాలంకారములు 28:-

| | | |
|---|---|---|
| 1. జాతి. | 11. విషమము. | 21. భ్రాంతి. |
| 2. హేతువు. | 12. సంభవము. | 22. అభావము. |
| 3. అహేతువు. | 13. ప్రత్యనీకము. | 23. ఆగమము. |
| 4. సూక్ష్మము. | 14. వ్యతిరేకము. | 24. ఉపమానము. |
| 5. సారము. | 15. అసంగతి. | 25. అనుమానము. |
| 6. సమాహితము. | 16. లేశము. | 26. ప్రత్యక్షము. |
| 7. భావము. | 17. పరివృత్తి. | 27. సంశయము. |
| 8. విభావన. | 18. నిమీలనము. | 28. అతిశయము. |
| 9. అన్యోన్యము. | 19. వితర్కము. | |
| 10. విరోధము. | 20. స్మరణము. | |

ఇందు 1, 3, 5, 7, 9, 11-13, 15, 18-26 భామహుని కృతిలో లేవు. భామహుఁడు మఱికొన్నియలంకారములఁ జేర్చొనెను.

| | | |
|---|---|---|
| 1. అర్థాంతరన్యాసము. | 11. ఊర్జస్వి. | 20. రసవత్తు. |
| 2. అనన్వయము. | 12. తుల్యయోగిత. | 21. రూపకము. |
| 3. అపహ్నుతి. | 13. దీపకము. | 22. విశేషోక్తి. |
| 4. అప్రస్తుతప్రశంస. | 14. నిదర్శన. | 23. వ్యాజస్తుతి. |
| 5. ఆక్షేపము. | 15. పర్యాయోక్తము. | 24. శ్లేష. |
| 6. ఆశీస్సు. | 16. ప్రతివస్తూపమ. | 25. సమాసోక్తి. |
| 7. ఉత్ప్రేక్ష. | 17. ప్రేయస్సు. | 26. సహోక్తి. |
| 8. ఉదాత్తము. | 18. భావికము. | 27. సంసృష్టి. |
| 9. ఉపమ. | 19. యథాసంఖ్యము. | 28. స్వభావోక్తి. |
| 10. ఉపమేయోపమ. | | |

ఇవి ప్రకాశవర్షునికృతియందు మృగ్యములు. దండి మొత్తము 35 అలంకారములను సోదాహరణముగ వివరించెను. ఇతఁడు పేర్కొనిన వానిలోఁ దొమ్మిది రసార్ణవమునను [2, 4, 6, 8, 10, 14, 16, 17,

28] గలవు. ఇవి కాక దండికృతియం దీక్రింది వధికముగాఁ గానవచ్చు చున్నవి-

1. స్వభావోక్తి.
2. ఉపమ.
3. రూపకము.
4. దీపకము.
5. ఆవృత్తి.
6. ఆక్షేపము.
7. అర్థాంతరన్యాసము
8. సమాసోక్తి.
9. ఉత్ప్రేక్ష.
10. క్రమము.
11. ప్రేయస్సు.
12. రసవత్తు.
13. ఊర్జస్వి.
14. పర్యాయోక్తము.
15. ఉదాత్తము.
16. అపహ్నుతి.
17. శ్లేష.
18. విశేషము.
19. తుల్యయోగిత.
20. అప్రస్తుతప్రశంస.
21. వ్యాజస్తుతి.
22. నిదర్శన.
23. సహోక్తి.
24 ఆశీస్సు.
25. సంకీర్ణము.
26. భావికము.

దండిభామహు లిరువురు నలంకారములుగా నెంచిన- 1. ప్రేయస్సు. 2. ఊర్జస్వి. 3. ఉదాత్తము. 4. భావికములను మనకవి గుణములుగా మార్చెను. దండిభామహులచే నర్థాలంకారముగాఁ జేర్పఁబడిన శ్లేష మనకవిచే శబ్దాలంకారములలోఁ జేర్పఁబడెను. పిమ్మట మనకవి జాతి నర్థాలంకారములలో మొదటిదానినిగా నుడివెను. శబ్దాలంకారములలోఁ గూడ జాతిని మొదటిదానినిగా నీతఁ డెంచెను.

హేతువు 6 విధములు:- 1. ప్రవర్తకము. 2. నివర్తకము. 3. అభావము. 4. జ్ఞాపకము. 5. ప్రయోజకము. 6. చిత్రము.

దండి హేతువు నాలుగువిధము లనియెను. రసార్ణవమునందలి 6 హేతువులలో మొదటి రెండును దక్కఁ దక్కినవి దండికృతిలోఁ జూపట్టు చున్నవి. మనకవి 'ప్రయోజక' మనిన దానిని దండి 'కారక' మనెను. మఱియు నీతఁడు 'జ్ఞాపక-కారకములు' ప్రవృత్తి-నివృత్తులలోఁ జేరున నెను. కారకము-1. నిర్వర్త్యము. 2. వికార్యము. 3. ప్రాప్యము-అని 3 విధములనియు, i. దూరకార్యము. ii. కార్యసహజము. iii. కార్యాంతరజము. iv. అయుక్తకార్యము. v. యుక్తకార్యము మొదలుగా 'చిత్రహేతు' వనేకవిధము లనియు దండి నుడివెను. సూక్ష్మము రెండురకము లని దండి యన, రసార్ణవకర్త యాఱువిధము లనెను.

ధర్మి, ధర్మము నని సార మిఱుదెఱఁగులు. సమాహితముకూడ 2 విధములే. దండి సమాహితభేదములఁ బేర్కొనలేదు. విరోధము శబ్దాలంకారములలోఁ గూడఁ జేరును గాని, సంఖ్యాగౌరవభీతిచే దీని నా ప్రకరణమునఁ జెప్పక యిటఁ బేర్కొనుచుంటి నని రసార్ణవకారుఁడు వ్రాసియున్నాఁడు.

సంభవము 4 విధములు:- 1. విధి. 2. నిషేధము. 3. ఉభయరూపము. 4. ఉభయవర్జితము.

వ్యతిరేకము 7 తెఱఁగులు:- 1. ఏకవ్యతిరేకము. 2. ఉభయవ్య. 3. సదృశవ్య. 4. అసదృశవ్య. 5. సజాతివ్య. 6. వ్యక్తివ్య. 7. రూపక ప్రకృతి.

[భామహుఁడు వ్యతిరేకమును బేర్కొనియెను గాని తద్భేదములఁ జెప్పలేదు. దండి వ్యతిరేకభేదముల నేడింటినినుడివెను: 1. ఏకవ్యతిరేకము. 2. ఉభయవ్య. 3. సశ్లేషవ్య. 4. సాక్షేపవ్య. 5. సహేతువ్య. 6. సాదృశ్యవ్య. 7. సజాతివ్యతిరేకము. ఇందు 1, 2, 6, 7 లను రసార్ణవకర్త గ్రహించెను. దఁడి సాదృశ్యవ్యతిరేకభేదములఁగూడఁ గొన్నిటిని జేర్కొనెను.]

అభావాలంకారము 4 తెఱఁగులు:- 1. ప్రాగభావము. 2. ప్రధ్వంసాభావము. 3. అత్యంతాభావము. 4. కల్పితాభావము. ఇట సంసర్గాభావమే పేర్కొనఁబడినది కాని యన్యోన్యాభావము చెప్పఁబడలేదు. కొందఱు నైయాయికు లీసంసర్గాభావమును బైనాలుగువిధములుగా విభజింతురు. కాని కొందఱు సంసర్గాభావము త్రివిధ మని పైవానిలో మొదటి మూఁటిని బేర్కొందురు. కల్పితాభావమునకు సామయికాభావ మని నామాంతరము.

ఆగమాలంకారము 4 విధములు:- 1. ధర్మము. 2. అర్థము. 3. కామము. 4. మోక్షము. ధర్మోపార్జనము ప్రవృత్తినివృత్తులచే నగును.

అర్థము 3 తెగలు:- 1. పిత్ర్యము. 2. స్వము. 3. సంచితము.

పిమ్మట నర్థశాస్త్రగ్రంథములు, నర్థశాస్త్రమునందలి దశస్కంధములు పేర్కొనఁబడినవి.

# కఠినశ్లోకార్థము.

— కొండపేటి వెంకయ్యచౌదరీగారు- క్రోసూరు. —

---

శ్లో. పాయాద్వః కరణోరణోరణరణో రాణోరణో వారణో
దత్తాయేనరమారమారమరమా రామారమా సారమా
సశ్రీమానుదయోదయోదయదయో దాయోదయో దేదయో
విష్ణు ర్జిష్ణు రభీరభీ రభిరభీ రాభీరభీసారభీః.

ఈ శ్లోకములో దశావతారములు చెప్పఁబడినవి.

టీక. శ్రీమాన్=సంపద్యుక్తుఁడైన (లక్ష్మీయుక్తుఁడయిన) అవతారములయందు సిరితోఁ గూడియుండునని- "రాఘవత్వే భవత్సీతా" ఇత్యాది విష్ణుపురాణము. కరణః- కే=ఉదకమునందు, రణతి= వెళ్లుచుండువాఁడు (కరణుఁడు) ఉదకములలోన సంచరించునది యని మత్స్యావతారముం జెప్పెను. అరణః=రణము లేనివాఁడు. (యుద్ధాద్యుపకరణములచేఁ గాక సామముచే శత్రువుల రూపడఁగించువాఁడు- (వామనావతారము) రాణః=రణసంబంధమైన, రణః=అయస్తంభ ధ్వనినుండి పుట్టిన, రణః=ప్రతిశబ్దమును విని వచ్చు రాక్షసులను, వారణః=వారించువాఁడు. (నరసింహావతారము) రమా=లక్ష్మి, యేన=ఏకూర్మ రూపముచేత, (సముద్రమునకు) దత్తా=ఈయఁబడినదో-(కూర్మావతారము) ఆరమాః- ఆరః=సుదర్శనాంశమువలన నుత్పన్నమైన కార్తవీర్యుని, మినాతి=చంపువాఁడు, రమారమః=విష్ణువు, (వానియందు) రమాః=రమించువారలు, (రమారమరమాః) బ్రాహ్మణులు, అట్టివారలకు సంపాదించిన, అర=భూమి, (స్యాదరో యుద్ధకర్మణి, పిశునేచఖలా వహశ్నా వరాతు కమలేల యోః- అని శ్రీహర్షనిఘంటువు.) (దానియొక్క) మా=సమృద్ధియు, రమా=జయలక్ష్మియు (ఎవనిచే) ఆసా=స్థాపింపఁబడినదో యట్టిది (పరశురామావతారము) ఉత్=మిక్కిలి, అయః=ధాన్యమునకు (అయో

5

దన్తే ధనేధాన్యైకల్యాణేకరణేపిచ - (శ్రీహర్షని ఘంటువు) ఉదయః=ఉత్పత్తిభూత మైన భూమియందు దయః=దయగలవాఁడు. సర్వబీజాధార భూతమైన భూమిని హిరణ్యాక్షునిబారినుండి రక్షించినవాఁడు. (వరాహావతారమున) అదయదయః=దయలేని క్రూరులయందే దయగలఁవాడు. క్రూరులయందేదయగలవాఁడు తదతిరిక్తులయందుఁ జెప్పనవసరము లేదు. (సకలజనహితకరమైన బుద్ధావతారము చెప్పఁబడినది.)

దాయోదదయోదాః-దాయ=జ్ఞాతులందు, అదయాః=దయాశూన్యులయిన (దుర్యోధనాదులను), ద్యతి=ఖండించువారు (పాండవులు), వారియందు- దయః=దయగలవాఁడు, (శ్రీకృష్ణావతారము.) అభీరాః=భయరహితులైన- (దుష్టకార్యవిషయమున) రావణాదులకు, భీ=భయమును గల్పించి, రభిః=సంహారక్రీడగలవాఁడు, (శ్రీరామావతారము) అభీరః=అభి=నిగమాదివ్యాప్తమైన, ఇరః=దేవత్వముగల బ్రాహ్మణులను ఆభీరాః=ఆ=అంతటను, భీ=భయమును, రాన్తి=గ్రహించువారుగాన- ఆభీరాః=అంతటను భయమునుబొందువా రని యర్థము. అట్టి వారలకు, భీసారభీః= భీ=భయమును, సార=ప్రసరింపఁజేయువారు, (ములుచలు) అట్టివారలకు, భీ=భయమును గల్గించువాఁడు- (కల్కి) సః=అట్టి, జిష్ణుః=జయశీలుఁడైన, విష్ణుః=సర్వవ్యాపకుఁడైన దేవుఁడు, వః=మిమ్ము, పాయాత్=రక్షించుఁగాత!

ఈశ్లోకమునకు శ్రీతిరుమలకూరాన్వయ...సరససాహిత్యచక్రవర్తి కంఠీరవ...విశిష్టాద్వైతసంప్రదాయ నిరాతంక వేంకటరంగాచార్యేణ విరచితోయ ముపన్యాసః. అని సంస్కృతవ్యాఖ్య వ్రాసినట్లు కనఁబడుచున్నది. శ్లోక మెవ్వరు రచించినదో తెలియదు.

# మనవి.

విద్వద్వర్యులార! ఈక్రిందిశ్లోకమునకుఁ బెక్కుమంది కవులు రచించిన పూర్వపద్యములు కొన్ని చూపినారము. మఱియు నెందైనఁ బూర్వకవుల పద్యము లున్న వానిం బంపుమ నిప్పటికవులుం బండితులును దాముఁగూడ నొక్కొక్కపద్యమును రచియించి మాకుఁ బంపఁ గోరుచున్నారము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికాధిపతి, కాకినాడ.

"ఉచ్చైర్గచ్ఛగతి సిద్ధ్యతి ధర్మతశ్చే
త్తస్యప్రమాచ వచనైః కృతకేతరైశ్చేత్
తేషాం ప్రకాశనదశా చ మహీసురైశ్చే
త్తానన్తరేణ నిపతేత్క్వను మత్ర్పణామః"—భోజరాజః.

---

ఉ. ఇం బడరంగ సద్గతి సమృద్ధినిదానము ధర్మమేని ధ
ర్మంబు నెఱుంగఁ జేయ మహిమం దగునట్టిది వేదమేని వే
దంబు భరించు వారు వసుధాసురులేని తదీయపాదప
ద్మంబులఁ దక్క నొక్కయెడ మామకమౌళిమదాళిప్రాలునే.

ఋగ్వేదికవి వేంకటాచలపతికవి.

మ. పరికింపందగు ధర్మవృత్తి సుగతుల్ ప్రాపించెనా దానిని
ల్వరముం గూర్పఁగనైన పల్కుబడుల న్వర్తిల్లెనా వానిని
ర్భరవిఖ్యాతి ధరాసురాగ్రణులచేఁ బాటిల్లెనా తన్మహా
త్తరులం జెందక యెందుఁ బోవఁగల పుద్యన్మన్నమో వాకముల్.

నడిమింటి వేంకటపతి (అభిషిక్తరాఘవము)

క. ఇల మేల్గతిధర్మముచే
నలధర్మంబునకుఁ బ్రమయు నామ్నాయపదం
బులవానికి విద్యలచే
నలరం దశగలుగ వారి కగునానతియుఁ.

ఉ. ధారుణియందు మేటిగతి ధర్మముచే సమకూరునేని యు
న్నారకదానికి న్నిజము వైదికవాక్యముల౯ ఘటిల్లెనా
సారెకు వానికి౯ మనలసద్దశ విప్రులచేత నైనచో
వారలఁదప్ప మద్రచితవందన మొందువసించు నిత్యము౯.

చిత్రకవి రామాచార్యులు.

భోజభూపాలీయోపాఖ్యానంబను రఘునందనవిలాసము.

గీ. ధర్మమునఁ గల్గునే నున్నతగతి జగతి
నకృతకోక్తులఁ దత్త్వము యఁడరునేని
వాని వెలయించువారలు పాఱులేని
వారిఁగాక నామ్రణతు లేరిఁ జెందు.

నిడమర్తి జలదుర్గాప్రసాదరాయకవిగారు.

చ. భువనమునందు నుచ్చగతి పొల్పుగధర్మమునుండి ప్రాపితం
బవునదియేని ధర్మపుయథార్థమెఱుంగుట వేదవిద్యచే
నవునదియేని వేదముల నన్నిటినిం బ్రకటించురీతి వి
ప్రవరులచేత నేని మఱి వారిసిగాకెటఁ జేరు మన్నతుల్.

అల్లమరాజు రంగశాయికవిగారు

చ. జనములు సద్గతిన్బొరయు సాధనమైనది ధర్మమేని య
ద్దనికి కకృత్రిమంబు నిగమంబె ప్రమాణమునయ్యెనేని దా
నిని ధరియించి యెంచి ధరణిన్వెలయింతురు పాఱులేని న
స్పనముగు మత్ప్రణామములు వారికిఁగాక మఱేరి కయ్యెడు౯.

పొన్నాడ కృష్ణమూర్తిగారు.

ఉ. ధారుణిలోన సద్గతినిదానము ధర్మమయేని దాని కా
ధార మపౌరుషోక్తికలితం బగువేదమయేని వేదము
న్నేరిచి యీధరాస్థలిని నిల్పెడువారలు పాఱులేని నా
పాఱులఁ గాక యింకఁ బెఱవారల నెవ్వరిఁ జేరు మన్నతుల్.

జయంతి రామయ్యపంతులుగారు.

---

# గ్రంథస్వీకారము.

## (1) నూతనరాజ్యాంగవిధానము.

రచయిత: తల్లాప్రగడ జగన్నాథరావుగారు, B.A. వెల 8 అణాలు.
కాకినాడలో, ప్రతులు: గ్రంథకర్తయొద్ద దొరకును.

స్వపరిపాలనము, స్వాతంత్ర్యమును, ఓటుహక్కు మున్నగుభావములు ప్రబలి, నలుదలఁ బ్రాకియున్న యీదినములలోఁ, బ్రతిమానవుఁడును, ప్రజలకు, ప్రభుత్వమునకు నొండొరులయెడఁ గలహక్కులు, బాధ్యతలు, సంబంధము తెలిసికొనవలసినయావశ్యకత మిక్కుటము.

ఈగ్రంథమున మొదటియేఁబదిపుటలందు నాంగ్లేయు లీదేశమున వర్తకమునకై ప్రవేశించి రాజ్యము నార్జించినదిమొదలు 'కుంఫినీ'పాలనమంతమొందువఱకును, కుంఫినీవారిని దొలఁగించి 1858 లో విక్టోరియా రాణి భారతసార్వభౌమత్వము వహించిన దాది 1935 వఱకు మనపాలన మేవిధముగ నుండెనో, దిఙ్మాత్రముగ సూచితమై, 1935 వ సంవత్సరపు ఇండియాప్రభుత్వచట్టముప్రకారము నేఁడమలునందున్న విధానమునకు పోద్ఘాతముగనున్నది. నేటిభారతరాజ్యతంత్రమున, సార్వభౌముఁడు భారత రాజ్యాంగమంత్రి, రాష్ట్రీయగవర్నరులు, రాష్ట్రీయశాసనసభలు, గవర్నరుజనరలు లేక వైస్రాయి, అఖిలభార తాంతరరాష్ట్రీయశాసనసభ, ప్రజలు, వీరిస్థానములు, వీరికిఁ గలపరస్పరాధికారతారతమ్యములు, హక్కు బాధ్యతలు వివరింపఁబడినవి. ఆంగ్లభాషాసంపర్కము లేనివారికిని, భారతచట్టము నామూలాగ్రముగఁ బఠించుట కవకాశము లేనివారికిని, సంక్షేపముగ నేటిభారతీయపాలన విధానమందలి మూలసూత్రములఁ దెలిసికొనుట కీగ్రంథ ముపయోగించును.

పా.

---

## (2) బ్రహ్మవిద్యా. BRAHMAVIDYA (సంపు- 1 సంచి. 2)

అడయారువిద్యాలయసంఘమువారిచేఁ బ్రకటింపఁబడినది. ఇందు మాధవకృత మగుభాష్యముతో ఋగ్వేదము వెనుకటిసంచిక తరువాతి భాగము వెలువడినది. ఉపనిషత్తులకు నాశ్వలాయనగృహ్యసూత్రము

లకు నాంగ్లభాషాంతరీకరణమే కాక నూతనముగ మేళరాగమాలిక యను నపూర్వగ్రంథ మొకటి ప్రారంభింపఁబడినది. ఇది శ్రీ మహావైద్యనాథయ్యరుగారిచే రచియింపఁబడినది. సంగీతశాస్త్రజిజ్ఞాసువుల కత్యంతోపయోగ మనుటలో సందియము లేదు. కర్ణాటదేశమునఁ బ్రచారమునఁ గల డెబ్బదిరెండురాగముల వివరణ మిందుఁ బ్రకటింపఁబడును. టిబెటను భాషనుండి యనువదింపఁబడిన భావసంక్రాంతిసూత్రమూలమును, దాని కాంగ్లభాషాంతరీకరణమును, గలవు. బోధిరుచి, బుద్ధశాంత, ఇట్సింగు మొదలగు సుప్రసిద్ధ బౌద్ధపండితుల మూలగ్రంథములకుఁ గలభేదములఁ దెలియఁజేయుటకై యాంగ్లానువాదము లొకచోఁ జేయఁబడినవి.

**The Adyar Library Bulletin Vol. I - Part II.** This issue contains the continuation of Madhava's Rigveda Bhasya and of the English translation of the Yoga Upanishads commenced in the first part of the Journal. A new work on music called Mela - Raga-malika by Maha Vaidyanatha Iyer is commenced in this issue. The work aims at giving the description of the Seventy two Ragas prevalent in Karnata Music and commences with the Sri-Raga. It is bound to be very useful to lovers of South Indian Music. The Bhava Sankranti Sutra constructed from the Tibetan Version and its translation with the English Versions of the Texts of Bodhiruchi, Buddhasanta and Itsing for Comparative Study are given in this part. We congratulate the Editor and his staff for their useful contribution to Oriental studies in the pages of this Bulletin.

---

(3) కథాసరిత్సాగరము.

వేంకటరామకృష్ణప్రణీతము. 2 వది కథాముఖలంబకము. 4 వది నరవాహనదత్తజననలంబకము. ఈరెండును మాకార్యాలయమునకుఁ జేరినవి. లావాణకలంబకము నిదివఱకే పరిషత్పత్త్రికాపాఠకు లెఱిఁగియున్నారు. వేదము వేంకటరాయశాస్త్రులుగారి వచనమొకటి దీనికి ముందే యున్నది. ఉన్నను దీనిం జదువువారి కిది మృదుమధుర పద్యకావ్య మగుట నెక్కుడుసంతోషము కలిగింపకమానదు.

పూర్వపండితులకు మనకువలె గ్రంథములు లేవు. రామాయణ, భారత, భాగవతాదులే కాని మనకువలె వారి కితరకావ్యము లేవి!

వానిం జదివియే, యశస్కులైన మనకొఱకు వా రమితము ననూల్యము నైన వివిధకావ్యసంచయమును దయచేసియున్నారు. పైవానితోపాటు పూర్వులు-కథాసరిత్సాగరమునో బృహత్కథనో చదువుకొనుచుండెడువా రనుట కెన్నియో దృష్టాంతముల నీయవచ్చును. ఒక్క కాళిదాసునిం దీసికొందము. ఆతఁడు రఘువంశము, కుమారసంభవము నను పేరులు కూడ శ్రీమద్రామాయణమునుండియే గ్రహించెనని చెప్పవచ్చును. మేఘసందేశమును గథాసరిత్సాగరములోని యొక్క శ్లోకమునుబట్టి రచించె నని పెద్దలు చెప్పెదరు. దానిని ముందు విమర్శింతము. అభిజ్ఞానశాకుంతలమును బృహత్కథను జదివియే యాకవి రచియించెను. ఒక్క చోటనున్న దొక్క విషయము వేఱొక్క చోట నున్నది యొక్క విషయమును దలలుమార్చి యందందుఁ గూర్చినాఁడు. కథాముఖలంబకములో-తిలోత్తమ శతానీకుని శపియించుట దుర్వాసుఁడు శకుంతలను శపించినట్లు మాఱిచినాఁడు.

ఉ. ఎవ్వతె నీమనంబు నారయించుటఁ జేసి యనన్యబుద్ధివై
యివ్విధి నామపల్కు గణియింపక నీవిపు డేఁగుచుంటివో
యవ్వనితాలలామ కెడయై పదునాలుగువర్షము ల్మదిన్
నెవ్వగ నొందుచుండెదవు నీవని శాపమొసంగె నయ్యెడన్.

వ. తదీయశాపవచనంబు లింద్రసారథియైన మాతలి యాలించెం గాని,
రాజున కట్టి యహితవచనంబు లెఱింగింపనొల్లక మిన్నకుండె.

ప్రథమతరంగము 49-50.

గీ. తండ్రికులముద్ధరింపంగఁ దగినయొక్క
యర్భకుం డున్నవాఁడు నీగర్భమందు
వెలయ నాతండు నీకుద్భవించు నిందు
నవుల భర్తృసమాగమం బదియుఁగలుగు.   1-96

(ఇది జమదగ్ని చెప్పినట్లున్నది) ఉదయనుని జననసందర్భమునఁ గల దానిని కాళిదాసు భరతుని జననమునకు సందర్భించినాఁడు. పైమాటలలో నాఁడువారిమాటలు మగవారికిని మగవారి మాట లాఁడువారికినిఁ బెట్టినాఁడు.

గీ. ఇంతలోపల నయ్యాశ్వ రేచ్ఛవలన
నుదయమునిచేత బహుమాన మొందినట్టి
చెంచు నప్పెడికడియమ్ముఁ గొంచుఁబోయి
యాపణమ్మున నది యమ్మఁజూపుటయును. 119

ఇక్కడికథ చదువుఁడు. మీకు శాకుంతలనాటకములో నభిజ్ఞాన మెట్లున్నదో విశదమగును. ఒక్కటికాదు:—

౧౨ లంబకము ౨౭ వ తరంగములోఁ జంద్రావలోకుఁ డిందీవర ప్రభయను నిరువదియవకథలోని విషయము కొంత శాకుంతలనాటకమునఁ జేర్చినాఁడు.

"అథ సప్రణయం రాజా తాం సప్రచ్ఛసోత్సుకః
భద్రే కః పుణ్యవాన్ వంశ స్త్వత్సఖ్యాలంకృతో నయా
కాని శ్రోత్రామృతస్యన్ది న్యస్యా నామాక్షరాణిచ
కిం చైవ మనసూ పుష్పసుకుమార మిదం వపుః
తాపసోచితయా వృత్త్యా విజనే క్లిశ్యతే."

ఈభాగము దుష్యంతునితో ననసూయాప్రియంవదలు సంభాషించుసందర్భమున నదికినాఁడు.

ఇట్టి మెలఁకువలు మనకుఁ దెలియక కాళిదాసుని స్వకల్పనము లే యని సంతోషించుచున్నాము. నయమే! ఒకవిద్వాంసుఁడు "దొంగగాని కవియు, వర్తకుఁడును లేఁడు, తనదొంగతనమును గప్పి పుచ్చుకొనువాఁడే గొప్పవాఁ"డను నర్థమిచ్చువిషయము వ్రాసినారు. దానిపరమార్థము నూహింపుఁడు. కొంచెమో గొప్పయో యీకథాసరిత్సాగరముం జదివిన సమస్తవిషయములుం దెలిసికొనఁగలరు. ఇట్టియుత్తమగ్రంథమును ముఖ్యముగా మన తెనుఁగువారు పండితులు మొదలందఱు నుపేక్షించుచున్నారు. ఇందు లేనివి మఱియెందును లేవని మఱియొక్కసారి చెప్పుచున్నారము. నరవాహనదత్తజననలంబకము నాగానందకథవలన నెల్లరకు సుపరిచితమైనదే. ఈగ్రంథములలోఁగూడ వెలలు తెల్పఁబడియుండ లేదు.

వ. ఇవ్విధంబున నద్దశరథమహీధవుండు సకలబలసమేతుం డై యంతఃపురకాంతలతోడం గూడం గదలి నదులు వనంబులు నగంబులుం గడచి కతిపయప్రయాణంబుల నంగరాజరాజధాని డగ్గఱి రోమపాదుండు ప్రమోదంబున నెదుర్కొని తోడ్కొని పోవం దత్పురంబుఁ బ్రవేశించి యానృపాలుండు సేయు విడిదియులుపాలు[1] గైకొని తన్మందిరమ్మునం గొన్నిదివసంబులు విందువీడుల నానందించుచు నంత నొక్కనాఁ డతనితో ని ట్లనియె. ౧౨

క. ధరణీశతిలక నీకూఁ
తురు శాంతాకన్య భర్తతోఁ గూడఁగ నా
పురికిఁ జనుదెంచి తిరి గిట
కరుదెంచుంగాని వేడ్క నంపఁగవలయున్. ౧౩

చ. అన విని యంగభూమిభుఁడు నట్ల యకా కని కూఁతు నల్లుఁ దో
డ్కొని చను మన్న నానృపతికుంజరుఁడు న్ముద మొప్ప వారిఁ దో
డ్కొని చనియెం బురంబునకుఁ గోసలదేశము వారు మార్గసీ
మ నిలిచి కాన్క లిచ్చి కన మన్నన వారల నాదరించుచున్. ౧౪

సీ. చామీకరధ్వజోజ్జ్వలవజ్రసౌధంబు
పల్లవతోరణోద్భాసితంబు
సలిలసంసేకశీతలరాజమార్గంబుఁ
సంతతాగరుధూపసౌరభంబుఁ
జిత్రవిశేషభూషితభిత్తిభాగంబుఁ
బ్రతివీథికల్పితోన్నతరథంబు
స్వర్ణరంభాస్తంభసంభృతద్వారంబు
రంగవల్ల్యంకితప్రాంగణంబు
నగుపురంబుఁ బ్రవేశించె నవనివిభుఁడు
ఋశ్యశృంగుని మున్నిడి యిరుగెలఁకుల
బలసమూహంబు మంత్రులు బలసికొలువఁ
బల్లకీలును దాను సంభ్రమము మెఱయ. ౧౫

---

1. విడిదివియులుపాలు-మూ.

క. అప్పుడు పౌరవధూమణు
లుప్పరిగలమీఁద నెక్కి యొక్కట లాజల్
గుప్పించిరి దశరథుపైఁ
గప్పెనఁగెడు తమకుచూపుఁగలువలఁ గూడన్. ౧౬

గీ. అంత నగరు ప్రవేశించి యంతిపురము
నందు నాఋశ్యశృంగుని నగ్ర్యపీఠి
నునిచి యర్ఘ్యంబుఁ బాద్యంబు నొసఁగి వేడ్కఁ
బూజ లొనరించె దశరథభూవరుండు. ౧౭

వ. అప్పుడు. ౧౮

ఉ. అంతిపురంబునం గలుగునంగన లందఱు నెమ్మనంబుల
న్సంతస మొప్ప నేఁడు మనశాంతను గన్గొనఁ గల్గెనంచు న
య్యింతిని వేఱవేఱ తమయిండ్లకుఁ దోడ్కొనిపోయి యెంతయు
న్వింతలుగాఁగ సంతతము విందు లొనర్చిరి మచ్చిక ల్దగన్. ౧౯

వ. ఋశ్యశృంగుండును దశరథరాజుచేతం బూజ గైకొనుచుం దన్మందిరం
బున శాంతయుం దానును సంతసంబునం గొంతకాలంబు సుఖం
బున వసియించుచుండ. ౨౦

ఉ. వచ్చె వసంత మంతట నవత్వము మీఱుచు భూరుహావళుల్
హెచ్చఁగ నించువిల్లు వెస నెక్కిడి మారుఁడు పుష్పబాణముల్
గ్రుచ్చఁగ నల్లనల్ల నిలఁ గోయిలమూఁకల మూకభావము
ల్వచ్చఁగ భూజనుల్మిగుల వేడుక లబ్బె నటంచు మెచ్చఁగన్. ౨౧

క. అందంద చిలుకతేజీ
జిందులు ద్రొక్కించికొనుచుఁ జిల్లునఁ దేనె
ల్చిందుశరంబులు గైకొని
కందర్పుఁడు గుఱులు వైచెఁ గాననసీమన్. ౨౨

క. కాంతలుఁ బురుషులుఁ గూడి ల
తాంతాక్రాంతంబు లగు వనాంతములందున్
సంతతముఁ జలిపి రెంతయు
సంతస మెసఁగ న్వసంతసమయోత్సవముల్. ౨౩

సీ. కలకంఠకలకలక్రమసమగ్రము లైన
జొంపంపుఁగ్రొమ్మావిగుంపులందు
భ్రమరఝుంకారసంభ్రమరంజితము లైన
గొజ్జంగపొదరిండ్లపజ్జలందు
మధువర్షికుసుమసంపత్సంభృతము లైన
వకుళభూరుహముల వాడలందుఁ
బవనధూతపరాగభరితతీరము లైన
తెలిదమ్మికొలఁకుల కెలఁకులందు
వేడ్క వనభోజనములు గావించి రపుడు
మావిపండ్లరసంబుతోఁ బూవుఁదేనె
దొప్పలను నించికొనుచు సొం పొప్పుచుండ
నంగనలుఁ దారు జనులు వనాంగణముల. ౧౪

వ. ఇత్తెఱంగున వసంతంబు సకలజనకాంతం బగుచుం గనుపట్టినం జూచి దశరథమహీకాంతుండు సంతసంబున సంతానార్థం బశ్వమేధంబు సేయవలయు నని తలంచి తనయంతఃపురమున సంతతంబుఁ బూజలు గైకొనుచు శాంతాసమేతుం డై యున్న శాంతాకారుఁ గారుణ్యనిధి దేవవర్ణితచరిత్రు దేవవర్ణి ఋశ్యశృంగమునిపుంగవుం జేరంజను దెంచి నమస్కరించి యి ట్లనియె. ౧౫

— దశరథుఁ డశ్వమేధయాగము చేయుట. —

గీ. ఇదె వసంతంబు వచ్చె నోఋశ్యశృంగ
మౌనిపుంగవ తామసింపంగవలదు
తురగమేధంబు సేయంగ దొరకొనుందు
సంతతి వొసంగు మీమంత్రశక్తివలన. ౧౬

వ. అనిన ఋశ్యశృంగుం డి ట్లనియె. ౧౭

క. తురగంబు విడువఁ బంపుము
సరగున హయమేధమునకు సంభారసము
త్కరములు సంపాదింపఁగఁ
బురికించి ప్రధానవరులఁ బనుపు నృపాలా. ౧౮

సీ. అన విని దశరథుం డపుడు సుమంత్రుఁ బి
ల్వఁగఁ బంపి యోమంత్రివర్య నీవు
వైశంప జాబాలివామదేవసుయజ్ఞ
కాశ్యపప్రముఖు లౌ ఘనుల నాదు
గురువులైన వసిష్ఠవరవరాని వెండియు
వేదాంతవిదుల ఋత్విజుల నెల్లఁ
దోడ్కొని రమ్మన్న వేడ్కతో నతఁడును
జని వారి నందఱి వినయ మెనయఁ
బిలిచి తెచ్చిన నమ్మనుకులుఁడు చూచి
మానులకు నెల్ల భక్తి నమస్కరించి
డెందమునయందు మోదంబు గందళింపఁ
బలికె ని ట్లని సరసవాక్ప్రౌఢి మెఱయ. ౨౯

చ. వినుఁడు మునీంద్రులార పృథివీపరిపాలనఖేలనంబుచే
ననుపమసౌఖ్యము ల్గలుగునంద్రు గదా యది యొక్క సౌఖ్యమే
తనయులు లేమి నిప్డు మది తల్లడమొందఁగ సౌఖ్యలేశముం
గనుఁగొన నైతి సంతతియె కారణ మెన్నఁగ సౌఖ్యపంక్తికిన్. ౩౦

క. తనయులకై హయమేధం
బొనరింపఁగవలయు ననుచు నున్నాఁడను మీ
రనుపమమంత్రవిధిజ్ఞుల
రనుకూలము సేయవలయు నాయజ్ఞంబున్. ౩౧

క. తొలుమేన నెట్టికర్మము
చలిపితినో యిపుడు పుత్రసంతానము లే
కలమట నొందెద సంతతి
కలిమికి హయమేధమఖము గావింపఁదగున్. ౩౨

క. ఈఋష్యశృంగమునివరు
కారుణ్యముచే ఫలించుఁ గాంక్షిత మెల్లన్
వారును మీరును సంతతి
కారణముగ నధ్వరంబు గావింపుఁ డొగిన్. ౩౩

చ. అనిన వసిష్ఠమునివరుఁ డాదిగఁగల్గినమహాను లందఱున్
మన మలర న్విభండకకుమారుని మున్నిడి సాధుసాధు శో
భనమతి వైనయాన్నృపతి ప్రశ్నము సేసినరీతి గంటిరే
విన మిలనెందు నీదృశవివేకవిపాకము నెన్నఁ డేనియున్. 3౪

మ. సుతసంతానము సద్గతిప్రదమటంచుం జాటునానాశ్రుతి
స్మృతిసిద్ధాంత మెఱింగి తత్సుతులకల్మిం గోరి ధర్మక్రమా
ర్జితవిత్తంబున నశ్వమేధముఖముం జేయంగ నూహించె ని
వృతి సాధుస్తుతి కెల్లయోగ్య మగు నీభాగ్యంబు సామాన్యమే.

క. ఎంతటిధృతి యెంతటిమతి
సంతతిఫల మశ్వమేధసవనమువలనం
గాంతు నని పలికె దృఢముగ
నింతటిరా జెందునైన నిలలోఁ గలఁడే. 3౬

చ. అని యిటు లవ్వసిష్ఠముని యాదిగఁగల్గిన మహాను లందఱుం
దనయులు నీకుఁ గల్గెదరు తప్పక యాగము సేయుమంచుఁ బ
ల్కినపలు కాత్మసమ్మదము గీల్కొనఁజేయ నమాత్యవర్గముం
గనుఁగొని పల్కె నద్ధరణికాంతుఁడు పంతస మొప్పుచుండఁగన్.

క. వాగురువుల యానతిచే
సాగింపుఁడు యాగ మఖిలసంభారంబుల్
వేగ నొనగూడఁ జేయుం
డాగమకోవిదులఁ బిలువనంపుఁ డిచటికిన్. 3౭

క. ఏయెడల విశృంఖలగతి
నై యవనిం దిరిగిరాఁగ నశ్వము సోపా
ధ్యాయముగ విడువఁబంపుఁడు
పాయక వెనువెంట సకలబలములు గొలువన్. 3౮

సీ. సరయూస్రవంతి యుత్తరతటంబునయందు
యజ్ఞభూమి యొనర్పుఁ డచట నచట
శాంతికవిధులు శాస్త్రము దప్పకుండంగ
వర్తిల్లఁ జేయుఁడీ వరమఖంబు

క్షితినాథులకు నెల్లఁ జేయంగ వచ్చుఁ బో
వొకటి లోపంబు లేకుండవలయుఁ
బగవట్టి విద్వాంసు లగు బ్రహ్మరాక్షసు
ల్విఘ్నంబు సేయంగ వేచియుంద్రు
క్రతువునకు విఘ్న మేదైనఁ గలిగెనేని
కర్తకుఁ గొఱంత వాటిల్లుఁ గాన మీర
లధ్వరం బెట్లు కొనసాగు నట్లు సేయుఁ
డనిన మంత్రులు నృపుమాట కలరి వేడ్క. ౪౦

క. భూనాథవంశమణి నీ
యానతిఁ దల మోచి యేము హయమేధంబుం
బూని యొనర్తుము తగ నె
వ్వైనను నీతలఁపు సఫల మగు నూహింపన్. ౪౧

వ. మహీపాల భవత్సంకల్పానుసారంబున నశ్వమేధంబునకు వలయు సం భారంబు లొనగూర్చెద మని పలికిరి వసిష్ఠాదిమహర్షిపుంగవులు భవ త్సంకల్పంబు గొనసాగు సర్వంబు సంపన్నం బగు నని యమ్మహీశు నుపశ్లోకించిరి యమ్మంత్రివరుల ధరణీబృందారకుల నందఱ నంచి యవితథమనోరథుఁ డగుచు దశరథుండు నంత నశ్వంబు సమంత్రకం బుగా విడిపించి యంతఃపురంబున కరిగి సుఖం బుండె నసంతరంబ క ర్తాంతికు లందఱు సంతసంబున. ౪౨

క. శాలలు గట్టిరి చాల వి
శాలతలు చెలంగుచుండ సరయూతటినీ
కూలమున సవనమున కను
కూలముగాఁ బనులమారుపు కొమరొప్పంగన్. ౪౩

సీ. సోపానపంక్తులఁ జూపట్టుచుండెడు
సున్నంపుఁజగతుల సొంపునింపు
మొగసాలలును జుట్టు గగనంబుముట్టెడు
ప్రహరిగోడలు వింతపనుల మెఱయు

శయ్యాగృహములు భోజనకూటములుఁ బాక
 శాలలుఁ గొలువుండు చావడులును
స్నానమందిరములు జలజకహ్లారసం
 దీప్తంబు లగు కేళిదీర్ఘికలును
జలువపందిరులును వేత్తసలుపుచుండ
భూభుజుల కెల్ల నుపకారికాభవనము
లెన్నియేనియుఁ గట్టి రెల్లెడల మిగులఁ
బలుపు నిడుపును గలుగ సంభ్రమము చెలఁగ. ౪౪

క. భూవలయంబునఁ గల నా
నావర్ణంబులకు నెల్ల నవముగ విడుదల్
గావించి రెన్నియేనియు
నేవంకం గనిన వీథు లేర్పడుచుండన్. ౪౫

చ. నరవరు లంత సద్ధరణినాయకునానతి మోచి వచ్చి ర
ధ్వరవరముం గనుంగొనెడు వాంఛలచే నరదంబులు న్మద
ద్విరదములుం దురంగములు వీరభటౌఘము గొల్వ నుల్లస
ద్విరుదపతాకికానికరదీధితు లంబర మెల్లఁ గప్పఁగన్. ౪౬

సీ. దశరథమేదినీధవుఁ డశ్వమేధంబు
 సలుపుచున్నాఁడఁట యలఘురుహిమ
సతనియజ్ఞంబున నాగంతుకుల కెల్ల
 వలసినట్టులు భక్ష్యములు గల వఁట
భోజనంబును గాక భూజనంబున కిత్తు
 రఁట రత్నమయభూషణాంశుకములు
నెందఱే వచ్చిన నందఱ కచ్చోట
 విడుదలు గల వఁట వేడ్కవెలయ
ననుచు నొండొరుఁ జీరుచు నఖిలదేశ
వాసులగు బ్రాహ్మణక్షత్త్ర వైశ్యశూద్ర
వరులు సాకేతపురమున కరుగుదెంచి
రవనినాథుని యధ్వరోత్సవముఁ జూడ. ౪౭

వ. ఇవ్విధంబునం జతురర్ణవీవలయితవసుంధరావలయంబునం గల చతు
ర్వర్ణంబులవార లెల్లం జనుదెంచినం గనుంగొని వసిష్ఠమహర్షి మనం
బున హర్షించుచు దశరథమహీధవునితో ని ట్లనియె. ౭౮

క. భవదీయశాసనంబున
సవనమహోత్సవముఁ జూడ జనకాదిమహీ
ధవు లెల్ల వచ్చి యిదె పుర
సవిధస్థలులందు నిండసాగిరి వేడ్కన్. ౭౯

క. అర్ణవవృతధరణిం జతు
ర్వర్ణంబులవార లెల్ల వచ్చిరి క్రతువుం
బూర్ణ మగు నీకు భాగ్యము
వర్ణింపఁ దరమె యెంతు వసుధాధీశా. ౮౦

క. పరిపూర్ణ మయ్యె నంవ
త్సరమును నశ్వంబు వచ్చె ధరణిం దిరిగి భూ
వర సరయూతటమున నిఁకఁ
దురంగమేధంబు సేయ దొరకొనవలయున్. ౮౧

క. రమణులతోడుత సుముహూ
ర్తమునం గ్రతుశాల కరిగి తత్క్రతుదీక్షా
క్రమ మెల్ల నడపు బుత్వి
క్ప్రముఖుల నియమించు సవనకర్త మొనర్పన్. ౮౨

సీ. అన విని యట్లకా కని యానృపాగ్రణి
సైద్ధాంతికసమూహసమ్మత మగు
శోభనదినమున సుముహూర్తవేళ నం
తఃపురకాంతలుఁ దాను నొకట
మణిమయానేకభూషణభూషితాంగులై
చేడియ లుడిగము ల్సేయుచుండ
బుశ్యశృంగుఁ బురస్కరించి వసిష్ఠప్ర
ముఖభూమిదివిజులు ప్రేమలఁ జనఁగ

శంఖదుందుభివాద్యనిస్వనము లెసఁగ
నగరువెడలి జనంబు లానంద మొంది
తనమహావైభవంబుఁ గన్గొనఁగ నాత్మ
నలరుచును యజ్ఞశాలకు నరిగె నంత. ౫౩

చ. జనపతి యజ్ఞశాలకు ససంభ్రమతన్ రమణీజనంబుతోఁ
జన నపు డభ్రమార్గమున సారెఁ బ్రదక్షిణలీల విష్ణువా
హనములు సుస్వరమ్ముల జయంబులు దెల్పుచు సంచరించెఁ జం
దనగిరిమందగంధపవనం బనుకూలత మించె నెంతయున్. ౫౪

గీ. యాగశాలకు నల్లేఁగి యవనివిభుఁడు
దీక్షగైకొని యంత ఋత్విజులఁ బిలిచి
క్రతువు నడపింపుఁ డనుచుఁ బల్కంగ వారుఁ
జెలఁగి కూశ్మాండగణహోమముల నొనర్చి. ౫౫

వ. ఋశ్యశృంగుఁ బురస్కరించుకొని యశ్వమేధయాగప్రయోగంబు నడ
పం దొడంగి రప్పుడు. ౫౬

ఉ. ఆనరనాథుయాగసదనాంగణభాగమునందు ఋత్విజు
ల్భానురుచు ల్దొలంకు జిగిబంగరుపళ్లెరముల్ గరంబులం
బూని శుభస్వరంబులఁ బ్రమోదము మీఱుచునుండ దేవతా
హ్వాన మొనర్చి రందఱు సురావలియంబరవీథిఁ జూడఁగన్. ౫౭

గీ. ఋశ్యశృంగుండు క్రతువుఁ జేయింపఁ దొడఁగె
నన్నిదిశల నాధ్వర్యవహోత్రభాగ
తంత్రవిదులైన బ్రాహ్మణోత్తముల నెల్ల
నుండ నియమించి వేద్య విధ్యుక్తసరణి. ౫౮

క. ఆలోచనామహార్హులు
చాలం దలయూఁచి మెచ్చ సవిధికముగ జి
హ్వాలకృశానువిశాల
జ్వాలల వేలిచిరి మునులు సాన్నాయ్యంబుల్. ౫౯

క. అయ్యాగశాలలోపల
ధాయ్యాసంధుక్షితాగ్నితాపసహుతసా

న్నాయ్యనవసౌరభము సుర
లయ్యారే యనఁగ దిక్కు లలమఁ దొడంగెన్. ౬౦

క. గుమ్మనుచు హవిర్గంధము
గ్రమ్ముచు నలుగడల నిగుడఁగాఁ గర్పురవ
ర్ణమ్మగుచు హోమధూమము
నమ్మఖశాలలను వెడలి యంబర మలమెన్. ౬౧

ఉ. ఆమహిపాలుయజ్ఞసదనాంతరసీమలఁ జూడ నెల్లెడన్
సామగసామగానములు చాలవినం జవియయ్యెఁ గోకిల
స్తోమము పంచమస్వరము సొంపులునింపఁగఁ గ్రోల్చినట్టు లు
ద్దామసుధామధుద్రవము ధారలుగా భువి నిండుకైవడిన్. ౬౨

ఉ. గండయుగస్థలంబుల నఖండమణీఘృణిమండలస్ఫుర
త్కుండలము ల్నటింపఁగ నెదుర్కొని వాద మొనర్చి మాటికిం
బండితకోటి యాధరణిపాలకునధ్వరవాటి నిండి వై
తండికమార్గవక్రతరతర్కవచఃక్రమము ల్చెలంగఁగన్. ౬౩

క. ప్రతిదివసము నయ్యజ్ఞా
యతనమున భుజించి రప్పు డవనిసురు లవా
రితముగ నిండుచ్ఛాయా
యుత మగు నన్నంబు షడ్రసోపేతముగన్. ౬౪

క. గ్రుక్కిళ్లు వెలయ డాచేఁ
బ్రక్కలు నిమురుచును శాకపాకంబుల న
మ్మక్క యటంచుం బొగడుచు
నొక్కట వేడుక భుజించి రుర్వీదివిజుల్. ౬౫

సీ. అయ్యల కిచట గంగామృతంబులు దెండు
వేఁడియన్నములు వేవేగ నిడుఁడు
వడ్డింపుఁ డీబంతి నిడ్డెనకుడుములు
నేయి దొప్పలనిండఁ బోయుఁ డిందుఁ
గూర లన్నియు మాఱు గొంచురం డందఱుఁ
దియ్యచారులు సారె దెండు చాల

మజ్జిగపడిదెము ల్భజ్జను లడుగుండు
కుప్పళింపుఁడు చాయపప్పులెల్లఁ
గ్రుమ్మరింపుఁ డిచ్చోటులఁ దిమ్మనంబు
లనెడుపల్కులె యజ్ఞశాలాంతరమునఁ
గూడి వినవయ్యె మంథానకుధరమథిత
జలనిధానవినాదంబుసరణి నపుడు. ౬౬

క. ఘృతగుడపాయసములతో
సతతము భుజియించె మూకజడబధిరాంధ
ప్రతతియుఁ బంగుగ్లాని
ప్రతిభిక్షుశ్రమణనాథవన్నివహంబుల్. ౬౭

ఉ. గంతులువైచుచు న్నగుచుఁ గాంచనశోభితరత్నమేఖలా
కాంతులు దిక్కులు న్నిగుడఁగాఁ బరివేషకు లప్పు డచ్చటన్
బంతులరీతి సూపఘృతపాయసపాత్రలఁ బట్టి యాడుచు
న్బంతులవెంట వేడుక లొనర్చిరి చూపఱ కెల్లనెల్లెడన్. ౬౮

సీ. అన్నకూటంబులు నాజ్యకటాహముల్
శర్కరోత్కరములు శాకతతులు
సూపరాసులును నపూపసమూహముల్
పాలకాఁగులు ఫలప్రకరములును
వెన్నదిన్నెలు నాలజున్నుకుప్పలుఁ దేనె
బిందెలు మీఁగడపెరుఁగుతొల్లుఁ
బరమాన్నపాత్రలుఁ బానకంబులకొప్పె
రలు నీరుమజ్జిగకొలఁకుగములుఁ
దియ్యదెలినీటిబావులుఁ దెప్పలగుచు
వేలసంఖ్యల మించి యవేలగతులఁ
జూపఱుల కద్భుతంబులు చూపె నప్పు
డమ్మహీనాథు యాగశాలాంతరముల. ౬౯

క. క్షీరాజ్యాహుతుల మహా
వీరములఁ బ్రవర్గ్య లెసఁగె వితతాగ్నిశిఖా

ధోరణి మిన్నులు ముట్టఁగ
సారెకు వేడుకల సకలజనములుఁ జూడన్. ౭౦

సీ. సరిగ చిత్రపుఁగుట్లు సరిలేని ముత్యాల
బవిరిచౌకట్టులు[1] పరిఢవిల్లఁ
గుఱుచగేదంగిరేకుల యలికల మించు
జడలు పిఱుంద్రుల బెడఁగు చూప
జిగిపైఁడియందెలవగల చందురకావి
నెఱికకాసెల నిగనిగలు నిగుడ
నభినయంబుల నేర్పు లలరించుకంకణ
కలితహస్తముల సింగార మమర
ఘనతరమృదంగధింధిమి ధ్వనులు సెలఁగ
వింతకోపులు మెఱయంగ వేశ్యలపుడు
నాట్యమొనరించి రమ్మహీనాథమౌళి
యాగశాలాంతరద్వారభాగములను. ౭౧

గీ. అంతఁ బ్రాతస్సవనము మాధ్యందినసవ
నముఁ దృతీయసవనమును గ్రమముతోడఁ
జలిపి రాఋత్విజులు మహాసంయములును
మంత్రతంత్రవిశేషసామగ్రి మెఱయ. ౭౨

వ. విశ్వకర్మీయతంత్రచాతురీచతురాననకల్పులగుశిల్పులప్పుడు ఋత్విక్ప్రముఖులం బురస్కరించుకొని బైల్వంబు లాఱును, ఖాదిరంబు లాఱును, బిల్వసహితంబు లగు పలాశంబు లాఱును బాహువ్యస్తపరిగ్రహంబు లగు శ్లేష్మాతక దేవదారువులు రెండునుం గా నిరువదియొక్క యూపంబులు శక్షురూపంబులుగా నష్టాంగసంగతంబు లేకవింశత్యరత్నిప్రమాణసహితంబులు గావించి యొండొంటి కేకవింశతి వసనంబులు పొసంగించి యన్నింటికిం గనకచషాలంబులు గీలించి గం

1. బవరిచక్కట్టులు- మూ.

ధపుష్పాక్షతంబుల నలంకరించి ప్రతిష్ఠించి రయ్యూపంబులు దేదీప్య
మానంబు లగుచు నాకసంబునం బ్రకాశించు సప్తర్షులజోకం బ్రకా
శించుచుండె. ౭౩

శా. ఆఋత్విక్కులు నంత నిష్టకలచే నందంబు మీఱం జమ
త్కారం బొప్పఁగ రుక్మపక్షగరుడాకారంబుగాఁ బన్ని యం
దారూఢస్థితిఁ జేసి రగ్నిచయనం బాశ్చర్యచర్య న్మహో
దారప్రక్రియ మంత్రతంత్రవిభవవ్యాపార మేపారఁగన్. ౭౪

సీ. అంత ఋత్విజు లెల్ల నాయాజ్ఞ హయమును
శామిత్రమున నిల్పి జలచరాది
పశువుల మున్నూటిఁ బాటించి యందుతోఁ
గూడ యూపములందుఁ గూర్చికట్టి
విశసింపకయ వాని విడిచిరి కౌసల్య
తత్తురంగంబుఁ బ్రదక్షిణంబు
గావించి నిశితఖడ్గంబులు మూఁడు గై
కొని విశసించె నెమ్మనము వొదల
హోత యధ్వర్యుఁ డుద్గాతయు ను గడంగి
హయముతోఁ గూర్చి రారాత్రి యధిపుసతుఁ
ముప్వురను వారు భక్తిసొంపున హయంబు
నొందఁ బరిచర్య చేయుచు నుండి రంత. ౭౫

క. నిపుణత ద్విజు లయ్యశ్వము
వప డించి సమంత్రకముగ వరవైతస శా
ఖపయి నిడి వేల్చి రుత్కట
కృపీటభవకీలలందుఁ గీల్కొనుచుండన్. ౭౬

క. అప్పుడు వప చిటచిట మను
చప్పుడుఁ బ్రజకేలు చఱచుచప్పుడు నొగిసొం
పొప్పఁగ నేక మగుచుఁ గ
కుప్పటలము నెల్లఁ జాల ఘూర్ణిలఁజేసెన్. ౭౭

గీ. అంత ఋత్విజులెల్ల నాయజ్ఞహయము
నంగములనెల్ల వేల్చిరి యగ్నియందు
సకలసురసంఘ మెల్లను సంస్తుతింప
నంగహోమంబు సాంగమై యతిశయిల్లె. ౭౮

గీ. కల్పసూత్రోక్తసరణి సంకల్ప మొనర
ధరణినాథుని యశ్వమేధంబునందు
మూఁడు సుత్యాహములు సాంగముగ నొనర్చి
రమరులు నుతింప ఋత్విజుల్ క్రమముతోడ. ౭౯

వ. మఱియు జ్యోతిష్టోమంబు నప్తోర్యామంబు నభిజిత్తు విశ్వజిత్తు ను
క్థ్యం బతిరాత్రంబు మొదలగు నుత్తరక్రతువులుం గ్రమప్రాప్తి నొ
నర్చి రంత. ౮౦

మ. ఘనసాన్నాయ్యవిసారిసౌరభసమాక్రాంతాష్టదిక్సీమ మై
యనఘం బై మఘవన్ముఖామరనుతం బై ఋశ్యశృంగాదిస
న్మునిరాణ్మంత్రవచఃప్రణీత మయి సంపూర్ణ ... సంతుష్టభూ
జనసంఘం బయి సాంగమై మెఱసె నాక్ష్మాపాలుయజ్ఞం బిలన్.

వ. అంత నమ్మహీకాంతుండు బ్రహ్మనిర్మితప్రకారంబున యజ్ఞదక్షిణగాఁ
దా నేలు భూమియందు హోతకుఁ దూర్పుదిక్కును బ్రహ్మకు దక్షిణ
క్షోణియు నధ్వర్యునకుఁ బశ్చిమాశయు నుద్గాతకు నుత్తరంబు ను
దత్తంబు సేసె నాఋత్విజు లందఱు నుల్లంబు లలర నమ్మహీవల్లభుం
గనుంగొని యి ట్లనిరి. ౮౨

సీ. జననాథ నీవొసంగినయట్టి దక్షిణ
యక్షీణ మై సాంగ మయ్యెఁ జాల
మాకు సమ్మద మయ్యె మణిసువర్ణము లెవ్వి
యైన నీకుఁగ నిచ్చి యవని యెల్లఁ
దిరుగఁ గైకొనుము మేదిని యేల బ్రాహ్మణుల్
తగుదురె క్షత్రియోత్తములుగాక
బ్రహ్మ మొదల్గొని బ్రాహ్మణు లర యేలి
రనుమాట యెందైన వినుట గలదె

యరయఁ గప్పలమూట బ్రాహ్మణగణంబు
గూడియుడంగనేర దీక్షోణిభరము
దాల్ప శక్తులె నీవ యిద్ధరణి యెల్లఁ
జేకొనుము క్రమ్మఱంగ దక్షిణ యొసంగి. ౮౩

గీ. ఉగ్రశాసనుఁ డగుక్షత్రియోత్తముండు
శిష్టరక్షణమును దుష్టశిక్షణంబుఁ
జేయుచును భూమి యేలినఁ జెల్లుఁగాక
బ్రాహ్మణులు శక్తులే మహీభరము దాల్ప. ౮౪

వ. అనిన విని యట్లకా కని యమ్మహీవల్లభుం డాఋత్విజులకెల్ల మనఃప్రత్యయంబు చెలంగ భూమికిం బ్రత్యామ్నాయంబుగా దశలక్ష ధేనువులు దశకోటిసువర్ణంబులు సువర్ణచతుర్గుణరజతంబులు నొసంగె వార లవి యెల్లం గైకొని ఋశ్యశృంగవసిష్ఠమునిపుంగవుల ముంగలనిడి యందఱు యథోచితంబుగా విభజించి పుచ్చికొని రంత. ౮౫

క. అసమానయశోధనుఁ డా
వసుధావిభుఁ డఖిలదేశవాసులు మెచ్చన్
వసుమణిసందోహంబులు
ప్రసర్పక బ్రాహ్మణులకు భక్తి నొసంగెన్. ౮౬

ఉ. వారిజబాంధవాన్వయుఁ డవారితదానఘనుండు సద్గుణా
ధారుఁడు ధీరుఁ డాదశరథక్షితినాథుఁడు యాగదీక్షచేఁ
గోరికివచ్చినట్టి జనకోటులకెల్లను జాలునట్లుగా
భూరిమహార్ఘరత్నములు భూరిగ నిచ్చె ముదంబుహెచ్చఁగన్. ౮౭

క. అవనీవిభుఁ డయ్యెడ నొక
యవనీదివిజుండు చేరి యడిగినయంతన్
నవరత్నహస్తకటకం
బవిశంకత నొసఁగె జనము లచ్చెరు వందన్. ౮౮

క. ఇప్పగిదిన్ ధనకోటులు
తెప్పలుగా నొసఁగి భూమిదివిజులకు ముదం

బొప్ప నొనర్చెఁ బ్రణామం
బప్పుడు సాష్టాంగముగ జనావళి వొగడన్. ౮౯

వ. ఇట్లు నమస్కరించినం గనుంగొని యందఱు హర్షంబున. ౯౦

శా. ఆయుష్మాన్ భవ పుత్రవాన్ భవ సమగ్రానందసాంద్రో భవ
శ్రీయుక్తో భవ యంచు భూమిసురు లాశీర్వాదముల్ సేసి ర
త్యాయత్తాంచితధర్మశీలు సుగుణోద్యత్కీర్తిశోభాసము
ద్ఛాయద్యోతితలోకు నాదశరథక్ష్మాపాలచూడామణిన్. ౯౧

క. ఆదశరథుఁ డీవిధమున
మోదము మీఱంగ విప్రముఖ్యులయాశీ
ర్వాదములఁ బొదలి యంతట
వేదనిధిన్ ఋశ్యశృంగు వినయం బెనయన్. ౯౨

వ. కనుంగొని నమస్కరించి యిట్లనియె. ౯౩

గీ. ఋశ్యశృంగమునీంద్ర మహేశసదృశ
మహితచిత్రచరిత్ర నీమహిమవలనఁ
దురగమేధంబు గడతేఱె సరగ నింకఁ
బుత్రకామేష్టి సేయంగఁ బూనవలయు. ౯౪

క. శ్రోత్రియులు నుత్తములు నగు
ధాత్రీసురవరులఁ గూడి తడయక వేడ్కం
బుత్రీయేష్టి యొనర్పుఁడు
పుత్రులు గలుగంగ నాకుఁ బుణ్యచరిత్రా. ౯౫

వ. అనిన విని ఋశ్యశృంగమునిపుంగవుండు నంగీకారంబు సెలంగ నో
ధాత్రీశ యట్లన నీకుం బుత్రులు గలిగెదరు మనమ్మున నమ్ము మథర్వ
శిరఃప్రోక్తంబు లగు మంత్రవిశేషంబులం బుత్రేష్టి గావించెద నని
కడంగి సకలయజ్ఞకర్మపరినిష్ఠితు లగు వసిష్ఠాదిమునిశ్రేష్ఠులం గూర్చు
కొని శుభముహూర్తంబున వివిధవిచ్ఛందకసంఘటనాధురీణనిపుణశి
ల్పివరకల్పిత పరిపక్వేష్టకచితంబునుం గనకమయానేకపట్టాంబరాలం
కృతంబును సౌగంధ్యబంధుస్వచ్ఛకుసుమగుచ్ఛశోభితంబును బహిరం

తరావరణదేవతాధిష్ఠితంబునుం బ్రాజ్యసమిదాజ్యచరుసంభారసంభృ
తంబు ను ధ్రువోపభృజ్జుహూప్రముఖపాత్రవిస్తారితంబు నగుమండ
పంబునందుం బూర్వాదిదిగవస్థిత గణేశాష్టదిక్పాలకాది దైవతంబును
బ్రాహ్మ్యాదిమాతృకాధిష్ఠితంబు ను హోమవిధానలక్షణలక్షితంబు
ను నఖండమేఖలాత్రయమండితంబు ను నగుకుండంబునందు నగ్నిం
బ్రతిష్ఠించి దర్భాస్తరణపూర్వకంబుగా నగ్నిముఖంబు గావించి తా
నాచార్యుం డై యన్నిదిక్కుల ఋత్విక్కుల సమిద్ధోమంబు సేయ
నేమించి చరుహోమంబు సేయం దాన పాలుపడి యాలోచనామ
హర్షులు చూచి తల యూఁచి మెచ్చం బవిత్రధవిత్రవీజనసంధుక్షితం
బై ప్రదక్షిణార్చి యగు నగ్నిహోత్రంబునందు నాథర్వణమంత్రంబుల
వేల్వం దొడంగె నాసమయంబున యాగభాగంబులకై గరుడగంధర్వ
కిన్నరకింపురుషసురగణంబులతోడ నింద్రాగ్నియమ (నిర్మృతి) వరుణ
వాయుకుబేరేశానులు వచ్చి యచ్చోట నిలిచిరి మహర్షులుం జను
దెంచి రంత. ౯౬

ఉ. కాంచనగర్భుఁ డాక్రతువు గన్గొనువేడుక నేఁగుదెంచెఁ గ్రొ
మ్మించుల నీనుచుండు తనమేని మెఱుంగుతోడఁ గూడి డా
లించు పసిండిఱెక్క జిగిలీలలు మించుచునుండ నొప్పు రా
యంచపటాణి నెక్కి యమరౌఘము గొల్వఁగ సమ్మదంబునన్. ౯౭

వ. ఇట్లు చనుదెంచి యయ్యాగశాలాసమీపంబున ననర్ఘమణిగణో దం
చితం బగుకాంచనపీఠంబునం గొలువు గూర్చుండి సిద్ధచారణస్తుతు
లాకర్ణించుచు నందంద వందనంబులు సేయు మునిబృందంబులం జతు
ర్ముఖోదితంబు లగు మృదుభాషణంబుల బహూకరించుచు నుండె నా
సమయంబున. ౯౮

క. రావణపరిపీడితు లగు
దేవత లందఱును గూడి దీనవదను లై
యావనజాసనునకు నతి
గావించి వినీతి మెఱయఁగాఁ బల్కి రొగిన్. ౯౯

శా. వాణీమోహన హంసవాహన నమోవాకంబు నీకున్ జగ
త్త్రాణిశ్రేణిలలాటలేఖనకళాపారీణ దండంబు నీ
కేణాంకార్కసహస్రతేజ నతి నీకివే కృపాలోకము
న్వీణామానిసనందనాదిజనకా నీకుం బ్రణామాంజలుల్. ౧౦౦

క. సర్గస్థితివిలయముల ని
సర్గగతి న్నీ వొనర్తు శతధృతిమధుజి
ద్భర్గస్వరూపలీల న
నర్గళమహిమైకవిభవ యంభోజభవా. ౧౦౧

ఉ. రావణనాముఁ డైనయొకరాక్షసుఁ డిప్పుడు పుట్టి సర్వలో
కావలిఁ దాన కావలిగ నంతయు నేలుచు నిర్జరోత్తముల్
సేవకులై తనుం గొలువఁ జేయుచు గర్వము దొట్టియున్నవాఁ
డోవనజాసనా జనుల కుండఁగరాదు జగంబులోపలన్. ౧౦౨

క. దేవర వర మిచ్చితి రని
కావరమున మీఱి వాఁడు కడు నుద్ధతుఁడై
దేవగణములం జెఱ గొని
యేవఱకును[1] లేని బాధ లెసఁగం జేసెన్. ౧౦౩

క. ఏయెడఁ జూచిన లోకని
కాయము రావణుని చేతికాల్పులఁ బూర్వ
చ్ఛాయ లెడలి దగ్ధపట
న్యాయంబున నుండఁ దొడఁగె నంభోజభవా. ౧౦౪

క. అని యిట్లు విన్నవించిన
విని యప్పరమేష్ఠి యపుడు వేల్పుల నెల్లం
గనుఁగొని భయపడ నేటికి
వనజాక్షుఁడు హరి జగన్నివాసుఁడు గలుగన్. ౧౦౫

క. వర మిచ్చితి మే మెఱుఁగక
సురరిపునకు వాఁడు జగముఁ జూఁడఁగసాగెన్

---

1. యేవరకుని- మూ.

హరి యించుక యిది విన్నను
హరియించు న్వానిగర్వ మనిమిషులారా. ౧౦౬

క. శ్వేతద్వీపమునకుఁ జని
శ్రీతరుణీపతికి నెఱుక సేయుఁడు వేగం
బీ తెఱఁ గంతయు నప్పుడ
యాతంకము లెల్లఁ బాయు నాహరికరుణన్. ౧౦౭

వ. అనిన విని యట్ల కా కని యప్పురందర ప్రముఖ బృందారకు లందఱు నవ్విరించిం బురస్కరించుకొని చని రంతఁ దదనంతరకథావృత్తాంతం బెట్టి దనిన. ౧౦౮

శా. కల్యాణాచలధీర సాధితజగత్కల్యాణ వాత్సల్యసా
శీల్యాద్యద్భుతకృత్స్న మహాగుణఖనీ సీతాసతీ నేత్రసా
ఫల్యాపాదనమోహనాంగ ఘనశోభా సంభృతౌజ్జ్వల్య కౌ
సల్యానందన చంద్రచందనసుధాచంచద్యశోభాసురా. ౧౦౯

క. భాస్వత్కులైకభాస్వర
భూస్వర్గాంచితయశోవిభూషణ దోర్వీ
ర్యస్వవశీకృతలోక ము
నిస్వాంతవిహారగేహ నిహ్నుతమోహా. ౧౧౦

భుజంగప్రయాతము.

శరాసారసంభిన్న సంగ్రామరంగా
శరాసారదోర్వీర్యసత్యప్రతిజ్ఞా
ధరాధార ధారాధరస్పర్ధిమూర్తీ
సురాహారనీహారసుస్నిగ్ధకీర్తీ. ౧౧౧

గద్యము. ఇది శ్రీరామచంద్రసాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వత విశేషనిరర్గళ వాగ్వైభవ వాశేషసరససాహిత్యకళాభోజ, సత్యసంభాషిత ముఖాంభోజ, సకల సామ్రాజ్యధౌరేయ, నిత్యవితీర్ణి ధారారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషిత పంచాశత్సహస్రభూసుర, బహు

వారావర్తిత మహాదాన వైభవానర్తిత కీర్తిభాసుర, నిజనామాం కితాకలంకవస్తుసముగ్ర బహుళాగ్రహారభూషిత చోళధరామండల, నిఖిలభోగనిభవనిర్జితాఖండల, సాధితసముద్రాంతరద్వీపపరనృపాలసంస్తుతప్రతాప, నేపాలభూపాల స్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయ ధౌరంధర్య, రామసేతుశ్రీరంగవిజయరాఘవపుర కుంభఘోణాదిదివ్యస్థలప్రతిష్ఠాపితరామభద్ర, సర్వజనసంభావిత గాంభీర్యముద్రానిర్జితసముద్ర, సదాశ్రితభరణదీక్షాదక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతాసాధారణశౌర్య, దిగంత ప్రసిద్ధతరౌదార్య, సుజ్ఞానజనక, సంతతసంసేవితజనక, పోషితవిద్వత్ప్రియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీతసామంతమహీకాంత విమోచన శ్లాఘనీయబాహుబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వయాచ్యుతనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితసుమసాయక, సకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతంబైన శ్రీమద్రామాయణంబున విబుధజనవినుతవివిధకథా శాఖాప్రకాండం బగు బాలకాండంబునం దృతీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# రఘునాథరామాయణము

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరఘువంశనృపోత్తమ
నీరనిధినిబంధనైకనిపుణాశుగబలో
త్సారితరిపుప్రచారణ
చారణసంస్తూయమానశౌర్యాభరణా. ౧

వ. అవధరింపు మాసమయంబున. ౨

చ. సురవరు లెల్ల నేఁగి యట చూచిరి వేడుక సంఘటిల్లఁగా
శరశరదభ్రశుభ్రకరచందనకుందనవప్రభావిభా
సురపరితస్ఫురద్గగనచుంబితరంగఘటీఘటాళిసం
గరకరణోద్యమోద్యదధికధ్వనిబోధి సుధాపయోధిన్. ౩

గీ. ఇంద్రముఖ్య దివౌకసు లెల్ల నపుడు
మంద్రబృంహిత గజశోభమానచటుల
చంద్రమండలపాండురోజ్జ్వలతరంగ
సాంద్ర మగుపాలసంద్రంబుఁ జక్కఁ జూచి. ౪

వ. తద్వైభవంబునకుం జాలం దలయూఁచి మెచ్చుచు నిందుకుందగుచ్ఛ
స్వరూపం బగు శ్వేతద్వీపంబుం గనుంగొని యుప్పొంగుచు నొం
డొరులతోడ. ౫

— శ్వేతద్వీపవర్ణనము. —

సీ. సింధురా జెదను వైచిన మధ్యహారినీల
శాలి యావజ్రాలతాళి యనఁగఁ
బలిభీతి నీటిలోపల నుండుతనయుఁ గ
న్గొనఁగ వచ్చిన మంచుఁగొండ యనఁగఁ

బాలసంద్రపువెండిపళ్ళెరంబునడుమ
నున్న ముత్తెపుఁజిప్పగిన్నె యనఁగ
దనుజాళిపైఁ బాశి దండువో నెత్తిన
డాలించు తెల్లగుడార మనఁగఁ
బాంచజన్యంబు శౌఁచేపట్టు గాంచి
మించె నిటు మాకు నితని వహించఁ గలుగు
ఘనయశం బని యచటిశంఖంబు లెల్లఁ
దిన్నెగా నిల్చె ననఁ దెల్ల దీవి మెఱసె.

సీ. పా లగ్గలముగాఁగఁ గ్రోలి యొకింతైనఁ
గదలని పాండుమేఘం బనంగ
మున్నీటిపాళెంపుమన్నీఁడు కొలువుండు
మేలైన ముత్యాలమేడ యనఁగ
హరిభీతి లేకుండ నద్రులఁ బాలింప
జలధి పూనిన వజ్రఫలక మనఁగ
రతనంబు లుండునీరధిదంతపేటిపైఁ
జెన్నారు బటువైన శిఖర మనఁగఁ
దనభువన మెల్ల నిండునీవనధి యెంత
చోటిపై నాక్రమించెనో చూతు ననుచుఁ
బైకి నిక్కిన శేషునిఫణిసహస్ర
మండలం బనఁ దెలిదీవి నిండికొనియె.

సీ. తనమామగారైన వననిధిభర్తఁ గ
న్గొనఁగ వచ్చినచుక్కగుం పనంగఁ
దనుఁ జుట్టుకొను నహితతతి ఫణిపురిఁ జేర్పఁ
జనుదెంచిన పటీరశైల మనఁగ
శివుని చిచ్చుఱకంటి సెక సోఁక నబ్ధి నా
గళమగ్న మగు వెండిగట్టనంగఁ

గడలి కళంకపంకక్షాళన మొనర్పఁ
జేరిన కలువలచెలి యనంగ
జలనిధానంబు తనకుఁ గావలసి నాక
నాయకున కీక దాఁప నానాఁటఁ బెఱిఁగి
గుమురుగాఁ బైకి వెడలిన యమరతరుల
పూవుఁగొమ్మలు నాఁ దెల్లదీవి మెఱసె. ౮

గీ. దుగ్ధసాగరకర్దమదిగ్ధమైన
యాదికమఠంబు బహుకాల మచట నుండి
మందరము మోచినట్టి శ్రమంబు దీఱఁ
దేలెనో పైకి ననఁ దెల్ల దీవి మెఱసె. ౯

క. ఉదధి మథియించు వేళల
నుదయించిన యమృతపూర మొకచో నచటం
బదిలంబుగ నిలిపిరొకో
త్రిదశు లనఁగ దీవిఁ దెల్లదీవి చెలంగెన్. ౧౦

సీ. రమపెండ్లినాఁటిముత్తెములప్రాల్చిండిన
విధుకాంతమణికాంత వేది యనఁగ
జలవారణముల పోరులు చూచు సలిలభ
ర్తకు నొనర్చిన వెండి తమక మనఁగ
జలశాయి హరినాభి చతురాస్యుఁ గొలువ వ
చ్చిన వాహనమరాళసేన యనఁగ
మున్నీటిరాయని ముంజేతి వజ్రమ
య పుహంపీరుతాయత యనంగఁ
బాలసంద్రంబు ఘనయాచకాళి కెల్లఁ
దోరహత్తుగఁ దనరసపూర మిత్తు
ననుచు నెత్తిన ధవళపట్టాంబరధ్వ
జం బనఁగఁ బాండురాంతరీపంబు వెలయు. ౧౧

సీ. నీరధిరా జల్లునికిఁ బవళింపఁ గా
వించిన దంతంపుమంచ మనఁగ
నిచ్చఁ బెండ్లి యొనర్చు నీరుపావలపైని
బట్టు తెల్లని యుల్లభం బనంగఁ
బాశినగరిలోని పాత్రలు లాగెత్తు
మేలి వజ్రపులాగుమేడ యనఁగ
మరకతచ్ఛవి మించు హరి యుండు నిర్మల
స్ఫటికసంఘటితపంజర మనఁగఁ
గలశవారిధి ద్రచ్చుటకన్న మున్ను
గొన్ని దినములు శశి లోన నున్నవేళఁ
బొడ వెగయు నంశుశతులచేఁ బొడమి పేరి
తిన్నె యగుమంచనఁగఁ దెలిదీవి మెఱయు. ౧౨

సీ. అంబుకేళికి వచ్చి యమునునఁ గా లూఁది
కదలనేరని వెలిగా రనంగ
యాదోవిభునకుఁ దోయనిధి సేయించిన
(వెలఁది)ముత్తెపుసింహపీఠ మనఁగఁ
బాలు గ్రోలఁగఁ గోరి పాలసంద్రముమీఁద
వ్రాలు పురాణమరాళ మనఁగ
జలధి ద్రవ్వుచు సాగరులు నిల్పిన విఫేన
ఘట్టమైనట్టి పెన్నిట్ట యనఁగ
జనకుఁ డైనట్టి దనుఁ గనుఁగొనఁగఁ జేరఁ
బుత్రవాత్సల్యమున మహాంభోధి తరగ
చేతుల బిగించి కౌఁగిటఁ జేర్పఁ గదల
కున్న శశి యనఁ దెలిదీవి చెన్ను మీఱు. ౧౩

సీ. ప్రతిమాసచంద్రనిర్మితి కబ్ధి యుంచిన
కారణద్రవ్యసంఘం బనంగ

జ మొంది "వంశస్థ" తె-జంబు రేఫ యగా-జ । U ।, త U U ।, జ । U ।,
ర U । U;

ఈతాజను ్రేఫయు-"ఇంద్రవంశ"కుఁగా-త U U ।, త U U ।, జ । U ।,
ర U । U;

"ద్రుతవిలంబిత"-దోఁ చెనభారలన్-న । । ।, భ U । ।, భ U । ।, ర U । U;

అగయతిఁ "దోధక[1]"-మయ్యె నజాయల్-న । । ।, జ । U ।, జ । U ।,
య । U U; దీనిపేరే తామరసము.

నభజరల్గుగు వి-నం"బ్రియంవదగా"-న । । ।, భ U । ।, జ । U ।, ర U । U;

"ప్రమితాక్షరగా" సజస-పంక్తి సనుఁగా-స । । U; జ । U ।, స । । U,
స । । U;

"జలోద్ధతగతిగా" జ-సంబులు జసల్-జ । U ।, స । । U, జ । U ।,
స । । U;

అందం బా మాయాప్రాప్తి-"వైశ్వదేవిగా"-మ U U U, మ U U U,
య । U U, య । U U;

"చంద్రవర్త్మ"యనఁ-జగా రనభసలగా- ర U । U, న । । ।, భ U । ।,
స । । U;

అగఁసుతులఁ "బ్రహే-యం" బయ్యె నామ్యల్ - న । । ।, న । । ।,
మ U U U, య । U U;

"ప్రముదితవదనగా"-బ్రబ ల్నారరల్- న । । ।, న । । ।, ర U । U,
ర U । U; దీనిపేరే ప్రభావృత్తము.

"కుసుమవిచిత్రం"-గొలలు నయన్యల్-న । । ।, య । U U, న । । ।,
య । U U;

త్యత్యల్ "మణిమాలా"-ఖ్యగా షడ్యతు లొందుఁగా-త U U ।, య । U U,
త U U ।, య । U U;

తాల్చున్న భాశి "లలితగా"-తభల్జరల్-త U U ।, భ U । ।, జ । U ।,
ర U । U;

---

1. తోటకమని మూలములోనున్నది. అప్పకవి తోదక మని.

నలి "వనమాలిని"- నజభయల్ విన-న ।।।, జ ।౧।, భ ౧।।, య ।౧౧;

లాగా "మేఘవి-లసిత" మననసల్-మ ౧౧౧, న।।।, న।।।, స।।౧;

నజజరలీ "పదమాలి"-నాఁదగున-న।।।, జ।౧।, జ।౧।, ర౧।౧;

స్వరయతి ననరాల్-"ప్రభాఖ్యం"దగున-న ।।।, న ।।।, ర ౧।౧, ర ౧।౧;

ననభర లమరు-న్నహి "తోజ్జ్వలన్"- న।।।, న।।।, భ ౧।।, ర ౧।౧.

క. తనరు 'నతిజగతి' వృత్తము
లెనిమిది వేల్నూటతొంబదిరువ్వురలోఁ బా
ల్చెను మత్తమయూరాదులు
విను మవి పంౘెండుపేర్ల వృత్తములు హరీ. ౮౫

౧౩. యా హా మత్యంబుల్ సగు-రు "మత్తమయూరన్". మ ౧౧౧, త ౧౧।, య।౧౧, స।।౧, గ ౧;

కన్పట్టున మనజర-గల్ "ప్రహర్షిణి"న్విన-మ ౧౧౧, న।।।, జ।౧।, ర౧।౧, గ ౧;

మొనసి నజారగ-ముల్ తగుం "బ్రభాతన్"-న।।।, జ।౧।, జ।౧।. ర౧।౧, గ ౧;

ఆభరసంబులై భగురు-వా "జలదన్-" భ ౧।।, ర ౧।౧, న।।।, భ ౧।।, గ ౧;

జత "మంజుభాషిణి"స-జల్సజ గ్గముల్- స ।।౧, జ।౧।, స।।౧, జ।౧।, గ ౧;

జభస్జగల్ "రుచిర" కె-సంగు వల్లహిన్- జ।౧।, భ ౧।।, స।।౧, జ।౧।, గ ౧;

ననతతగలనె-న్నన్ "క్షమావృత్త"మున్. న।।।, న।।।, త ౧౧।, త ౧౧।, గ ౧; ఇదేచంద్రికావృత్తము; దీనిపేరేక్షపావృత్తమును.

యమల్[1] రాగ ల్సొ-ల్సొ"చంచరీకావ"ళింపై-య | U U, మ U U U,
ర U | U, ర U | U, గ U;

జత ల్సజ గ్గం బె-సఁగు"మత్తహంసినిన్-"[2] జ | U |, త U U | స | | U,
జ | U |, గ U;

స"సుమంగలిన్" సజస-సల్గురువొంకున్ - స | | U, జ | U |, స | | U,
స | | U, గ U;

చాల్గాగ్రిగల్ వల్గాఉన్-"చంచరీకాతతిన్"విన్-మ U U U, మ U U U,
ర U | U, ర U : U, గ U.

క. పదునాల్గవ 'శక్వరి' దగు
విదితములైకల పదాఱు వేల్పున్నాకు
న్నిడినాల్గువృత్తములు, తో
మ్మిదవి వసంతతిలకాసమేత మనిలజా. ౨౬

౧౪. కల్గు"న్వసంతతిల-కన్" తభజాగగంబుల్- త U U |, భ U | |,
జ | U |, జ | U |, గగ UU;
"సింహోద్ధతం"[3] బగుఁ బ్రసిద్ధిగ దీనిపేరే.
"ఉద్ధర్షిణీ"గరిమ-నొప్పు నిదే పఠింపన్.
"శోభావతిన్" గిరులఁ-జూపువిరామ మల్లే.
మంజూక్తిఁ జెందు "మధు-మాధవినా"ని దెన్నన్.

ఈభజసనల్ గగము-"నిందువద"నాఖ్యన్-భ U | |, జ | U |, స | | U,
న | | |, గగ U U;
ఒప్పు నిదియే "వనమ-యూర"మహీవల్లన్.

శర్వ ల్వళ్ళంబుల్ తనసగగ "ల-సంబాధన్"-మ U U U, త U U |,
న | | |, స | | U, గగ U U;

---

1 అప్పకవీయములో, "మారాగశ్వేర్చి" యని ముందు మగణ ముంచినాఁడు-
ఈగ్రంథములో దీనిని 'చంచరీకాతతి' యనిచెప్పినాఁడు.

2. అప్పకవీయములో దీనిని మత్తహంసిని యని-

3. అప్పకవీయములో, సింహోన్నత మని-

వసుయతి ననరల్ స-వం "బపరాజితక్"-న | | |, న | | |, ర ౧ | ౧,
స | ౧|, వ | ౧;

రహి ననభనవల్-"ప్రహరణకలితక్"-న | | |, న | | |, భ ౧ | |, న | | |,
వ | ౧;

సామజరాడ్యతి భార-సల్వము"సుందరిక్"-భ ౧ | |, భ ౧ | |, ర ౧ | ౧,
స | | ౧, వ | ౧;

"నవనందినిక్"సజస-నల్ గగముఁ జెందుక్- స | | ౧, జ | ౧ |, స | | ౧,
న | | |, గగ ౧ ౧;

"భూనుతంబు"రనభాగగ-ముల్ కయతుల్గాక్-ర ౧ | ౧, న | | |, భ ౧||,
భ ౧ | |, గగ ౧ ౧;

"కమలవిలసిత"నె-గడు ననానాగాల్- న | | |. న | | |. న | | |. న | | |,
గా ౧ ౧.

క. 'అతిశక్వరిఁ' బుట్టిన వసు
బుతుముని నేత్రాగ్నులను[1] ద శైకగః
కృతులను మణిగణనికరాం
చితవృత్తాములు వెలయుఁ బ్రసిద్ధవటుమణీ ౮౭

౧౫. మనులఘువులుగము-మహి"శశికళ"యా- న | | |, న | | |, న | | |,
న | | |, స | | ౧; (పదునాలుగు లఘువులు నొక్క గురువు)
కరియతి నిది"మణి-గణనికర"మగుక్.
రసయతి నిది-"స్రగ"భిధఁ దనరుఁ గృతిక్.

మహి గజయతి మించెక్- "మాలిని"న్నామయాప్తిక్- న | | |, న | | |,
మ ౧ ౧ ౧, య | ౧ ౧, య | ౧ ౧;

నజభజరల్"ప్రభద్రక"మొ-నర్చు దిగ్యతిక్- న | | |, జ | ౧ |, భ ౧ | |,
జ | ౧ |, ర ౧ | ౧;
గిరిచరచంద్ర వి న్నిది "సు-కేసరం"బగుక్.

సజనల్ న-సల్ యతి-శరదిశక"మిలకు"క్-స | | ౧, జ | ౧ |, న | | |,
న | | |, స | | ౧;

1. వసుబుతుమునినేత్రాగ్నులు-౩౭౮౬౮.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు; పరిషదాద్యాధ్యక్షులు

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు–ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు. ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు. ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు,(కోశాధ్యక్షులు)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. „

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు. ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

శ్రీ పిఠాపురముమహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని, రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటము ముద్రితమై విక్రయమునకు సిద్ధముగా నున్నది. ఇందు, అకారము మొదలు, ఔకారమువఱకును గల యచ్చు లాదియందుఁ గల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నింటికంటె నిది సర్వవిధముల నుత్తమమైనది. ఈ భాగము శబ్దరత్నాకరములో 186 పుటలలో నిమిడినది. దీనినిబట్టి యీరెండు నిఘంటువులకుఁ గల తారతమ్య మూహింపవచ్చును. ఈనిఘంటువునందు, సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నింటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకుఁ గూడ మిగుల నుపయోగకరముగా నుండును. ఇది యున్నచో సంస్కృతనిఘంటువు నపేక్ష యుండదు. ఆచ్ఛికపదములకుఁ గల యర్థభేదములఁ గనఁబఱిచి వానికిఁ బ్రమాణవాక్యములును బూర్వగ్రంథములనుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దేశ్యశబ్దములకు సంస్కృతద్రావిడాదిభాషలయందుఁ గల సజాతీయపదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములే కాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను దానికిఁ గలయర్థములును బ్రయోగములును గూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఏవిధముగఁ జూచిన నిది యిదివఱకున్న నిఘంటువు లన్నింటికంటె మిన్నయని మఱియొకసారి నిస్సంశయముగఁ జెప్పవచ్చును. దళసరికాగితములమీఁద నచ్చువేయఁబడినది. చక్కనియక్కరములు, తోలు, క్యాలికోలతోఁ గట్టి బైండు చేయఁబడినది. గిల్టు అక్షరములతోఁ బేరు గలదు. పుస్తకభాండాగారముల కిది యలంకారముగ నుండును. విద్యార్థులకు సహాకారి. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకే గాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతో సాదాప్రతి వెల రు. 5 లు, ఆర్టు పేపరు ప్రతి రు. 7 లు, మాత్రమే నిర్ణయింపఁబడినది. రైలు, పోస్టువ్యయములు, కొనువారే భరింపవలయును. కావలసినవారు, కాకినాడ, ఆంధ్రసాహిత్యపరిషత్తు కార్యదర్శులకు వ్రాయఁగోరెదము.

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works Cocanada,

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచి, రు ౦-౮-౦.

జూన్, జూలై 1937.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౧.


## బాలకవిశరణ్యము.

'ఆదివ్యంజనలోపము' అనుశీర్షిక (261 పేజి) లో మెఱుఁగెట్టి, ఉసుకోసుకొను మున్నగుప్రయోగములతో పాటు అడుగు + వెంట 'అడుగెంట' అని పాండురంగమాహాత్మ్యములోని పద్యమొకటి యుదాప్రయోగముల నడుమ నీయఁబడినది. ఈ 'అడుగెంట' అనునది పరిమాణార్థకమై ఔపవిభక్తికాంతమగు 'అడుగెఁడు' అనుదాని సప్తమ్యంతరూపము కాని 'అడుగువెంట' అనుదానిలో వకారము లోపింపఁగా మిగిలిన 'ఎంట' రూపము కాదు, అని యాపద్యము చెప్పుచునే యున్నది. 'తత్పురీహారులు (రౌతులు) కానంత మఱలించిరేని యొక్కయడుగు పరిమితి గలస్థలమునందే (పరుగెత్తుచున్నను) సంభ్రమింపక నిలుచును. ఒకింత త్రోలినచో మెఱుచాఁచి సప్తసముద్రములు దాఁటఁగలవు... అని గుఱ్ఱములగతిలాఘవము పై పద్యమున వర్ణింపఁబడినది. అచట 'నడుగువెంటనె నిలుచును' అని యర్థము చెప్పినయెడల 'నెపరియడుగువెంట' అను నాకాంక్షకు సమాధానము లేదు కావున వెంట, ఎంట, అయినదనుట యుక్తముకాదు. అది వెంటశబ్దమే యగునెడల 'జుట్టెంటిలో' అనుమనుచరిత్రప్రయోగము కుదురుటెట్లు. 'వెంట'కు 'వెంటిలో' అను రూపము లేదు గదా. మఱియు, 'జుట్టిలి'లోని లివర్ణకమునకుఁ బరిమా

సార్థకముగు ఎందు ప్రత్యయము పరముగునపుడు లోపము గాని మఱియే యజాదిశబ్దము పరమైనను లోపించుట కాధారము కానరాదు. 'బారెఁటిలో మూరెఁటిలో' మున్నగుశబ్దములందు వెంటలోని నిండుసున్నమాఱు టెట్లో తెలియదు. పరిమాణార్థకముగు ఎఁడుప్రత్యయమున కిట్టిరూపముతో బహుళముగా గ్రంథములందు వాడుక యున్నది.

ద్వి. జుట్టెంట నొక్కొక్కచోద్యంబు గలదు,... జేనెంట నొక్కొక్క శివ
మూర్తి గలదు, బారెంటనొక్కొక్క పర్వతం బలరు.
పండితా, పర్వ, ౩౮ ౪ పా.

సీ. జేనెంట జేనెంట శివలింగములు కోటిసంఖ్య నేపురమునఁ
జాలనొప్పు కాశీ. ౩.

సీ. ఇసి గాలికి నిల మూఁకవరాహదను జేంద్రునైనజుట్టెంటిలో నాఁగఁజాలు
మను, ౪.

కావున 'అడుగెంట' లోని 'ఎంట' ఎఁడుప్రత్యయాంతముపై వచ్చు నొకవిభక్తికసప్తమీవిభక్తిరూపము కాని వెంటలోనిదో మఱి యేయితరపదములోనిదో యాదివ్యంజనము లోపించిన రూపము కాదు.

ఈ 'ఆదివ్యంజనలోపము' అనుశీర్షికకు వెనుకనున్న 'ప్రథమ వ్యంజనలోపము' అనుశీర్షికతో మోపు + పెట్టి = మోపెట్టి, బొబ్బ + పెట్టి = బొబ్బెట్టి మొదలగునుదాహరణములతోపాటు 'తలపెట్టు' అను నొకపదము కూడ నీయఁబడినది. ఈ 'తలపెట్టు' ఎట్టిదో రవంత యాలోచింతము. తలఁపు + పెట్టు లోని పకారము ప్రథమవ్యంజనము లోపింప ఎట్టు అయి తలఁపు ఎట్టు = తలపెట్టు అగు నని యీగ్రంథాభిప్రాయము కావచ్చును. అట్లు సంధి యగునప్పుడందలి ఖండబిందువునకు లోప మెట్లు? ఖండబిందువు లేదేమో యనుటకు మ... మున్న కైపెక్కినట్టితలం పచ్యుత నీకుఁగల్గినది-భార, ఉద్యో, ౩. ౭౨ మున్నగు ప్రాచీనకవిప్రయోగముల మొదలుకొని యీగ్రంథమునందలి ముఖబంధనమునందలి 'జనులతలఁపుదెలుపు సాధనములు' ౨. వఱకు ననంతముగాఁ

ప్రయుక్తమైనది యీ “ఎట్టు” పరమగునంతమాత్రమున లోపించు ననుటయు వలనుపడదు. కావున ‘తలపెట్టు’ నకీగ్రంథమునఁ గలయనుశాసనికము ప్రామాదికము.

ప్రమాదము మనుజులకు సహజము, కావుననే ప్రమాదములు ప్రమాణములుకా వని విజ్ఞులయభిప్రాయము. ప్రాచీనులు మొదలుకొని నేఁటివఱకుఁగలలాక్షణికుల నందఱను గంఠోక్తిగాఁ దప్పు లని వ్రాసిన యీగ్రంథమున నిట్టిప్రమాదము లుండఁగాఁ బ్రమాదము లేనికవి యెవ్వఁడైన నుండునా ? అట్టియాకవులప్రమాదము లన్నిటిని బ్రమాణము లని చూపి పూర్వలాక్షణికగ్రంథములఁ ద్రోసిపుచ్చుట యెట్టిదో చదువరు లూహింతురుగాక !

యాథాలాభముగ నీగ్రంథమును విప్పిచూడఁగా మా కారెండు తావులం దిట్టిపొరపాటులు కనఁబడినవి. సమగ్రముగాఁ జదివినచో వీని కెచట నయిన సమాధానము లందు ముందు వెనుకల నున్న వేమో చూచి యట్లున్నచో తెలిపెదము. ఇం కొక చిన్నసందేహము. ‘ప్రథమవ్యంజనలోపము’ అని యొకశీర్షికయును, వెనువెంటనే ‘ఆదివ్యంజనలోపము’ అని మఱియొకశీర్షికయు, నిందుఁగలవు. ఆరెంటికి భేదమేమియో తెలియకున్నది. విషయసూచికయందు ‘ప్రథమవ్యంజనలోపము’ ఒకటియే కలదు. రెండవది దానిలో నంతర్భాగమేమో యనుకొనుటకు భేదమేమియుఁ గానరాదు. అందలిభేదము నెవ్వరయినఁ దెలిసినవారు తెలుపఁగోరుచున్నాము.

# శ్రీకృష్ణదేవరాయల సంస్థానమునందలి వీరశైవకవులు.

తోఁగర్చేటి సోమసుందరశాస్త్రిగారు-ఆదవాని.

---

విజయనగర సామ్రాజ్య కాలమునందు కర్ణాటకవాఙ్మయమునకు నపారమైన యుపకారము లభించినది. ప్రాచీనకాలవాఙ్మయమందు కర్ణాటకవాఙ్మయ మితరభాషావాఙ్మయముల కెంతమాత్రము తీసిపోకయుండె నని చెప్పుటకు సంతోషావహమగుట సహజము. కర్ణాటకదేశపరిపాలకు లగు మహారాజులు కన్నడభాషాభ్యుదయమునకై మిక్కిలి సాహాయ్యము గావించిరి. శ్రీకృష్ణదేవరాయలవారి యాస్థానమునందలి తెలుఁగుకవులఁగూర్చి తెలియనియాంధ్రుఁ డుండఁడు. రాయలవారి వీరశైవకవుల పరిచయ మాంధ్రసోదరులకుఁ గల్గించుట యీవ్యాసలేఖనోద్దేశము.

విజయనగరసామ్రాజ్య పరిపాలకులపైకి శ్రీబుక్కరాయలకాలము నుండే కవులకు, పండితులకు నాస్థానప్రవేశము గల్గుచు వచ్చెను. ఈకాలమునందే భీమకవి బసవపురాణమును వ్రాసెను. ఇమ్మడి హరిహరరాయలకాలమునందు పద్మనాంకకవి పద్మరాజపురాణము వ్రాసెను. నీలకంఠశివాచార్యులవారు బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానరూపమయిన క్రియాసారమును వీరశైవధార్మికసంస్కృతోద్గ్రంథమును రచియించుటగాక, కన్నడమునందుఁగూడ ననేకగ్రంథములు రచించినట్లు తెలియుచున్నది. తర్వాత ప్రౌఢదేవరాయలవారికాలము వీరశైవవాఙ్మయాభివృద్ధికి మహాపర్వకాలముగ నుండె నని ధారాళముగఁ జెప్పవచ్చును. ప్రౌఢదేవరాయలు స్వయము వీరశైవదీక్షను గ్రహించుటయేగాక, యీమతప్రచారమునకు కర్ణాటకభాషాసాహిత్యకళాభ్యుదయమునకు నత్యంతసాహాయకులై యుండెను.

ప్రౌఢదేవరాయలవారి ముఖ్యమంత్రియును సేనాధిపతియు నగు లక్కణ్ణకవి శివతత్త్వచింతామణి యనుగ్రంథమును రచియించెను. కర్ణా

టకులయొక్క, అంకునను, వీరశైవుల యొక్క మౌఢ్యమువల్ల నింతవఱ కా గ్రంథము ముద్రితము గాకుండుట మిక్కిలి లజ్జాకర మని చెప్పఁదగియున్నది. ప్రౌఢదేవరాయల సేనాధిపతి యగు జక్కణాచార్యుల వారు, "ఏకోత్తరశతస్థల" మను గ్రంథమును వ్రాసెను.

ఈకాలమునందే చామరస వీరణ్ణోడయు, కుమారబంకనాథ, కల్లురద ప్రభుదేవ, మున్నగు ౧౦౧ మంది జనులు విరక్తులై రాజాశ్రయము వల్ల ననేకగ్రంథములను, వచనములను వ్రాసిరి. అవన్నియు నిచట వివరించుటకు సాధ్యముగా కున్నను గొన్నిరచనలం గూర్చి మాత్ర మిచట జేర్పవలసినదిగ నున్నది. గూళూరు సిద్దవీరన్న, శూన్యసంపాదన యను శ్రేష్ఠగ్రంథమును రచించెను- ఇతని శైలి యమోఘమైనది.

ఈరీతి, కర్ణాటక భాషలో నేనుశకవిగాని వ్రాయలేదనుట యీ గ్రంథమును జదివినవారికిఁ దెలియును- చామరసకవిచే వ్రాయఁబడిన "ప్రభులింగలీల" యనునది కర్ణాటక కావ్యములలో సుప్రసిద్ధమైనది. ఈ గ్రంథము ఆంధ్ర; తమిళ, సంస్కృత, మరాటీ (ఈనాల్గు) భాషలయందుఁ బరివర్తనముఁ జెందియున్నది. ఇట్టి సుయోగము మఱి యేయితర కన్నడగ్రంథములకుఁ గలుగలేదు. కుమారబంకనాథకవి, షట్స్థలోపదేశమును, ప్రభుదేవర టీక వచనమును వ్రాసెను. కలస్థలద నాగదేవకవి త్రిపది యనుగ్రంథమును వ్రాసెను.

మగ్గయమాయదేవకవి గూడ, ప్రౌఢదేవరాయలసహాయముననే (అనుభవసూత్ర (సంస్కృత) ప్రభుగీత, ఏకోత్తరస్థలదషట్పది, షట్స్థలగద్య, శతకత్రయ, అనుకొన్నిగ్రంథములను వ్రాసెను.

రెండవప్రౌఢదేవరాయల వారి కాలమునందు గురుబసవనకవి, శివయోగాంగభూషణ, సద్గురురహస్య, కళ్యాణేశ్వర, స్వరూపామృత, వృషభగీత, మనోవిజయకావ్య, అను గ్రంథముల రచియించెను-

బొమ్మరసను నాతఁడు సుందరపురాణమును వ్రాసెను. కల్లరసను వాఁడు జనవశ్య అను గ్రంథము వ్రాసెను. మఱికొందఱిని కన్నడకవులను కన్నడగ్రంథములను దెల్పుసూచిక :—

| కవులు. | గ్రంథములు. |
|---|---|
| చెన్నబసవాంకన- | అక్క మహాదేవీపురాణము. |
| కల్మఠప్రభుదేవన- | లింగలీలావిలాసచారిత్రము. |
| విరూపాక్షపండితుఁడు- | చెన్నబసవపురాణము. |
| తోంటదసిద్ధేశ్వర- | షట్స్థలజ్ఞానామృతసారము |
| గుబ్బియమల్లనార్యుఁడు- | వీరశైవామృతము. |
|  | గణభాష్యరత్నమాల. |
| చతుర్ముఖబొమ్మరసను- | రేవణసిద్ధేశ్వరపురాణము |
| సింగరాజు- | మలబసవచరిత్రము. |
| లింగకవి- | చోళరాజచరిత్ర. |
| మహాలింగదేవకవి- | షట్స్థలవివేకము. |
| హరభక్త- | వేదభాష్యము. |

వేదభాష్యమును కన్నడమునకుఁ బరివర్తనము గావించిన మొదటికవి ఈహరభక్తకవి యని తెలియఁదగును.

| | |
|---|---|
| గురుసంజను- | యజుర్వేదభాష్య (కన్న) |
| నీలకంఠార్యుఁడు- | పరవాదిగజాంకుశతారావళి. |
| చెరమాంకను- | వీరమహాకావ్యము. |
| వీరభద్రరాజు- | వీరభద్రవిజయకావ్యము. |
| కిక్కిరీయారాధ్యులు- | భైరవేశ్వరకావ్యము. |
| చెన్నవీరన- | సారస్వతవ్యాకరణశబ్దమణి. |
| లింగమంత్రి- | కబ్బిగరకైపిడియకోశము. |
| చంద్రరవి- | శంకరశతము. |
| ఎమ్మబసవన- | కాలజ్ఞానము. |

మొత్తమునకు విజయనగరమహారాజులకాలమునందు వీరశైవకవులసాహిత్యకళ యత్యున్నతదశను బొందియుండినది. ఆకాలమున వీరశైవకవులు తెలుఁగునఁ గూడ గొప్పగ్రంథములను వ్రాసిరి. ఇంకను నెందఱో కవు లెన్నియో గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. విమర్శించుటకు సాధ్యము గాకున్నది. వీరశైవులందఱు తమ కన్నడసాహి

త్యము నభివృద్ధినొందించిన విజయనగరరాజులయెడ నెంతయుఁ గృతజ్ఞులై యుండుట పరమధర్మము.

ఈవ్యాసము వ్రాయుటకు సంయుక్తకర్ణాటకపత్రిక నాకెంతయుఁ దోడ్పడినది. అపత్రికాధిపతులకు వినతి.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్కృత్యము.

—శతావధాని, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.—

సీ. కావ్యంబులును నాటకిములు నలంకార
ములును గూడను దెల్పుసలుపు టొకటి
వ్యాసప్రణీతంబు లగుపురాణము లెల్ల
నంచితంబుగఁ దెలింగించు టొకటి
యాయుశాస్త్రంబులయందుఁ జెప్పంబడ్డ
విషయంబు తెల్గుగావించు టొకటి
తెలుఁగులోనికి రానికళ లన్నియునుగూడ
సేకరించి తెలుంగుసేయు టొకటి
యుభయభాషలలోఁ బ్రజ్ఞ యున్నయట్టి
పండితుల నెన్నఁడును బాయకుండు టొకటి
యరయు మియ్యవి నియతకృత్యములు నీకు
నాంధ్రసాహిత్యపరిషద్బ్రాయతాక్షి!

సీ. ఆంధ్రంబునం దుండినట్టిభారతమునఁ
బడినప్రమాదముల్ వాపు టొకటి
తెలుఁగుబాసకు లోటు దీర్పఁగాఁగలయట్టి
వ్యాకరణంబును వ్రాయు టొకటి
ముద్రితంబులు గాక మూల నుండినగొప్ప
తెల్గుఁబొత్తములు ముద్రించు టొకటి
తప్పుగా వ్రాయుగ్రంథములలోఁ గలతప్పు
నిశ్శంకముగను ఖండించు టొకటి

### — ౫ వ పరిచ్ఛేదము. [శృంగారవ్యక్తి]. —

రసవిచారకమును మనకృతికి 'రసార్ణవ' మనుపేరును సార్థకము చేయునదియు నగు నీపరిచ్ఛేదము బహువిపులముగా నుండియుండును. కాని మనకు 2 పుటలగ్రంథము మాత్రమే లభించినది. ఈప్రకరణమునకు 'శృంగారవ్యక్తి' యనుపేరీక్రిందిశ్లోకమునుబట్టి కలిగినది:

శ్లో. 'ఏ(వం) (రత్యా)దయో భావాః శృఙ్గారవ్యక్తిహేతవః
 శాకల్యాదిభి దేకోనపఞ్చాశ ద్యథాభేదం ప్రకాశితాః.'—రసార్ణవ. ౫. 17.

ఈశ్లోకము భోజుని 'శృంగారప్రకాశము' న 14 వ ప్రకాశమునందలి యుపసంహారశ్లోకములలో మొదటిది. ఈప్రకాశమునందలి కడపటి యీరెండుశ్లోకములను గూడ ప్రకాశవర్షుఁడు గ్రహించెను.

శ్లో. 'జన్మానుబన్ధాతిశయసమ్ప్రర్కానుగమా నితి
 యుఞ్జీత సర్వభావేషు వర్గయో రుభయో రపి.

శ్లో. య దపి చ గదితం ప్రకర్షగామీ
 భవతి రసో రతివిస్మయాది రేవ
 త దిద మితి నిరాకృతం ప్రకృష్టాః
 ప్రకృతిజభేద మమీహి సర్వఏవ.'—రసార్ణవ. ౫. 18–19.

శృంగారప్రకాశము [13 ప్రకాశము] న విస్తరింపఁబడిన భావముల వివిధావస్థలు—భావోదయము, వికాసము మొదలగునవి—18 వ శ్లోకమున సూచింపఁబడెను. తరువాతిశ్లోకమున నూతన మగు భోజుని రససిద్ధాంతము కొంతవఱకు సంగ్రహముగాఁ జెప్పఁబడెను. ఈసిద్ధాంత మేమన—అభిమానము, శృంగారము ననునామాంతరములు గల 'అహంకారము' నకే రసనామ ముచితము. రత్యాదులగు 49 భావములు ప్రకర్షావస్థ నందినను భావనావస్థయం దుండుటచే నవి రసమనఁ జెల్లవు. రత్యాదిప్రకర్షయే రస మనునది ప్రాచీనసిద్ధాంతము. ప్రకర్షమైనను భావమే యని భోజునిమతము. ప్రకర్షావస్థయందున్న యీభావము లన్నియు మనలో ననవరతమును బ్రకాశించునహంకారదీపికను బ్రజ్వలింపఁజేయును ['సప్తర్షిమం ద్యుతిచయా ఇవ వర్ధయన్తి']. ఈయహంకారమే మన మనుభవించునది, విషయాంతరముల

ననుభవించుటకు సాధనభూత మైనది. కావున 'అహంకారశృంగారాభిమాన' మొక్కటియే రసము. 'సరస్వతీకంఠాభరణము'నఁ గూడ రసప్రకరణము మొదట [5 పరి.] నీతని సిద్ధాంత మిట్లు సూత్రప్రాయముగా నొసఁగఁబడెను:

'రసోఽభిమానోఽహఙ్కారః శృఙ్గార ఇతి గీయతే.'

ఈనవీనమతము నావిష్కరించిన పిమ్మట భోజుఁడు ప్రాచీనాలంకారికులు చెప్పిన 'శృంగారము' [స్త్రీపురుషప్రేమ] రతియను భావము యొక్క ప్రకర్షావస్థయే యని నుడివియున్నాఁడు. ఈరతి 'అహంకారశృంగార' కల్పకముయొక్క ప్రథమముఁ బ్రధానము నగునంకురము. 'శృంగారప్రకాశము'[11ప్రకాశ.] న నీరతినే 'సకలభావమూర్ధాభిషిక్త' మని యాతఁడు చెప్పియున్నాఁడు. రతిప్రపంచక మగు 13 వ ప్రకాశము తుదిని—

౧. శ్లో. 'సైవ భావో రతి ర్నామ.'
౨. శ్లో. 'భావాన్తరేభ్యః సర్వేభ్యః.'
3. శ్లో. 'నిసర్గసంసర్గసుఖైః ప్రభేదైః.'

అనునీశ్లోకములలో రతివిచారము నుపసంహరించెను. ఈశ్లోకములు మూఁడును రసార్ణవమున స్వీకరింపఁబడినవి. [౫ పరి. 12-14]

'రసార్ణవము'న నీప్రకరణమున 'శృంగారప్రకాశము' సారము-అందుఁ బ్రధానముగా 11, 12, 13 ప్రకాశముల సారము-సంగ్రహింపఁబడి యుండును. రసార్ణవమునఁ బంచమప్రకరణము-

'ఉక్తః సోఽయం విభావానుభావసఞ్చారిసఙ్కరః
క్రమేణ సర్వభావానాం శృఙ్గారేషు చతుర్ష్వపి.'

అని ప్రారంభింపఁబడెను. దీనినిబట్టి మొదటఁ జాలభాగ ముత్సన్న మైనట్లు తెలియుచున్నది. ఇటఁ బేర్కొనఁబడిన చతుర్విధశృంగారములును భోజుఁడు చెప్పిన ధర్మార్థకామమోక్షశృంగారములే. శ్లోకాదిని 'ఉక్తః' అని చెప్పఁబడుటచే లుప్త మగుభాగమున 'శృంగారప్రకాశము' నందలి 11, 13, 14, 18-21 ప్రకాశములలో వివరింపఁబడిన

49 భావములయొక్క విభావములు మొదలగునంశములు సమాలోచింపఁబడియుండును.

రాఘవన్ పండితులు చెప్పినట్లు భోజునికిఁ బిమ్మట వచ్చినయాలంకారికులలో విలక్షణ మగుభోజుని రససిద్ధాంతమును సరిగా బోధపఱచుకొనినవారు బహుస్వల్పము. ప్రకాశవర్షుఁడు, 'సరస్వతీకంఠాభరణము'నకు వ్యాఖ్యలు వ్రాసిన రత్నేశ్వర- జగద్ధర- భట్టనరసింహులను పండితప్రకాండులేత్కృతమును బాగుగ నవగాహనము చేసికొనఁగలిగిరి. అందువలన ప్రకాశవర్షునికృతిలోఁ బ్రధానమగురసప్రకరణము చాల భాగ ముత్సన్న మగుట శోచనీయము.

— 7. భామహుఁడు-ప్రకాశవర్షుఁడు. —

ప్రకాశవర్షున కుపజీవ్యు లగుప్రాచీనాలంకారికులలో భామహుఁడొకఁడు. భామహునికావ్యాలంకారమునుండి యీతఁడు కొన్నిశ్లోకముల యథాస్థితములుగాఁ బరిగ్రహించియున్నాఁడు. మఱికొన్ని భామహశ్లోకములకు నీతనిశ్లోకములకు విశేషసామ్యము పొడకట్టుచున్నది. 3 వ పరిచ్ఛేదమున (37 శ్లో.) మహాభామహుని దని యొకశ్లోకము నుదాహరించెను. ఇది మనకు లభించినభామహగ్రంథమునఁ గానరాదు. అందీశ్లోకము లోపించెనో లేక ప్ర. వ. పొరపాటున మఱియొకకవిరచనము నీతని కంటఁగట్టెనో చెప్పఁజాలము. రసార్ణవమున [౪ పరి. 91-92 శ్లో. 'ప్రతిబింబమపి', 'రూపం శంసన్తి'] రెండుశ్లోకములలో భామహుని మతము ప్రమాణీకరించుకొనఁబడెను. ఈశ్లోకములు గూడ భామహునికృతిలో మృగ్యములు. దీని నాధారముగాఁ గొని వేంకటరామశర్మగారు మహాభామహుఁ డనునాలంకారికుఁ డొకఁడు గలఁ డనియు, నీతఁడు భామహునికంటె భిన్నుఁ డనియుఁ బ్రతిపాదించిరి. కాని యీవాదము సమంజసము కాదని తరువాత నిరూపింపఁబడును. ఇఁక భామహప్రకాశవర్షులరచనాసామ్యములఁ జూడఁదగును—

(అ) ఈక్రిందిశ్లోకము లిరువురగ్రంథములలోను గలవు:

1. శ్లో. 'సముదాయార్థశూన్యం య త్త దపార్థం ప్రచక్షతే.'

—భామహ. IV. పరి. 8 శ్లో. ప్రకాశ. ౧ పరి. 31.

2. శ్లో. 'క్వచి దాశ్రయసౌన్దర్యా ద్ధత్తే శోభా మసాధ్వపి
కాంతావిలోచనన్యస్తం మలీమసమి వాఞ్జనమ్.'
శ్లో. 'సన్నివేశవిశేషాత్తు దురుక్త మపి శోభతే
నీలం పలాశ మాబద్ధ మన్తరాలే స్రజా మివ.'
—భామహ. I. 55-54. ప్రకాశ. ౨. 50-51.

3. శ్లో. 'సర్వం సర్వేణ సారూప్యం నాస్తి భావస్య కస్యచిత్
యథోపపత్తి కృతిభి రుపమానం ప్రయుజ్యతే.
శ్లో. అఖణ్డమణ్డలః క్వేన్దుః క్వ కాన్తానన మద్యుతి
యత్కిఞ్చిత్కాన్తిసామ్యాత్తు శశినై వోపమీయతే.'
—భామహ. II. 43-44 ప్రకాశ. ౨. 64-65.

4. శ్లో. 'ఏతద్గ్రాహ్యం సురభికుసుమం మాల్య మేత న్నిధేయమ్
ధత్తే శోభాం విరచిత మిదం స్థాన మస్యైత దస్య
మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలామ్
యోజ్యం కావ్యే ష్వవహితధియా తద్వదే వాభిధానమ్.'
—భామహ. I. 59. ప్రకాశ. 3. 97.

(ఆ) ఉభయులకు విశేషసాదృశ్యముగల రచనలు:

1. 'య దభిన్నార్థ మన్యోన్యం త దేకార్థం ప్రచక్షతే.'—భామహ. IV. 12.
'ఉక్తాభిన్నార్థ మేకార్థం వ్యాహరన్తి విశారదాః.'—ప్రకాశ. ౧. 32.

2. 'యథోపదేశం క్రమశో నిర్దేశోఽత్ర క్రమో మతః
తదపేతం విపర్యాసా దిత్యాఖ్యాత మపక్రమమ్.'—భామహ. IV. 20.
'అపక్రమం తు తద్యత్ర పౌర్వాపర్యవిపర్యయః.'—ప్రకాశ. ౧. 33.

3. 'అవిద్వదఙ్గనాబాలప్రతీతార్థం ప్రసాదవత్'.—భామహ. II. 3.
'ప్రసిద్ధార్థపదన్యాసా త్ప్రసాద ఇతి కీర్తితః.'—ప్రకాశ. ౨. 7.

4. 'న కాన్త మపి నిర్భూషం విభాతి వనితాననమ్'—భామహ. I. 13.
'జ్ఞేయోఽలఙ్కారయోగోఽయం కామినీవపుషో యథా
నిసర్గసున్దర స్యాపి ప్రకర్షాధాయకో ధ్రువమ్.'—ప్రకాశ. 3. 2.

5. 'వినయేన వినా కా శ్రీః కా నిశా శశినా వినా
రహితా సత్కవిత్వేన కీదృశీ వాగ్విదగ్ధతా.'—భామహ. I. 4.
'వినయేన వినా కా శ్రీః కానిశా శశినా వినా
వినాచ శ్లేషచిత్రాభ్యాం కీదృశీ వాగ్విదగ్ధతా.'—ప్రకాశ. 3. 80-81.

## — 8. దండి-ప్రకాశవర్షుఁడు. —

ప్రకాశవర్షుని కుపజీవ్యగ్రంథములు భోజుని 'సరస్వతీకంఠాభరణ-శృంగారప్రకాశములు.' 'సరస్వతీకంఠాభరణము'న దండి 'కావ్యాదర్శము' నుండియు, భామహుని 'కావ్యాలంకారము' నుండియు శ్లోకములు చాలవఱకును, రాజశేఖరుని 'కావ్యమీమాంస' నుండి కొన్ని శ్లోకములును సంగ్రహింపఁబడినవి. భోజుని యీకృతి మనకవికి నొఱవడి యగుటచే దండి- భామహ- రాజశేఖరుల రచనలకు నీతనిరచనలకు విశేషసామ్యసాదృశ్యములు కానఁబడుటలో వింత లేదు. ప్రకృతముదండి-ప్రకాశవర్షులరచనాసామ్యముల నరయుదము:

(అ) ఈక్రిందిభాగము లుభయులకృతులలోను గానవచ్చెడిని:—

1. 'సముదాయార్థశూన్యం య త్తదపార్థం ప్రచక్షతే'

—దండి. III. 128; ప్రకాశ. ౧. 31.

2. 'ఓజ స్సమాసభూయ స్త్వమ్.'—దండి. I. 80. ప్రకాశ. ౨. 17.

3 'యత్రోద్వేగో న ధీమతాం.'—దండి. II. 51. ప్రకాశ. ౨. 62.

4. 'అస్తి కాచి దవస్థా సా సాభిషఙ్గస్య చేతసః
యస్యాం భవే దభిమతా విరుద్ధార్థాపి భారతీ.'

—దండి. III. 133. ప్రకాశ. ౨. 88.

5. 'ఇహ శిష్టానుశిష్టానాం శిష్టానా మపి సర్వథా
వాచా మేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే.
ఇద మన్ధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారా న్న దీప్యతే'

—దండి. I. 3, 4. ప్రకాశ. 3. 67-68.

6. 'అనుకమ్పా ద్యతిశయో యది కశ్చి ద్వివక్ష్యతే
న దోషః పునరుక్తోఽపి ప్రత్యు తేయ మలఙ్కృతిః.'

—దండి. III. 137. ప్రకాశ. ౨. 55-56.

7. 'క్రీడా గోష్ఠీవినోదేషు తద్జ్ఞై రాకీర్ణమన్త్రణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేలికాః.'

—దండి. III. 97. ప్రకాశ. 3. 82.

8. 'న సంహితాం వివక్షామీ త్యసన్ధానం పదేషు యత్
తద్విసన్ధీతి నిర్దిష్టం న ప్రగృహ్యాది హేతుకమ్.'
—దండి. III. 159. ప్రకాశ. ౨. 54-55.

(ఆ) దండి-ప్రకాశవర్షులకృతులలో విశేషసాదృశ్యముగల వాక్యములు.

1. 'అవిశేషేణ పూర్వోక్తం యది భూయోఽపి కీర్త్యతే
అర్థతః శబ్దతో వాపి తదేకార్థం మతం యథా.'—దండి. III. 135.
ఉక్తాభిన్నార్థ మేకార్థం వ్యాహరన్తి విశారదాః'.—ప్రకాశ. ౧. 32.

2. 'లోకాతీత ఇవాత్యర్థ మధ్యారోప్య వివక్షితః
యోఽర్థస్తే నాతితుష్యన్తి విదగ్ధా నేతరేజనాః.'—దండి. II. 89.
'లోకాతీత ఇవార్థో యః సోఽతిమాత్ర ఇహోచ్యతే.'—ప్రకాశ. ౧. 34.

3. 'స్యా ద్వపుః సున్దర మపి శ్విత్రే ణైకేన దుర్భగమ్.'—దండి. I. 7.
'న హి కుస్త్వాదిభి ర్దోషై రహితం కామినీవపుః
నృత్తగీతాదిచాతుర్యగుణా న్నాద్రియతే క్వచిత్.'—ప్రకాశ. ౨. 2.

గ్రంథగౌరవభీతిచే నిఁక దండివాక్యముల మాత్ర ముదాహరించి ప్రకాశవర్షుని వాక్యముల దిక్ప్రదర్శనముగ సూచించెదను.

4. 'ప్రసాదవత్ ప్రసిద్ధార్థమ్'.—దండి. I. 45.
'ప్రసిద్ధార్థ.'—ప్రకాశ. ౨. 7.

5. 'సమం బన్ధే ష్వవిషమం తే మృదుస్ఫుటమధ్యమాః
బన్ధా మృదుస్ఫుటోన్మిశ్రవర్ణవిన్యాసయోనయః.'—దండి. I. 47.
'బన్ధో మృదు'—ప్రకాశ. ౨. 8.

6. 'అనిష్ఠురాక్షరప్రాయం సుకుమార మి హేష్యతే.'—దండి I. 69.
'అకఠోరాక్షర'—ప్రకాశ. ౨. 9.

7. 'ఊర్జస్వి రూఢాహంకారమ్'—దండి. II. 275.
'రూఢాహంకార తౌర్జిత్యమ్'—ప్రకాశ. ౨. 29.

8. 'యత్నః సమ్బన్ధవిజ్ఞానహేతుకోఽపి కృతో యది
క్రమలఙ్ఘన మ ప్యాహుః సూరయో నైవదూషణమ్.'—దండి. III. 146.
'యత్నః సమ్బన్ధ'—ప్రకాశ. ౨. 53-54.

9. 'శిథిలమ్ * * *
అనుప్రాసధియా గౌడై స్తదిష్టం బన్ధగౌరవాత్.'—దండి. I. 43-44.
'సుకుమారార్థ'—ప్రకాశ. ౨. 67.

# అభినవభారతి.

— విద్వాన్ కాశీ వ్యాసాచార్యులుగారు —

### ఉత్పలమాల.

శాసనకర్తలై నన్నృపసత్తము లెల్లరుఁ దొల్లి, యాత్మ సం
తోసముతోడ రాజ్యరమతో సరిగాఁగఁ బరిగ్రహించి భా
షాసతిఁ గూడఁ బెంచిరి; విచారణకర్తలు వార లుండ సం
త్రాసము వాసి భారతియు రమ్యతరాద్భుతహావభావ చే
ష్టాసముదీర్ణయై, నిజవచస్సుధ లొల్కఁగ దివ్యపాదవి
న్యాసములం జరించెఁ జతురాననహర్మ్యతలంబులందె; నాఁ
డాసతిఁ గాంచుటే ఘనులకైనను దుర్ఘట మౌచుఁదోఁచెఁ; గా
నీ సిరి డిందెనో! యిపుడిఁ కేమని తెల్పెదఁ, దొంటికీర్తి వి
న్యాసము జాఱెఁ, గాలగతి యంతయు మాఱె, స్వరాజవర్గ మా
వాసముఁ జేరె, నన్యవరపాలురపాలన మీఱె, దేశభా
షాసతి నిద్రఁ గూరె, నను శాసను లెవ్వరు లేరటన్న వి
శ్వాసముతోడ నెవ్వనికి వాఁడె కవీంద్రపదంబుఁ గాంచు పే
రాసదివంబు ముట్ట 'బళిరా! యదె భారతి చిక్కెఁ జిక్కె' నం
చా సతి కేలు బట్టిఁ గొని "యాఁగుమిఛీ! యెట కేఁగు దింక ? నీ
గసరి కొక్కపండితులనే వరియించెద నన్నయట్టి యా
శాసలు మాను మింక, భయభక్తుల మాకయిఁ బట్టు మింక" నం
చాసురభావమూని వికటార్భటి లాగఁగఁ, బాప మక్కటా!
యాసతి మేనఁ దాల్చిన మహార్హవిభూషలు జాఱెఁ, బాదవి
న్యాసము మాఱెఁ, వాక్యములయందునఁ దొట్రిలుపాటు గూరెఁ, గ
ట్టా! సరసంపుఁబాకముల యందు రుచుల్ పసతీఱె, సంధులున్
వాసి చలించుచుండ సడలఁబాఱెఁ, బొరింబొరి సర్వభావస
న్న్యాసము మీఱె, నీపయి వినం గనరాని విఁకెన్ని క్రొత్తలా
వేసము లూని భారతి నవీనగతిం జరియించునో గదా!

మ్రమయ్యల్ యాంతం బగుఁ-వశ్శైనల్ దగుఁ "చంద్రరేఖ"-
మ U U U, ర U I U, మ U U U, య I U U, య I U U;

సరవిఁ సగణంబులు పం-చకమా "నలినిఁ"-స I I U, స I I U,
స I I U, స I I U, స I I U;

శాప్తివళ్ల "మణిభూషణ"-మా రనభారలఁ-ర U I U, న I I I,
భ U I I, భ U I I, ర U I U;

అయతి నజాభర లున్న-నౌను "మనోజ్ఞ"కుఁ-న I I I, జ I U I,
జ I U I, భ U I I, ర U I U;

కుంభివ శ్రిజద్వయం బ-గుఁ రముఁ "ప్రశాంతికిఁ"-ర U I U,
జ I U I, ర U I U, జ I U I, ర U I U.

"ఆలసగతి"మా నసన-లంది భయములొందఁ-న I I I, స I I U,
న I I I, భ U I I, య I U U;

ఏడుహాంబులుఁ గముఁ వ-డెన్నిది "స్రగంధికిఁ" హా U I,
హా U I, హా U I, హా U I, హా U I, హా U I హా U I, గ U;

దీనిపేరె "చామరంబు"-ధీరవంద్య మారుతీ.

క. అల పదియాఱవ 'యష్టిని'
 గల రసశిఖిశరశరర్తు[1]గణన సువృత్త
 ములలోఁ బ్రియకాంతాదులు
 కలితములై పది యెసఁగుఁ గవినుతచరితా. ౮౮.

౧౬. యతి "ప్రియకాంతఁ" దిశల న-యద్వంద్వసగంబుల్-. న I I I,
య I U U, న I I I, య I U U, స I I U, గ U;

లగాష్టకాత్త భూయుతుల్ చె-లంగుఁ "బంచచామరఁ"-
లగ I U, లగ I U, లగ I U, లగ I U, లగ I U, లగ I U,
లగ I U, లగ I U;

నభజజాగల దిశాయతి-నల్వయి "పద్మ"మా-న I I I, భ U I I,
జ I U I, జ I U I, జ I U I, గ U;

---

1. రసశిఖిశరశరర్తులు-౬౫౫౩౬.

కపీంద్రా "చంద్రశ్రీ" యమనసర-గల్ వల్లు రుద్రుల్-య I U U,
మ U U U, న I I I, స I I U, ర U I U, గ U;

యతి పదితో నజభజరగ-లౌను "మేదిని" న్విక౯-న I I I, జ I U I,
భ U I I, జ I U I, ర U I U, గ U;

స్వామి "మదనదర్పం" బగు౯ భ-సల్ రజజల్ గము౯- భ U I I,
స I I U, ర U I U, జ I U I, జ I U I, గ U;

మహి "ఫలసదన" మగు-మనులఘుగగంబుల్-లఘువులు ౧౮.
న I I I, న I I I, న I I I, న I I I, స I I U, గ U;

నజభజరల్ గము౯ త-నరి "వాణి" నింపౌసంగు౯-న I I I, జ I U I,
భ U I I, జ I U I, ర U I U, గ U;

భ్రంబులు నానగల్ వ-రఁగు "గజవిలసిత" మై.. భ U I I,
ర U I U, న I I I, న I I I, న I I I, గ U;

ఐదుభకారములు౯ గము-నైతగు "సశ్వగతి౯"-భ U I I, భ U I I,
భ U I I, భ U I I, భ U I I, గ U.

క. తగు సప్తదశా'త్యష్టిని'
యుగమునిఖేంద్వగ్నిహిమమయూఖుల[1]లో మె
చ్చుగ శిఖరిణి మొద లెన్నిది
మిగులఁ బ్రశస్తములు విను సమీరణతనయా. ౮౯

౧౭. యతిస్థానం బర్రుల్ యమనసభవం-బౌ "శిఖరిణి౯"-య I U U,
మ U U U, న I I I, స I I U, భ U I I, వ I U;

నజభజజల్వము౯ యతిగ-న౯ దిశ "నర్కుటకము౯"-న I I I, జ I U I,
భ U I I, జ I U I, జ I U I, వ I U;

అగరసవిశ్రమా-ఖ్య "పదకోకిల-కాంక"[2] మిదే-

జసల్ జసలు ను౯ యవల్ గిరిశ-సంజ్ఞ "పృథ్వి౯" యతుల్-
జ I U I, స I I U, జ I U I, స I I U, య I U U, వ I U;

---

1. యుగమునిఖేంద్వగ్నిహిమమయూఖులు ౧౭౧౦౭౨.
2. అప్పకవి కోకిలకాక మని చెప్పెను.

నసమరసవల్ వళ్లగ్రుల్ గైకొనన్ "హారిణిం" దగున్ - న | | |, స | | U, మ U U U, ర U | U, స | | U, వ | U;

"మందాక్రాంతన్" మభనతతగా - మార్గమా దిగ్యతుల్గాన్ - మ U U U, భ U | |, న | | |, త U U |, త U U |, గా U U;

"త్వరితపదగతి" దిశల - వడిననననాగాల్ - న | | |, న | | |, న | | |, న | | |, న | | |, గా U U;

ఇదియే "పలాశదళ" మనువృత్తము.

బాగగు "వంశపత్రపతితన్" - భరనభనలగల్ - భ U | |, ర U | U, న | | |, భ U | |, న | | |, లగ | U;

సజసాస్వ లౌ యతి గ - జంబులఁ "జంపక కేసరిన్" - స | | U, జ | U |, స | | U, స | | U, స | | U, వ | U.

క. 'ధృతి' యను ఛందంబునఁ గల
చతురంబుధిచంద్ర నేత్రశాస్త్రాక్షులఁ[1] బొ
ల్చి తగుకుసుమితలతావె
ల్లితాదు లవి యీలు దనరె లేఖారిహరా. ౯౦

౯౧. విన్నత్నల్ యీయల్ "కుసుమితలతా - వేల్లిత" న్వళ్లు రుద్రుల్ -
మ U U U, త U U |, న | | |, య | U U, య | U U, య | U U;

మారుతీ రసజాభరల్ తగు - "మత్తకోకిల" దిగ్యతిన్ - - ర U | U, స | | U, జ | U |, జ | U |, భ U | |, ర U | U;

అష్టబాణవిరామమై - యన నౌ నిదే - "హరిణప్లుతన్"

ఔరసజ్యభగోక్తి వ - ళ్లహిబాణంబుల్ - "హారనర్తనన్" - ర U | U, స | | U, జ | U |, య | U U, భ U | |, ర U | U;

నయుగము రచతుర్గ - ణంబై "నిశా" వృత్తమాయత్యహీన్ - న | | |, న | | |, ర U | U, ర U | U, ర U | U, ర U | U;

"క్ష్మాహారంబు" మనయతన్మప్రో - క్తం బగు యతిదిక్కుల్ గాన్ - మ U U U, న | | |, య | U U, త U U |, న | | | మ U U U.

---

1. చతురంబుధిచంద్ర నేత్రశాస్త్రాక్షులు ౬౬-౨౧౪౪.

2. క్ష్మాహారవృత్తమునకు అప్పకవీయములో "రత్నేషు" యతులని రెండు తావులఁజూపెను.

క. పందొమ్మిదైన 'యతిధృతి'
యం దహివసుకరజలధియుగాస్త్రసమితిలోఁ[1]
జెంది తరళాదిపట్టం
బందం బగుఁ గృతుల వినుము హనుమన్నాథా. ౯౧

౧౯. భవయతిఁ "దరళం" బెసంగు న-భంబులుఁ రసజాగముల్-
న I I I, భ U I I, ర U I U, స I I U, జ I U I, జ I U I, గ U;
కంజాతాప్తయతిఁ మసజ్జసతతల్-గంబుంప "శార్దూల" యా-
మ U U U, స I I U, జ I U I, స I I U, త U U I, త U U I, గ U;
భారసజాగల రుద్రవిశ్రమ-భాతి "భూతిలకం" బగుఁ-భ U I I,
భ U I I, ర U I U, స I I U, జ I U I, జ I U I, గ U;
"కవికంఠభూషణము"-గఁ సజసాసజగల్ వ డెన్మిదిఁ-స I I U,
జ I U I, స I I U, స I I U, స I I U, జ I U I, గ U;
సద్రసాతజజంబుగముంగాఁ "-జంద్రకళం" దగఁ దిగ్యతిఁ-ర U I U,
స I I U, స I I U, త U U I, జ I U I, జ I U I, గ U;
మిళద్యత్యర్థుల్ యమ్న సరరగలా- "మేఘవిస్ఫూర్జితా"ఖ్యఁ-
య I U U, మ U U U, న I I I, స I I U, ర U I U, ర U I U, గ U.

క. ఇరువదియగు 'కృతి'లో రస
ధరశరవసువార్ధిఖేందు[2]తతిలోఁగల యం
బురుహాది సప్తవృత్తము
లిరవగుఁ గావ్యముల దాసహీనమందారా. ౯౨

౨౦. "అంబురుహంబు" భభాభ్రభసవల్ యతు-లంబుజాప్తుల రా నగుఁ-
భ U I I, భ U I I, భ U I I, భ U I I, ర U I U, స I I U,
వ I U;
వడి షద్మాట సభల్ రనల్ మయవలుఁ- వైపొందు "మత్తేభ"
కుఁ- స I I U, భ U I I, ర U I U, న I I I, మ U U U, య I U U,
వ I U;

---

1. అహివసుకరజలధియుగాస్త్ర-౫.౨౪.౨౮౮.
2. రసధరశరవసువార్ధిఖేందులు-౧౦౪౮౫౭౬. మూలములో "కృతిలోపల, ధరశర" ఇత్యాదిగానున్నది.

పంకజభూయతుల్ భరన - భారవ "ఉత్పలమాలికం" దగున్ -
భ U||, ర U|U, న|||, భ U||, భ U||, ర U|U, వ|U;

అగు నభామసనల్ వముతో ఖా-లాక్షయతిన్ "ఖచరప్లుతన్"-
న |||, భ U||, భ U||, మ UUU, స ||U, స ||U, వ|U;

కయతి నజాభరస ల్వముం గలు-గం "ప్రభాకలితం" బగున్-న |||,
జ |U|, జ|U|, భ U||, ర U|U, స ||U, వ|U;

పద్మాల్గింటన్ యతుల్గా మరభనయభవల్-ప్రాపౌ "సువదనన్"-
మ UUU, ర U|U, భ U||, న |||, య |UU, భ U||, వ|U;

త్రైరజల్ హాముం జో-రంగఁ దర్కషడ్వి-రామమైనవృత్తమొప్పు-[1]
ర U|U, జ |U|, ర U|U, జ |U|, ర U|U, జ|U|, హా U|.

క. ఇరువది యొకటగు 'ప్రకృతిని'
కరశరశశిమానిరంధ్రగగనాక్షుల[2] స్ర
గ్ధర మొదలగు వృత్తంబులు
పరఁగఁగ నొకయాఱు వెలయుఁ బవనతనూజా. ౯౩

౨౧. క్ష్మాభృద్భ్యాభృద్యతుల్గా- మరభనయయయల్ - మానగున్ "స్రగ్ధరాఖ్యన్"- మ UUU, ర U|U, భ U||, న|||, య|UU, య |UU, య |UU;

నజభజజారదిగ్విరమ-ణంబులఁ "జంపకమాలికం" దగున్-న |||,
జ |U|, భ U||, జ|U|, జ|U|, జ|U|, ర U|U;

ససనామతయల్ రవివిశ్రమము-స్సాధించన్. "లాటీవిట" మయ్యెన్-స ||U, స||U, స||U, స||U, మ UUU, త UU|, య |UU;

యతి పదుమూఁట నజాజజభల్ రము - నొఁ గృతిన్ "వన మంజరిన్"- న |||, జ|U|, జ|U|, జ|U|, జ|U|, భ U||, ర U|U;

---

1. ఈవృత్తముపేరు చెప్పలేదు.
2. కరశరశశివహానిరంధ్రగగనాక్షులు-౨౦౯౧౧౫౨.

హనుమా సజత్రయము సంబు-నొను "మణిమాలిక" దశయ
తి-స ।। ౧, జ । ౧ ।, స ।। ౧, జ । ౧ ।, స ।। ౧, జ । ౧ ।, స ।। ౧;
లఘు లిరువది గురువు "గనక-లత" కెనయు నినయతి-(న ।।।,
న ।।।, న ।।।, న ।।।, న ।।।, న ।।।, స ।। ౧) ల ।।।।।।।।।
।।।।।।।।।।। గు ౧.

క. ఇరువది రెం డగు 'నాకృతి'
శరధిఖశిఖివారిధాతృశశిజలధుల[1]లోఁ
దురగాదికవృత్తము లై
దిరవొందును గృతులయందు నిద్ధచరిత్రా. 54

౨౨. ననన సజజగములఁ "దురగ"మ-నఁ మనూక్తయతిం దగుఁ-
న ।।।, న ।।।, న ।।।, న ।।।, స ।। ౧, జ । ౧ ।, జ । ౧ ।, గ౧;
కరిమానుల్వృక్షహస్త-గ్ధర సతతనసల్- గల్గిరాగంబు లుండుఁ-
స ।। ౧, త ౧ ౧ ।, త ౧ ౧ ।, న ।।।, స ।। ౧, ర ౧ । ౧, ర ౧ । ౧,
గ ౧;

భాన్వితమై రనత్రయము గంబు-నై భవ్రునివళ్ల "భద్రక"మగుఁ-
భ ౧ ।।, ర ౧ । ౧, న ।।।, ర ౧ । ౧, న ।।।, ర ౧ । ౧, న ।।।, గ ౧;
భంబు రనల్ రసల్ సనగురుల్- పదింటను వళ్లిడ "మద్రక"
మగుఁ- భ ౧ ।।, ర ౧ । ౧, న ।।।, ర ౧ । ౧, స ।। ౧, స ।। ౧,
న ।।।, గ ౧

ఏడ్భగురుల్ రవి నేని రసత్రయు-నేన్పడి "మానిని"- కి ట్లిడనా-[2]
భ ౧ ।।, భ ౧ ।।, భ ౧ ।।, భ ౧ ।।, భ ౧ ।।, భ ౧ ।।, భ ౧ ।।,
గ ౧.

క. 'వికృతి'కి నిరువదిమూఁడును
సుకృతికి వసుఖర్తుగజవసుశిఖిభములం[3]
దొకనాల్గు పద్మనాభా
దికవృత్తము లమరు వాయుదేవకుమారా. 55

1 శరధిఖశిఖివారిధాతృశశిజలధులు-౭౧౫౮౩౦౪.

2. మానినికి అప్పకవీయములో-విశ్వవిరామ మెంక్కటియే చెప్పెను.

3. వసుఖర్తుగజవసుశిఖీభములు-౭౩౮౬౮౬౦౮.

౨౩. భాస్వద్యతి నప్తతంబులన్ గగంబున్ప-భాస్వద్యశా "పద్మనాభంబు"
మించున్-త ౧౧।, త ౧౧।, త ౧౧।, త ౧౧।, త ౧౧।,
త ౧౧।, త ౧౧।, గగ ౧౧;

నము త్రిజభల్ వమున్ దనరునా డి-నప్రభువిరామ "మశ్వలలితన్"-
న।।।, జ।౧।, భ ౧।।, జ।౧।, భ ౧।।, జ।౧।, భ ౧।।,
వ।౧;

"మత్తాక్రీడన్" మాతల్ నానాల్-మఱి వము వసుగజ-మత
యతు లమరున్-మ ౧౧౧, మ ౧౧౧, త ౧౧।, న।।।, న।।।,
న।।।, న।।।, వ।౧;

ప్రతి రస మద్యతి-రా నము షడ్జ్వలు-రాఁ "గవిరాజవిరాజితమౌ"
న।।।, జ।౧।, జ।౧।, జ।౧।, జ।౧।, జ।౧।, జ।౧।; వ।౧.

క. ఇరువదినాల్గగు 'సంకృతి'
హరజము ఖేంద్వక్షి మానిహయమునిరసభే
శ్వరు[1] లందుఁ గ్రౌంచపదముఖ
వరవృత్తచతుష్క మొప్పు వటులోకమణీ. ౯౬

౨౪. పంచయుగాహుల్ "క్రౌంచపదిన్"వ-శ్ర్భమసభన ననయ-పరిమిత
మయ్యెన్-భ ౧।।, మ ౧౧౧, స।।౧, భ ౧।।, న।।।,
న।।।, న।।।, య।౧౧;

సంధిల్లున్ మనతసరభ-జ్యలయి వ "శ్లిష్టమూర్తిన్"-సరవితోఁ గరి
దంతుల్-మ ౧౧౧, న।।।, త ౧౧।, స।।౧, ర ౧।౧, భ ౧।।,
జ।౧।, య।౧౧;

సారాజాహీస్ఫారయతుల్ మిం-చ మతయననన-సల "సరసిజ"
మౌ-మ ౧౧౧, త ౧౧।, య।౧౧, న।।।, న।।।, న।।।,
న।।।, స।।౧;

"తన్వికిఁ" బద్మాప్తయతి ననిలపు-ప్రౌభతనల్ సభభనయలు చెందున్-
భ ౧।।, త ౧౧।, న।।।, స।।౧, భ ౧।।, భ ౧।।, న।।।,
య।౧౧.

---

1. హరజము ఖేంద్వక్షి మానిహయమునిరసభేశ్వరులు-౧౬౭౭౭౭౧౬.

క. ఇరువదియై దగు 'సభికృతిఁ'
గరగుణగతిగతిశరవిశిఖగుణాగ్నులు[1] భా
స్కరవిలసితంబు మొదలై
పరఁగెను వృత్తత్రయంబు భానుజమంత్రీ. ౯౭

౨౫. "భాస్కరవిలసిత" మర్కయతిం గూర్పఁ భనజయభననసగల
మిందుఁ-భ ౧।।, న ।।।, జ ।౧।, య ।౧౧, భ ౧।।,
న ।।।, న ।।।, స ।।౧, గ ౧;

ననసన సభభభ గురువులయతి యొ-న్నం బదియేనిట "బంధుర" మౌ-న ।।।, న ।।।, న ।।।, న ।।।, స ।।౧, భ ౧।।, భ ౧।।, భ ౧।।, గ ౧;

వడి గిరి మునుల-వసునగణగలు-వలె నిడ "ధరణిధరగతిఁ"- న ।।।, న ।।।, న ।।।, న ।।।, న ।।।, న ।।।, న ।।।, న ।।।, గ ౧.

క. ఇరువదియాఱగు 'నుత్కృతి'
శరధిమదష్టాష్టఖేందుశైలర్తులలోఁ[2]
బరఁగె భుజంగవిజృంభిత
దొరకొని వృత్తత్రయంబు ధూమ్రమాక్షహరా. ౯౮

౨౬. తొల్చున్వళ్ల ష్టాశాప్తిఁ మా-తననన రసవము లిడఁ-దా "భుజంగ విజృంభితఁ"-మ ౧౧౧, మ ౧౧౧, త ౧౧।, న ।।।,
న ।।।, న ।।।, ర ౧।౧, స ।।౧, వ ।౧;

ఔబ్రహ్మర్తురసములను-యతిమగణగు-మాకససగగ-"లపవాహో ఖ్యఁ"[3]-మ ౧౧౧, న ।।।, న ।।।, న ।।।, న ।।।, న ।।।,
న ।।।, స ।।౧, గగ ౧౧;

ఆభజసనద్వయగ-గాన్వితమునై యతిగ-జాహులగు మంగళమహా శ్రీ-భ ౧।।, జ ।౧।, స ।।౧, న ।।।, భ ౧।।, జ ।౧।, స ।।౧,
న ।।।, గగ ౧౧.

---

1. కరగుణగతిగతిశరవిశిఖగుణాగ్నులు-౩౩౭౭౫౫౩౨
2. శరధిమదష్టాష్టఖేందుశైలర్తు-౬౭౧౦౮౮౬౫.
3. అప్పకవి యీవృత్తమును వరాహవృత్తమనియెను.

గాలివెంబడి నొకకడఁ జేరు హారిమంచ
నిర్ముక్తకంచుకనిచయ మనఁగ
నబ్జగేహకు వాస మైనట్టి హరికి ని
వాస మైన సితాబ్జవన మనంగ
నక్షయచంద్రు నిమ్మని వారినిధి వేఁడ
వచ్చిన కైరవవార మనఁగ
నంబరంబున కెగసిన యపుడె క్రిందు
నకట రాహుగ్రహం బన నాత్మఁ గలఁగి
జనకుఁ డగుసింధురాజు నక్కున నె యున్న
విధుని బింబం బనఁగ మించు వెల్లదీవి. ౧౪

క. నెలనెలకు జలనిధానము
కలువలచెలిమండలంబు గావించుటకై
నిలిపిన మాదిరియో యన
వెలయుం దెలిదీవి కాంతి విశదం బగుచున్. ౧౫

గీ. తనకరౌఘంబు వేఁడిమిఁ దాళలేక
శరధిఁ దేలుచు దుగ్ధపాండురిత మైన
దివసకరమండలమొ తెల్లదీవి, యట్లు
గానినాఁ డుష్ణ హరి యుండఁగాఁ బనేమి. ౧౬

క. తనగు వయఃప్రకృతిని మృగు
వని యాడ సహింపలేక యంబుధి యొకచోఁ
గనుపించెనొ కారిన్యం
బనఁగ సితద్వీప మఘుమరాపం బమరున్. ౧౭

క. వనజదళాక్షుఁ డుదధి వా,మునమూర్తి వసింప నచటి మట్టున నే పే
రెనొ పాలసంద్ర మనఁగాఁ, గననగుఁ దెలిదీవి రుచిధగద్ధగితం బై.

గీ. నీరుపాకలు గుమిగూడి నింగి కెగయ
వీచికారజ్జువులఁ గట్టి విడిచినట్టి
కాగితపుగాలిపటము నిష్టంపలీల
నున్నదో యనఁ దెలిదీవి చెన్నుమీఱు. ౧౮

గీ. వనధులకు నెల్లఁ దారాజు గనుక పాల
కడలి పట్టంబుగొను తెల్లగొడు గనంగ
నెసఁగు తెలిదీవి తనమీఁద నిద్రసీల
కల సునఁగ శౌరి తనుశోభ గ్రమ్ముకొనఁగ. ౧౧

గీ. ఏల నేనుండ గొల్లలయిండ్లు సొచ్చి
వెన్న దొంగిల నీవిద్య విడువు మనుచు
వారినిధి యల్లునికి నొక వంక వైచెఁ
దిన్నగా వెన్న లనఁ దెల్లదీవి మెఱయు. ౨౧

గీ. మహికి మగఱాలమొలనూలు రహివహించు
పాలకడలిని హరినీలశాలిమధ్య
మైన తెలిముత్తియపుమొగ పనఁగఁ బరఁగు
దీప్రధవళప్రభల ఠీవిఁ దెల్లదీవి. ౨౨

గీ. నాకవిభునకు వెఱచి మైనాకపూర్వ
పర్వతంబులలో నుండి పైని వేగు
నిలుపుగాఁ జొప్పుమార్ప డిండీరపిహిత
దేహ మగుకొండ యనఁ దెల్లదీవి మెఱయు. ౨౩

గీ. కందుఁ గుందును జెందు నాయిందునందు
నంచుఁ జింతించి తప మాచరించి కడలి
గన్న కందును గుందును గనని యిందు
చందమునఁ దెల్లదీవి చెన్నొందు నెపుడు. ౨౪

క. అనుదినము వచ్చు బహువా
హినులఁ గలయు కడలిపాల నేర్పఱుపఁగ వ
చ్చిన పంచనాసితచ్ఛద
మనఁ దగు నాద్వీప మతిసితాభం బగుచున్. ౨౫

క. తెలిదీవి కలువరారా
చలువ మురారాతి వామచక్షూరుచివీ
చులఁ దోఁగఁ దొరుఁగు పాండుర
సలిలంబులె నిండి దుగ్ధసాగర మయ్యెన్. * ౨౬

---

* దీనితరువాత "వ. అ" అనిమాత్రమే యున్నది.

# రఘునాథరామాయణము.

---

పీఠిక

ఈరామాయణము విజయవిలాసకృతిభర్త యగు రఘునాథనృపాలుఁడు రచించినది. ఇది పూర్తిగా లభించునను నాశతో - బ్ర. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు సంపాదించిన యసంపూర్ణపుస్తకమునుండి యెత్తివ్రాసి ప్రకటింప నారంభించితిమి. కాని లభింపలేదు. లభించు ననునాశ యింకను విడువలేదు. యత్నము జరుగుచున్నది. దొరకినంతనె మరలఁ బ్రారంభించెదము. అంతవఱకు దీనిని మూలఁ బడవేయనేల యని యొక్క భాగముగా నీ 9౮ పుటలను బ్రకటించుచున్నారము.

ఎవ్వరియొద్దనైన మాతృకయున్నచోఁ బంపి మాయత్నము సఫలముచేయ నాంధ్రభాషాభిమానుల వేఁడుచున్నారము.

గ్రంథవిషయము మున్నగునవి సంపూర్ణగ్రంథములోఁ వివరింపఁబడును.

క్రొత్తపల్లి సూర్యారావు.

---

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణము. ౪౦.

శ్రీ

# రఘునాథరామాయణము.

## రఘునాథభూపాలప్రణీతము.

మొదటిభాగము.




కాకినాడ:
ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ
ప్రకటింపఁబడినది.

కాకినాడముద్రాక్షరశాల,

వెల రు 0-8-0.

1937.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు; పరిషద్వ్యాపజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు. ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు. ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు,(కోశాధ్యక్షులు).

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాసుగారు బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

గోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.

ఒలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

# రజతోత్సవసంపుటము.

ఇం దిరువదియైదుసంవత్సరములలోని పరిషచ్చరిత్రము గలదు.
అనేకులు పండితులు, కవులు, ప్రభువులు వ్రాసిన యాంధ్ర గద్యపద్యవ్యాసములును ఇంగ్లీషువ్యాసములును గలవు.
రాజులు, మహారాజులు, తదితరుల ఫోటోలును గలవు.

దీనివెల ౧-౦-౦.

పరిషచ్ఛరిత్రము ౦-౮-౦.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ.

---

ఆంధ్రేతిహాసపరిశోధకమండలి.

రాజమహేంద్రవరము.

## —రెడ్డిసంచిక—

పై మండలివారు, ఇదివరలో చాళుక్య, కళింగ, కాకతీయరాజ్య వర్ధంత్యుత్సవములను జరపినట్లు, రాబోవు డిసెంబరునెలలో రెడ్డిరాజ్య వర్ధంతిని, రాజమహేంద్రవరమునను, కొండవీటిలోను జరుపుటకు నిశ్చయించినారు. వర్ధంత్యుత్సవసందర్భమున, రెడ్డిరాజుల చరిత్రమును రెడ్డిసంచిక అనుపేరుతో ప్రకటింతురు. ఈప్రయత్నమును కొనసాగించుటకు చారిత్రకపరిశోధకులయొక్కయు, ఉదారులగు ధనికులయొక్కయు విద్యాధికులయొక్కయు, విశేషించి రెడ్డిసంఘముయొక్కయు సాహాయ్యమత్యవసరము. సంచికాప్రచురణమునకును, వర్ధంతికిని విరాళములను వ్యాసములను, రెడ్డిసంచిక సంపాదకులగు, వడ్డాది అప్పారావు, బి. ఏ. బి. ఎల్. గారికి పంపప్రార్థించుచున్నాము.

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక, రు ౦-౮-౦.

ఆగస్టు, సెప్టెంబరు 1937.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౬. { ఈశ్వరనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక ౩.

## పాల్కురికి మతరహస్యము.

—యామిజాల పద్మనాభస్వామిగారు, విజయనగరము.—

సోమనాథునిమతము వీరశైవ మని తద్గ్రంథపాఠకులకును, ద
త్తాలపరిస్థితిజ్ఞులకును దెల్లంబ.

సోమనాథుఁడు శ్రుతివాక్యముల నుదాహరించుచు సర్వమును పశు
పతి పరముగ సమన్వయించిన శైవపండితుఁడు. ఆరాధ్యవంశమునకుఁ
జెందిన విప్రుఁడయ్యు శైవాచారదీక్షారత్నాధురంధరుఁడై వర్ణసన్న్యాస
మును జేసికొనఁ డయ్యె. శ్రియాదేవియు, విష్ణురామదేవుఁడును గౌర
వింపఁగ నొప్పుగాదిలిసుతుఁడేకాని గురులింగవరకరోదరజాతుఁ డఁట.
కన్నవారినేని నసహ్యించు నాశైవనియమప్రభావ మయ్యారే;—భవిజ
నసమాదరణసంభాషణాదిసంసర్గదూరగుఁడు. తనకు జన్మలే దని యామ్రేం
ద్రియసంతృప్తిగావించుకొనినాఁడు. ధర నుమా మాతా పితా రుద్ర
యనఁగఁ బరఁగినవాఁడు. “కర్మంబు త్రాళ్లు తాఁ గట్టుకోఁదగునె?” అని
కర్మనునిందించిన మానిసి, శిలాదునిచేతను, నందీశ్వరునిచేతను ఘోర
తపస్సు చేయించినాఁడు. నందికేశ్వరునినోము, తద్విధానముఁ జెప్పి యొ
ప్పించినాఁడు. శ్రుతులను, స్మృతులను నొకవంక నాదరించుచునే కథ న
డిపినాఁడు. సంధ్యావందనము సల్పినచో దేవత లందఱను మ్రొక్కవలె

నట. దాన నయ్యాది దూష్య మని కేవల శివశివభక్తనామసంస్మరణమే కర్తవ్య మని కులసతియట్లు నిశ్చలయుక్తి భక్తి; వెలయాలియట్టు లవ్విప్రమార్గంబు." అని విప్రమార్గమును నిందించుట యాతనియిష్టము. భక్తియే చాలును. కర్మాచరణ మకర్తవ్య మనుట యాతని యాంతరంగిక ముఖ్యోద్దేశము. శాపమునకు శక్తికల దని యంగీకరించుచుఁ గర్మాచరణముల భక్తినిఁ బోలినది లే దనుట యాతని సిద్ధాంతము. శత్రు లైనను లింగసహితులై యున్నచో నాదరించుట యాతనిదినకృత్యము. చిత్తజాంతకుభక్తిఁ జెడనాడు ఖలుల మృత్యువుగతిఁ ద్రుంచుట తత్స్మతపరమసిద్ధాంతము. పరస్త్రీపరాఙ్ముఖత యాతని మతమహోపాయపథమున నాఱని విద్యుద్దీపిక. ప్రపంచము కలదు. అధీశ్వరుఁడు మాత్రము పశుపతి. దేవత లందఱును గలరు, అందఱును శివాంశసంభూతులు. జీవాత్మవేఱు. జీవుఁడు సకర్మి. శివుఁడు నిష్కర్మి. ఆత్మ పంచభూతాత్మకము. శివుఁడు [illegible]కపటనాటకసూత్రధారి. శివుఁడు నిర్మలుఁడు. అంగము పుణ్యపాపాలయము. నిష్కర్మి యైనశివునకును, అంగమునకును సంబంధము లేదు. తనయిచ్ఛాప్రభావమున సర్వమును బుట్టించిన శివునకుఁ దత్సంబంధిత్వ మంటఁగట్టుట యజ్ఞత్వము. మృతుఁడు లేఁడనినవాని నడుతల మెట్టి నడచుట వీరశైవుల యాచారము. శివభక్తులు శివభక్తునిఁ జేరి నీభార్య నీవని మ్మనినచో నిచ్చితీఱవలెను. చచ్చితీఱవలెను. శివభక్తుఁడు చచ్చినదానిని బ్రదికింపఁగలఁడు. బ్రాహ్మణులు త్రాటిమాలలు, పచ్చిమాలలు నట. ఇరుగడలఁ గ్రిక్కిఱిసియున్న యద్వైతబౌద్ధమతమున నడఁచి తన్నియమస్వీకారాశక్త నికృష్టజాతీయులను సులభమోక్షప్రాప్తిపరమసాధనపరశివభక్తి శక్తిని తనలోఁ గొనివారితోఁ గూడి జనబాహుళ్యముచే మన్ననఁగొనుట యతని హృదయసమ్మతమగు మతము. విషము త్రావినను, కన్నులు పెఱికికొనినను, తలనఱికికొనినను భయము లేదు. ప్రాణాపాయము రాదు. అంతయు శివప్రీణనమునకై చేయుచున్న వీరశైవమతమార్గము. దాని కడ్డుతవులరాదు. వర్ణాశ్రమధర్మములు పాటింపరాదు. బసవనికి వడుగు చేయఁబడలేదు. అద్వైతులును, సాంఖ్యులును, జైనులును, బౌద్ధులును, నేశ్రుతిస్మృతులతోడ, యుక్తివాదములతోడఁ దమ

మతములకుఁ బ్రాబల్యము సంఘటింపవారకపోనిచో యుగంధరమే సోమ నాథుని కరగ్రహణ మొనర్చి స్వప్రకృతి గాత్రగమనములతో వివక్తమైనవన్ని మతమార్గములను జక్క దిద్దుకొని యుభయమతములకు నైకమత్యమునుం జేసినది. బాగుగా నాలుగుభాషలలోఁ బాండిత్యము గలదిట్టి. [illegible] కవంటి సంస్కృతవాణిని నాటవెలఁదిం జేసి యాడించిన కీర్తి గడించి యాంధ్ర భాషలం గబ్బములు రచించి ప్రాచీనమతముల వివేకించి కలిపించి యేకమైన నిరాటంకఘంటాపథప్రవర్తకుఁడు, గుర్వాజ్ఞఁ జెల్లించుకొనినవాఁడు సాత్త్వికుఁడు సోమనాథుఁడు.

---

# "ప్రశంస."

— విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు —

---

సీ. శ్రీజయంతికులాబ్ధిశీతభానుఁడు రామ
యార్యుండు జనకుండై యలరుచుండఁ
బీఠికాపురమహీభృన్మౌళి సూర్యరా
ట్ప్రభువు పోషకుఁడయి ప్రబలుచుండ
రాజాధిరాజ విక్రమదేవవర్మభూ
నేత యధ్యక్షుఁడై నెగడుచుండ
సంస్కృతాంధ్రజ్ఞాన సంపూర్ణులైన
విద్వాంసులు సభ్యులై తనరుచుండఁ
బంచవింశతివత్సరప్రాయమంద
మందగతి రాజతోత్సవానందలీల
ననుభవించితి సాటి నీ కవనిఁ గలదె
యాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి !

ఉ. నన్నయభట్టు తిక్కకవినాయకుఁ డెఱ్ఱన నీకుఁ దండ్రులై
మన్ననఁ జేసినారు, నిను మానిని ! నాచనసోమనాథపో

తన్నలు పెంచినారు, బహుధా భవదీయవిలాససంపద
భ్యున్నతిఁ గృష్ణరాయఁడు ప్రభుప్రవరుం డొడఁగూర్చినాఁడు పె
ద్దన్నయు ముక్కుతిమ్మన సుధామధురోక్తుల నేర్చినారు త్యా
గన్న కృతుల్ రచించిన మహాత్ముఁడు గానము చెప్పినాఁడు సూ
రన్న కథాచమత్కృతుల కాకరముం బొనరించి శ్లేషసం
పన్న నొనర్చినాఁడు బహుభంగములం బడి, చేమకూర వెం
కన్న మఱెవ్వరుం బడయఁగాని పథంబునఁ ద్రిప్పినాఁడు, వీ
రన్న మదీయరాజ్ఞి యని యాదరణం బొనరించినాఁడు, తి
క్కన్న వచించినాఁడు తగ భాణపథంబును, కూచిమంచి తి
మ్మన్నయుఁ బొన్నిగంటి తెలఁగన్నయు నచ్చతెనుంగుదానిఁగా
ని న్నొనరించినారలు గణింపఁగ నెల్లరు, నాంధ్రసాహితీ
సన్నుతగాత్రి! నీకుఁ దగుసాటి జగంబుననొకఁ గల్గునే ?.

ఉ. ఇంక నవీనసత్కవు లనేకులు చిన్నయసూరిముఖ్యు లే
వంక భవద్యశఃకుసుమవల్లరిఁ బ్రోది యొనర్చిరో నిరా
తంకముగాఁ ద్వదీయసవిధంబున విన్నిద నాంధ్రసాహితీ
పంకజనేత్ర! యొక్కపరి భావనసేయుము దాని నెమ్మదిన్.

సీ. నన్నయవ్యాకరణంబు నథర్వణ
కారికావళి మున్నుగాఁగఁ గలుగు
వ్యాకరణంబులు ప్రామాణికకవిప్ర
యోగంబులును జూచి యుక్తరీతిఁ
దెలుఁగువ్యాకరణంబు తీర్చిదిద్దినవాఁడు
గద్యకావ్యంబుల కాద్యగురుఁడు
చిన్నయసూరి నీచెలువంబునకుఁ గొంత
క్రొత్తందనంబును గూర్చినాఁడు
కడచన్న యాంధ్రసత్కవిజీవితచరిత్ర
సేకరించినవాఁడు స్వీయచరిత

రచనకాంధ్రమున మార్గము చూపినయతండు
ప్రహసననిర్మాణపటుమనీషుఁ
డివి యవి యననేల యెల్లమార్గంబుల
శోధించినట్టి విశుద్ధబుద్ధి
వీరేశలింగకవిబ్రహ్మ నిన్నెల్ల
తెలుంగుల వృద్ధికిఁ దెచ్చినాఁడు
కనఁజేసినాఁడు లక్ష్మణరాయఁ డొకకొంత
విజ్ఞానసర్వస్వవిమలకీర్తి
యభినవకృష్ణరాయాస్థానికి ననర్ఘ
రత్నభూషణములు రామకృష్ణ
కవులు నిన్నుఁ బ్రసాదకలితఁగా నొనరింప
భావించి కవితఁ జేపట్టినారు
బ్రహ్మఁ దిమ్మినిఁ దిమ్మి బ్రహ్మనిఁగా సమ
ర్థించి యొప్పించెడి ధీయుతుండు
హాస్యరసాంబుధి నాచమించినప్రోడ
నాటకగ్రంథసంధానచణుఁడు
లక్ష్మీనృసింహరాయక్ష్మాసురాగ్రణి
నీమ్రోల సాక్షియై నిలిచినాఁడు
నూటికెక్కువ గాఁగ ధాటిమై గ్రంథముల్
రచియించినట్టి ధీరప్రశస్తి
యొకచేతిమీఁదఁ బాయక భారతంబెల్ల
నాంధ్రీకరించినయట్టిదిట్ట
శ్రీపాద కృష్ణమూర్తిబుధుండు నీచేత
నితిహాసరచనఁ జేయించినాఁడు
తిరుపతి వెంకటేశ్వరసుధీవరు లవ
ధానాశుకవితాప్రధానగురువు

లాంధ్రదేశమ్మునం దఖిలస్థలంబుల
నీరాజనం బిచ్చినాయ నీకు
వారిమార్గమునందె వర్తించిన మహాత్ముఁ
డస్మదగ్రజుఁడు చిదంబరకవి
యాసేతుశీతనగావనీనాయకు
లిచ్చినకాన్క లందిచ్చినాఁడు
హరికథాసృష్టికి నరవిందగర్భుండు
సంగీతకవితావిశారదుండు
నారాయణుఁడు నీకు నట్టువై నృత్యంబు
గఱపి ప్రశస్తిని గాంచినాఁడు
పూర్వరాజులు నిన్నుఁ బోషించిన చరిత్ర
శాసనంబులు విప్పిచదువుదంట
రామమూర్త్యుఁడు సూర్యరాయమహీపాలు
నాదరణాతిశయంబువలనఁ
బండితమండలీపరివృతుండు నిఘంటు
తారహారము నీకుఁ దగినదానిఁ
గూర్చుచున్నాఁడు తొలిపేట కొని ధరింపు
మచిరకాలంబుననె తక్కినట్టిపేట
లును ధరించెద-నీమాలికను ధరింపు
మాంధ్రసాహితీపుండరీకాయతాక్షి !

# —చిత్రపటప్రశంస—

—వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు—

---

క. శ్రీమజ్జయంతివంశమ
హాముక్తామణిని రామసూర్యుని సతతం
బోచును ముక్తీశ్వరుఁడు ని
రామయపురుషాయుషాభ్యుదయము లొసఁగు మ౯.

సీ. ఆంగ్లభాషాదేవి యనుకంప నాదిని
బట్టభద్రుం డయిపరఁగుసుకృతి
గీర్వాణభారతీకీలకంబుల శ్రద్ధ
నామూల మెఱిఁగినయట్టిప్రౌఢ
యాంధ్రసరస్వతి యంఘ్రు లారాధించి
మాతౄణ మీఁగిన మహితమూర్తి
కర్ణాటశారదాకరుణామృతము సైత
మాని గజ్జనిత్రేచ్చినట్టిదిట్ట
బహుశిలాతామ్రశాసనప్రకటనక్ర
మప్రవీణుఁడు నిరుపమానప్రభావుఁ
డాంధ్రసాహిత్యపరిషల్లతాంగిఁ గన్న
యతఁడు గాఁడె జయంతి రామార్యుఁ డనిన.

సీ. కవియాటఁ గవినన్న నెవఁడైన వానిలోఁ
తరసి కావ్యాలొసంగ కనుపలేఁడు
శాస్త్రజ్ఞుఁడ నటంచుఁ జనుదెంచు నెవ్వాని
ననువొందఁ బూజింప కనుపలేఁడు
వరుస వేదజ్ఞులు వచ్చుచో నెవని వ
ర్షాశనమ్ము లొసంగ కనుపలేఁడు
ఇతరవిద్యల నెవ్వయేని నేర్చినవారి
నాదరింపక యొన్నఁ డనుపలేఁడు

ప్రాభవమ్ము విద్యావైభవమ్ము గల్గి
యిట్లు విద్యార్థికులఁ బ్రోత్సహించునట్టి
మాన్యచరితుం డెవండు రామయ్యపంతు
లొక్కఁడే కాక యెన్నాళ్ళు లెక్కయిడిన.

శా. ఆచంద్రార్కము నిల్చు చందమున సూర్యారాయభూపాహ్వయ
శ్రీచిహ్నంబు నిఘంటుశేఖరము వాసిన్ గూర్చి యాంధ్రావనిన్
వాచాగోచరరీతి శారదకు సంధానించె సామ్రాజ్యము
ర్వీచక్రం బరుదంద రామయబుధాగ్రీయుండు సామాన్యుఁడే.

ఉ. కంటను వత్తివెట్టుకొని గారవమొప్పఁ దెలుంగుబాసవా
ల్గంటికి నీవు గూర్చినవికాసములన్ స్మరియించి యాంధ్రు లిం
టింటను నీదుచిత్రపట మేడ్తెఱ నిల్పి యఖండభక్తి, దో
యింటి నొసంటఁ జేర్చి భజియించిన నీఋణ మీఁగనేర్తురే.

శా. ఎందాఁకన్ విలసిల్లు నాంధ్రమహియందే కాకృతిన్ శారదా
నందక్రీడలు సజ్జనుల్ వొగడ; నందాఁకన్ విపశ్చిన్మనో
బృందంబందు భవత్తనూవిలసచ్ఛ్రీ చిత్రితాకారమై
యుందంబొందు నటంచు నీపటము రామయ్యార్య! చాటెంజుమీ.

గీ. సర్వసంపత్సమృద్ధి యశఃప్రసార
మొనయు నీకది యిట్టిది యిట్టటంచుఁ
గోరఁ బరమేశ్వరుని, గాని గోరువాఁడ
నొక్కటే నీకుఁ జిరతరాయుష్యమీయ.

---

"ఉచ్చైర్గతి" యనుశ్లోకమునకుఁ దెనిఁగింపు.

గీ. క్షితిని సద్గతి ధర్మంబు చేత నేని
దానికిం బ్రమాణంబు వేదంబు లేని
బ్రాహ్మణులు వానిఁ బ్రకటించువార లేని
వారిఁగాక మన్నమస్కృతు లేరిఁ జెందు.

బోడపాటి శివరామకవి
రాజమహేంద్రము.

# రజతోత్సవపద్యములు.

(1) దివాకర్ల వేంకటావధానిగారు.

ఉ. ఈ రజతోత్సవమ్ము నొనరించుట సత్పరిషద్విలాసవి
స్తారయశోవిభూతుల కజస్రము కారకుఁ డైనవాని వి
ద్యారతు సత్తమోత్తము జయంతికులీనుని రామయార్యు నిం
పారఁగ గౌరవించు టని భావమునం దలపోయుఁ గొప్పదే ?

సీ. ఆంగ్లభాషాపార మరసి యుద్యోగియై
యధికృతిమన్నన లందినాఁడు
ఆంధ్రగీర్వాణమ్ములందు నప్రతిమాన
మైన సంస్కారము నూనినాఁడు
రసవత్ప్రబంధనిర్మాణచాతురిఁ జూపి
కవిలోకవిఖ్యాతిఁ గాంచినాఁడు
స్వార్థమ్ము వీడి భాషాదేవిసేవయే
పరమార్థ మనుతలం పరసినాఁడు
అఖిలసమ్మత మైన విన్యాస మొప్ప
నాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి
యితని సంతతకృషిచేత నింతవఱకు
నరసికొనఁజాలె దైనందినాభివృద్ధి.

ఉ. శ్రేయము గల్గుకార్యములఁ జేయఁగలేరు స్వయమ్ముగాఁగ భూ
నాయకు లెవ్వ రెంత సుగుణప్రియులైనను వారి నెవ్వరో
సాయముగా భవాదృశులు చక్కని శక్తికి దింపుచుందు రో
ధీయుత ! నిన్నుఁ బోలఁగలధీరులు దుర్లభు లీజగమ్మునన్.

మ. కవి విద్వాంసుఁడు కావ్యవేత్త విపులక్ష్మాపాలుఁ డుద్వేలభా
గ్యవిలాసుండు వదాన్యమౌళి వినయవ్యాపారుఁ డుద్యద్యశ
స్తవనీయుండగు విక్రమోర్వీపతి యధ్యక్షత్వముం గాంచు టొ
క్క విశేషంబని నమ్ముమమ్మ ! పరిషత్కల్యాణి ! నిక్కమ్ముగన్.

ఉ. రాజుల చేతి బిడ్డవయి రాణ వహించుచు నుంటఁజేసి వి
భ్రాజదనంతభోగములఁ బొల్పడియుం బ్రతివత్సరంబు నీ
వోజనయిత్రి! యాశ్రితుల నొక్కొకమండల మేఁగి చూచి త
త్పూజలఁ గాంచు నోపికయుఁ బూనికయు న్నుతియింపఁజెల్లదే.

ఉ. అందని మ్రానిపండు లగునట్టి కళానిధులు న్కవీంద్రసం
క్రందను లొక్క చో నలరఁగాఁ దిలకించి తదీయ వాక్సుధా
స్వాదము గ్రోలు భాగ్య మసమంబు భవత్కృపఁజేసి కల్గె నా
నందముతో నొసర్చెదఁ బ్రణామముల న్గయికొమ్ము తల్లిరో!

సీ. పలువిధంబులఁ బోవు భాషాకుమారుల
నేకసగ్గులను గావించు టొకటి
యన్యభాషలయందు నలరు శాస్త్రావళి
నెలమిమై నాంధ్రీకరించు టొకటి
కాలానుగుణముగాఁ గలుగు మార్పుల సైఁచి
యితరదేశ్యముల చోటిచ్చు టొకటి
సహవాసజనితదోషముచేత మనభాష
పాడుగాకుండఁ గాపాడు టొకటి
చేయఁదగ్గపనులు చింతించి నెఱవేర్ప
మాంధ్రమందు లోప మసము గాఁగ
చిరమునుండి వచ్చు గురుయశస్సంపత్తి
నాంధ్రపరిషదంబ! యాఁపు కొనుము.

క. నీవు జనించిన దాదిగ
భావుక మగురీతి నిన్నుఁ బాలించిన సూ
ర్యావనిపాలుఁ డితోఽధిక
జీవనసౌభాగ్యసిద్ధిఁ జెంది సుఖించున్.

చ. జయపుర మేలుచుండిన విశాంపతికి౯ బునరుక్తిగాఁగ నే
జయమని పల్కుటేల? పరిషల్లలితాంగి యుదారుఁడైన భూ
దయితుని యాదరంబునకుఁ దద్దయుఁ బాత్రమవై సుఖింపు మా
శయముల సిద్ధి గాంచుత మజస్రము వాణి దయార్ద్రదృష్టిచే.

(2) తాడిమళ్ల నారాయణమూర్తిగారు, ఎం. ఏ.

గీ. రాజకవియశోధనుఁ బండితరాజసభల
గౌరవించి సన్మానించు ఘనతకెక్కె
నాంధ్రభాషాభివర్ధనుం డల్ల కృష్ణ
దేవరాయలే విక్రమదేవవర్మ.

గీ. అష్టదిశలందు దిగ్విజయంబు గలిగి
నాఁటిసత్కవు లష్టసంఖ్యాకులైన
నేఁటిసత్కవీశ్వరు లసంఖ్యేయులైరి
నాఁటికంటె నేఁడే సద్గుణాధికంబు.

గీ. సంస్కృతాంధ్రభాషల నలసాని పెద్ద
నార్యుఁడు ప్రసిద్ధిఁ జెందె జయంతి రామ
యాఖ్యపండితవర్యుఁడు నాంగ్లభాష
నధికప్రఖ్యాతిఁ గాంచెఁ బ్రజ్ఞానిరూఢి

సీ. శ్రీమహాలక్ష్మి విశేషభాగ్య మొసంగు
　　బ్రహ్మ చిరాయుసంపద ఘటించు
జయము యత్నములందు సర్వేశ్వరుం డిచ్చు
　　భాస్కరుం డారోగ్యభాగ్య మిచ్చు
యంత్రమువోలె దేహము పనిచేయుత
　　మెల్లవిద్యల వాణి కిల్లువలెనె
స్థిరముగఁ గీర్తి సిద్ధించెను రవిచంద్ర
　　తారకముగనె విద్వత్ప్రసక్తి
రామభక్తిని జాటు రామచరిత్రోక్తి
　　యాంధ్రగీర్వాణభాషాభిలాష
మహిపు రానీయను మానమున రాజకీ
　　యోద్యోగమహిమ మత్యుత్సుకతను
యమనియమాదుల నాయురారోగ్యముల్
　　ప్రకటించు దీక్షాప్రవర్తనంబు

పండితసన్మానభావ మీసభ దెల్పు
మహిమంబు జనులసమ్మతమె దెలుపు
త్తునిమె గ్రామ్యవాదమును దుత్తునియలుగ వె
ల్చుంగు నిపుణత ధర్మసత్సంగతులను
గౌరవమునకు నెల్లెడ మేరలేను
రుచిరగుణకీర్తి రామయామాత్యుండు వఱలు.

చ. సరసకవిత్వవైఖరిని శాస్త్రసమన్వితశక్తి సత్కవీ
శ్వరులు రచించుగ్రంథములు శాశ్వతకీర్తియుతంబులై ధరన్
స్థిరపఱుప న్నిఘంటువు రచించి ప్రసిద్ధి వహించుచుండఁగా
నిరువదియైనవత్సరము లీపరిషత్తువయస్సు నేఁటికిన్.

గీ. ఇట్టి సిల్వరుజూబిలీ లెన్న లేని
సార్లు వచ్చుచుండవలె భాషావధూటి
శాస్త్రసమ్మతమౌచు సజ్జనులహృదయ
రంజకమయి వర్ధిల్లు నిరంతరంబు.

---

(3) కొమరవోలు వేంకటసుబ్బరావుగారు బి. ఏ.

శా. రారాపిళ్లకు నోర్చి విత్తజలధారాపూరముల్ సేర్చి మో
కేసుం గడియుఁ గూర్చి సేద్యమును దానేనాఁట నీసీమలోఁ
బ్రారంభించె జయంతి రాముఁడను పూర్ణప్రజ్ఞుఁడౌ రైతు, సూ
ర్యారాయుం డటమీఁద సాకె ఫల మధ్యక్షింపుఁడీ ధీవరుల్.

చ. ఇరువదియైనవత్సరములేఁగెఁ గృషీవలసత్తముండు జ
ర్జరితవయస్కుఁడయ్యె నుపసన్నితమౌచమనస్కులౌచు నె
ల్లరు శుభకాంక్షలం గృషిఫలమ్ముల ప్రాప్తికి వేచియుండఁగా
నురవడితోడఁ గూడె రజతోత్సవవేళలు విస్మయంబుగన్.

సీ. చెదపుర్వునోటిలోఁ జెఱవడ్డవాఙ్మయ
మ్మున కెట్లొ చిరకాల ముక్తిగలిగె

శైథిల్యమునఁ గూలి సమయు పూర్వప్రబం
ధములకు సుస్థిరత్వంబు గలిగె
వ్యవహారభాషామహాఘాటి కోర్చి గ్రాం
థికభాష ప్రౌఢిమఁ దేజినిలిచె
భావకవిత్వాది వాంతిరోగములను
బరిమార్చు నౌషధవల్లి యబ్బె
నే మహాసంస్థదీక్షనోద్దామమహిమ
విపుల కీర్తిప్రసూనముల్ విరియు నట్టి
యాంధ్రసాహిత్యపరిషన్మహాప్రసిద్ధ
సభకు రజతోత్సవము నేఁడు జగతి వినుము.

గీ. భారతీతీర్థపరిషత్సభాప్రయుక్త
సరససాహిత్యసామ్రాట్ప్రశస్తబిరుద
ఘనుఁడు జయపురాధిపుఁడు విక్రమనరేంద్రుఁ
డాసభాధ్యక్షుఁ డట్టె భాగ్యం బదేమొ.

మ. దిననాథప్రతిమానకోవిదుఁడు జ్యోతిశ్శాస్త్రపారంగతుం
డును నా విక్రమభూపు కీర్తిసతి గండూషించె దిఙ్మండలం
బు నన్నద్దానఁ గేమి సత్యమె యగు న్బ్రాశ్యైర్యశో లభ్యతే
యని గాదా వచియించు చుండెదరు సత్యాభిజ్ఞశ్రాధీయుతుల్.

సీ. బహుళభాషాగళగ్రహపాండితీమండి
తప్రజ్ఞ తనకు బాంధవుఁడుగాఁగ
గీతారహస్యనిక్ష్ణితిసితివిధాన
చర్యయే తనకు దర్శకుఁడుగాఁగ
తతవనీపకదరిద్రాణదుఃఖత్రాణ
హస్తమ్మె తనకు వియ్యమ్ముగాఁగ
దశదిశావిశ్రాంత విశదయశఃపూర
పటలంబె తనకు దీపంబుగాఁగ

రాజ్య భోగాలిఁ దేలు నీరాజమూర్తి
యయ్యు నధికారవైయాత్య మభిగణింపఁ
డొల్లఁ డాడంబరము నోర్తి నుజ్జగింపఁ
డహహా ! సామాన్యుఁడే విక్రమాధిపుండు ?

సీ. కవిసార్వభౌమసంగ్రథితకావ్యములకుఁ
గృతిభర్త యిత డన్న నుతికిఁ దెరువు
రసవత్ప్రబంధముల్ రచియించు నితఁడంచు
వచియింతు రది వంది వాక్యసరణి
లక్షలాదిగ విరాళము లిచ్చు నితఁ డంచుఁ
గొనియాడు టది మెచ్చుకోలుమాట
యతులవైభవసముద్ధతుఁ డయ్యు నాడంబ
రవిహీనుఁడనుట కీర్తనకుఁ జొప్పు
పరున కొకనికి నొప్పిన మరసి చూడ
నన్నిగుణములు నీయందు సార్థకములు
ప్రాక్తనాచారనియతవర్తనుఁడ వీవు
కలరె నీవంటి నృపులు విక్రమనరేంద్ర ?

చ. బుధులును సత్కవీంద్రులును భూపతులన్వెలగట్టుచుండ్రు ద
త్తధనకప్రకర్షణవిధానమునన్ హితబృందవందిమా
గధనుతుఁడైన భూభుజు ముఖశ్రుతవాక్యమొకండెకోటి క
త్యధికము సేయు నంచెఱుఁగ కయ్యయొ యెంతటియల్పులో కదే.

సీ. రాజరాజనరేంద్రరత్నరాజికిరీట
దివ్యదీధితులలోఁ దేలివచ్చి
రెడ్డిరాజన్యుల యొడ్డోలగంబున
సరససాహిత్యసౌష్ఠవముఁ బడసి
కృష్ణరాయలదివ్యకీర్తిసుధాశర
చ్చంద్రికాతతుల నైశ్వర్య మొనసి

భరతశాస్త్రప్రౌఢపటిమఁ దెల్పిన రఘునాథ
　　　నరనాథు కడఁ గళాభిరతి నెఱపి
వార్ధకముతోడ ముదిరి చేవను దలిర్చు
నీమరసికత శేముషీవిరతి దాన
శీలసంపత్తులను బరీక్షింపఁగోరి
కడకు నినుఁ జేరె నాంధ్రి విక్రమమహేంద్ర.

సీ. పరిత్యృప్తులనె తృప్తిఁ బఱచె నీతఁడన్నఁ
　　　　బరుల సంగతులఁ జెప్పంగ నేల
యంతర్విరోధుల నణఁచె నీతండన్న
　　　　బాహ్యశత్రులఁగూర్చి పలుక నేల
కవిభూషణులె పడిగాపు లీతని కన్న
　　　　నితరుల చందమ్ము లెంచ నేల
వైరాగ్యశిష్టజీవనవర్తి యితఁడన్న
　　　　నిహపరాభ్యుఖభావ మెన్న నేల
యనుచు జగమెల్లఁ గీర్తింపఁ దనరుచుంటి
జయపురాధీశ శ్రీకృష్ణచంద్రపుత్ర,
జరఠపార్థివమౌని నీసభను నడప
నేఁగుదెంచితె కొమ్ము మా యేటికోళ్లు.

గీ. అనఘ క్రతూత్సవ మనెడు కావ్యము గ్రహించి
నన్ను దయఁజూచినాఁడవు మున్నటుల నె
యందఱకు నీదు కారుణ్య మబ్బునట్టు
లాయురారోగ్యములు నీకు నభవుఁ డిడుత.

# ఆంధ్రవ్యాకరణము.

చర్ల నారాయణశాస్త్రిగారు—పిఠాపురము.

---

సృష్టికిని దన్నియమసూత్రములకును నెట్టి యవినాభావసంబంధ మున్నదో యట్టియవినాభావసంబంధమే వాఙ్మయమునకును వ్యాకరణమునకును గలదు. భాష ప్రవాహరూప మైనది. వఱదలు వచ్చి ప్రవాహము గట్లుదాఁటి పోవునపుడు దానిని నియమించుట కవసర మైనట్లే భాషకూడఁ బామరవ్యవహృతమై నిరంకుశముగా వ్యవహరింపఁబడినపుడు దానికిఁ గూడ నియమ మావశ్యక మగుచున్నది. కాని కాలక్రమమున మొదటఁ జేయఁబడిన నియమములు పండితవ్యవహారమున సడలింపఁబడుట సంప్రదాయ మైనది. అట్లు కాలక్రమమున నియమములు సడలింపఁబడి దేశకాలపాత్రములఁబట్టి మార్పు చెందుట యవసరము కూడ నైనది. కనుకనే సంస్కృతభాషలోఁ బాణిని, వరరుచి, పతంజలులు, ఒకరి తరువాత నొకరు వారివారికాలములందుఁ బ్రసిద్ధములైన రూపములను వార్తికములచేతను, ఇష్టులచేతను సాధించుచు మిగిలినవానిని గణములయందును సార్థక్యకల్పనములయందు సంతర్భవింపఁజేయుచు వచ్చిరి. తరువాతిమహాకవుల ప్రయోగములు కొన్నిటికింకను సాధుకల్పన మేర్పడనేలేదు. ఇతరభాషలయందుఁ గూడ దేశకాలాదులనుబట్టి వ్యాకరణములు మాఱుచు వచ్చిన వనుసంగతి మనీషులకుఁ దెలియనిది కాదు. ఒక్క వ్యాకరణములలో మాత్రమే కాదు. ఆచారవ్యవహారములలోఁ గూడ మార్పు గలుగుచున్నది. పూర్వాచారములగు దేవరన్యాయము, సహగమనము, నిప్పుడు లేవు. కనుక జీవద్వాఙ్మయములలోని వ్యాకరణములకు మార్పు తప్పదు. అదిగాక జీవద్భాషల వ్యాకరణములకు సంపూర్ణత కూడ నుండుట యసంభవము. ఎప్పటికప్పుడు వైయాకరణులు మహాకవిప్రయోగములను బట్టి వారివారికాలములలో మార్పు గావించుకొనవలసి యున్నది. దీనినే "సిద్ధిర్లోకా ద్దృశ్యా" ప్రయో

గమూలం వ్యాకరణం,అనుసూత్రములు స్పష్టపఱచుచున్నవి. ఇట్టిమార్పులు కాలక్రమమున నెట్లు వచ్చినవో ముందు చూపెదను.

ప్రస్తుతము మనవ్యాకరణములలోఁ బరస్పర మిట్టిభిన్నాభిప్రాయములు సంభవించినవో ముందు తెలిసికొనవలసి యున్నది.

ఆంధ్రశబ్దచింతామణి:—ఆంధ్రవాఙ్మయ మాంధ్రమహాభారతములోఁ బ్రారంభ మైనది. నన్నెచోడుని కుమారసంభవము భారతమునకుఁ బూర్వమే రచింపఁబడె ననువాదము లేకపోలేదు. కాని యీవిషయ మిపు డప్రస్తుత మగుటచే దానిసంగతి వదలిపెట్టెదను. ఆంధ్రవ్యాకరణములలో "ఆంధ్రశబ్దచింతామణి" యొకటి దనుసంగతి నిర్వివాదము. నన్నపార్యుఁడు తనభారతములోఁ దా నవలంబించిన కొన్నిసామాన్యనియమముల, నాకాలపుసంప్రదాయముల నందుఁ దెలిపియున్నాఁడు. ఈయాంధ్రశబ్దచింతామణి రచనమువలననే యితనికి వాగనుశాసనుఁడను బిరుదము వచ్చినట్లు పండితులకు విశదమే.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయరచితము కాదను శ్రీవీరేశలింగము పంతులుగారివాదము సరియైనది కాదని యిదివఱకే నిశ్చయింపఁబడినది. కేతన తనయాంధ్రభాషాభూషణములో "మున్ను దెనుఁగునకు లక్షణ మెవ్వఁడు నెవ్వరును జెప్పరేఁ జెప్పెద" నని చెప్పికొనియున్నాఁడు. కాని యితనికాలమున నాంధ్రశబ్దచింతామణి కంతప్రచారము లేకపోవుటచేఁ గేతన యట్లు వ్రాసియుండును.

చింతామణివ్యాఖ్యలు:—ఆంధ్రశబ్దచింతామణిని బ్రచారములోనికిఁ దీసికొనివచ్చినవాఁడు- ఎలకూచి బాలసరస్వతి. బాలసరస్వతి చింతామణికి భాష్యము వ్రాసియున్నాఁడు. అది బాలసరస్వతీయ మను పేరితో నున్నది. మొన్ననే యీ యాంధ్రసాహిత్యపరిషత్తువారు దానిని బ్రకటించిరి. ఈచింతామణికే అప్పకవి సోదాహరణముగా నొక విపులవ్యాఖ్య వ్రాయఁ దలఁచెను. కాని కొలఁదిభాగమునకే వ్యాఖ్య వ్రాయఁగలిగెను. మొత్తముమీఁద నది ఛందోవిషయకముగానే యెక్కువగానుండుటచే దానికి ఛందోగ్రంథముగా వ్యవహారము గలిగినది.

అతనిపుస్తకమునకు బాలసరస్వతిగ్రంథమునకుఁ బాఠభేదము లనేకము లు గనుపట్టుచున్నవి. వానియుక్తాయుక్తతలను నేను వ్రాసిన బాల సరస్వతీయపీఠికలో వివరించియుంటిని. బాలసరస్వతీయమునుపిదపఁ జెప్ప దగినది యహోబలపండితీయము. బాలసరస్వతి వ్రాసినటీక సంగ్రహ ముగా నున్నది. అది చాలవఱకు నిర్దుష్టముగా నున్నది. తనటీకలో బా లసరస్వతి నన్నయసంప్రదాయములను జక్కఁగా సరిగాఁ దెలిపియున్నాఁ డు. ఈబాలసరస్వతిపాఠము నతనిటీకను, ఆధారముగఁ జేసికొని యహో బలపండితుఁడు చింతామణికి విపుల మగు వ్యాఖ్యానము వ్రాసెను.

అహోబలపండితుఁడు చింతామణివ్యాఖ్యలోఁ దచ్ఛేషపూరక మగు ఆథర్వణునివికృతివివేకమును జేరిచి రెండిటికిని సమన్వయము చేసె ను. అథర్వణునికారికల కితఁడు వ్రాసినటీక చాల ముఖ్యమైనది. ఇతఁడు వ్రాయఁగా మిగిలినకారికలలోఁ గొన్నింటి కిప్పటికిని సరియైనయర్థము లభించుట లేదు.

కవిజనాంజన మనువ్యాఖ్యకూడఁ జింతామణికిఁ గలదు. ఇందు లో నహోబలపండితీయములోని యుదాహరణములే తఱచు కన్పట్టు చున్నవి. ఇందులో నంతయెక్కువ విశేష మేమియునుఁ గానరాదు. కాని యహోబలపండితీయములో లేని కొన్నియథర్వణకారిక లిందుఁ గలవు.

—: నన్నయకాలమునఁ గలసంప్రదాయములు :—

నన్నయకాలమునకు దేశభాషాకావ్యములం దాసక్తి గలిగినట్లు "స్వస్థానవేష భాషాభిమతాః" అను చింతామణిశ్లోకము విశదపఱచుచు న్నది. శబ్దానుశాసనుఁడు రససిద్ధికే ప్రాధాన్యము నిచ్చియున్నాఁడు.

గ్రామ్యము.

నన్నయ, పదసిద్ధి లోకమువలనఁ దెలియనగు ననియు లోక మన న్యాదృశము నిత్యము ననియుఁ జెప్పి నియమావశ్యకతను గూర్చి ప్రసం గించెను. "అనియమా ద్గ్రామ్యం హి య త్త్వపభ్రంశః" అను సూక్తి వలన నన్నయకాలముననే కటిగల్లాద్యర్థవిషయక మగుగ్రామ్యపదము నియమరహిత మెనపదముల విషయమున నుపయోగింపఁబడిన దని

తెలియుచున్నది. నియమరహితముగా వాడఁబడిన పదము గ్రామ్య మనునన్నయభట్టారకుని యుద్దేశము తరువాతివైయాకరణులలో "లక్ష ణావిరుద్ధం బగుభాష గ్రామ్యంబు" అను నభిప్రాయములోనికి మాఱినది. దీనినిబట్టి ప్రాచీనలక్ష్యసంప్రదాయవియమవిరుద్ధ మగుభాష గ్రామ్యమ నుశబ్దానుశాసనాశయము విభిన్నమై పోయినది.

వర్ణోచ్చారణము.

వాగనుశాసనుఁడు వర్ణోచ్చారణవిషయమున నప్పటివారికను గొంత విశదపఱచి యున్నాఁడు. ఇప్పటివపినవైయాకరణులు సంధిలేని చోట యడాగమమును విధించియున్నారు. కాని నన్నయమాత్ర మట్లు చెప్పియుండలేదు. "అచ్చుపై నున్న యచ్చు యశ్రుతిఁ బొందు నదియు నది లఘు" వనియు నతనికాలపువాఁడుక తెలిపియున్నాఁడు. అథర్వణుని నాఁటికే యాయభిప్రాయము మాఱినట్లు "ప్రాణా త్ప్రాణో లఘు ర్య స్స్యాత్ సహాల్స్యాచ్చ భవేత్ క్వచిత్" అను నతనికారిక స్పష్టపఱచు చున్నది. దీనినిబట్టియే చిన్నయసూరిప్రభృతులు "సంధిలేనిచోట స్వరం బుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమం బగు" నని సూత్రించి "హరియతఁడు- ఇత్యాదులం దాగమయకారము లఘువు- తక్కినయకార మలఘువు" అని వివరించినారు. కనుకనే నేఁడట్టిపూర్వసంప్రదాయము తెలియకుండనే పోయినది.

నన్నయభట్టు వర్ణోచ్చారణమున సందిగ్ధస్థలములను గొన్నిటిని జూపి యచ్చట భ్రాంతిని నివారింపఁజేయుచు నెచ్చట నెట్లుచ్చరింపఁ దగునో తెలిపియున్నాఁడు. భూతార్థక పదములందును శబ్దాదియందును దక్కఁ దక్కినచోట్ల నున్న యకారము అత్వముతో నుండు ననియుఁ బై వానియందలి యకారములు మాత్రము ఎత్వయుతము లనియుఁ జెప్పి యున్నాఁడు. ఇట్లే దంత్యతాలవ్యచజలవిషయమునను సందేహనివార ణార్థము చెప్పియున్నాఁడు. ఇచ్చట నథర్వణుఁడు-

"భావిక్రియాసు యస్య స్యా దేత్వ మేవ క్రమాగతః
డుఞ్యాదివర్ణే భూతార్థే చాపి తద్వద్భవే త్సతా
ఛోలాభూషో త్తరీయాణి విన్యైత్వం నాస్తిమధ్యయః"

అని మొత్త మెచ్చుపెచ్చుట నుండునో పరిగణనము చేసి చెప్పి యున్నాఁడు. దీనిని జూచి బాలవ్యాకరణకర్త "ఊమేల వయ్యెద తాఱెతులం ద్రిక్క నామంబులందు యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు." అని చెప్పెను. ఆంధ్రకౌముదిలోఁ గూడ నీమార్గమే ప్రోక్తఁ బడినది. దంత్యతాలవ్యచజలవిషయమునఁ గూడ నథర్వణుఁడు చేసిన పరిగణనమును జిన్నయసూరి యనుసరించినాఁడు. ఇందు నన్నయ చూపినసంప్రదాయము సంగతి వేఱు, అథర్వణాదులు చూపినసంగతి వేఱు నగుచున్నది. నన్నయభట్టాదియందు యశ్రుతి నంగీకరించియున్నను శ్రుతిసంగతి తలపెట్టక "ఆద్యవర్ణాస్తు హ త్వేన గృహ్యాన్తే న కదాపి చ" అని యాదియందు యకార ముండనేయుండ దని యథర్వణాచార్యులు చెప్పెను.

ద్రుతాంతములు:—ద్రుతమువిషయములో ననేకములగునభిప్రాయములు కలవు. మొదట వాగనుశాసనుఁడు "ద్రుతాఖ్యో నః" అని సామాన్యముగాఁ జెప్పియున్నాఁడు. అథర్వణుఁ డా ద్రుతస్వరూపమును వివరించి యెచ్చోటను జెప్పియుండలేదు. కాని ద్రుతకార్యములను స్వత్వబిందుసంశ్లేషములుగాఁ దెలిపియున్నాఁడు. తట్టీకాకారు లగుబాలసరస్వత్యహోబలపండితులు స్వత్వాదిద్రుతకార్యములనే కాని ద్రుతము ప్రత్యయాగమావ్యయాత్మక మని కాని ప్రకృతిస్థనకారము ద్రుత మని కాని చెప్పలేదు. చిన్నయసూరికూడ ద్రుతవిషయము నెత్తుకొనలేదు, కాని, ద్రుతకార్యముగా "కను + దోయి" కందోయి, అనునుదాహరణ మిచ్చుటచేఁ బ్రకృతిస్థ నకారముగూడ ద్రుతముగా నతఁ డంగీకరించినట్లు తెలియుచున్నది. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు మాత్రము "నకారం బసాధారణంబు ద్రుతంబు" అని సూత్రించి "ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమైన నకారంబు ద్రుతసంజ్ఞకం" బని వివరించి ప్రకృత్యవయవనకారంబు ద్రుతముకా దనునభిప్రాయము వెల్లడించియుండిరి. కాని "కందోయి, పెన్జీకఁటి, వెంబడి, ఎందెడెందము, రామునే సీతనేనిఁ గొలిచెద" ఇత్యాదులఁబట్టి సీతారామాచార్యులుగారి

నిర్వచనము సంకుచిత మయ్యె నని చెప్పవలసివచ్చుచున్నది. కనుకనే ప్రథమాచార్యుఁడు "ద్రుతాత్స్యోనః" అని సామాన్యముగా సూత్రించియున్నాఁడు.

తద్ధర్మసంధి:—తద్ధర్మక్రియలకును దద్విశేషణములకును సంధి రాకుండుటకై "న స్యాత్ తద్ధర్మోక్తః" అని నన్నయభట్టు సూత్రించియుండెను. ఇక్కడ నొకసందేహము గలుగుచున్నది. వాగనుశాసనుఁడు తద్ధర్మములను ద్రుతాంతములుగా గ్రహించియుండెనా లేక కళలుగా గ్రహించియుండెనా? అని- ఇతఁడు కళాపరిగణనములోఁ దిజ్ఞర్థ్యములను మాత్రమే, అనఁగాఁ, గ్రియలలో రమాంతక్రియలను మాత్రమే కళలుఁగాఁ జెప్పెను. ఇందువలనఁ దద్భిన్నము లగుతద్ధర్మక్రియలు ద్రుతాంతములని చెప్పవలయును. తద్ధర్మక్రియలతోఁ పాటు తద్ధర్మవిశేషణములను గ్రహింపవలయును. ఇక్కడ "వచ్చున్ + ఇతఁడు" ఇత్యాదులలో ద్రుతవ్యవధానముచే సంధియే వచ్చుటలేదు. కాని తద్ధర్మసంధినిషేధమువలననే ద్రుతవ్యవధాన మున్నను సంధిరావచ్చు నని నన్నయ యాశయముగాఁ దెలిసికొనవలసియున్నది. కనుకనే "అనాదిషు విభక్తి ష్వాతో వా" అను విధి సార్థక మగుచున్నది. నన్నయయొక్క యభిప్రాయమునే-

'అచాం సంధా ద్రుతోఽదృశ్య స్థితిస్త్వపిచ భవేత్సదా'

అను నథర్వణకారిక వివరించుచున్నది. తద్ధర్మక్రియలు తద్విశేషణములు ద్రుతాంతము లనునన్నయాభిప్రాయమునే యథర్వణాచార్యుఁడు

"ప్రథమ శ్చోత్తమ శ్చైవ తాసు తద్ధర్మసంజ్ఞికౌ,
భూతాద్యవిషయా, తత్ర చైక త్వార్థాభిధాయకౌ,
ఉదంతౌ చ సదా నాంతౌ నసంధి స్తత్రకల్ప్యతే."

అని స్పష్టముగాఁ జెప్పినాఁడు. ఆధునికుఁ డగుచిన్నయసూరి మాత్రము తద్ధర్మవిశేషణములను గళలుగానే యంగీకరించి వానికి నుగాగమమును విధించియున్నాఁడు. ప్రక్రియానిరూపణములో నిందు దోషము లేకున్నను సంప్రదాయము భేదించినది. లేక చిన్నయసూరి 'న స్యాత్తద్ధర్మోక్తః' అనుసూత్రమునకు 'తద్ధర్మోక్త్వమునకు నకారము వచ్చును'

అనునర్థ మని భ్రాంతిపడె నేమో యని మనము సందేహింపవలసి వచ్చు చున్నది. చిన్నయసూరి ఆంధ్రశబ్దానుశాసనములోఁ గూడ నుగాగమ విధియే కన్పట్టుచున్నది. 'నస్యా త్తద్ధర్మో తః' అను దానిలో బాలసరస్వత్యా హ్వాబాలపండితులు 'న' అను దానిని నిషేధార్థకముగనే వచించియుం డిరి. అథర్వణాచార్యుఁడు 'న సన్ధి స్తత్రకల్ప్య తే' అని స్పష్టముగా సంధ్య భావమునే చెప్పియున్నాఁడు. ఇందర్థము చేసికొనుటలోఁ జిన్నయసూరి ప్రమాదపడె నేమో యనవలసివచ్చుచున్నది. అతఁడు 'న స్యాక్ తద్ధర్మో తః' అనుచోట రెండుసకారము లున్న వని యనుకొనెనేమో- బాలసర స్వత్యాదులటీక గాని, యథర్వణుని వచనముగాని యితఁడు చూడలేదా? లేక చూచినను మఱచియుండెనా ? అనుసందేహము గలుగుచున్నది.

డుప్రత్యయాది విధానము:- నన్నయభట్టారకుఁడు మొదటినుం డియు సంస్కృతవ్యాకరణపద్ధతినే తనవ్యాకరణమును రచించియున్నాఁ డనుసంగతి యందఱకును దెలిసినదే. అతఁడు సామాన్యముగ సంస్కృ తవిభక్తిప్రత్యయములే తెలుఁగుప్రాతిపదికములకం బెు నగునను నభిప్రా యముతో 'సు ఔ జస్' ఇత్యాదిసంస్కృతప్రత్యయములకు డుప్రభృతి ప్రత్యయముల నాదేశముగాఁ జెప్పియున్నాఁడు కాని యాధునికు లగు చిన్నయసూరి మొదలగువా రట్లు విధింపక మొదటనే మహదాదులకు డ్వాదిప్రత్యయములను విధించి యున్నారు. ఆధునికులరచనలోఁ గొన్ని చోట్ల దోషము సంభవింపక తప్పినది కాదు. చిన్నయసూరి "స్త్రీలింగం బులప్రథమైకవచనంబునకు లోపం బగు" ననియు ను "ప్రథమైకవచనంబు నకు లోపం బగు" ననియును ప్రథమైకవచనంబునకు లోపము చెప్పి యున్నాఁడు. కాని 'డు, 'ము' ప్రభృతివర్ణకంబులు మహదర్థకములకం బెును, అమహన్నపుంసకలింగములకింబెును విశేషముగా విధించి యుం డుటచే ఇకారాంతములకంబెును, స్త్రీలింగములకంబెును, ప్రథమైకవచన ప్రత్యయములు లేవు. స్థాని యున్నఁ గదా లోపాదేశము విధించుటకు. వాగనుశాసనుల రచనములో సామాన్యముగా విభక్తులు విధింపఁబడు టచే వానికి లోపాదివిధానము సమంజసమే యగుచున్నది.

ఇట్టి వింక నాధునికుల రచనములలోఁ గన్పించుచున్నవి. విస్తర భీతిచే సామాన్యము లగువిషయములను గొన్నిటి మాత్రమే చూపియుంటిని. కాలక్రమమున మనవ్యాకరణములలోఁ గలిగిన మూఁడునాలుగు సామాన్యమగు మార్పులు చూపెదను.

వాగనుశాసనులు ద్రుతప్రకృతికముల కచ్చుపరమగునపుడు లుక్సంశ్లేషములు రా వని "ద్రుతప్రకృతికేభ్యో లుక్సంశ్లేషౌ నాచి" అను సూత్రముచే నిషేధించియున్నారు. 'అన్నిష్టసఖి నూఁదియున్నదాని' భార. ఆది. ౩. ఆ. అనుప్రయోగము ద్రుతసంశ్లేషరూప మని చెప్పరాదు. 'అను' అనుక్రియాజవిశేషణములోనిలుప్తశేషముగుప్రకృత్యవయవనకారము ద్రుతముకాదు. ద్రుతమైనచో 'గిరివ్రజమున్పురంబు' ఇత్యాదుల 'గిరివ్రజ మన్పురంబు' అని రూపభేదము గలుగవలసివచ్చును. "అన్నిష్టసఖి" పెను + ఉద్ది = పెన్నుద్ది, పెన్నూఁత, అన్నుర్వీశుఁడు, మొదలగురూపములవంటివి నకారద్విత్వము వచ్చినరూపములు" మదీయభాషిత మెన్నఁడు, న్నేని మోఘము గాదు దిగ్ధరణీశవించు తెలుఁగఁగాన్. భార. ఆది. ౭-౧౮౧ అనుచో ఏనిరూపాంతర మగు "నేని" అనునది గాని "ఏని" అని కాదు. కాన నిదిగూడ ద్రుతసంశ్లేషరూపము గాదు. నీవును జూచి తట్టిసభ నేని వినంబడ దేయుగంబులన్. భార. సభా. ౨. ౬౫. అను నన్నయార్యునిప్రయోగము "నేని" అనురూపాంతరములోఁ బ్రమాణ మగుచున్నది. 'నేని' యనుటకు నన్నయేతరకవి ప్రమాణములు కూడ నున్నవి. చందనంబు తడియాఱను నేనియు నంగజన్మ- కు. సం. ౫౫౧. ఆదిగర్భేశ్వరి నంటినఁ గందెను నెలకన్నెఱుఁగవు నేని...కు. సం. ౬. ౬౭౦ అని. ఇట్లునన్నయకాలమున ద్రుతసంశ్లేషము సమ్మతము గాలేదు. ద్రుతసంశ్లేషమథర్వణునికాలమునను దరువాతను వాడఁబడి సాధు వయినది. అథర్వణుఁడు "నో వా ద్విత్వం క్వచి ద్దృష్టం పరప్రాణేవ సంగతేః" అని దానికి సాధుత్వము తెలిపియున్నాఁడు. 'ఘనచక్రాయుధనిష్ఠురక్షతగళద్రక్తాస్యసర్వాంగుని, న్నను భూతాప్రతిమప్రగల్భ పరివాదాంతర్హితోద్వక్రముగ్. ఉ. హరి. 'షడంతులమీఁద నేయ రతిపయ్యెదకు న్ననుపైనచే

ము పండితులు నిర్ధారణ చేయవలసి యున్నది. వ్యాకరణమునందు మా
ర్పులుగూడఁ జేయవచ్చును గదా! అట్టిదాని కిట్టిపరిషత్తువారు పూను
కొన్నచో బాగుండెడిది.

### ఉపసంహారము.

ఇట్లు వ్యాకరణములు భిన్నసంప్రదాయములు గలిగి పూర్వాధు
నికవైయాకరణులచేఁ గృతములు వేఱువేఱుగ నైపోయినవి. వాని నన్నిటి
నేకముఖమునకుఁ దీసికొనిరావలయును. అన్నిటిని బరిశీలించి యొక్క
వ్యాకరణము తిరిగి రచింపఁబడవలయును. ప్రసంగవశమున నిట నొక
మాట చెప్పవలసియున్నది. ఇట్టి యుద్దేశముతోనే నేను నన్నయాథర్వ
ణులగ్రంథముల నాంధ్రీకరించితిని. ఇఁకను వివరముగా వ్యాకరణము
లన్నియు శోధించి క్రొత్తవిషయములు చేర్చి విపులముగా వ్యాఖ్య
వ్రాయవలయు నని సంకల్పించియుంటిని కాని "శ్రీసూర్యరాయాంధ్ర
నిఘంటువు" పనిచే దానిసంగతి మానవలసివచ్చినది. కాని, యది నా
పుత్రుఁడు చిరంజీవి గణపతిశాస్త్రి యుత్సాహపడి మిగులశ్రమపడి దా
నికి వ్యాఖ్య విపులముగా వ్రాసియున్నాఁడు. దానిలోఁ బూర్వోక్తము
లగు వైరుధ్యములు తొలఁగింపఁబడి నన్నయాథర్వణానుక్తము లగుననే
కము లగువిషయములు చేర్పఁబడియున్నవి. అది చాలవఱకు సమగ్రము
గా నున్న దని నాయభిప్రాయము. దానిపేరు "నన్నయాథర్వణకారికా
వళి" అని పెట్టఁబడినది. అన్ని సంప్రదాయములను సమగ్రముగఁ దెలు
పుచు సర్వవిషయములను వివరించుచు వ్రాయుటకు నీపరిషత్తునకే శక్తి
కలదు. కాని మావాఁడు వ్రాసినది సర్వవిధముల సమగ్రముగా నున్న
దని చెప్పవలసియున్నది. అది యొకచేతిమీఁదుగా వచ్చియుండుటచే
నందు నేవేని దోషము లుండవచ్చును. వానిని దెలుపుచు దానియందుఁ
గొంతయభిమానము చూపవలయు నని పండితులను గోరుచున్నాను.

ఈపరిషత్తువారు సర్వగ్రంథపరిశీలనముతో నొకవ్యాకరణమును
రచించిన బాగుండు ననియు నట్టిది త్వరలో రచింతురుగాక యనియుఁ
గోరుచు నింతతో విరమించుచున్నాఁడను.

# సంగీతసాహిత్యసమ్మేళనము.

ఉభయభాషాప్రవీణ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు,
విజయనగరము.

---

నాదబ్రహ్మోపాసనమే నాహృదయంబున నాలాపించెద ।

అ. ఆదిమధ్యాంతరహితంబై ఆధారంబై హృదయగతంబై
మాధవభజనామృతమహితంబై మంగళమయజీవితఫలమైన॥ నా॥

చ. రసకలితంబై పరమసుఖంబై రాగభావమయమై
అసమబ్రహ్మానందసమానంబై నాయజ్ఞానము మఱపించిన॥ నా॥

కవిచమత్కారజనకము లగుభావనలను ప్రతిపాదించుశబ్దార్థముల ద్వారా, రసోపాసకుండై పరబ్రహ్మాస్వాదసదృశ మగునానందమునుగల్గించునట్లు గాయకుండు మనోహరభావప్రతిపాదక మగు నాదోపాసనము ద్వారా పరబ్రహ్మాస్వాదతుల్య మగు నానందము నొదవించుచున్నాడు.

"నకారం ప్రాణనామానం దకార మనలం విదుః, జాతః ప్రాణాగ్నిసంయోగాత్తేన నాదోఽభిధీయతే" అని నాదశబ్దమున కర్థము నిర్వచింపఁబడినది. "ప్రాణానలసంయోగమువల్ల ప్రణవనాదము సప్తస్వరములై పరఁగ" అని "త్యాగరాజు." ఆనాద మోంకార మైనట్లు చెప్పియున్నాఁడు. అది-"ఆహతము అనాహతము" నని ద్వివిధముగాఁ జెప్పఁబడియున్నది. అనాహతనాదముచే ఋషులు పరబ్రహ్మోపాసనముఁ గావించుచున్నారు. ఆహతనాదమును గాయకు లుపాసించుచున్నారు. దీని వలనఁ బ్రజారంజనము గల్గుచున్నది, తన్మూలమున లోకోపకారసంపాదనము గాయకులకే సాధ్య మగుచున్నది.

శబ్దములు, విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావప్రతిపాదనము చేత రసోత్పత్తిని గల్గించునట్లు, స్వరములు నాదబ్రహ్మోపాసనముచేత రసభావోత్పత్తిని గల్గించుచున్నవి. రసమే బ్రహ్మము. పరబ్రహ్మము రసస్వరూపుఁ డనుటకు మాకు "రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వా

నందీ భవతి" అను శ్రుతి ప్రామాణ్య మగుచున్న దని పండితరాయలు తన రసగంగాధరమునందుఁ దెలిపియున్నాఁడు.

"విభావాదిసంవలితమును, రత్యాదిమిళితమును, భగ్నావరణమును, నగుచైతన్యమే రసము" అని యాలంకారికులు నిరూపించియున్నారు. ఈరసమే యానందజనకమైనది. విషయసంవలిత మగుచిత్తు నాలంబనముగాఁ గొనుటచే నిది పరబ్రహ్మానందముగా లేక పరబ్రహ్మానందసదృశమైనది.

ఈరసానందము కవులచేతను గాయకులచేతను గూడ సాధింపఁబడుచున్నది. కావునఁ గవిగాయకులచే నిష్టముగా సాధింపఁబడుట లోనాశ్చర్యమే మున్నది?

సత్యారాధకుఁ డగు కవికిని గాయకునకును గూడ గమ్యస్థానమొక్క సత్యస్వరూప మగుపరబ్రహ్మమే. దేవతారాధనమూలముగా నిర్వికల్పసమాధ్యాదిసిద్ధియే గాంధర్వవేదమునకుఁ బ్రయోజన మని మధుసూదనసరస్వతి ప్రస్థానభేద మను గ్రంథమునందుఁ దెల్పియున్నాఁడు.

"కావ్యం యశసే" అను నాలంకారికవచనమందుఁ గల కావ్యప్రయోజనము లగు కీర్తి, ధనము, వ్యవహారజ్ఞానము, నమంగళనివారణము, మహానందము (కాంతాసమ్మితత్వముచే) వాచ్యము గాకుండ నుపదేశము, గానమువలనఁ గూడ లభ్య మగుచున్న వని చెప్పవచ్చును. "ఏకమాపాతమధుర మన్య దాలోచనామృతమ్" అనుటచేత శీఘ్రోపస్థిత మగునానందమును గల్గించుసంగీతమే పై ప్రయోజనములను శీఘ్రముగా సంపాదించుచున్న దని చెప్పవచ్చును. అది ప్రస్తుతలోకానుభవముచేఁ గూడ నిర్ధారిత మగుచున్నది.

"సంగీత మపి" అను శ్లోకమునందు సాహిత్యము గొప్ప దను నభిప్రాయము గల దని కొంద రందురు. రెండును సమాన మైనవే యని నే నందును.

మాధుర్యముయొక్క శీఘ్రోపస్థితి మొదటిశాఖయందలిసుగుణము. కావుననే సంగీతము "శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అని కొనియాడఁబడినది.

ఆలోచనచే నమృతము వలె నుండుట రెండవదానియందలి సుగుణమై యున్నది.

కవి యిం దొకదానిని గొప్ప దని తెలుపుటలేదు. దీనికిఁ బ్రమాణము వీనిని భారతీ స్తనద్వయముగా నిర్ణయించుటయే. మనోహరము లగుటచేతఁగాని క్షీరరసప్రకృత్యాదులచేతఁ గాని యిందొకదానికి మహత్త్వమును నొకదాని కల్పత్వమును నిర్ణయింప వలనుపడదుగదా! కావున రెండును సమానములే యని నా యుద్దేశము.

ధ్వని రసవ్యంజక మగునట్లు వర్ణ(అక్షర)సంబంధము లేకయే కేవలనాదము రసవ్యంజక మగుచున్నది.

శబ్దార్థములు లేని కేవలనాదమువలన శృంగారాదినవరసములను బుట్టింపవచ్చును.

కోయిలకుహూధ్వనియందు శృంగార ముట్టిపడుచుండును. గార్దభధ్వని హాస్యమును బ్రకటింప దని యెవ్వ రనఁగలరు? సముద్రఘోష వీరరసప్రతిపాదకము గాఁ దోఁచునుగదా! కాకధ్వని బీభత్సరసమును గలుగఁజేయునుగదా! గుడ్లగూబ, యఱపు లేక మేఘనాదము భయానకరసప్రతిపాదకముగా నుండునుగదా! సింహనాదము రౌద్రరసవ్యంజకముగాఁ దోఁపని వా రెవ్వరు?

(గ్రుడ్డి) మూఁగబిచ్చగానిధ్వని కరుణరసస్ఫోరకమై యుండును.

నిశ్శబ్దాకాశము శాంతరసప్రతిపాదకము గదా!

ఇట్లే గాత్రమునందలి యామూ (వర్ణసంబంధము లేని) ధ్వనులే (సాత్త్వికాదిధ్వనులు) భక్త్యాదులను బ్రకటించును.

అద్భుతమగునీనాదరూప మగు సంగీతము, మాటలు లేకుండ రసజ్ఞుఁ డగువాని నాకసమున కెగిరించును, స్వర్గాధిపత్యముఁ గావింపఁజేయును. అద్వైతానందసాదృశ్యమును సంఘటించును.

అధికదీనునిఁ గావించి యంధతామిస్రములఁ బడఁద్రోయును. అలౌకికము లగుసుఖదుఃఖముల ననుభవింపఁజేయును.

దీనివలన సాహిత్యము లేకుండినను గూడఁ గేవలనాదరూప మగుసంగీతము సాహిత్యభావములను గొంతవఱకుఁ బ్రకటింపఁ గల దని తేలుచున్నది.

సాహిత్యభూషితము కాని కేవలము సంగీతమువలన సాహిత్యభావములు ప్రకటింపఁబడవల్లే రాగాదిజ్ఞానము లేనివానిచేఁ జదువఁబడినప్పటికిని, పద్యములలోను, గద్యములలోను, సంగీతము ప్రకటిత మగును.

కేవలనాదరూప మగుసంగీతమువలన నాయారసభావములు ప్రకటింపఁబడినప్పటికి నవి సుస్పష్టముగా గోచరింపఁబడవు. ఈనాదమువలన నీభావము ప్రకటింపఁబడి యుండు నని యూహింపవలసియే యుండును.

కేవల మగుసంగీతమున సాహిత్యమును గేవలసాహిత్యమున సంగీతమును నుండుటవలనను, శ్రుతిమాధుర్యము, రాగము, మొదలగు సుగుణములచే సామరస్య మేర్పడుటవలనను, శబ్దార్థములకువలెను, పార్వతీపరమేశ్వరులకు వలెను, సంగీతసాహిత్యములకు నిత్యమగు నవినాభావసమ్మేళనము గల దని తేలుచున్నది. సంగీతముతోఁ గూడిన సాహిత్యమువలననే సంపూర్ణమగు రసభావములు సుస్పష్టముగాఁ బ్రకటింపఁబడును.

సాహిత్యముతోఁ గూడని కేవలనాదమువలన సుస్పష్ట మగు నర్థము లభింపనట్లే సంగీతముతోఁ గూడనిసాహిత్యమువలనఁ గూడ సుస్పష్ట మగునర్థము ప్రకటింపఁబడఁజాలదు.

వాద్యములందు నాదరూప మగు సంగీతముమాత్రమే వినఁబడుటచే వానివలన భావములు స్పష్టీకరింపఁబడఁజాలవు. సంపూర్ణ మగురసోత్పత్తి గలుగనేరదు.

సభ్యులమనస్సులయం దాయారసములను భావములను గలిగించుటకు సాహిత్యయుక్త మగుసంగీతమే సమర్థ మగుచు. సాహిత్యయుక్త మగు సంగీతము వాద్యములందుఁ బ్రకటింపఁబడదు కావున నట్టిసంగీతము గాత్రసాధకునకే సాధ్యమగుచున్నది. కావుననే గాయకునకుఁ బ్రాధాన్యమును వాద్యకారునకుఁ బ్రక్కవాద్యమును యుక్తమగుచున్నది.

పరబ్రహ్మవాచకముగా వేదాంతములందు నిర్ధారితమగు నోంకారము నుచ్చరించుటకొక్క మనుష్యకంఠమే సమర్థమైనది- ఆప్రణవమే సాహిత్యము, ఆసాహిత్యమును బోషించునదియే సంగీతము.

దివ్యమాధుర్యసంకలితమును నుత్తమంబు నునగుప్రణవనాదశ్రవణముచేత సత్కావ్యశ్రవణముచేతను వలెనే దుర్మార్గుడు సైతము సన్మార్గుఁ డగుచున్నాఁడు.

సత్కావ్యమువలెనే యట్టిప్రణవనాదముగూడ నరుదుగా నున్నది.

గాయకశ్రేష్ఠులు దీనికొఱకు గాఢతపోదీక్ష వహింపవలసియున్న దని విన్నవించుచున్నాను.

గీత, వాద్య, నృత్యముల చేరికవలన సంగీత మేర్పడు నని యొక మతము. గీతవాద్యముల కూడికయే సంగీత మని వేఱొకమతము. మొదటిమతమునుబట్టి హరిదాసులే (భాగవతారులే) గాయకు లగుదురు. రెండవమతమునుబట్టి ప్రస్తుతము గానసభలందుఁ బాడుచున్నవారును గాయకు లగుదురు. మొదటిమతమే యుత్తమమైనట్లు నిర్ణయింప వీ లగుచున్నది.

శాస్త్ర మన నేమి? సంగీతశాస్త్రజ్ఞుఁ డెట్టివాఁడు?

అనుభవమే శాస్త్రరూపముగాఁ బ్రకటింపఁబడును. అనుభవవిరుద్ధ మగు శాస్త్రము శాస్త్రము గానేరదు. పూర్వము గాయకశ్రేష్ఠుల నిరుష్ట మగుసంగీతానుభవమే సంగీతశాస్త్ర మైనది. ప్రపంచమందున్న ప్రతిశాస్త్రము ననుభవరూపమే యై యున్నది. లక్ష్యము ముందుపుట్టినది. తరువాత దానిని సంగ్రహించినది లక్షణము. నిర్దుష్ట మగు లక్ష్యమునకు విరుద్ధ మగుశాస్త్రము శాస్త్రము కాదు.

యోగ్యములగు నూతనానుభవములచే శాస్త్రములు తిరుగ వైశాల్యము నొందుచుండును. వివిధశాస్త్రములును నిట్లు వైశాల్యమును బొందుచునే యున్నవి.

పారతంత్ర్యమువలన మనశాస్త్రపరిశోధనలు చాలకాలముక్రిందటనే యాఁగి పోయినవి. ప్రస్తుతానుభవము పూర్వానుభవముకంటెఁ జాల హీనదశయం దున్నది. కావున మరలఁ బరిశోధన జరుగవలసియున్నది. ఇందుకొఱకు సంగీతరసాలంకారాదివిషయములు గలభరతాదుల

గ్రంథములను బఠింపవలయును. సామవేదముయొక్క గానమునకు సం
బంధించిన సంగీతగ్రంథములు కొన్ని గల వని తెలియుచున్నది. అవిమిగు
లఁ బ్రాచీనకాలికములుగా నిర్ణయింపఁబడినవి. మఱియు, సంగీతరత్నాక
రము మొదలగు సంగీతగ్రంథములఁ బరిశోధించి గాయకులు యథార్థమ
గు సంగీతమును బ్రకటింపఁ గోరెదను.

నవీనులచే నిటీవలఁ బ్రచురింపఁబడిన, సంగీతవిద్యాదర్పణము,
సంగీతసుధాంబుధి మొదలగుగ్రంథములయందుఁ గలసాహిత్యగ్రంథము
చాలవఱకు దోషసంకలితమై యున్నది. కావున గాయకులు తెలుఁగు
నందుఁ బ్రకటింపఁబడిన యీగ్రంథములను బ్రమాణముగా గ్రహియింపఁ
గూడ దని మనవి చేయుచున్నాను.

నిర్దుష్ట మగు సంగీతసాహిత్యసమ్మేళనము గలగ్రంథములు తెలుఁ
గునందుఁ బ్రకటింపఁబడవలయును. దీనికై గాయకోత్తములు కృషి గా
వింపఁగోరెదను. ఇంతవఱకు బ్రకటింపఁబడిన గ్రంథములలో నిర్దుష్టము
లగుగ్రంథములు చాలఁ దక్కువ.

సువిమర్శకులగు సంగీతశాస్త్రజ్ఞులు నూతనమగు సంగీతానుభవ
మును విమర్శించి లక్షణసమన్వయమును గావింపవలయును.

సంగీతసాహిత్యములలో నెందును బాండిత్యము లేని యల్పజ్ఞుఁడ
నగు నేను సంగీతసాహిత్యసమ్మేళన మొర్చుట సాధ్యము గాని పనియైన
నుత్సాహాతిశయమువలన నించుక పరిశోధనము చేయఁదలఁచుచున్నాను.
ఇందులకు విద్వాంసులప్రోత్సాహ మత్యావశ్యక మయియున్నది.

శ్రుతి స్వర రాగ తాళ లయజ్ఞానములు గలవాఁడు సంగీతశాస్త్ర
జ్ఞుఁడు. ఇతఁడు చమత్కారజనక మగుభావన లేనిచో గాయకుఁడు కాఁ
జాలఁడు. స్వరరాగాదిజ్ఞానము గల్గి శక్తి వ్యుత్పత్తులు గల్గిన భావనాశా
లి గాయకోత్తముఁ డగుచున్నాఁడు. స్వరలయాదిజ్ఞానము లేకయే పాట
పాడువా రనేకు లున్నారు. శబ్దార్థజ్ఞానము లేని కవుల కావ్యములవలెనే
వారిగానము నింద్యము కావచ్చును. శబ్దార్థములు మాత్రమే కవిత్వము
కానట్లు స్వరములే సంగీతము గాదు.

కవిత్వమునకు శబ్దార్థాదిజ్ఞాన మావశ్యక మైనట్లు గాయకునకు స్వరలయాదిజ్ఞాన మావశ్యకము.

ప్రతిభ లేని శాస్త్రజ్ఞుఁడు గాయకోత్తముఁ డనుకొనుటకంటెఁ బరిహాసాస్పద మైనసంగతి వేఱొకటి యుండదు.

భావము లేని స్వరకల్పనము భావనారహితుఁ డగు శాస్త్రజ్ఞునిచేఁ గావింపఁబడు చుండును. అది శాస్త్ర మని యవివేకు లగుజనులు విశ్వసింతురు. భావహీన మగుసంగీతము, సంగీతము కానేరదు. అర్థము లేని మాటవలె నర్థము లేని పాటకూడ నపరిగ్రాహ్యము.

కావున స్వరరాగలయాదులే సంగీతము గానేరవు.

శబ్దార్థాలంకారములు రసోత్పాదకము లై కవిత్వ మగునట్లు స్వరరాగలయాదులును, రసోత్పాదకము లైనపుడే సంగీత మగుచున్నవి.

కర్ణాటకపద్ధతి గలగానమే సంగీత మనుబూటకపువాద మొకటి గలదు. దీనిని గొందఱు విశ్వసించుచున్నారు. ఇది యజ్ఞానమూలక మగు నంధవిశ్వాసము.

ప్రపంచమునం దనేకములగు బాణీలు కలవు. శ్రుతిస్వరాదిజ్ఞానము గలభావనాశాలిచేఁ బాడఁబడిన యేబాణీయును శాస్త్రవిరుద్ధము కాదు. బొంబాయిబాణీ గాని హిందూస్థానిబాణీగాని సంగీతము కాదనుట యవివేకవిలసితము.

కృష్ణభాగవతము ల నాడుసాంప్రదాయ మాంధ్రులలోఁ జిరకాలమునుండి యుఁ గలదు. వీనియందలి గేయములను శ్రుతిస్వరరాగతాళయుక్తముగాఁ బాడుభాగవతు లగువేషగాం డ్రనేకు లిప్పటికిని గలరు.

ఈబాణీ సామాన్యముగా పల్లెలయం దుండువారికిఁ బరిచిత మైయుండును.

ఇట్లే తోలుబొమ్మల నాడించువారు పాడెడిబాణీ వేఱొకరీతిగ నుండును. ఇట్లే బోనెలవానిపదములయందలి బాణీయు హరికథలందు గలమట్లయొక్క బాణీయు భజనకీర్తనలఁ బాడువారిబాణీయు వేర్వేఱుగ నుండును.

శ్రుత్యాదిజ్ఞానయుక్తముగాఁ బాడఁబడినను గొందఱు నాగరకంమన్యులు పైవానిని సంగీతముగా నంగీకరింపరు. ఇది మూర్ఖము.

శ్రుత్యాదిజ్ఞానరహితముగా, త్యాగరాజకృతులు పాడినను నదిసంగీతము కానేరదు. శ్రుత్యాదియుక్తమైనపుడు తందనాలపదాలుకూడ సంగీతమే యని నానిశ్చితాభిప్రాయము. బహుళనియమయుక్తము ను క్రమసాధనసంకలితము ను నగు, సంగీతము, ఉత్తమసంగీతముగా నంగీకరింపఁబడుట న్యాయమే యగును.

దానిని గ్రహింపఁగలవారు కూడఁ గొలఁదిగనే యుందురు. దీనికి గానసభలే దృష్టాంతములై యున్నవి. కాని యివి యింకను సంస్కరింపఁబడవలసి యున్నవి. ఇది యనవసరము లగుస్వరకల్పనలకు, లెక్కపంపకములకు, యుద్ధములకుఁ బ్రాధాన్యము నొసంగుట మాని రసభావములకు భగవద్భక్తికిని బ్రాధాన్య మొసంగుటుచిత మని మనవి చేయుచున్నాను. గానసభలయందు "ప్రోగ్రాము"నిర్ణయము రసభావభంజకమేమో యని నాతలంపు సహృదయులు విమర్శింతురుగాక.

ఆంధ్రులలోఁ బలువు రనుకరణాసక్తు లగుటచేతఁ దమప్రత్యేకతాలక్షణ మగు నాంధ్రబాణీని విడిచి దాక్షిణాత్యులను, బొంబాయివారిని, హిందూస్థానీవారిని ననుకరించుచున్నారు.

ఆయాసంగీతముల విధానముల గ్రహియించుట మంచిదే కాని యిట్లు ప్రతిభాశూన్యముగా వారిసంగీతము ననుకరించుట యభివృద్ధికిభంగకరము.

ఆంధ్రభాషవలె గానమున కనుకూలించు భాష వేఱొకటి కానుపింపదు. నవరసములను బ్రకటింపఁజేయఁగల సౌకుమార్యాదిగుణము లొక్కయాంధ్రభాషయందే కలవు. కావుననే "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అనినాఁడా మహారాజశేఖరుఁడు. కావుననే దాక్షిణాత్యగాయకులు త్యాగరాజాదులకృతులనే యాదరించిరి. ఆంధ్రభాష మనోహరవర్ణసంకలితము. ఆంధ్రసాహిత్యవిశిష్ట మగుసంగీతము స్వర్గసుఖతుల్యము. అనుపమానభావపదమంజులము లగుత్యాగరాజకృతు లాంధ్రుల భాగ్యచిహ్నములు !

వీనిని భావయుక్తముగాఁ బాడుటను గాయకు లింకను నభ్యసింపవ లసియున్నది.

త్యాగరాజు పాడిన స్వరసంప్రదాయము దాక్షిణాత్యగాయకుల కెంతవఱకు లభ్యమైనదో తెలియదు. కాని యిప్పుడు వారు పాడుచున్న కృతులలోఁ బెక్కింటి కనుగుణ మగు భావప్రకటన, గల స్వరవిధానము వారిలోఁ గాన్పించుట లేదు. ఇట్లు భావహీనముగా, త్యాగరాజు గాన ము చేసి యుండు నని సహృదయు లూహింపఁజాలరు.

వీరిలో ననేకులకు భాషాజ్ఞానము లేనందునఁ గృతులలోని యర్థ వంతము లగుపదములు నిరర్థకములుగా మాఱినవి. భాషాభావములయొ క్క జ్ఞానము లేనందుననే భావమునకు విరుద్ధ మగు స్వరముల పోకడ యేర్పడెను.

అర్థము చెడుటకు, పదములమార్పునకు:—

భుజగభూషణా: రామః- తారకాధిపా: రామః- తరయా రఘువర:

శ్రీరాముఁడు భుజగభూషణుఁడు, తారకాధిపుఁడు గాఁ జేయఁ బడియెను. 'భుజగభూషణుఁడు! తారకాధిపుఁడుగాఁజేయఁబడియె. 'భుజగ భూషణార్చితా" అనియు, "తారకాధిపాననా" అనియు నుండవలెను. "తరయా" అనుచోట, "తారయ!" (తరింపఁజేయుము) అని యుండ వలెను.

"జనియించెదరు జాలినకరుణతో,
మొదలు నంటగఁజేయు మందనుచు, (ఇందర్థము లేదు.)
ఇట్లే, తొలి నేను జేసినపూజా, ఫలమే
ఆడ మోడిగలదె రామయ్య.

మొదలగు కృతులయందు సరియగు నర్థము లభింపదు.

గాయకులు కృతులయొక్క భావార్థములనైన నెఱుఁగుటకుఁ బ్ర యత్నింపకుండుట యన్యాయము.

గాయకులు కొంతవఱకైన సాహిత్యజ్ఞానమును సంపాదింపనంత వఱకు, నిట్టిదోషములు తప్పవు.

సంగీతమునందు సాహిత్య మెట్లున్న నేమి ? అను దురభిప్రాయము కొందఱికిఁ గలదు. ఈయభిప్రాయమును పామరులు హర్షింపవచ్చును. కాని పండితులు హర్షింపఁజాలరు. సాహిత్యార్థమునకుఁ బ్రాధాన్యము లేకుండఁ గృతులను పాడుటకంటె వానిని విసర్జించి నాదరూప సంగీతముల నాలపించుట యుక్తము.

సంగీతసాహిత్యములలో సాహిత్యభావమును సంగీతము పోషింపవలెను. ప్రస్తుతకాలమున నట్లు పాడుటలో గానకళానిధి బిరుదాంకితులును మహావిద్వాంసులు నగు బ్ర॥ శ్రీ పట్రాయని సీతారామశాస్త్రిగారును, వాగ్గేయకారక బ్ర॥ శ్రీ హరి నాగభూషణముగారును నగ్రగణ్యు లని చెప్పఁదగును. సాహిత్యభావపోషకము గాని సంగీతము సంగీతము కాదు.

త్యాగరాజకృతులలో సాహిత్యమునకుఁ బ్రాధాన్యము లేదని మ. రా. పి. సాంబమూర్తి అయ్యరుగారీనడుమ విజయనగరాంగ్లకళాశాలయం దుపన్యసించియున్నారు. పై వాదము యుక్తివిరుద్ధము ననుభవవిరుద్ధమును నై యున్నది. కొందఱు దాక్షిణాత్యగాయకులచే భావార్థశూన్యముగాఁ బాడఁబడుచున్న కృతులను గాంచి వీ రిట్టిభ్రమకు లోనై యుందురు. త్యాగరాజు మహాభక్తవరేణ్యుఁడు. మహాకవి. భావనాశాలి. అట్టిమహానుభావుఁడు, భావహీనముగా, సాహిత్యార్థమును బోషింపని సంగతులతోఁ గృతులను బాడియుండు ననినచో నెవ్వఁడును నమ్మఁజాలఁడు. ఇప్పు డీకృతులను గొందఱు దాక్షిణాత్యగాయకులు పాడినట్లే పూర్వము త్యాగరాజు పాడినట్లు నిదర్శనము లేదు. కావున వీరి వాదము నిరాధారము, వీని కాధార మొక్క దాక్షిణాత్యగాయకుల త్యాగరాజకృతిగానవిధానమే.

కావున త్యాగరాజకృతులందలి సాహిత్యమునకే ప్రాధాన్య మనుట నిర్వివాదాంశము. గాయకులు తత్ప్రాధాన్యమును బాడుచేయుటచే నిట్టివాదమున కవకాశము గల్గినది. త్యాగరాజకృతులలోని గంభీరభావములు విశేషముగా సంగీతమును బ్రకటించుటకు వీలు గల్గించుచున్న వని చెప్పవచ్చును.

గీతములు, వర్ణములు, కృతులు, మున్నగువానియందలి లక్షణ విశేషముల నించుక విమర్శించెదను.

ఆంధ్రభాషయందుఁ గలపద్యములలోని సంప్రదాయము గేయములం దనుసరింపఁబడిన దనుట నిర్వివాదాంశము.

పద్యములందుఁ దాళము గలదు- కాని యవి గణనిబద్ధములు. కావుననే తాళజ్ఞానము లేనివాఁడును బద్యముల వ్రాయ నీలగును. తాళము ననుసరించి శబ్దములను గూర్చుట గేయలక్షణము. నియమితగణ ముండవలె ననునియమము వీనియందు లేదు. కావుననే తాళజ్ఞానము లేనివాఁడు గేయములను వ్రాయఁజాలఁడు.

ప్రాసనియమము కన్నడమునందును నాంధ్రమునందును గలదు. యతినియమ మాంధ్రభాషయందే గలదు.

ఇట్టిది యాంధ్రభాషకు సహజ మైనది. కావుననే జానపదుల పాటలలోఁ గూడఁ బ్రాముఖ్యము నందినది.

ప్రాసము లేనిపాట లుండిన నుండవచ్చును గాని సామాన్యముగా యతి లేని పాటలు కానుపింపవు. అర్థము లేకుండినను సరే యతి యుండవలెను! యతికొఱకు వ్యర్థపదము లైనను బ్రయోగింపవలయును! ఇది చెవుల కింపుగా నుండుటచేత నన్నయభట్టారకాదు లనుసరించిరి. ఇప్పటివఱకును బద్యకవులేమి, గేయకవులేమి యనుసరించుచున్నారు. జానపదులగేయములలో యతిని నిర్వహించుటయందుఁ గలదీక్షను మీరు గమనింపుఁడు!

"చేతిగాజులతోను చెల్లెళ్ళతోను."

ఇట్లని యతికొఱకు వ్యర్థపదములను బ్రయోగింపవలె నని నా యుద్దేశము కాదు. సమర్థులగు కవులు వ్యర్థపదములు లేకుండ యతి ప్రాసనియమమును నిర్వహించుచున్నారు. కాఁగా, గణయతిప్రాసనియమము పద్యములం దెట్లనుల్లంఘనీయమో తాళయతిప్రాసాదినిర్ణయము వర్ణములందును గృతులందును, బదములందును, నట్లే యనుల్లంఘనీయమైనదిగా ననుసరింపఁబడుచున్నది. శ్రవణమాధుర్యమును సంపాదిం

చుటలోఁ బద్యములలోఁ గేయములలో సౌలభ్యము గల దని యంగీక
రింపనివా రుండరు గదా: అట్టిగేయములలో యతిప్రాసల యావశ్యకత
హెచ్చుగానుండు ననుట నిర్వివాదాంశము.

పిళ్లారిగీతములందు యతిప్రాసనియమము సరిగా ననుసరింపఁబడి
నట్లు కనుపింపదు. అనేకము లగుపెద్దగీతములయందు యతిప్రాసనియమ
ము కానుపింపదు.

ఉ. (ఆనందభైరవి. ఆదితాళము) కమలసులోచన—

శ్లోకములను స్వరము ననుసరించి యిట్టి గీతములుగా వ్రాయు
ట యొకపద్ధతి.

ఉ. భైరవి. శ్రీ ఇరఅమా—

ఇందు యతిప్రాసము లుండుట కవకాశము లేకపోవుట యటుండ
భావపోషణమునకే యవకాశము లేకుండ నున్నది ఇట్లు గీతములను
వ్రాయుట యన్యాయ్యము.

గీతము లనేకములు కన్నడాదిభాషలయం దున్నవియే యాంధ్రు
లకు శరణ్యము లైనవి. వీనికి బదులుగా నేను వ్రాయుచున్న యాంధ్రగీత
ములను మున్ముందు గాయకలోకమునకు సమర్పింపఁ బూనియున్నాను.
గీతములందు-పల్లవి, అనుపల్లవి, చరణము, యతిప్రాసాదినియమము లేన
ట్లు తోఁచుచున్నది. స్వరజతులయం దీయతిప్రాసనియమము గోచరించు
చునే యున్నది. సంస్కృతగేయములం దీయతిప్రాసనియమము లేకున్నను
నాంధ్రలక్షణానుయాయులచే వ్రాయఁబడిన కొన్ని సంస్కృతగేయము
లం దీనియమము పాటింపఁబడినది.

వర్ణములవలన లయజ్ఞానము, స్వరజ్ఞానము, అకార ఇకారాదు
లను హెచ్చుగ గాత్రమునందు పాడఁగల్గుటయు ననుభవసిద్ధమై యున్నది.
వర్ణములందు, పల్లవి, అనుపల్లవి, చరణములు నుండును. పల్లవియం
దొకటిగాని రెండుగాని యతులుండును. అనుపల్లవియందును నిట్లే యొ
కటిగాని రెండుగాని ప్రాసము లుండును. పల్లవికి ననుపల్లవికిని ప్రాసని
యమ ముండును. చరణమునకు పల్లవి యనుపల్లవుల కున్నప్రాస ముండ
నక్కఱలేదు.

రెండిటికిని భంగముకల్గి నట్లుగానే యెంచవలసి యుండు ననియును, సంగీతవిద్వాంసులకు మనవిచేయుచున్నాను.

వర్ణకవులు యతిభంగముఁ గావించిన పరిస్థితులు చాలస్వల్పముగానున్నవి. ఇదిపొరపాటువలన జరిగిన దని నిర్ణయింపవచ్చును.

నాట—సామి: నిన్నే కోరినాను—చాలదయఁజూడర!

భూమివెలయు శ్రీ వేంకటేశ!

'పఫ బభ వ' లకు యతిమైత్రి లేదు. యతి యుండు ననుభ్రమచే నిట్లు జరిగినను జరుగవచ్చును. లేదా పొరపాటై యుండవచ్చును-ఇట్టియుదాహరణములు స్వల్పముగనే లభించినవి. వర్ణకవులకు యతినియమము పాటింపవలె నను నుద్దేశము లే దనుట పొసగనిమాట. నియమపాలనోద్దేశ మే వారికున్నట్లు వందలకొలఁది యుదాహరణము లీయఁగలను.

వర్ణములలో నకారాదులు హెచ్చుగా నుంచుటకు వీలగునట్లు వర్ణకవులు చిన్నచిన్న వాక్యములను వ్రాసి యున్నారు. అందువలన "నివాస" ఇత్యాదులగు ననేకస్థలములందు 'నిఇఇ ఈఇవఅసఅఅ' అనిహ్రస్వాక్షరములనుగూడ అకార, ఇకారాదులచేఁ బెంచుట వర్ణములలోఁ గానఁబడుచున్నది.

సంస్కృతకవుల గేయములలో దీర్ఘాక్షరములకు మఱికొంత దైర్ఘ్యము సంపాదించుట కానవచ్చును, గాని, హ్రస్వాక్షరములను దీర్ఘముగాఁ జేయుట యెచ్చటనో గాని కానుపింపదు.

అట్లు వ్రాయ వీలగు ననియు, గీతాదులందు స్వరానుసారియగు సాహిత్యము లేదనియు నేను, రెండుసంవత్సరములక్రిందట జరిగిన భారతీతీర్థసభయం దుపన్యసించియున్నాను. ఇట్లు వ్రాయకుండినయెడల సర్థబోధగలుగనేర దని గీతవర్ణకాదు లింకముందు గమనింపఁ గోరెదను.

అష్టపదులందును, తరంగములందును దీర్ఘాక్షరము లున్నచోటను, సంబోధనాదు లున్నచోటను అకారములను హెచ్చించుట కానఁబడును గాని హ్రస్వాక్షరములయొద్ద అకారములను పెంచుట సాధార

ణముగాఁ గానుపింపదు. పదవిరామమునందు మాత్ర మొక్కొక్కచో ప్రహ స్వాక్షరమునకు కించుక దీర్ఘము నుండుట కానవచ్చును ఇట్లుండుటవలననే వానియం దర్థబోధ గలుగును.

"పశ్యతి దిశిదిశి రహసిభవంతం
తదధరమధుర మధూని పిబంతం
నాథహరే! జగన్నాథహరే!
సీదతి రాధావాసగృహే కృష్ణ!"

గాయకులకు ఛందోలక్షణాది జ్ఞానము లేకుండుటవలన త్యాగరాజాదుల కృతులయందుఁ గలిగిన దోషములను వేఱొకవ్యాసమునందుఁ జర్చింపఁ దలఁచితిని. కావున నింతతో దీని విరమించుచున్నాను.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు నాయభిప్రాయములను విమర్శించి పైవిషయములను దేశవ్యాప్తములు గావించెద రనియు నీవ్యాసమును వారిపరిషత్పత్రికయందుఁ బ్రకటించెద రనియు విశ్వసించుచున్నాను.

ఈనడుమ విశాఖపట్టణమునందుఁ జరుపఁబడిన, భారతీతీర్థసభ యందు నేనీవిషయమును గూర్చి యుపన్యసింపఁగా నాయభిప్రాయముతోఁ జాలవఱకేకీభవించి నాకు మిగులఁ బ్రోత్సాహము నిచ్చిన సాహిత్యసమ్రాట్టు లగు శ్రీ జయపురాధీశ్వర శ్రీ విక్రమదేవవర్మమహారాజావారికిని, నాకు సంగీతవిద్యాగురువు లైన గానకళానిధి బ్ర. శ్రీ పట్రాయని సీతారామశాస్త్రిగారికిని ధన్యవాదముల నర్పించుచున్నాను.

---

# శ్రీవిశుద్ధాంధ్రభాషాదుర్దశ.

(ఆంధ్రసాహిత్యపరిషత్కర్తవ్యము.)

విద్వత్కవిరత్నాదిబిరుదాంచితులు పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు.
పాలకొల్లు.

---

శ్లో. యస్యా గీర్వాణవాణీ శిర ఉదరతలం తద్భవా దేశ్యవాణీ
పాదాన్తా థశ్శరీరం వదన మపి పరా వ్యాకృతిః ప్రాణవాతాః
సాహిత్యాత్మా రసో ఽఙ్గా న్యఖిలశుభకలా గ్రామ్యవాణీచ పాయు
స్సైషాన్ధ్రీ స్వాఙ్గభేదా త్త్రికవిజనకృతా త్త్రోవిధానాశిగుప్త్యై. ౧

శ్లో. శ్రీమన్నన్నయతిక్కనాఖ్యభయవాగీశానసంవర్ధితా
శ్రీమత్కృష్ణమహీపతిప్రముఖసద్భూపాలసంభూషితా
విద్వద్ద్రావిడసజ్జనస్తుతధృతా సద్దేశ్యసమ్మానితా
వాణ్యాన్ధ్రీ విలపత్యహో కలివశా దాత్మావనా మూఘనా. ౨

మహాశయులారా! గతవర్షములలో నేను వ్రాసిన వ్యాసముల వలన నేప్రయోజనము కలిగిన దని విచారించిన నాచారనిర్వహణమే యని తేలినది. ఇపుడు గూడ నట్టిదియే యైన నాచారనిర్వహణమే ఫలమగు నదియు లేకున్న నుద్దిష్టఫలము చేకూరు ననునాసతోనే యందుల కుపక్రమించుచుంటిని. పరిషత్సభ్యమున నేప్రాచీననవీనకవుల కవితామతల్లికలం గూర్చియో లేక యేయతిప్రాసాదులం గూర్చియో లేక యేవ్యాకరణాంశములం గూర్చియో యాంధ్రభాషాభిమాను లగు విద్వద్వతంసులచే వ్రాయంబడిన వ్యాసరాజములం జదువుటయుఁ బాడిపద్యలు విని యెటో మస్తకములం గదల్చుటయు వానిని బరిషత్పత్రికాముఖమున వెల్లడించుటయు, వీనివలన నుభయులును గృతార్థుల మని తలంచుటయు నొకయాచార మైనది. కాని యాంధ్రసారస్వతోద్ధారకసంఘములెన్నియున్న నధోగతిం జెందుచున్న యాంధ్రభాషాయోషామణి నుద్ధరించుటకు వలయు కార్యక్రమము నారంభించి పనిచేయుచున్న సంఘ మొక్కటియు నింతవఱకుఁ గానరాకుండుట విచారకరము. తమతమయభిమా

నానుసారము బిరుదముల నొసంగుటకు మాత్రమే యేర్పడిన సంఘము
లవారు తమకర్తవ్యముల నిర్వహించుచుఁ బత్రికాముఖముల వానిని వెల్ల
డించుచున్నారు. ఆంధ్రదేశమున విశ్వతోముఖముగఁ బ్రచారమున నున్న
పత్రికలు సాధారణముగ గ్రామ్యభాషను వాడకవిశతులు గ్రామ్యభాష
ము నొసంగుచు నాంధ్రభాషాపోషణ [illegible]
గాక ముఖాద్యవయవములఁ గూడఁ గ్రమక్రమముగ ఖండించుచున్నవి.
ఇందులకు సుప్రసిద్ధవిద్వన్మణులే కొందఱు స్వహస్తరచితాసిధారలఁ బ్రయో
గించి పోషించువారుగ నున్నారు. ఇట్టిచో నాధునికకవికులశిరోమణులు
రచియించి వెలువడఁ జేయుచున్న గ్రంథరాజములు గ్రామ్యభాషాభూయి
ష్ఠములై భావకవితావలంబితమాలికలతో నిండి భావికవిమార్గదర్శకము
లై విశుద్ధాంధ్రభాషావినాశనోద్యమమును బోషించుచున్నయవి. మహో
ద్యమముతో నెట్టకేల కేతెంచి పనిచేయుచున్న యాంధ్రవిశ్వవిద్యాలయ
ము నుండి ప్రతివత్సరమునను దయారగుచున్న ప్రవీణ లేమి బి యే.
మున్నగు పట్టపరీక్షలలో నుత్తీర్ణులైన విద్వాంసు లేమి యాంధ్రభాషా
స్వరూపలోపమునకే యత్నించుచుండుట సర్వవిదితము. ఈయంశమును
వీరివ్యాసము లేమి వీరి గీతము లేమి స్పష్టముగా ఋజువుచేయుచున్నవి
కదా. వీనివలన విశుద్ధాంధ్రభాష యత్యల్పకాలముననే స్వరూపలో
పము నొంది యపభ్రష్టరూపముతోనే యుండుదశకు వచ్చిన దని
లోకజ్ఞులకుఁ దేటతెల్లమే. అయిన నిటఁ గొన్ని యంశములు విచారణీయ
ములు కాకపోవు- విశ్వవిద్యాలయ పట్టపరీక్షలలో నుత్తీర్ణులైన
విద్వాంసులు భాష నిట్టిదశకుఁ గొనివచ్చుటకుఁ గారణము వారేర్పఱ
చిన పాఠ్యగ్రంథములయందలి లోపమా- లేక యాయాకళాశాలలలో
నుండునట్టి యధ్యాపకుల యధ్యాపనమునందలి లోపమా- లేక య
ధ్యేతల యధ్యయనమునందలి లోపమా- లేక యుత్తీర్ణు లగునీవిద్వ
త్పుంగవులు వశ్యభాషులై మతధర్మములయందు వలెఁ గలిప్రేరణమున
నపభ్రంశప్రచారముం గావించి భాషాసంస్కర్తలను విఖ్యాతిం గాంచఁ
దలఁచి బుద్ధిపూర్వకముగఁ జేయుచున్న సంస్కరణాభాసప్రవృత్తియా

యని విమర్శించునపుడు నిర్ణీత పాఠ్యగ్రంథములు భాషాతత్త్వవిజ్ఞానసాధకములును శాస్త్రతత్త్వవిజ్ఞానసాధకములు నైనయుత్కృష్టగ్రంథములే యగుటంబట్టి వానిలోప మగుటకు వలనుపడదు- కాని యవి విస్తరించి యేర్పఱుపఁబడియుండుటంబట్టి యిప్పటి "టీపార్టీ"లలోని భోజ్యవస్తువుల వలె నాస్వాదనమాత్రోపయుక్తములై తృప్తికరతత్త్వానుభావకములు కాకుండుటయుఁ దత్త్వలిప్సువులకుఁ దత్త్వగ్రహణానవకాశకములైయుండుటయు, నిష్కృష్టదత్త్వగ్రహణముతోఁ బరీక్ష్యులకు నిమిత్తములేదు, చవి చూచి యున్నఁ జాలు నని యుద్బోధించుచున్నవా యనునట్లు ప్రతికక్ష్యనుపాఠ్యగ్రంథములకు నేర్పడియున్న సారబోధక(నోట్సు) గ్రంథముల నిర్మాణప్రచారణములును, గతవత్సరములలోని ప్రశ్నపత్రముల విక్రయము మున్నగు యూనివర్సిటీవారి యేర్పాట్లవలన నధ్యాపకులు నధ్యేతలును పాఠ్యగ్రంథములవంకఁ జూడక సారగ్రంథములను ప్రశ్నపత్రములను మాత్రమే యధ్యాపనాధ్యయనములలోనికిఁ గొనివచ్చుటకు వలయు నవకాశము నేర్పఱచుటయే యీ భాషాదుర్దశకుఁ గారణ మని తోఁచెడిని- నేఁ గొందఱుహూణభాషావిద్యార్థులను ప్రాచ్యవిద్యాపరీక్షలకును జదువుచున్న విద్యార్థులను వారు చదువుచున్న గ్రంథములలోఁ జదివిన భాగములలోఁ బరీక్షించితిని- వారా గ్రంథములలోని పద్యములనుగాని వాక్యములను గాని ప్రతిపదార్థవిజ్ఞానముతో నొక్కవ్యక్తియు సమన్వయింపలేకపోయిరి- "నోట్సుబుక్కు"లోనదుగుఁ డనియు మాకదే చెప్పుచున్నా రనియు హూణవిద్యార్థు లనిరి. ప్రవేశప్రవీణాదిపరీక్షలకుఁ జదువుప్రాచ్యవిద్యార్థులు వ్యాఖ్యానములతోఁ గూడఁ గష్టించి చదువవలసిన యుద్గ్రంథములలోనిమూలపంక్తుల యర్థములనైనఁ జెప్పనేరనివారావత్సరముననే యటఁ గృతార్థులైరి- పిమ్మట నిందుల కారణమును దృఢముగఁ గనుఁగొనఁగాఁ బ్రాచీనప్రశ్నపత్రములను వెలకుఁగొని వానిలోని ప్రశ్నములను సమాధానములను గురుసన్నిధిం దెలిసికొని వాని ధారణతో నుత్తీర్ణులైనట్లు ధ్రువముగఁ దెలిసికొని విచారించితిని- కనుక ప్రతిపదార్థజ్ఞానపూర్వకసమన్వయజ్ఞానముతో సవిశేషముగ నధ్యయనాధ్యా

పనములు జరుగనపుడు సాధారణముగ నాభాషాగ్రంథములయందు
వారి కెల్లను తత్త్వజ్ఞానము లభించును. ఇట్టిదశలో నతిబుద్ధిక్లేశమున సూక్ష్మ
బుద్ధితో సాధింపవలసిన తర్కవ్యాకరణాది శాస్త్రములలోఁ బ్రశ్నపత్రాధ్య
యనమాత్రమున నెట్టిప్రావీణ్య మదయించునో విద్యార్థులకుఁ దెలియును.

ఏశాస్త్రమునఁ దాను ప్రవీణపదము నందెనో యాశాస్త్రమునం
దలి యారంభగ్రంథములనే ప్రాచీనపద్ధతి నిప్పటిప్రవీణులు చాలవఱకు
నధ్యాపనము చేయలేకపోవుటకుఁ గారణము శాస్త్రాధ్యయనసంప్రదా
యములతో నాయాశాస్త్రములఁ జదువకుండుటయే గాని వేఱొండు
లేదు. ఇట్లు చదువకుండుటకు ముఖ్యకారణ ముదరదరీపూరణసాధనము
లగుపట్టముల నందికొనుటయందు మాత్రమే యధ్యేతలదృష్టులు ప్రస
రించుచుఁ దత్త్వవిజ్ఞానసమార్జనదృష్టులు లేకపోవుటయే యని విజ్ఞు లెఱుం
గుదురు. ఏనాఁడు విద్యలు దేశీయులదృష్టులలో జ్ఞానసాధనము లనుస్వా
ర్థమును విడనాడి పొట్టకూటికి సాధనము లనునర్థముతో గోచరించినవో
యానాఁడే వానిజ్ఞానసాధనత్వమునకుఁ దిలాంజలి ఘటించినది. "యూని
వర్సిటీ" వారు శ్రమపడి యిట్టితమపట్టముల నందినవారికే దేశీయవివిధక
లాశాలలలో నధ్యాపకత్వము గౌరవము మున్నగు వానిని నిర్ణయించియు
నిర్ణయింపఁజేసియుఁ బ్రచారమునకై పాటుపడుచుండినను బ్రతివత్సరము
నను వందలకొలఁదియును వేలకొలఁదియుఁ దయారగుచున్న ప్రవీణులకు
నత్యల్పముగ నున్న దేశీయకలాశాలలలో నధ్యాపనస్థానములు లభింపకుం
డుటంబట్టియు నితరమార్గముల నుదరదరీపూరణము జేసికొనుటకుఁ దమ
విద్య లనుపయుక్తము లగుటంబట్టియు విజ్ఞానోదరపూరణోభయభ్రష్టతం
జెంది యపభ్రంశప్రచారమునఁ దమకాలమును దమవిద్యల నుపయోగిం
పవలసిన వారగుచున్నారు. కనుక విద్యాశబ్దార్థమగు విజ్ఞానసాధనత్వము
మీఁద నధ్యేతలదృష్టులు ప్రసరించునట్లుచేయుట విశ్వవిద్యాలయము వా
రి ముఖ్యకర్తవ్యమగుటచే నది యేనాఁడు ఘటించునో యానాఁడు విద్యా
ర్థులకు 'మార్కు'లమీఁదఁ దృష్టియు విద్వాంసులకు మొదటితేదీ మీఁద
దృష్టియుమరలి న్యాయ్యార్థవాచకవిద్వత్పదవాచ్యులు దేశమునఁ దయా

రగుదురు- అట్లు కానంతవఱకును భాషలకును శాస్త్రములకును నీదుర్ద
శ తప్పదిదై యుండును-అట్లు తయారగుటకు గ్రంథబాహుల్యమును
దగ్గించి యధ్యయనకాలమును విస్తరింపఁజేసి సవ్యాఖ్యముగ నిష్కృష్టజ్ఞాన
సాధక మగుపాఠ్యగ్రంథసముదాయము నేర్పఱచి నోట్సుబుక్కులను బ్రా
చీఁ ప్రశ్నపత్రముల విక్రయమును విరమింపఁజేసి నిష్కృష్టపరీక్షల నేర్పఱ
చుట సాధన మని నాయాశయము. అట్టివారు తయారైననాఁ డుదరదరీ
పూరణమున కనేకమార్గములు లభించును. 'యథా రాజా తథా ప్రజాః'
అనునది యిట నను వర్తించును గనుక విద్యాలయాధికారులదృష్టి తత్త్వ
వేత్తలఁ దయారుచేయుటమీఁదఁ బ్రసరించినచోఁ దత్త్వవేత్తలే తయార
గుదురు. పాశ్చాత్యదృష్టిని మాలించి ప్రాచ్యదృష్టిని గ్రహించుట దేశీ
యులకు న్యాయ్యము. దేశీయవిద్యోద్ధారమున దేశీయదృష్టి ప్రసరింపని
చో విదేశీయుల కెట్లు ప్రసరించును. వైదేశికవిద్యావిధానము స్వదేశీయ
విద్యలకు విపరీతజ్ఞానసాధకత్వమును జేకూర్చుటలో వింతయేమి? కనుక
యింతవఱకున్న విద్యావిధానమే తత్త్వగ్రాహకము కానందున నాంధ్రభా
షకును బ్రాచ్యవిద్యలకు నిట్టిదుర్దశ నొనర్చుచున్న దని నాభావము.
అధ్యయనకాలమున లేనితత్త్వజిజ్ఞాస యుత్తరణానన్తరమునఁ గలుగుట దు
ర్లభముకదా. కలిగినను బ్రయోజనకారిణి కాదు. కనుక యధ్యయనకా
లమున నేర్పడినయీదోషమును గప్పిపుచ్చుటకును గలిప్రేరణమున జనిం
చిన పాశ్చాత్యవిధానానుకరణమును బ్రస్తుతాపభ్రంశప్రచారము విపరీత
వాదములతోఁ బ్రారబ్ధమై తొలుత భాషామతల్లికయొక్క ముఖావయవ
మును భ్రంశింపఁజేసి క్రమక్రమముగ నన్నియాంధ్రకాయావయవములను
భ్రంశింపఁజేసి తుద కిప్పటి కిట్టి యపభ్రష్టదశకుఁ గొనివచ్చినది. అస్థిరూ
పము లగుప్రాచీనగ్రంథములు మాత్రము భాషాయోషను సజీవముగ
నిల్పినవి. ఇట్టిదశలో నాత్మరక్షణమునకై విలపించుచున్న యాంధ్రభాషా
వధూటిని రక్షించుట కాంధ్రసాహిత్యపరిషత్తువారికన్నఁ దగువారు కా
న్పింపరు. ఈపరిషత్తున కాంధ్రభోజుఁ డనివిఖ్యాతిం గన్న శ్రీపీఠికాపురాధీ
శులు ముఖ్యపోషకులై యుండ నాంధ్రకాళిదాసమహాకవి యన నగు
శ్రీజయన్తి రామయ్యపంతులువారు ప్రధానప్రవర్తకులై యుండ శ్రీభోజ

పారిషద్యపండితపుండరీకులఁ బోలుమహనీయులు పారిషద్యులై యుండ
నాంధ్రభాషామహోద్ధారమున కన్నివిధములఁ జిరకాలమునుండి పాటుప
డుచు ననేకప్రాచీనాముద్రితాంధ్రగ్రంథముల సేకరించుచు వానిరక్షణ
మునకై పత్రికల వ్రాయించి శక్త్యనంతరమును లోకమునకుఁ బ్రకటించు
చు సలక్షణభాషను నవీనాంధ్రగ్రంథములను రచించియు రచియిం
పఁజేసియుఁ బ్రకటించుటయుఁ జిరకాలమునుండి యమూల్యవిద్వద్రాజ
న్యాసరాజదానములతోఁ బరిషత్పత్రికాప్రకటనములచే నాంధ్రభాషాను
కే నలంకరించుటయు మున్నగు ఘనకార్యము లిన్నిటికన్న మిన్నయు నతిదుర
సాధ్యము నగు శ్రీసూర్యరాయాంధ్రమహానిఘంటువు సిద్ధపఱచి ప్రకటిం
చుచుండుటయు నను మహాకార్యముల నొనర్చుచున్న యీపరిషత్తువారు నుభ
యభాషానిష్ణాతసాహిత్యసంపాదకసద్గ్రంథముల నుత్తమముఖ్యమాధ్యమ
కక్ష్యావిశేషములతోఁ బరీక్ష్యములనుగా నేర్పఱచి సక్రమపరీక్షల నేర్పఱ
చి పారితోషికముల నొసంగుచు నుభయభాషాసాహిత్యతత్త్వవేత్త లగువి
ద్వత్తిలకులను దేశమునఁ దయారుచేయుచున్న విశ్వవిద్యాలయమువారికిఁ
గూడమార్గదర్శకులుగా నుండి యపభ్రంశప్రచారమున సుత్ర్యమునద
శను నచ్చుచున్న యాంధ్రభాషామతల్లిక నుద్ధరించి తమకుఁ గలయీకొ
ఱంతను దీర్చికొనవలెనో నాంధ్రభాష కిపుడు పట్టిన దుర్దశను బాపు వా రెవ
రాంధ్రదేశమున నుండరు. ఇట్టిముఖ్యకర్తవ్యాంశమున వీరి కింతవఱ కౌదా
సీన్య మొదవించుట కూడఁ గలికృతభాషాదౌర్భాగ్య మనకతప్పదు.
కనుక యన్నియంశములను సమర్థులగు విశుద్ధభాషాభిమానులు గలయీ
పరిషత్తువారు వెంటనే యింకనైనఁ దమకుఁ గొఱంతవడియున్న యీఘన
తరముఖ్యకార్య మగు నాంధ్రభాషాసాహిత్యపరిరక్షాకార్యమునకుఁ గడంగి
యాంధ్రభాష నుద్ధరింపఁగోరుచున్నారము. ఇత్కార్యమున వీరు వెంటనే
ప్రవర్తించునటులు సర్వాంతర్యామి సర్వేశ్వరుండు సర్వదా యనుగ్రహించి
ప్రేరణమునొనర్చుచుండుఁగాత. విశుద్ధాంధ్రభాషాయోషామణి యాంధ్రదే
శమున నఖిలాలంకారశోభితయై నిఖిలావయవలావణ్యవిలసితయై యప
భ్రంశసంపర్కదోషలేశదూషితయుఁ గాకుండ సంతతము వెలయుఁగాత.
సమస్తసన్మంగళాని సర్వేషాంభవంతు.

---

# గ్రంథస్వీకారము.

(1) ఔదార్య - (సారస్వతం) - దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు - నెల్లూరు -
వెల రు. 0-10-0.

గ్రంథకర్తగారి ప్రణయకుసుమకావ్యముపై 'సరస్వతిరాష్ట్రి నాగరకాచార్యుఁడు' వ్రాసిన విమర్శనమునకును, ములుమూడి నారాయణ రెడ్డిగారి కాలగతితలపోత లను గ్రంథమునకును ప్రతివిమర్శనగ్రంథము. పై విమర్శకులు గ్రంథకర్తల గురువర్యులును విద్వత్తల్లజులునగు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని మఱికొందఱను తీవ్రముగ విమర్శించియుండుటచే గ్రంథకర్త వారిని వారిగురువులగు కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారిని తత్తనుచితవాక్యముల విమర్శించిరి. విమర్శకవిషయములు కొలఁదిగను, పద్యగద్యరూపమున హేళనాదికము లెక్కువగను గలవు. ఇట్టివి పత్రికల నపుడపుడు వెలువడుచుండుటయే యాంధ్రుల దురదృష్టము. పుస్తకరూపమును దాల్చుటను గూర్చి చెప్పనేల ? మఱి పలుకున నిట్టిగ్రంథమును వ్రాయుట పొరపాటని గ్రంథకర్తలు గుర్తించియే యున్నారు. అది మొదటనే గ్రహించిన బాగుగనుండి యుండునేమో ! విమర్శకుల 'తిట్టుపాత్రమును వారికే యప్పగింతుగాక యని వారివాక్కులను వానివంటివానిని మఱికొన్నింటిని నేనును వాడితిన'ని గ్రంథకర్తలు వ్రాసిరి. ఇదియే గ్రంథస్వభావమును వివరించుచున్నది. పండితు లిట్టిగ్రంథములను వ్రాసి, కష్టపడి ముద్రణ మొనర్చి తమధనమును, కాలమును, పాండిత్యమును వ్యర్థముచేయక, తమకుఁ దోఁచిన రీతిని భాషాసేవ యొనర్చుటయే యుత్తమ మని విన్నవించుచున్నాము.

(2) త్రిపురాంతకోదాహరణము:—రావిపాటి త్రిపురాంతకమహాకవిప్రణీతము- నిడుదవోలు వేంకటరావు బి. ఏ. గారిచే ప్రకటితము- వెల రు. 0-12-0.

ఆంధ్రమునఁ గలయుదాహరణగ్రంథముల సుప్రసిద్ధ మగుదీనిని తంజావూరు సరస్వతీభవనప్రాచ్యలిఖితగ్రంథభాండాగారమునఁ గలప్రతి ననుసరించి ప్రథమమున శ్రీమానవల్లి రామకృష్ణకవి గారు ప్రకటించియుండిరి. దానినే విపుల మగుపీఠికతోడను, లఘుటిప్పణము తోడను ప్రకటించి గ్రంథప్రకాశకులు తమయాంధ్రభాషాభిమానమును ప్రకటించియున్నారు. త్రిపురాంతకుఁడు ప్రాచీనాంధ్రకవులచే సంస్తుతి నొందినకవివర్యుఁడు. సంస్కృతమునఁ బ్రేమాభిరామమును రచించె నని క్రీడాభిరామమునఁ గలదు గాని యది మన కలభ్యము. అంబికాశతకము, చంద్రతారావళి, మదనవిజయగ్రంథముల మనకు లభ్యములగు పద్యములు పీఠికయం దీయఁబడినవి. సంస్కృతోదాహరణగ్రంథములఁ గూర్చియు, నుదాహరణగ్రంథముల స్వరూపమును గూర్చియుఁ బెక్కువిషయములును గలవు. ఉదాహరణగ్రంథముల నుపయోగింపఁబడిన విభక్తిప్రత్యయముల వలన నేయేప్రత్యయము లేయే కాలములఁ గలవో నిశ్చయ మొనర్చుట సులభము కాదు. భాషాశాస్త్ర పరిశోధనలవలన నిర్ణయ మొనర్పవలసియుండును. 'నై' యనునది చతుర్థీవిభక్తిప్రత్యయము కాదు. న్ + అయి అని పదవిభాగ మొనర్చి స్వరూపనిర్ణయ మొనర్పవలసియున్నది. ద్వితీయభాగమున టీకాయుతముగ మూలము ప్రకటింపఁబడినది. టీక యింకను విపులముగ నుండవలయును. ఈగ్రంథ మాంధ్రభాష కత్యంతోపయోగము.

---

(3) మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి జీవితచరిత్రము:—గ్రంథకర్త చిలుకూరి వీరభద్రరావుగారు, వెల రు 1-0-0.

కీ. శే. శ్రీ వేంకటరామశాస్త్రిగారి జీవితవిశేషముల గ్రహించి గ్రంథకర్త లీవిపులగ్రంథమును రచించిరి. శాస్త్రిగారి రచన లగు వంశముక్తావళి, శ్రీకోటిలింగేశ్వరస్తోత్రము, నారసింహాష్టకము, స్త్రీపతిరత్నావళి, చాటుశ్లోకములు నచ్చటచట నీయఁబడినవి. ఆంధ్రమేఘసందేశము, గుప్తార్థప్ర

కాశిక మొదలగుగ్రంథములపై విమర్శనప్రతివిమర్శనములు గలవు. నాఁటిదినములఁ బ్రచారములో నున్న కళావతీ, భారతీ పత్రికల శ్రీవేంకటరామశాస్త్రిగారును, వారి శిష్యులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారును జరపిన వాదోపవాదములు గలవు. వానిపై గ్రంథకర్త శ్రీవేంకటరామశాస్త్రిగారిని సమర్థించుచు వ్రాసినవిషయములు పెక్కులు గలవు. పీఠికయు దీనికనుగుణముగఁ గలదు. ఈవాదోపవాదములలోఁ గలవిషయములలోఁ జాలభాగము సహృదయరంజకములు గావని యు, నట్టివానిని వదలినచో నీగ్రంథము ప్రశంసార్హము గ నుండు ననియుఁ దలంచుచున్నాము. ఒకవేళ నట్టివాదములఁ దమయభిప్రాయముతోఁ బ్రకటించుటకే యీగ్రంథము రచింపఁబడినదేమో? వ్యక్తిదూషణాదులను వదలి, గ్రంథవిషయములనే గైకొని సహేతుకముగ నిష్పాక్షికబుద్ధితో విమర్శించుట యాంధ్రవిమర్శకులును జరిత్రకారులును ముఖ్యముగ నేర్చుకొనవలసియున్న దని మాయాశయము.

---

(4) బరోడా ప్రాచీనవస్తుపరిశోధనాసంఘప్రచురణములు:—ప్రకాశకులు శ్రీయుత హీరానందశాస్త్రిగారు.

(1) 1934-35 సంవత్సరకార్యనివేదిక.

(2) ప్రాచీనగ్రంథములఁ గన్పడు చిత్రలేఖనము.

(3) గిర్నారులోని యశోకునిశాసనము.

సంస్కృత భాషకును ప్రాచీనహైందవవిజ్ఞానపరిశోధనములకును బరోడాదొరతనమువా రొసంగు సహాయ మనల్పము. వీరిసంస్కృతగ్రంథావళి యం దమూల్యమగు గ్రంథములు పెక్కులు ప్రచురింపఁబడినవి. ఇటీవల 1934-వ సంవత్సరమున బరోడామహారాజుగారిచే నీసంఘము స్థాపింపఁబడినది. మొదటివత్సరమున బరోడారాజ్యమునఁ గలప్రాచీనశిల్పములు, కట్టడములు, శాసనములు పరిశోధింపఁబడి, యవి శిథిలముగాకుండు ప్రయత్నములు శాఖాధికారులచేఁ జేయఁబడినవి. మనదొరతనమువారి వార్షికనివేదికలందువలె వారికృషి మొదటిగ్రంథమున వివరింపఁబడినది.

ప్రాచీనగ్రంథములఁ జిత్రలేఖన ముండఁటఁ గన్పడుచున్నది. అం దుఁగల చిత్రములు గ్రంథవిషయములకు సంబంధించినవై యతిమనోహరములై యున్నవి. అహమ్మదాబాదునందున్నగు స్థలములఁ గలఁజైన భాండాగారముల నిట్టిగ్రంథసంపుటము లెన్నియేని గలవు. అందలి చిత్రలేఖనము మొగలుసామ్రాజ్యస్థాపనముకన్నఁ బ్రాచీనమై హైందవసంప్రదాయముల వ్యక్తీకరించుచున్నది. మనప్రాచీనచిత్రలేఖనము గ్రంథముల లోని విషయముల కెంతమాత్రమును సంబంధింపక యుండినదను పాశ్చాత్యవిద్వాంసుల యూహాలను ఖండింప నీగ్రంథమును హీరానందశాస్త్రిగారు వ్రాసియున్నారు. కావ్యాలంకారగ్రంథములఁ గలఖడ్గాదిబంధములును నట్టిచిత్రలేఖనమున కుదాహరణము లని వారువ్రాసిరి. రామాయణమహాభారతములు, అనంగరంగాదికామశాస్త్రగ్రంథములును, తంత్రగ్రంథములు, భగవద్గీతయందలి దశమాధ్యాయము, పెక్కుజైనగ్రంథములు సచిత్రము లగుసంపుటము లింకను భారతదేశమునఁ బెక్కుస్థలములఁ గలవని యు నందలి జిత్రలేఖనములఁ బ్రకటించి భారతీయుల చిత్రకళాప్రావీణ్యమును విమర్శింపవలయు ననియు వీరు వ్రాసి యున్నారు. గ్రంథమును విశదీకరించుటకై యిరువది ప్రాచీనచిత్రము లీయఁబడినవి.

భారతీయులలో నశోకుని స్మరింపనివా రరుదు. ఆతనిశిలాశాసనములు దక్షిణదేశమునఁ గూడ వ్యాపించి, యతనిధర్మపరాయణత్వము, నహింసావ్రతముమున్నగు సద్గుణములను ఘోషించుచున్నవి. ఏనిని హుల్షు, భండార్కరుమున్నగుశాస్త్రపరిశోధకులు ప్రకటించియున్నారు బరోడారాజ్యమునఁ గలగిర్నారుశిలలపై నశోకుని పదునాలుగు శిలాశాసనములు, రుద్రదామ, స్కందగుప్తుల శాసనములుఁ గలవు. ప్రాచీనచారిత్రపరిశోధకుల కివి యమూల్యములు. వీనిని మూలముతోడను, ఆంగ్లభాషాంతరీకరణముతోడను శాస్త్రిగారు ప్రకటించియున్నారు. అశోకుని పరిపాలనమును గూర్చిన ముఖ్యవిషయములు పీఠికయం దీయఁబడినవి. ఇట్టిగ్రంథములఁ బ్రకటించి భారతీయుల యౌన్నత్యమునకుఁ బాటుపడుచున్న బరోడాదొరతనమువారికిని, గ్రంథప్రకాశకులకును మనకృతజ్ఞతను దెలుపవలసియున్నది.

(5) Tirupathi Devasthanam Epigraphical Report and Inscriptions, text and translation.•(3 Vols.)

తిరుపతిదేవస్థానము పురాతనపుణ్యస్థలములలో నొకటి. అందలి దైవమగు శ్రీవేంకటేశ్వరులు విజయనగరరాజుల కిష్టదైవము. దేవస్థానపు కుడ్యములపై, పెక్కు ప్రాచీనశాసనములు గలవు. వానిలోఁజాలభాగము దొరతనమువారు ప్రతిబింబములఁ దీసి దమశాసనసంపుటములఁ బ్రచురించిరి. అయినను విశేషపరిశ్రమ మొనర్చి మహాంతు శ్రీప్రయాగదాసుజీ గారును, వారిప్రాచ్యపరిశోధనాశాఖాధికారి యగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారును నీమూఁడుగ్రంథములును ముద్రణ మొనర్చిరి. ఇందు మొదటిసంపుటమున దిరుపతిక్షేత్రము, నందలిదేవాలయములు, వాహనాదికములు వర్ణింపఁబడినవి. అందే, ద్వితీయభాగమున పల్లవచోళపాండ్యయాదవవిజయనగరరాజులకును, నీక్షేత్రమునకుఁ గలసంబంధము, వారిచరిత్రమున కుపకరించుశాసనవిషయములు వివరింపఁబడినవి. రెండుమూఁడుసంపుటముల శాసనములు ఆంగ్లభాషానువాదముతోడను, పీఠికతోడను బ్రకటింపఁబడినవి. చరిత్రకారుల కీశాసనసంపుటములు మిక్కిలి యుపయోగకారులు. మూఁడవసంపుటము సాళువనరసింహరాయుల శాసనములతో ముగియుచున్నది. మిగిలినశాసనసంపుటములను గూడ త్వరలోఁ బ్రకటించి దేవస్థానాధిపతులు దాక్షిణాత్యచారిత్రపరిశోధనమునకమూల్యసహాయ మొనర్తురని యాశించుచున్నాము.

---

(6) పురాణచిత్రములు:—శ్రీపెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు, కాకినాడ-(మూఁడుభాగములు). ఈగ్రంథభాగములు వేదాంతవిషయములు సామాన్యులకు దెలుపుటకై వ్రాయఁబడినవి. రామాయణభాగవతాదిగ్రంథములఁ గలయుపాఖ్యానములకు నాధ్యాత్మముగ నంతరార్థమును వివరించుటకు గ్రంథకర్తలు ప్రయత్నించిరి. అందు వీ రెంతవఱకుఁ గృతకృత్యతను గాంచిరో పాఠకులే యూహింపవలసియున్నది. భాషయు నస్వాభావికము. ఆంగ్లభాషాపదముల నాంధ్రీకరించుటలోఁ బడినశ్రమ వ్యక్తమగుచున్నది.

చ. [1]ఋతునయనాశ్వసప్తశశివీక్షణవార్ధిశిఖీంద్రము లిందులో
శతయుగళైకవృత్తములు ఛందము లిర్వదియాఱిటం బ్రశ
స్తత గలవానినామగణసంజ్ఞలు దాఁట్రైన వక్కుగూర్చి చే
సితి నిటు సంస్కృతాంధ్రకవిసింహులలక్షణరీతి మారుతీ. ౯౮

— పాదగోపనము. —

చ. ఘనహరి భానుజాప్త మతికంజభవా యతులప్రతాప భా
గ్యనిధి కృపాకరా జనకజాయతశోకనికృంతకచా మహాత్మ పా
వని పటుకేసరీచయవర్య సుధీసరసాద్య హృద్యశా
హనుమ జయప్రభాధికనయక్రమపావనచర్యసద్యశా.[2] ౯౯

—జగణచతుష్పదము—

వృక్షాటవంశతారా
ధృక్షా జన్యప్రభంజితాసురసైన్యా
యక్షయసుశౌర్యసంప
ద్దక్షా మాన్యరవిజప్రధానా ధన్యా.

మాలిని. ప్రమదశుభచరిత్రా భక్తధాత్రీజమైత్రా
విచలితరిపుగోత్రా వీతిహోత్రాప్తపుత్రా
ద్రుచరవనజమిత్రా దోషవల్లీలవిత్రా
యచలసదృశగాత్రా యక్షవృక్షాగ్నిహోత్రా. ౧౦౧

గద్యము. ఇది శ్రీ హనుమద్వరప్రసాదలబ్ధ సారస్వతపాత్ర భారద్వాజ గోత్రపవిత్ర సర్వయామాత్యపుత్ర చిత్రకవి పెద్దనార్యప్రణీతం బైన లక్షణసారసంగ్రహంబునందు- అక్షరలక్షణంబును, గురులఘుసంజ్ఞలును, గణనిర్ణయంబును, గావ్యస్వరూపంబును, గవినేతృస్వరూపంబును, అష్టాదశప్రాసభేదంబులును, సప్తవింశతియతిస్థితులును, ఉక్తాదిషడ్వింశతిచ్ఛందంబులం గల వృత్తసంఖ్యలలోఁ బ్రసిద్ధవృత్తలక్షణములునుం గల ప్రథమాశ్వాసము.

---

1. ౧౩౪౭౧౨౨౭౯౬.

2. ఈనాల్గవపాదము, మొదటి మూఁడుచరణములలోను గలయక్షరముల లో రెం డువిడిచి మూఁడవదానిని దీసికొనుచు, ఎత్తి వ్రాసినచో నగును.

# లక్షణసారసంగ్రహము

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీరఘునాయకపాదస
రోరుహయుగలోలహృదయరోలంబవరా
ఘోరతరవాలమారుత
వారితరిపుజలదవార వాయుకుమారా. ౧

వ. అవధరింపుము. ౨

గీ. అర్ధసమములు విషమము లనఁగ రెండు
గతుల సమవృత్తముల గణాక్షరములె యగు;
నర్ధసమములు ద్వివిధంబు లగుచు రెండు
జరగు స్వస్థానములుఁ బరస్థానము లన. ౩

గీ. విషమవృత్తంబులంహాఁ ద్రివిధము లగుచుఁ
దనరు స్వస్థానములుఁ బరస్థానము లన
వెండి సర్వపరస్థానవిషమ మనఁగ
నిన్నియును నైదుగతు లయ్యె వనజమిత్ర. ౪

సీ. సమముగా నాదిత్రిచరణంబు లొకట ద్వి
చతురంఘ్రు లొకట నాచందమునను
జరగు స్వస్థానార్ధసమ మిట్లు నాదిత్రి
చరణంబు లెత్తినఛందమునను
ద్విచతురంఘ్రులమీఁద వెలయుఛందమునఁ గూ
ర్చను పరస్థానార్ధసమము దనరు
ఛంద మొక్కటి గొని చరణము ల్వేఱుగా
విరచింప స్వస్థానవిషమ మయ్యెఁ
బాద మొకటనున్న పదము లీఁదిఛంద
మునఁ బరస్థానవిషమసంజ్ఞను దలిర్చు
నాల్గుపదముల నాల్గుఛందములు దగుల
వెలయు సర్వపరస్థానవిషమ మనఁగ. ౫

వ. ఇందు స్వస్థానార్ధసమంబు లెట్టి వనిన:— ౬

గీ. నిశియు, విపరీతసంజ్ఞ యగా నిశి, రతిప్రి
య, మజితప్రతా, పోఃచిత్రాఖ్య లైన
యవియు, నాక్షిప్తతం బన నాఱుగతుల
జరగుచుండు స్వస్థానార్ధసమము లగుచు. ౭

౧. నిశివృత్తము.

చే సింద్రవజ్రంబునఁ జేర్చి రాఁగా
నెసంగఁగా సర్గ నుపేంద్రవజ్రక్
భాసిల్లఁగాఁ గూర్చియు బాగుమీఱ
న్వేస న్నిశీనామసువృత్త మయ్యెక్. ౮

ఇదే యుపజాతివృత్తము. దీనికే మఱియు-

ఈవింతతో జేసుల నింద్రవజ్రం
బివ్పుర్పఁగా సర్గ నుపేంద్రవజ్రం
బీవైఖరిన్ రెండును నిట్లు గూర్ప
న్నవజ్రదేహా యుపజాతి యయ్యెన్. ౯

౨. విపరీతనిశివృత్తము.

ఇరస్తుతా జేసి నుపేంద్రవజ్రక్
హీరాంగ సర్గిందును నింద్రవజ్రన్
ధరాధిరాజా యిది దా ధరిత్రిన్
శ్రీరీతి నొప్పు న్విపరీతపూర్వన్. ౧౦

3. రతిప్రియవృత్తము.

ఖ్యాతి న్జేసుల సంప్రహర్షిణిం దలిర్పన్
యుతంబుగా రుచిరము యుక్పదంబులన్
నీతిం గూర్పఁగనుక్ మనీషు లైనకావ్య
వ్రతిప్రియం బనుచుఁ దలంతురా కృతిన్. ౧౧

౪. అజితప్రతాపవృత్తము.

అజరస్తుతాంగ ప్రమితాక్షరతో
నజమతిస్ఫుట ప్రియంవదాఖ్యతో

నజితప్రతాప మన నయ్యెనయా
సుజనకల్పకము సూరు లెంచఁగాన్. ౧౨

౫. ఉపచిత్రవృత్తము.
అసమంబుల సాసవ లంది యా
ర్యాసుత దోదక మయ్యెను సర్ల
ప్రసికస్తుత సద్గుణరత్న ఘో
రాసురభంజన యాయుపచిత్రన్. ౧౩

౬. నారీప్లుతవృత్తము.
బేసుల్ శాలిన్యాఖ్యవృత్తంబు గాఁగా
నీసూటితో సర్లను నింద్రవజ్రం
బై సేయు న్నారీప్లుతాయాథ నామం
బోసత్యసంఘా లసముజ్జ్వలాంగా. ౧౪

వ. ఇది స్వస్థానార్ధసమవృత్తాధికారం బింకఁ బరస్థానార్ధసములక్షణంబు
నం గలవృత్తంబు లెట్టి వనిన— ౧౫

సీ. కేతుమతి వేగవతి వియోగిని పరావ
తియును ధృతమధ్యయును గోమలియును మణివి
తానకాంతి మనోహర దనరుఁ బుష్పి
తాగ్ర భద్రవిరాట్టును నపరవక్త్ర. ౧౬

క. శ్రీనాయకభృత్య పర
స్థానార్ధసమంబు లివియుఁ దగుఁ బదునొకఁడై
పూని ప్రసిద్ధము లైనవి
గా నెఱుఁగఁగవలయు వీనిగతులు కవీంద్రుల్. ౧౭

౧. కేతుమతివృత్తము.
చను బేసుల న్సజసగాప్తి
న్భానుసమా సరిన్ భనగగంబుల్
తనరం గవీంద్రతతి యెన్నం
దోనమరింపఁ గేతుమతి మించున్. ౧౮

౨. వేగవతీవృత్తము.

తగు జేసుల సత్రయుగంబు
ల్బాగుగఁ గోదక పాటిలు నర్లం
బాగడొందఁగ నేప్పఁగూర్ప
న్వేగవతీవరవృత్తము మించున్. ౧౯

౩. వియోగినివృత్తము.

అసమంబులయందు సాజగల్
వస నర్లందు సభ్రలవంబు లిం
పెసఁగ బ్రచియింపఁ జెల్వ మ
య్యు సమర్థించు వియోగినిం దగన్. ౨౦

౪. పరావతీవృత్తము.

బేసులందు పాంబు లాఱుపెట్టి యూల
పెస నర్గంబు లాఱు గం బడిన్నరి ప్రాఁ
జేసి కేఁ బరావతీప్రసిద్ధసంజ్ఞఁ
బొసంగుపేరి వృత్తమాను భూఁకీర్తి. ౨౧

౫. ధృతమధ్యావృత్తము.

ఆరయఁ దోదక మంటురు బేసు
ల్సరులను దోదకలక్షణ మొందన్
మారుతి యాధృతమధ్యకు నెంచు
న్సరసకవీంద్రులు సమ్మతిఁ గూర్పన్. ౨౨

౬. కోమలివృత్తము.

అనిలజ దోదక మా విషమాంఘ్రు
ల్జనస్తుతా రుచిర యసంగు యుక్తులన్
ఘనతర మైతగఁ గావ్యములందు
స్వనంగఁ గోమలియను వృత్త మొప్పగున్. ౨౩

౭. మణివితానకాంతివృత్తము.

రంగా శుద్ధవిరాట్టు బేసుల
న్సంగతి నసలఁ జాల్ రథోద్ధత

స్రంగత్సారధురంధరాభ్రమా
తంగ వి స్మణివితానకాంతికిన్. ౨౪

౮. మనోహరవృత్తము.

జేసి న్గలికాంతను జేర్చియు నిం
పెసఁగ న్సరితోటకవృత్తముతో
భాసిల్ల నొనర్చిన భవ్యయశో
విసరాఢ్య మనోహరవృత్త మగున్. ౨౫

౯. పుష్పితాగ్రవృత్తము.

పరఁగ ససమమందు భద్రికాగ
ల్నరులఁ బ్రభాత మెసంగుఁ బుష్పితాగ్రన్
హరికులమణి యంజనాత్మజాతా
శరనిధిలంఘనశౌర్య సత్యసంధా. ౨౬

౧౦. భద్రవిరాట్టువృత్తము.

తాఁజెం దసమాన తజ్రగాప్తి
స్రాజి ల్బద్ధవిరాట్టు గంబు సర్గం
దేజోవిజితార్క తేటగాఁగన్
భ్రాజద్భద్రవిరాడ్విధంబు మించన్. ౨౭

౧౧. అపరవక్త్రవృత్తము.

అనఘ యసమమునుందు భద్రిక
న్జనపతి మాలిని సర్గయందు ని
ల్ప నది యపరవక్త్రవృత్త మా
ననుచును సత్కవు లంద్రు మారుతీ. ౨౮

వ. ఇవి పరస్థానార్ధసమవృత్తంబు లింక స్వస్థానవిషమంబు పరస్థానవిషమంబు సర్వపరస్థానవిషమంబు ననంగల విషమవృత్తత్రయ లక్షణంబు లెట్లనిన. ౨౯

—:స్వస్థానవిషమవృత్తములు.:—

గీ. ధరణియు వరాంగి యంగజాస్త్రము నదీప్ర
ఘోష మన నాల్గు పేరులఁ గొమరు మిగిలి

ఘంద మొక్కటఁ దగిలి ప్రశస్త మగుచుఁ
దనరు స్వస్థానవిషమవృత్తంబు లనఁగ. ౩౦

౧. ధరణీవృత్తము.

గీ. జరగు నీనాలుచరణము ల్జగతియుండె
ఋతుశరాద్రీందుల శిఖిభఋతుశరులను
యుగనవధరాబ్జుల నవాక్షినగహిమకుల
ధరణి కుద్దిష్టమున నిడఁదగుచు బేర్లు. ౩౧

మును నీఃల్చను, తోటకముఁ మఱిపై
జానుగాఁ దర్కవిశ్రాంతిరా రసముల్
స్వనయతి ననససజా మనసా
ల్రానేనింట స్వళ్ళ గ్గలుగు ధ్ధరణిన్. ౩౨

౨. వరాంగీవృత్తము.

ఇర న్బుధుల్ మెచ్చ నుపేంద్రవజ్ర
న్మరుత్తనూజా ప్రథమద్వితుర్యల్
హేరాళమై యుండఁగ నింద్రవజ్రన్
వరాంగికిన్ త్ర్యంఘ్రికి వైపుమాపున్. ౩౩

౩. అంగజాస్త్రవృత్తము.

రూపయి మించ స్రుగ్మవతిన్మన్
దీపితమై యుండెన్ యరగాగాల్
ప్రాపై శుద్ధవిరాట్టునన్మితం
బై పైనర్ధము నంగజాస్త్రమా. ౩౪

౪. నదీప్రఘోషవృత్తము.

చాల నాద్యంఘ్రికిన్ స్రగ్విణీవృత్తముం
దలంపఁగాఁ దక్కిన త్రియాంఘ్రులం
జెలంగ వంశస్థచు జిత్రకీతి సం ౩౫
ధిలంగఁ గూర్పంగ నదీప్రఘోషమా.

వ. ఇవి స్వస్థానవిషమవృత్తంబు లనం దగు నింకఁ బరస్థానవిషమవృత్తం
బు లెట్లనిన. ౩౬

—ః పరస్థానవిషమవృత్తములు. ః—

క. క్షమ శరభక్రీడయు శ్రీ, రమణ రథగమన మనోహర మని యనెడు వృ
త్తము లీత్రయంబు విదళిత, విమత పరస్థానవిషమవృత్తము లయ్యెన్.

౧. అందుశరభక్రీడా వృత్తము.

కృతీశా చంద్రశ్రీప్రథమమున రెండింటియందున్
చతుర్థాంఘ్రిన్ రాఁగా మభసజ (సమాంచద్గణంబుల్)
చాతుర్యంబొప్పఁగ సువిశాలకీర్తిన్ త్రయనఘ్రిం గూర్పన్
ప్రతిజ్ఞావాక్యాలా వినుము శరభక్రీడ యయ్యెన్. ౩౮

౨. శ్రీరమణవృత్తము.

రూపయి యాది నుగ్మవతి నా
నాపయి దోదకమంఘ్రుల మూఁటన్
దీపిత మైనను ధీరులు మెచ్చన్
శ్రీపతిసేవక శ్రీరమణంబౌ. ౩౯

3. రథగమనమనోహరవృత్తము.

ప్రథి ననరజగాప్తిఁ బాటిలంగ నయ్యె
ప్రథమ తృతీయ చతుర్థ పాదముల్ జయోద్య
త్ప్రథ నజజరయ ద్వితీయపాదయుక్తిఁ జెంద
న్రథగమనమనోహరం బగున్ సుకీర్తి. ౪౦

ఇవి పరస్థాన విషమవృత్తంబు లింక సర్వపరస్థానవిషమవృత్తంబు లెట్లనిన.

—ః సర్వపరస్థానవిషమవృత్తములు. ః—

గీ. తనర వీణారచన యుద్గతంబు మధుర
యనఁగ మణిదీపికయు నన నమరు నాల్గు
పేర్లుగలిగినవృత్తముల్ పృథులశౌర్య
వినుము సర్వపరస్థానవిషమ మగుచు. ౪౧

౧. వీణారచనవృత్తము.

స్ఫారంబుగ నాదిఁ దయసాగురువు రా
నా రెండవయంఘ్రి తజనభాప్తి గగం బై
భారంజిత మూఁట తజనభల్ సగణము వీ
ణారచన కగు భననజన ల్గురువు తుదన్. ౪౩

1. మభసయ...చంచద్గణంబుల్. మూ.

# లౌకికన్యాయవివరణము.

లోకోక్తులు, సామెతలు, ఆభాణకములు (శ్లోకరూపములు) న్యాయములు మొదలగునవి యన్నియును గొప్పలోకానుభవము గల పెద్దలసూక్తులు. తెలుఁగుభాషలో వాడుకచేయఁబడు సామెతలు ప్రతి వారికి సుబోధములు కావున వానికి వివరణ మవసరము లేదు. కాని వ్యాకరణగ్రంథములును, న్యాయవైశేషికాదిగ్రంథములును, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస, ఉపనిషద్భాష్యములు, అలంకారశాస్త్రము, శుక్రనీతి, కామందకీయాది నీతిశాస్త్రగ్రంథములు మొదలగువానియందు నాయాగ్రంథసందర్భములయం దుదాహరింపఁబడిన యీన్యాయములే వివరణాపేక్షములు. వీనియందు శాస్త్రసంప్రదాయములు, పారిభాషికపదములు మెండుగా నుండుటచేతఁ బండితైకసమధిగమ్యములు. భగవద్గీతలయందు దశోపనిషత్తులయందుఁ బ్రయోగింపఁబడిన కఠినపదముల కర్థముతో నకారాదిగాఁగల యొకసంపూర్ణసూచిని వ్రాసి ప్రకటించిన పాశ్చాత్యపండితశిరోమణి యగు కర్నల్ జయకాబీపండితుఁడు సకలశాస్త్రగ్రంథములను శ్రద్ధతోఁ బరిశీలించి యీన్యాయములను సంగ్రహించి వాని నన్నింటి నాంగ్లేయభాషలో వివరించి మూఁడుభాగములుగా నచ్చొత్తించి ప్రకటించెను. దానికి "లౌకికన్యాయమాల" యని పేరిడెను. ఆగ్రంథము సంస్కృతాంగ్లేయభాషలలోఁ బ్రవేశ మున్నవారికే గాని యితరుల కుపయోగింపదు. అందుచే నేను వానిలో ముఖ్యమైన న్యాయములఁ గొన్నింటిని దీసి మనపాఠకుల కుపయోగించునట్లు తెలుఁగుభాషలో వివరించుటకు సమకట్టితిని.

ఇదిగాక యీలౌకికన్యాయములను బ్రతిపాదించు విస్తృతమైన గ్రంథము మఱియొకటి కలదు. దానిపేరు "భువనేశదత్తలౌకికసాహస్రి." అది బొంబాయినగరమునకు శాఖానగరమైన కల్యాణిలో గంగావిష్ణు శ్రీకృష్ణదాసు, అనువర్తకుని లక్ష్మీవేంకటేశ్వరముద్రాక్షరశాలలో ముద్రి

తమైనది. ఈగ్రంథము జాకోబీపండితుని గ్రంథముకంటె విపులతర మైన వ్యాఖ్యానముతో వ్రాయఁబడినది. దీని నామూలాగ్రముగాఁ బరిశీలించి యిందుఁ గలముఖ్యమైన న్యాయముల నిందులోఁ గూర్చితిని. ఈగ్రంథకర్తవృత్తాంతమును యథాజ్ఞాతముగా నీవ్యాసమందుఁ దెలుపుచున్నాను. తొల్లి మూలత్రాణనగర మను (Mooltan) నొకపట్టణమం దధీతసకలవేద శాస్త్రాగమేతిహాస పురాణకలాపుఁడు జ్యోతిశ్శాస్త్రపారంగతుఁడు "ఆశానందుఁ" డను నొకవిప్రవర్యుఁడు గలఁడు.

అతఁడు సారస్వతసేతుపాల మనువంశమందుఁ బుట్టినవాఁడు. అతనికి ఠాకురుదత్తుఁ డనునొకపుత్రుఁ డుదయించెను. ఇతఁడు కూడఁ గాలక్రమమునఁ దండ్రివలెనే మహావిద్వాంసుఁడై నానాదేశసంచారము చేసి సకలరాజస్థానములయందు సన్మానితుఁడయ్యెను. తరువాతఁ గొంతకాలమునకు ఠాకురుదత్తునకు విక్రమార్క శకము ౧౯౩౮ సం. లో భువనేశదత్తుఁ డనునొకకుమారుఁ డుద్భవించెను. విద్యాభ్యాసోచితవయస్కుఁడై పాఠశాలకుఁ బోయి కొంతకాలము చదివి ప్రథమపరీక్షయం దుత్తీర్ణుఁ డయ్యెను. ఈకాలమందు శ్రీరామనగరవాస్తవ్యుఁ డగు నొకకులీన బ్రాహ్మణుఁడు వచ్చి యీభువనేశదత్తునకుఁ దనకొమార్తె నిచ్చెద నని ప్రతిజ్ఞఁజేసెను. భువనేశునితండ్రియును వివాహమహోత్సవమును నిర్వర్తించెను. కొంతకాలము చన్నపిదప నతనికి నరేంద్రుఁ డను పుత్రుఁడు పుట్టెను. అపుడు భువనేశుఁడు మరల బడికిఁ బోయి మధ్యమపరీక్షకుఁ జదివెను. కాని దైవవశమునఁ బరీక్షయం దుత్తీర్ణుఁడు కాఁజాలక పోయెను. అయినను లవపురమునకుఁ బోయి యచట ముప్పదిరూప్యముల యుద్యోగములోఁ బ్రవేశించి యాసొమ్మును, తండ్రికిఁ బంపించుచుండెను. ఆంగ్లేయభాషయందుఁ గూడ మంచిప్రవేశమును సంపాదించెను. కొంతకాల మైనతరువాతఁ, దండ్రియాజ్ఞచే స్వగ్రామమునకు మరలి వచ్చెను. నరేంద్రుఁడు నాలుగువత్సరములు వయస్సు గలవాఁడై యుండఁగా భువనేశుఁడు తలిదండ్రులను బంధువర్గమును మిత్రబృందమును శోకసాగరనిమగ్నులను జేసి యాకస్మికముగా దేవభూయమును నొందెను. తద్వం

శజుఁడు భువనేశదత్తుని పితామహుఁడై నారాయణదత్తుని ప్రియశిష్యుఁడు నగు తేజోభానుశాస్త్రి యనుపండితుఁడు భువనేశుని స్తుత్యర్థముగా లౌకికన్యాయసాహస్రి యనుగ్రంథమును రచియించి లోకమున కిచ్చెను.

# న్యాయములు.

## ౧. ఫలవత్సహకారన్యాయము.

"ఆమ్రే ఫలార్థే రోపితే ఛాయాగన్ధా అనూత్పద్యేతే" అని యాపస్తమ్బసూత్రము. పండ్లకొఱకుఁ దియ్యమామిడిచెట్టును మొలవేయఁగా ఫలమే గాక నీడ, సౌగంధ్యము కూడ, సంప్రాప్తమగును. ఏకఫలము కొఱకుఁ బ్రయత్నము చేయువానికి దైవయోగమున నన్యఫలములు కూడఁ జేకూరును.

## ౨. వృద్ధబ్రాహ్మణవరన్యాయము.

తొల్లి జాత్యంధుఁడు, అత్యంతదరిద్రుఁడు, బ్రహ్మచారి యునైన యొకవృద్ధబ్రాహ్మణుఁ డుండెను. అతఁడు బహుదుఃఖపీడితుఁడై తీవ్రతపస్సుచేతఁ బరమేశ్వరు నారాధించెను. అతని తపస్సుచేతఁ బ్రీతుఁడై పరమేశ్వరుఁడు స్వాభీష్టమైన యొకవరమును యాచింపు మని చెప్పెను. అంత నావిప్రుఁడు "కన్నులిమ్మని కోరిన దారిద్ర్యదుఃఖ మెప్పటివలె నుండును, భార్య కావలె నని యాచించిన నంధత్వదారిద్ర్యసంతత్యభావములు దుఃఖమును బుట్టించును. ధనము కోరిన దానిని జోరు లపహరింతురు" అని యిట్లు నానావిధచింతాసమాకులుండై యేమియును దోఁపక కొంతకు స్వపౌత్రుని రాజసింహాసనము నున్నవానినిగాఁ జూడఁ గోరెద నని వర మడిగెను. అంత సర్వేశ్వరుఁడు వానిబుద్ధికౌశలమునకు సంతసిల్లి యాబ్రాహ్మణునికిఁ గన్నులును ధనమును రూపవతి యైన భార్యను ననుగ్రహించెను. కావున—

"పితా మాతా సుహృద్భ్రాతా బాంధవా గురవో హ్యమీ, ఏకైక ఫలలాభాయ సర్వలాభాయ కేశవః"— అన్నట్లు సర్వేశ్వరుఁడు సర్వఫలప్రదుఁడు.

## 3. కంఠచామీకరన్యాయము.

తనకంఠమం దున్న స్వర్ణభూషణమును బాఱు మఱచిపోయి దానిని పైని వెదకుట- "యథా హిరణ్యనిధి మక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరన్తో నవిన్దేయుః" (భూమియందుఁ బాతఁబడి యుండిన బంగారునిధిని పైపైని సంచరించు క్షేత్రజ్ఞులైన మనుష్యు లెల్లు గానఁజాలరో) అని ఛాందోగ్యశ్రుతి- "య ఆత్మని తిష్ఠన్- య మాత్మా న వేద, ఆత్మాన మన్తరో యమయతి" అని యంతర్యామిబ్రాహ్మణము. (ఎవఁ డాత్మలో నున్నాఁడో, ఎవని నాత్మ యెఱుఁగదో, ఎవఁడు లోపలనుండి యాత్మను నియమించుచున్నాఁడో) "దురధిగమోఽసతాం హృదిగతోఽస్మృతకణ్ఠమణిః" (భాగవతము శ్రుతిగీతులు 3౯ శ్లో) "యది నసముద్ధరన్తి యతయో హృది కామజటా దురధిగమోఽసతాం హృదిగతోఽస్మృతకణ్ఠమణిః."

౪. అర్కే చేన్మధు విన్దేత కిమర్థం పర్వతం వ్రజేత్
ఇష్టార్థస్య చ సంసిద్ధౌ కో విద్వాన్ యత్నమాచరేత్.

అర్కము- అనఁగా గృహకోణము- ఇంటిమూలలను తేనె దొరకిన యెడఁ బర్వతమున కేల పోవలెను. తాను గోరినవస్తువు సులభముగా లభించినచోఁ బ్రాజ్ఞుఁ డెందులకు శ్రమపడవలయును. తనయం దున్న పరబ్రహ్మమును దెలిసికొని బ్రహ్మవేత్త యజ్ఞదాన తపస్తీర్థయాత్రాదుల యందు విగతోత్సాహుఁ డగును.

"అర్కేచే న్మధు విన్దేత" అని మఱి యొకపాఠము గలదు. అర్కమనఁగా జిల్లేడుచెట్టు. ఈన్యాయము శాంకరబ్రహ్మసూత్రభాష్యము, 3-౪-3 లో నుదాహరింపఁబడినది. "కేవలాచ్చేత్ జ్ఞానా త్పురుషార్థసిద్ధి స్స్యా దనేకాయాస సమన్వితాని కర్మాణి తే కిమర్థం కుర్యుః, అర్కే చే న్మధు విన్దేత కిమర్థం పర్వతం వ్రజేత్ ఇతి న్యాయాత్- శాబరభాష్యము ౧-౨-౪. పూర్వపక్షి చెప్పుమాట-"తద్యథా పథిజాతేఽర్కే మధూత్సృజ్యతే నైవ తథా మధ్వర్థినః పర్వతం న గచ్ఛేయుః తాదృశం హి తత్, అర్కే చే న్మధు విన్దేత కిమర్థం పర్వతం వ్రజే దితి న్యాయాత్.

## ౫. అర్ధజరతీన్యాయము.

అర్ధజరతీ=సగము ముసలిది. దీనియర్థ మిది యని నిశ్చయించి చెప్పుట నిక్కమి కష్టము- దీనియర్థనిర్ధారణమందు శాస్త్రజ్ఞులు భిన్నాభిప్రాయులై యున్నారు. వర్ధమానుఁడు గణరత్నమహోదధిలో ౩-౧౯౫ నిట్లు వివరించెను. "కాకతాళం చ ఖల్వాటబిల్వే చాంధకవర్తకం। అర్ధాచ్చ జరతీ శ్చైనా త్ర ప్రోతో ఘుణాతో౽క్షరమ్॥ "యథా స్త్రీ న తరుణీ శ్లథస్తనత్వాత్ కృష్ణకేశత్వా చ్చ జరతీ వక్తుం శక్యతే, తద్వ త్సిద్ధాసిద్ధం ప్రయోజనం" అవయవములు శిథిలముగా నుండుటచేఁ బడుచుకాదు, కేశములు నల్లగా నుండుటచే నంతముసలి దనియునుఁ జెప్పలేము- ఈ న్యాయమును శంకరాచార్యులవారు బ్రహ్మసూత్రభాష్యమం దిట్లుదాహరించియున్నారు. ౧-౧-౧౯. యథా అన్నరసమయః ప్రాణమయ ఇత్యాదా వికారార్థే మయట్ప్రవాహే సతి ఆనందమయ ఏవాకస్మాదర్ధజరతీయన్యాయేన కథ మివ మయటః ప్రాచుర్యార్థత్వం బ్రహ్మవిషయత్వం వా శ్రీయత ఇతి" దీని కనిశ్చితస్వభావము గలకార్య మని కొందఱు- సంశయితవా క్యని మఱికొందఱు నర్థము చెప్పిరి.

## ౬. తృణజలూకన్యాయము.

తృణము=గడ్డిపరక—జలూక=జలగ. జలం ఓకః యస్య సః జలౌకాః- జలగ యింకొక గడ్డిపరకను బట్టుకొని గాని పూర్వపు గడ్డిపరకను విడువదు. ఆరీతిగానే ప్రాజ్ఞుఁడు మఱియొక పదవిని సంపాదింపనిదే పూర్వపుఁ బదవిని విడువఁడు. ఈన్యాయము-బృహదారణ్యకోపనిషత్తు ౪-౪-౩ లోఁ జెప్పఁబడినది. "తద్యథా తృణజలూకా తృణస్యాన్తం గత్వా అన్య మాక్రమ మాక్ర మ్యాత్మాన ముపసంహర త్యేవ మేవాయ మాత్మేదం శరీరం నిహ త్యావిద్యాం గమయిత్వా అన్యమాక్రమ మాక్ర మ్యాత్మాన ముపసంహరతి"

## ౭. స్థూణానిఖననన్యాయము.

స్థూణా=స్తమ్భము, రాట-నిఖననము=పాఁతుట—

మన మొక పందిరిరాటను బాఁతినపు డది దృఢముగా నున్న

దో లేదో యని పరీక్షించుటకు దానిని నాలుగువైపుల నూపి చూతు ము. అట్లే మన మొకమనుష్యుని యిష్టానిష్టములను గనుఁగొనుటకు దానికున్న సాధకబాధకములను జెప్పి వానిసమ్మతిని స్థిరపఱిచెదము. ఈ న్యాయము, శాంకరబ్రహ్మసూత్రభాష్యములో ౨-౧-౩ న నుదాహరింపఁ బడినది. "పునశ్చ జరాజన్మాదిహేతుత్వ మీశ్వర స్యాక్షిప్యతే స్థూణానిఖననన్యాయేన ప్రతిజ్ఞాత స్యార్థస్య దృఢీకరణాయ."

## ౮. సింహావలోకనన్యాయము.

సింహ మరణ్యములో నాహారార్థమై యొకజంతువును వధియించి తనకుఁ బ్రతిస్పర్ధి యగు మఱి యొకమృగ మేదైన వచ్చుచున్నదేమో యని వెనుకకుఁ జూచుట దానికలవాటు. అట్లే యొకపద్యమందుఁగాని శ్లోకమందుఁ గాని కొనయున్న పదము పద్యాదియందుఁ గాని శ్లోకాదియందుఁ గాని యున్నపదముతో నన్వయించుటకు సింహావలోకన మని పేరు. ఎట్లనఁగా-నరసభూపాలీయము. 4 ఆశ్వా.

క. మనవేటికి నూతనమా
  తనమానెడఁ బ్రేమ తనకుఁ దక్కితి ననుమా
  నను మానక దయ దనరం
  దనరంతులు మాని నరసధరు రమ్మనవే.

ఈపద్యమునకు కొన నున్న "రమ్మనవే" అనుపదము, మొదటనున్న "మన వేటికి" అనుపదముతో నన్వయించుచున్నది.

ఈన్యాయము ఆచార్యహేమచంద్రుని పరిశిష్టపర్వములో ౧-౬. 3 నిట్లు ప్రయోగింపఁబడినది. "సింహావలోకనన్యాయే నాలీఢః క్షత్రతేజసా, ప్రత్యాఖ్యానివ సోఽద్రాక్షీత్ తా నమాత్యా న్నతద్విషః".

## ౯. కాకాక్షిగోళకన్యాయము.

దీనినే తఱచుగా "కాకాక్షిన్యాయ" మందురు. కాకి కొక్కటే కన్నని లోకు లనుకొందురు, గాని, యది కాదు. దాని కొక్కటియే నేత్రగోళము (కన్నుగ్రుడ్డు). అది దాని యవసరమునుబట్టి రెండువైపులకుఁ దిరుగును.

అట్లే యొకశ్లోకమం దొకపదము వెనుకపదముతోను ముందుప దముతోను నన్వయించినపు డది కాకాక్షిన్యాయముగా నన్వయించు చున్న దని వ్యాఖ్యాతలు వ్యవహరింతురు. ఎట్లనఁగా; "ద్వీపోఽస్త్రియాము మన్తరీపః" అని యమరము. ఇచట "అస్త్రియాం" అను పదము ద్వీపశబ్దముతోను, అన్తరీపశబ్దముతోడను నన్వయించుచున్నది.

## ౧౦. గడ్డాలికాప్రవాహన్యాయము.

గడ్డాలికా=గొఱ్ఱె—గొఱ్ఱెలమంద పోవుచుండఁగా మార్గమధ్యమం దొకనది ప్రవహించుటను జూచి దానియొద్దను గొఱ్ఱె లన్నియును గొంతసేపు నిలువఁబడి కొన కొక గొఱ్ఱె దాఁటుటను జూచి మందలోని గొఱ్ఱె లన్నియును దానివెనుకనే పోవును. ఆరీతిగా లోకములో నొకఁడు మంచిపనిని గాని చెడ్డపనిని గాని చేసినచోఁ దక్కినవా రందఱు, గతానుగతికముగా వానినే యనుసరింతురు.

ఈశబ్దమునకు నాలుగురూపములు కానవచ్చుచున్నవి. ౧. గడ్డరికా. ౨. గడ్డలికా. ౩. గడ్డారికా. ౪. గడ్డాలికా—వీనిలో నెద్ది శుద్ధరూపమో నిశ్చయముగాఁ దెలియదు.

ఈన్యాయము కావ్యప్రదీపాష్టమోల్లాసప్రారంభమందు ౩౨౭ పుట "గడ్డలికా మేషీ కాచి దేకా కేనచి ద్ధేతునా పురోగచ్ఛతి ఇతరాస్తు వినైవ నిమిత్తవిచారం తా మనుగచ్ఛన్తి"

## ౧౧. గుడజిహ్వికాన్యాయము.

తలిదండ్రులు మందు ద్రాగ నని యల్లరిచేయు బాలుని నాలుకపైని ముందు బెల్లమును రాచి పిదప మందును ద్రాగింతురు. అట్లే యజ్ఞాదికర్మలు చేయుట కష్ట మని తలంచి వానిలోఁ బ్రవర్తింపని పురుషుని వేదము "అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి" (చాతుర్మాస్యయాజియొక్క పుణ్య మక్షయము) అను ప్రరోచనావాక్యముచేఁ గర్మయందుఁ బురుషుని బ్రవర్తింపఁజేయును. ఈన్యాయము కావ్యప్రదీపిక—౭వ పుటలో వివరింపఁబడినది. "యే సుకుమారమతయోఽ

తిసుఖస్వభావాద్రాజకుమారాదయో నీరసే నీతిశాస్త్రే ప్రవర్తయితు మశక్యా స్తా న్త్యాఖ్యాయికా స్తేన సరసతాపాదనే నాభిముఖీకృత్యో పదేశం గ్రాహయతి గుడజిహ్వికయా శిశూ నివౌషధమ్”-యథాహుః-స్వాదుకావ్య రసోన్మిశ్రం వాక్యార్థ ముపభుఞ్జతే-ప్రథమాలీఢమధవః పిబన్తి కటుభేషజమ్.

## ౧౨. గోబలీవర్దన్యాయము.

“ఉక్షా భద్రో బలీవర్ద ఋషభో వృషభో వృషః అనడ్వాన్ సౌరభేయీ గౌః” అని యమరనిఘంటువు. ఈశబ్దము లన్నియు వృషభపర్యాయములు. గామానయ, బలీవర్దంచానయ (గోవును గొనితెమ్ము, బలీవర్దమును దెమ్ము) గోపదముచేతనే “ఎద్దు” అని యర్థ మగుచుండఁగా బలీవర్దశబ్ద మేల? అంటే-బలీవర్దపదము దుర్దమ్యత్వమును (లొంగనియెద్దు) అని తెలియఁజేయుటచే నది సఫల మగుచున్నది. బ్రాహ్మణపరివ్రాజకన్యాయము- బ్రాహ్మణవసిష్ఠన్యాయము- దీనితో సమానము లే.

## ౧౩. ఘట్టకుటీప్రభాతన్యాయము.

ఘట్ట=“హాస్సీలు” కుటీ=పాక, గాటీపాక, మెట్టుపాక—ఒకబండివాఁడు తనబండికి “హాస్సీలు” తప్పించుకొనవలె నని దురూహచే మఱియొక దారిలో బండిని దోలి దారి తప్పి తిఁగి తిరిగి కొనకుఁ బ్రభాతసమయమునకు, ఆమెట్టుపాక దగ్గఱకు వచ్చెను. మెట్టువాఁడు వీనిదగ్గఱ సొమ్ము వసూలుచేసెను. సొమ్మిచ్చుకొనెను. ఎడ్లకుఁ దనకు రాత్రియంతయు శ్రమ కలిగెను. తనయిష్టము సిద్ధింపలేదు. ఇష్టసిద్ధ్యలాభము దీని తాత్పర్యము. ఈన్యాయము మాధవాచార్యవిరచిత సర్వదర్శనసంగ్రహమం దిట్లు చెప్పఁబడినది. “నను స్ఫోటవాచకతాపక్షేపి ప్రాగుక్తవికల్పప్రసరేణ ఘట్టకుటీప్రభాతాయితమితిచే త్తదేత న్మనోరాజ్యవిజృమ్భణం వైషమ్యసమ్భవాత్.”

## ౧౪. ఘుణాక్షరన్యాయము.

ఘుణ మనఁగాఁ బురుగు, దానిచేఁ దొలవఁబడిన యక్షరము-పురుగులు కట్టెలమీఁదఁ బుస్తకములమీఁదఁ దొలిచినగీఁతలు యాదృచ్ఛిక

# రఘునాథరామాయణము.

ప్రథమభాగము.

తంజావూరు రఘునాథభూపాలుఁడు రచించినదానిలోని కొంత భాగము. ఈభూపాలునికే చేమకూర వేంకటరాజకవి విజయవిలాసము నంకితము చేసినది. ఈరాజకవి కవిత్వము మృదుమధురమైనది. కల్పన లతి మనోహరములు, పాఠకలోక మీతని ద్విపదనలచరిత్రమును, వాల్మీకి చరిత్రమును జదివియేయుందురు కావున మేము వేఱుగఁ జెప్ప నక్కఱ యుండదు. వెల రు 0-8-0

---

# రసార్ణవాలంకారము.

ప్రకాశవర్షకవికృతమగు సంస్కృతాలంకారశాస్త్రము. శ్లోకరూపముగా నలంకారవిషయ మంతయుఁ జక్కగ సంగ్రహముగా నైదుపరిచ్ఛేదములలోనిమిడ్చినాఁడు. ఈప్రకాశవర్షునిజీవితము, కాలము, తత్కాలమునందుండిన యితరాలంకారికులగ్రంథములను విశేషములను తారతమ్యములను దెలుపు మిగుల హృద్యమగు విపులపీఠికయునుం గలవు. శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు ఎం.ఏ., గారు గ్రంథమూలమును బరిష్కరించిరి. పీఠికయును వారిచేతనే వ్రాయఁబడినది. సంస్కృతవిద్యార్థుల కిది మిగుల సహకారి. వెల రు 0-8-0.

కార్యదర్శులు ఆంధ్రసాహిత్యపరిషత్తు,

కాకినాడ.

అసురాంగనావైభవాంబుదాశుగము శ్రీ
రామకోదండంబు రాక్షసేంద్ర
దశశిరఃకాలాహితార్క్ష్యమాత్రంబు శ్రీ
రామకోదండంబు రాక్షసేంద్ర
ప్రలయసమయసముద్భూతభాసమాన
వాయుసఖసమరఘురామబాణములకుఁ
దప్పి ప్రాణంబు లేక నిల్పఁదరమె నీకుఁ ?
గనవె ఖరదూషణాదులగతులు మున్ను.

ఉత్తరకాండముగూడఁ గొంతవిపులముగనే వ్రాయఁబడెననవచ్చు. కంకంటి పాపరాజకృతోత్తరరామాయణమాధుర్య మిట్టి దట్టి దనియెట్టి వారు వర్ణింపఁజాలనట్టి దని నాగట్టి నమ్మకము. ముఖ్యముగా నందలి సీతాలక్ష్మణసంభాషణఘట్టము కరుణరసపూరితమై నిరుపమశైలి నలరారుచుండు. ఈరామాయణములోని ఉత్తరకాండపద్యములు పెక్కులు పాపరాజకవిధోరణిలో నొప్పుచు హృద్యములై యున్నవి, మచ్చున కీరెండుపద్యరత్నములను గనుఁడు:—

గీ. తల్లి ! సాధ్వీమతల్లి ! నీధవునిఁ బాపి
యడవివాల్చేయ వచ్చిన యధమజనుఁడఁ
గఠినచిత్తుఁడ నేనెట్టి కార్యమైనఁ
జేయఁగలనంచు నెంచియే చెప్పనేమొ !

క. తెల్లనివన్నియుఁ బాలని
నల్లనివియుఁ నీరమనుచు నమ్మెడి మాయీ
తల్లి వెతఁదీర్చి నానుడి
కల్లగఁ జేయకయ ప్రోవఁగదె భూదేవీ !

ఈసరస్వతీరామాయణమును గూర్చి యెంతేని వ్రాయఁదగియున్నను, వ్యాసవిస్తరభీతిచే నింక విరమింపవలసినవాఁడ నైతి. ఉభయభాషాప్రావీణ్యము గడించి, రసవత్తరకవిత్వము చెప్ప నేర్చి, పాతివ్రత్యాదిగుణరత్నములచే మించి, వినిర్మలశోభనము గాంచి యాంధ్రమాత కన్నుంగుబిడ్డ

యని పించుకొన్న సరస్వతీదేవి ధన్యురాలు- ఈకవయిత్రి యింతకుముందు సరస్వతీశతకాత్మోపదేశాది గ్రంథరాజములు రచించెనఁట. అనవద్యమగు విద్య- విద్యకుఁ దగినకవిత- కవితకుఁ దగిన గ్రంథరచన- అన్నిటిని మించినగుణసంపద! పురాకృతసుకృతపరిపాకవిశేషముచేఁ గాక యట్టి భాగ్య మెవరు పొందఁగలరు? ఈమెను గన్నతల్లిదండ్రుల పుణ్యవిశేష మగ్గించుచు, అర్ధాంగిగఁ జేసికొన్న పురుషవరేణ్యు నభినందించుచు, విద్యావతి నొనర్చిన గురుపుంగవు సన్నుతించుచు, నిట్టివిదుషీమణులకు సర్వవిధములఁ బ్రోత్సాహము గలిగింపుఁడని సకలాంధ్రజనమునకు విన్నవించుచు, నీసరస్వతీదేవి సమస్తసౌభాగ్యములతోఁ జిరకాలము వర్ధిల్లునట్లనుగ్రహింపుముతండ్రీ యని శ్రీరామచంద్రమూర్తినిఁ బ్రార్థించుచున్నాఁడ.

సీ. భోజరాజును ద్రోసిరాజను లోకబాం
ధవుకృపామహిమ నుద్భవముఁ జెంది
పండితమండలీమండనం బైనరా
మయ్యచే నక్షరాభ్యాస మొంది
వాణీకటాక్షసంప్రాప్తులై క్రాలు స
త్తప్పుచే విద్యాధికతను జెంది
వాఙ్మయోద్ధారణబద్ధకంకణు లైన
ఘనులచే దివ్యభూషణము లొంది
ఇరువదైదేండ్లప్రాయాన నెసఁగుచున్న
ఆంధ్రపరిషద్రమణి వృద్ధుఁడైన జయపు
రేంద్రుసైతము తా వలపించె నౌర!
యెవరి ధన్యత హెచ్చొ వచింపఁ దరమె?

చ. ప్రవిమలకీర్తిసంపద విరాజిలు నీపరిషత్తు కాంచనో
త్సవమును గూడ మేము కనఁజాలెడునట్టు లనుగ్రహింపవే
కవిబుధగాయకార్థిజనకల్పమహీజములైన సూర్యభూ
ధవునకు విక్రమేంద్రునకుఁ దద్దయు భద్రములెప్డు నీయవే
భువి జనులెల్లరున్ సుఖముఁబొందఁగఁ జేయవె లోకరక్షకా?

---

# ఆంధ్రవాఙ్మయము—కరుణరసము.

—సాగి వేంకటనరసింహముగారు, ఎం. ఏ., రాజమహేంద్రవరము—

---

ఆంధ్రవాఙ్మయమునందలి కరుణరసపు పట్టులను బేర్కొని వానిని సవిమర్శముగాఁ దిలకించి, వాఙ్మయసక్రమాభివృద్ధి కనువగు మార్గముల ను సూచించుటయే యీవ్యాసముయొక్క ప్రధానోద్దేశము. ఇందులకు ముందుగాఁ గరుణరసమును గూర్చిన సంస్కృతాలంకారికుల యభిప్రాయ ములును సంస్కృతకావ్యనాటకాదులయం దున్నకరుణరసలక్ష్యములును దెలిసికొనుట యావశ్యకము.

"ఇష్టనాశా దనిష్టాప్తేః కరుణాఖ్యా రసోభవేత్" (సాహిత్యదర్పణము)
"ఇష్టజనవియోగాదినాత్మని దుఃఖాతిభూమిః శోకః
'ఆదిగ్రహణా దనిష్టప్రాప్తి ర్గృహ్యతే' వ్యాఖ్య-(ప్రతాపరుద్రీయము)

"కరుణస్య బంధునాశాదయః ఆలంబనాని,తత్సంబంధి గృహాతురగాభరణదర్శనాదయః తత్కథాశ్రవణాదయశ్చ ఉద్దీపకాః, గాత్రక్షేప అశ్రుపాతాదయోఽనుభావాః,గ్లాని క్షయ మోహ విషాద చింతా ఔత్సుక్య దీనతా జడతాదయో వ్యభిచారిణశ్చ" (రసగంగాధరము)

నవరసములలో మూఁడవదగు కరుణరసము, ఇష్టనాశమువలనను అనిష్టాప్తివలనను సంభవించును. దీనికి స్థాయిభావము శోకము. బంధునాశప్రభృతు లాలంబనము. నష్టసంబంధి గృహాతురగాభరణదర్శనాదు లుద్దీపకములు. గాత్రక్షేప అశ్రుపాతాదు లనుభావములు. గ్లాని, క్షయ, మోహము, విషాదము, చింత, ఔత్సుక్యము, దీనత, జడత మొదలగు నవి వ్యభిచారీభావములు. కరుణ రౌద్రకర్మవలన జనించును. హాస్యము దీనికి విరోధి. దశమన్మథావస్థలలో చివరదగు మరణము కరుణకు హేతు వగును. పునఃప్రాప్త్యాశ లేని కరుణమును కేవలకరుణ మందురు. రఘువం శమునందు భార్యమరణమునకై యజమహారాజు విలపించుట యిందుల కు దాహరణముగా గ్రహింపవచ్చును. ఇష్టుఁడు మరణించినను మరల బ్ర

దుకఁగలఁ డనియు నెప్పటికో సమాగమము కలుగఁగల దనియు విశ్వాస మున్నచోటఁ గరుణావిప్రలంభము రస మని యందురు. ఇట్టిస్థితికి కాదంబరిలోని మహాశ్వేతావృత్తాంత ముదాహరణము; మఱియు, కుమారసంభవములోని రతీవిలాపముగూడ నీతెగకుఁ జేరిన దగును. ఇఁకఁ బ్రాప్త్యాశ యున్నట్లు నిశ్చయముగఁ దెలిసినచోటుల వియోగమునందు రసము విప్రలంభశృంగారమే గాని కరుణము గాదు. మేఘసందేశమునందలి యక్షదంపతులస్థితి యిట్టిది. కావ్యప్రబంధాదులయందలి వియోగములు ప్రాయికముగా నిట్టివే యగుచున్నవి.

ఇఁకఁ గావ్యనాటకాదులయందుఁ బ్రదర్శితమై సహృదయులచే ననుభవింపఁబడు దుఃఖము లౌకికదుఃఖమువంటిది కాదనియు, నది కేవలానందస్వరూప మనియు నందువలననే ప్రేక్షకులు తఱచు దానినభిలషించుచుందు రనియు సంస్కృతాలంకారికులు రుజువుచేసి యున్నారు. హరిశ్చంద్రాది పాత్రల స్థితిలోఁ బ్రేక్షకులు తాదాత్మ్యముఁ జెంది విగళితవేద్యాంతరత్వమువలన యనిర్వచనీయసుఖము ననుభవించుట లోకప్రసిద్ధమేగదా!

ఇట్టికరుణరసము కావ్యములయం దంగముగా నుండవలయునే గాని యంగిగా నుండరా దనునియమము గలదు. నాటకములలో శృంగారవీరములలో నన్యతరము మాత్రము అంగి కావలయు ననియుఁ దదితరములు కారా దని చెప్పుటవలన నిట కరుణయు నిషిద్ధములలోఁబడినది. ఇట్లు కరుణ నిషిద్ధమై యంగిగా సంస్కృతవాఙ్మయమున నెచ్చటను తద్రూపమునఁ గానరాకున్నది. అంగముగా మాత్రము పెక్కుచోట్ల మన కది గోచరించుచున్నది. కరుణరసపూరితమైన యుత్తరరామచరితము వీరరసప్రధాన మైన దని సంస్కృతపండితులు సాధింపఁజూచుట పరిచిత మైన విషయమే. మోక్షమును మంగళము ప్రధానాశయముగాఁ బ్రవర్తించు హైందవజాతి పతంజలి నుడివినట్లు-

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని ప్రథంతే'

అను వాక్యమును ఒరవడిగాఁ బెట్టికొని సర్వత్ర సంచరింతు రనుట యతిశయోక్తి గాదు. సాధ్యమైనంతవఱకు దుఃఖమును నిషేధిం

పవలయు ననియు 'ధర్మమేవ జయతి' యని నిరూపింపవలయు ననియుఁ గర్మసిద్ధాంతమును బ్రతిపాదింపవలయు ననియుఁ బాటుపడు భారతీయులు, సంస్కృతాలంకారికుల శాసనమునకు విరుద్ధముగా నెట్లు నడువఁగలరు.

మనపూర్వులు నాటకములలోఁ గరుణరసమునకుఁ బ్రాధాన్యమును నిరాకరించుటకు మఱియొకకారణము గలదు. కరుణరసమునకు నాటకావయవములతో సమన్వయము పొసఁగదు. "యత్నము శోకము నకా? ఫలప్రాప్తి దుఃఖమా? ఏమి బాగుగ నున్నది?" అను నిట్టివ్యాఖ్యానముల కవకాశము గలుగును. ఈవిధముగా నాలంకారికులయభిప్రాయములను జూచినను సంస్కృతాంధ్ర కావ్యములను బరిశీలించినను గరుణరసమునకుఁ బ్రాధాన్య మెచ్చటను గోచరించుటలేదు.

కరుణ ప్రాప్త్యాశ లేనివియోగమువలనఁ బుట్టినదిగదా. అట్టికరుణ ప్రియాప్రియుల యెడఁబాటు వలన మాత్రమే కలుగ నక్కఱలేదు. ఎట్టి బంధుమిత్త్రులైన మరణించినచో దుఃఖము తప్పక కలుగును. మానవజీవితము ప్రారంభమునుండి తుదివఱకును గరుణరసపూరితముగనే యున్నది. మానవులలో దుఃఖనిమగ్నులసంఖ్య సుఖభోగులసంఖ్యకంటె విస్తారముగ నున్నది. సుఖభోగులును, అనుభవించు సుఖములకంటె దుఃఖములనే యెక్కువగ ననుభవింతురు. మఱియు సుఖభోగ మెంత యనుభవించినను మనస్సున నాటదు. ఆసమయమున కాలము క్షణముగఁ గడచిపోవును. కాని దుఃఖము కొంచెమైనను గాఢముగ నాటుకొని యనంతముగ కాలమును దీర్ఘముచేయుచు మఱవరాని దగును. కాఁబట్టి మనజీవితములోను, జీవితావస్థకనుకృతి యగు నాట్యములోను మిగిలినరసము లన్నిటికంటెఁ గరుణకే యెక్కు డవకాశము గలదు. ఆంగ్లనాటకములను జూచుచున్న నవీనులయం దీపైఁజెప్పిన యభిప్రాయము ప్రబలముగ నున్నది.

ఇఁక సాధారణరీతిని లోకమునందు దుఃఖమునకుఁ గారణముల విచారింతము. దుష్టుల క్రౌర్యమువలన సజ్జనుల కాపదలు ఘటిల్లును. దుష్టులు స్వార్థపరులై వేఱుకారణము లేకయే శత్త్రుభావమును బూనుట లోకప్రసిద్ధమే. రావణాదు లిందులకుఁ దార్కాణము. ఆంగ్లనాటకము

గు 'ఒథెల్లో' లోని 'అయాగో' గూడ నీచపాత్రమే. ఒథెల్లో అతని భార్య 'డెస్డిమోనా' వీరిరువురును సుఖులై యుండుటను 'అయాగో' సహింపలేక డయ్యెను. అతని ద్వేషమునకుఁ దగినకారణములే లేవు. కారణాన్వేషణమున నతఁడు కొంతకాలము గడపి తుదకుఁ గారణమున్నను లేకున్నను వారిరువురి నెడఁబాపి యుభయులమరణమునకుఁ గారకుఁడయ్యెను. విశుద్ధచరిత్ర యగు డెస్డిమోనాకు కళంకము నాపాదించి యాకళంకమును కృత్రిమముగా ఋజువుచేయుటచే నాతఁ డింతపని నెఱవేర్చుకొనఁ గలిగెను. ఇతని క్రౌర్యము పులివలెను పామువలెను సహజమని విమర్శకులు నుడివియున్నారు. కరుణకు మఱియొక కారణము సజ్జనులలోపము. అతిదయ, అత్యౌదార్యము, తొందరపాటు, అతివిశ్వాసము, అలసత మొదలగునవి దుర్గుణములు కాకపోయినను, అపాయహేతువులై, ఒక్కొక్కమాఱు నాయకునిప్రాణములఁ దీయును. ఈలోపముల నాధారము చేసికొని దుష్టులు తమ తంత్రములను నెఱవేర్చుకొందురు. కైకపై నతిమోహముగల దశరథుఁడు ముం దాలోచింపక వరములిచ్చి యావరములను నెఱవేర్చుటలోఁజిక్కుపడి మరణించెను. ద్యూతవ్యసనమునఁ జిక్కి నలుఁడు రాజ్యముఁ బాసెను. ఇట్లే షేక్స్పియరు సృష్టించిన 'లియరు' గూడ దుఃఖనిమగ్నుఁడై మరణించెను. పూర్వోక్తములుగాక కేవల దైవికకారణములవలనఁ గూడ దుఃఖము గలుగును. తుపానులు, జలప్రళయములు, క్షామములు, భూకంపములు, పిడుగుపాటులు మొదలగునవి సంఘమరణములను వ్యక్తిమరణములను ఘటించును. ఇది ప్రారబ్ధకర్మ మనక మఱేమనఁగలము. యుద్ధములవలనఁ గొందఱు చత్తురు; అంటువ్యాధులు కొందఱిఁ గబళించును. ఇట్టివి మరణములకుఁ గారణములై బంధుమిత్రాదుల నఖండదుఃఖమున ముంచివేయును. ఇందుండికరుణపూరితగాథలు రచింపఁ గావలసినంత విషయములభించును. పైఁ జెప్పినవిషయము లన్నియు లోకమునందలి దుఃఖపుపట్టులు. వాని ననుభవించువారు లౌకికరసానుభూతి నందుదురు. ఇట్టి లౌకికరసానుభూతి యనుభవితలకే గాని సహృదయు లగుప్రేక్షకుల కెంతమాత్రము లభింప

దు. నాట్యములో నన్ననో తదనుభవము తద్రసప్రదర్శనము చేయున టుల కుండదు. సహృదయులగు ప్రేక్షకులకుమాత్రమే యట్టిరసానుభవము గలుగును. అలౌకికరసము కరుణ మైనను రసత్వసంజ్ఞను జెంది యానందమునే యొసంగును. కరుణరసభూయిష్ఠము లగు గ్రంథములును నాటకములును బఠితలకును ప్రేక్షకులకును లౌకికదుఃఖమును గలిగించు నేని వా రికనెన్నడు నట్టిగ్రంథములఁ బఠింపరు. అట్టినాటకములను జూడరు. అట్టిగ్రంథములను నాటకములను బలుసారు లనుభవింపవలయు నను నిచ్ఛ లోకమున సహృదయులలో మనము చూచుచున్నారము. కావున నట్టివి యానందప్రదము లనియు దుఃఖదములు కావనియు వినిశ్చిత మైనది.

ఇఁక మానవహృదయముపై కరుణప్రభావమును గూర్చి కొంచెము విచారింతము. శోకము హృదయము నుద్రేకింపఁజేయుటలో నగ్రస్థానము వహించును. శోకఫలముగ, పెక్కురు భక్తులైరి. పలువురు కవులైరి. అసంఖ్యాకులు దుర్జనులు సజ్జను లైరి. భావపరిణామమునకును ఉత్కృష్టభావావిర్భావమునకుఁ జాలినంత యుద్రేకమును గరుణ కలిగింపఁగల దని మనము వాల్మీకిచరిత్రము ననుసరించి గ్రహింపఁగలము. ఆదికావ్య మగు రామాయణ మాదికవియగు వాల్మీకిచే రచింపఁబడుటకు బీజ మిదియే. క్రౌంచద్వంద్వము రాగాతిరేకమున సుఖించుచుండఁగా నం దొకదానిని నిషాదుఁడు సంహరించెను. ఆదృశ్యమును జూచి వాల్మీకి శోకపూరితహృదయుఁ డయ్యెను. అతనిహృదయమునుండి బయలుదేఱిన శోకము శ్లోకరూపమునంది తదనంతరరామాయణరచనమునకు బీజప్రాయమైనది. అవిచ్ఛిన్నభక్తి నభిలషించు భక్తులు నిరంతరము దుఃఖమునే కోరుచుందురు. రామాయణమునందువలెఁ గాకపోయినను భారతమునందుఁగూడ దుఃఖపూరితగాథలు పెక్కులు గలవు. ఈరామాయణ భారతము లాంధ్రీకృతము లై మనవాఙ్మయమునఁ గరుణాబీజారోప మొనర్చినవి. భవభూతి సప్తమకాండగాథను సంస్కృతనాటకరూపమునను, కంకంటి పాపరాజు, ఆంధ్రకావ్యరూపమునను వెలయించి వన్నెకెక్కిరి. భారతమున (సీ.

పర్వమునందలి శోకము సుప్రసిద్ధము. సంస్కృతకావ్యములలో రఘు
వంశములోని యజవిలాపము, కుమారసంభవమునందలి రతివిలాపము,
కాదంబరియందలి పుండరీకమరణము తెలుఁగుకావ్యములలో బసవ
పురాణమునందలి భక్తులకథలు పల్నాటివీరచరిత్రము మొదలగునవి,
శోకమును గలిగించి తన్మయత్వమును బ్రసాదించు ననుటలో నొంతమా
త్రమును సందియము లేదు.

నాటకము గాని కావ్యము గాని దుఃఖాంతము కావచ్చునా?
కారాదా? అనుచర్చ నిచ్చట విచారింపవలసిన యావశ్యక మున్నది.
సుఖాంతముగనే యుండవలయు నని వాదించువారు కొన్ని కారణములను
జెప్పుదురు. ఈపక్షము ప్రాచీనభారతీయపక్షము. దుఃఖాంతముగ నుండ
వచ్చుననుటయే గాక దుఃఖాంతములయం దెక్కువ స్వారస్య మున్నదని
నవీనులు పాశ్చాత్యనాటకసంప్రదాయాభిమానులు వాదింతురు. ఇందొ
క్కొక్క పక్షమును గ్రహించి వారికారణములను సంగ్రహింతును.

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని
ప్రథంతే" అని మహాభాష్యకారుఁడు నుడువుట తత్పూర్వసంప్రదాయ
మును స్ఫురింపఁజేయుచున్నది. తదనంతరము సంస్కృతకవులును దాని
వెనుక నాంధ్రకవులును పూర్వులశాసనముల ననుసరించి కావ్యములను
మంగళాంతములనుగ నొనర్చిరి. మనస్సున కానందమునే గాని దుఃఖ
మును గలిగింపఁగూడ దనియు దుఃఖము తాత్కాలికముగ వచ్చినను
సుఖప్రాప్త్యాశ యున్నయెడల నంతబాధ యుండ దనియు వీరియభిప్రాయ
ము. మఱియు లోకసహజముగ సజ్జనులు దుఃఖాంతజీవనులైనచో తద
నుగుణముగ దుష్టులు జయించినచోఁ బ్రజకు సత్ప్రవర్తనమునందు నిరు
త్సాహము గలుగు ననియు దుష్ప్రవర్తనమునకుఁ బ్రోత్సాహము గలుగు
ననియు వారు వాదింతురు. 'ధర్మయేవ జయతి' అనుదాని స్థాపించుటకు
వారు దుఃఖాంతములను బూర్ణముగ నిషేధించిరి.

సంస్కృతశాసనములను నిషేధించుటలో బద్ధకంకణులైన బౌద్ధు
లును శైవులును ముఖ్యముగా నైవాదములను తిరస్కరించి విషాదాం

తగాథలను రచించిరి. లోకమునకై ప్రాణమును ద్యజించినవారును భక్తికై సర్వమును ద్యజించినవారును వారి కాదర్శపురుషులు. అట్టివారల గాథలు విషాదాంతములు గాకుండునా ? ఆంగ్లనాటకములందును ప్రాచీనగ్రీకునాటకములందును విషాదాంతనాటకము లగ్రస్థానము నలంకరించినవి. అవస్థానుకృతి నాట్యముగదా, లోకసహజ మగుదుఃఖావస్థ నేల ప్రదర్శింపరాదు ? అని వారు ప్రశ్నింతురు. సుఖముకంటె దుఃఖమునకే హృదయక్షాళనసామర్థ్యము విశేషముగఁ గల దని వారివిశ్వాసము. ఇట్టియభిప్రాయములను, ఆంధ్రపండితులుగూడఁ గొంద ఱంగీకరించి యున్నారు. ఒకవ్యక్తియందలి భావసంఘర్షణము, పెక్కురువ్యక్తులలోఁ బరస్పరసంఘర్షణము, దురదృష్టసంఘటనములు లభించినప్పుడు విషాదాంతవృత్తములు జరుగును. మానవహృదయతంత్రులను మ్రోగించుట కీవృత్తాంతముల కున్న ప్రభావ మితరములకు లేదు. 'కన్నీరుకథ' పీఠికలో బ్ర॥ వజ్ఝల చినసీతారామశాస్త్రిగారీక్రిందివిధముగా నుడివిరి.

"దుఃఖపర్యవసాయి కావ్యము లుత్కృష్టతరము లన్నవిషయములు పాశ్చాత్యమహాకవులకే గాక ప్రాచ్యమహాకవులకును సహితము సమ్మతమనుటకు భారతరామాయణాదిమహాగ్రంథముల సందర్భమె ప్రబలనిదర్శన మనవచ్చును. కరుణరసమునుమూలమున నుత్తమనీతులను సభ్యులమనముల నెలకొల్పుటలో దుఃఖపర్యవసాయికావ్యముల కున్నశక్తి సుఖపర్యవసాయికావ్యములకు లేదనుట సాహసోక్తి కానేరదు"

ఆంధ్రమునందుఁ బ్రథమవిషాదాంతనాటకమును వ్రాసిన శ్రీబళ్లారి ధర్మవరము కృష్ణమాచార్యులవారు తమవిషాదసారంగధరపీఠికలో విషాదాంతకథల యౌచితిని గూర్చి సర్వాంకషముగఁ బ్రసంగించియున్నారు. "దుర్నీతిని బ్రకటింపవచ్చునా ?" అనునంశముపై వారియభిప్రాయ మిది.

"దుర్నీతి నించుకైనఁ బ్రకటింపకున్న నీతికిఁ గాంతి గలుగదు. రావణుని దుర్నీతి లేకున్న శ్రీరాఘవున కంతకీర్తి గలుగునా? దుర్యోధనుని దుర్నీతి లేకున్నఁ బాండవుల కంతటిఖ్యాతి గలిగియుండునా ? కావున నీతి కుదుర్పవలెనన్న దుర్నీతి నించుక ప్రకటించియే తీరవలె నని వ్రాస

వినయవిజ్ఞాపనము. రుచిభేదములు నభిప్రాయభేదములు నున్న నుండుఁగాక, విశ్వామిత్రునకుఁ గ్రోధమే లేక యతఁడు వసిష్ఠునితోఁ గయ్యమాడకుండెనా హరిశ్చంద్రుని సత్యవాక్పరిపాలనమును బరీక్షించు టెట్లు?"

'సత్పురుషులకు దుఃఖము వచ్చునా ?'

సత్పురుషుల కెందుఁగాని ప్రాయికముగా బాధలు వచ్చుటయే కనుచున్నాము. అదిగాక లోకమున జరుగువిషయములలో నెన్నియో పొరపాటులు గలవుగదా! సద్గుణములు గలవారల కెందఱకో దుఃఖము కలుగుట చూడమా! వాని కన్నిటికిని గారణము చెప్పుట సాధ్యమా?" విషాదాంతగాథల యౌచిత్యమును గూర్చి విశేషముగ నెఱుఁగఁ గోరువారు 'బ్రాడ్లీ' మొదలగు నాంగ్లవిమర్శకాగ్రేసరుల గ్రంథముల నుండి గ్రహింపనగును.

కరుణ ప్రధానములైన గ్రంథములు లేకున్నను కరుణరసప్రవృత్తులు గల గ్రంథము లాంధ్రవాఙ్మయమునఁ దక్కువగా లేవు. ముందు, ప్రాచీనగ్రంథములలోఁ జూచెదము. శివపురాణములలో నిమ్మవ్వకథ, సిరియాలునికథ మొదలగునవి శోకముతో హృదయమును నింపివేయును. పాల్కురికి సోమనాథుని బసవపురాణము, పిడుపర్తి సోమనాథుని చెన్నబసవపురాణము నిందుల కుదాహరణములు. ఇఁక భారతమునందలి మహాయుద్ధముచే మృతవీరులకు సంబంధించిన మాతృదారాస్వసృదుహితాదులదుఃఖము స్త్రీపర్వములో వెల్లివిరియుచున్నది. శల్యపర్వములోని దుర్యోధనుని దుఃస్థితికి కంటఁ దడిపెట్టనివా రుండరు.

క. మదమడఁగి యొక్కరుండును
  గదచేకొని రాజరాజు కాల్నడ నేఁటఁబో
  మదిఁదలఁచి తొలఁగె నొకొ యా
  పద లిట్టివి గలవె మనుజపతులకు నెందున్.

సీ. ఏకాదశాక్షౌహిణీశుఁడై పెంపునఁ
         బొంపిరిపోవు నప్పుడమిఱేఁడు
వెనుక నొక్కరుఁడును జనలేక యేకాకి యైపోయె...శోక...తప్త చిత్తుఁడయ్యె దైవ మెవ్వరి నెట్లుచేయఁ జాలు దేనిచెప్పఁగలదు".

ఇందు దుర్యోధనుని దుఃస్థితి చక్కగ వర్ణితమైనది. ఇట్లే ధృతరాష్ట్రుఁ డాశ్ర మవాసమున కరుగుకాలమున హస్తినాపుర మంతయు శోకపూరితమై యుండెను.

"కుంతిమొదలైన కౌరవ, కాంతాజను లెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ బ ర్యాంతంబుల బాష్పసలిల, సంతానము లురులఁ దోన చనుదేరంగన్

అజ్జనపతి చనుచుండె—
పాండవాగ్రజుఁ డక్కురుభర్తవలను
శోకలీనుఁడై తప్పక చూచియేడ్చి
హామహారాజముఖ్య యెందరిగె దనుచు
నొడలు గంపింపఁ జదికిలఁబడియె నధిప.
నరుఁ డనునయించె వెస న
న్నరపతి నెత్తుచును దాను ననయము వనటం
బురపురఁబొక్కెం గురుభూ
వర యద్దెస తెలుఁగు రాదు వాక్రువ్వంగన్.

రామాయణము నందలి సీతాపరిత్యాగఘట్టము రాతిగుండెగల వారినైనను గరఁగింపకుండునా? ఆంధ్రమున కంకంటి పాపరాజుచేనయ్యా ది మిక్కిలి మెఱుఁగునందినది. చూడుఁడు పరిత్యక్తయగుసీతవాక్యములు:-

కటకట లక్ష్మణా పిడుగుకంటెను బెట్టిదమైన మాట నేఁ
డిటు విని యూడియుఁ బగుల దింతలు నింతలు గాదు గుండె యె
ప్పటివలె నున్న దీకటికభావముతో నసువుల్ భరించి యి
య్యటవిని యింక నేవలన నాపద లొందఁగ నున్న దాననో!
నాదు మే
నున్నది చెంత గంగమడుగున్నది యైనటులయ్యెడుం దుదిన్.

సీత భూగర్భమునఁ బ్రవేశించు ఘట్టముగూడ నిట్టిదే.

శ్రీమద్భాగవతమున కావ్యదృష్టికంటె వేదాంతదృష్టి విస్తారము. అందుఁ జచ్చినవారికైగాని బ్రదికియున్నవారికైగాని యెవ్వరును విలపింప రాదనుట దృఢముగా బోధింపఁబడుచున్నది. అయినను గరుణరసపూ

రితఘట్టములు కేవలము లేకపోలేదు. ఒక్కయుదాహరణము-చిత్రకేతూ
పాఖ్యానమున బాలకునిమరణమును జూచి-

దాసి—పుడమి నిట్టకనిల్వునఁబడి పొక్కుచుంగను దీనయై
యడఁగు వేమియు లేని వాక్కుల నావురంచు విలాపముం
దెడరు దోప భృశాతురోన్నతి నేడ్చెఁ దా విని భీతితో
గడుపు బిట్టవియంగ భూపతికాంత గ్రక్కున నేఁగుచున్.

ఆ కొడుకుఁజూచి తల్లి యడలఁజొచ్చె-

తండ్రి—బాలుని మీఁదఁ
వ్రాలి యోపుత్ర నీవార్త దంభోళియై
కూలఁగా నేయకే కొల్లి నన్నేటికిఁ
జాలినొందించె నాజాడ యిట్లెట్టిదో
తూలు మీతల్లికిఁ దుఃఖ మెట్లాఱునో.

ఇఁక స్వతంత్రప్రబంధములసంగతి విచారింతము. ప్రబంధ మన్నఁ బెండ్లితో ముగించుటయే గదా. అందు విప్రలంభశృంగారము విస్తారముగ నుండును. కేవలకరుణ కవకాశమే లేదు. విరహావస్థను వర్ణించుట మితిమీఱి యది విరస మగునే గాని హృదయమును విశేషము చలింపఁజేయదు. మన్మథదూషణము తత్పరివారదూషణము శ్లేషలకాకరము. శ్రీనాథుఁడును ముఖ్యముగా సూరనయు నౌచిత్యమునకై పాటుపడిన వారయ్యుఁ బ్రబంధశృంఖలలను ద్రెంపలేరైరి.

పల్నాటివీరచరిత్ర మాంధ్రవాఙ్మయహారమునఁ దలమానికము వంటిది. అది మహాభారతమువలె వీరరసప్రధానమై తుదకుఁ గరుణరస భూయిష్ఠమగును. ఇందు బ్రహ్మనాయఁడు కృష్ణునివంటివాఁడు; అతనిపక్షము పాండవపక్షమువంటిది. నాయకురాలిపక్షము కౌరవపక్షము, కార్యమపూఁడి కురుక్షేత్రము. రాజ్యమునకై జరిగిన యుద్ధము మహాభారతయుద్ధసదృశమైనది. బ్రహ్మనాయని కొడుకగు బాలచంద్రుని మరణముకంటె శోకాకర మగుదృశ్యము మఱియొకటి లేదు. యుద్ధమునకు ముందే యనపోతు మరణము శోచ్యమైనది. అనపోతు బ్రాహ్మణయువ

కుఁడు. బాలచంద్రునిసఖుఁడు. అతఁడు, బ్రాహ్మణుఁడుగావున యుద్ధమునకు రావద్దని బాలచంద్రుఁ డానవెట్టెను. ఆయానఁ జూచి యుద్ధము చేయ నోఁచనందుకు అనపోతు దుఃఖించి యాత్మహత్య గావించుకొనెను. రక్తసిక్తమైన యాతనిజందెమును మాడచి యనునామె బాలచంద్రునకుఁ జేర్చెను. దానిని జూచి బాలుఁడు కానున్న సంధి విభగ్నము చేసి యుద్ధమున కుఱికెను. బాలచంద్రుని యుద్ధమును మరణమును రైతులు శోకసమయములయందు పంబరవాండ్రచేఁ బాడించుకొని విందురు. అట్టి బాలుఁడు గతించినను బ్రహ్మనాయని యోర్పును గమనించి తనదుఃఖమునుఁగూడ నట్లే సహించుట నేర్చికొందురు.

అనపోతుమరణమును గూర్చి తలిదండ్రుల దుఃఖమును మాత్ర ముదాహరించెదను.

"తద్గతిఁ దెల్పిరి తల్లిదండ్రులకు
విని మూర్ఛనొందిరి వేగమె వారు
కొంతసేపటికి ని గొంచెము తెలిసి
కుందుచుఁ జనుదెంచి కొడుకుపై వ్రాలి
బొమ్మ గ్రుద్దికొనుచు బోలుచుఁ బడుచుఁ
దనయుఁడా! మాపుణ్యదశ యిట్టులాయె
మాయ చావయ్యెను మాముద్దుకొడుక
ఇచ్చోట నుండెనా మృత్యువు నీకు"

నాటకము:—ఆంధ్రవాఙ్మయమున సంస్కృతాంగ్లములపక్కిని నాటకరూప మిటీవల జనించినదే. పూర్వకాలమున వీథినాటకములే యుండినవి. అవి విశేషముగఁ గవిపండితాదరమును బొందలేదు. ఆంధ్రనాటకపితామహులు బళ్లారి ధర్మవరము కృష్ణమాచార్యులవారు కరుణరసప్రధాన మగునాటకములను వ్రాయుటలోఁ గూడ మార్గదర్శకులైరి. వారివిషాదసారంగధరనాటకమును, దత్పీఠికయు నాంధ్రమునఁ గరుణరసమునకు నిధానము లని చెప్పవచ్చును. అప్పటిపండితుల నెదుర్కొనుటకై వారు పీఠికలో గరుణరసమును గూర్చి యంతగా వాదింపవలసివచ్చెను.

ఇప్పు డంతగా వాదింప నక్కఱలేదు. విషాదాంతము లైన "చంద్రహాస" (దుష్టబుద్ధి) "పఠాణ్" (విజయనగరసామ్రాజ్యపతనము) "బొబ్బిలి," "పూర్ణిమ" "అనార్కలీ" వంటి పెక్కునాటకములను జవి యెఱిఁగిన ప్రజలును గవిపండితులును బూర్వమువలె దుఃఖాంతములను గూర్చి యంతగా నేవగించుకొనుట లేదు. మీఁదు మిక్కిలి యానాటకములఁ జూడఁ బరువు లెత్తి వచ్చుచున్నారు. 'సోరాబు రుస్తుములు', తెలుఁగు 'జూలియస్‌సీజర్', 'రాణాప్రతాప్' మొదలగు భాషాంతరీకరణములుగూడఁ గరుణరసప్రాధాన్యవాదమునకు బలము నిచ్చుచున్నవి. ప్రజల మనస్సు లాకర్షించుటయే ప్రధానకార్యముగాఁ గల సినిమాలలో శోకరసపూరిత ఘట్టములకుఁ గొదవ యుండునా ?

నవలలు:—నవలగూడ పాశ్చాత్యదేశములనుండి మనకు లభించినదే గావున నందును గరుణరసప్రధానము లగునవి పెక్కులున్నవి. అపరాధపరిశోధకనవలలు కరుణను గల్గించుఘట్టములు గలవయ్యు భయమును, నద్భుతమును గలిగించుటకే విశేషముగాఁ బాటుపడును.

ఖండకావ్యములు:—భావప్రాధాన్యమునకే పాటుపడు ఖండకావ్యములు పెక్కులు కరుణరసప్రధానముగ నున్నవి నేఁటికాలపు యువకవుల జీవితములు నిరుద్యోగాదిబాధలచే శోకసహితము లగుటచే వారు పెక్కుశోకగీతికలను విషాదగాథలను వ్రాయుచున్నారు. "అనంతపంతుల"వారి సరోజిని (a tale of tears) కి పేరే "కన్నీరుకత" యైనది. రాయప్రోలు సుబ్బారావుగారి కావ్యమొకటి 'కష్టకమల' "అస్రుతర్పణము" "......విలాపము" వంటిపేరులకుఁ దక్కువలేదు. దువ్వూరి రామిరెడ్డిగారు, దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు మొదలగు కవులు కరుణరసము నొప్పింపఁ బ్రయత్నించిరి. ఖండకావ్యములలో ముఖ్యముగా స్మృతికావ్యములు కరుణరసప్రధానములు. 'సతీస్మృతులు' 'సుతస్మృతులు' 'దేశనాయకస్మృతులు' మనకుఁ బెక్కులున్నవి. కాశీవ్యాసాచార్యులవారి "శ్రీరామనిర్యాణము" చక్కని 'సుతస్మృతి' కావ్యము. వ॥ సు॥ రాయని 'సతీస్మృతి' 'సుతస్మృతి' యనుకావ్యములు ప్రసిద్ధములే. శ్రీ

చెళ్లపిళ్ల వేంకటకవిగారు రచించిన "దివాకరాస్తమయము" శ్రీతిరుపతి కవిని గూర్చినయద్భుత స్మృతికావ్యము. ఇట్టి కావ్యములను జదివి నప్పుడు నిజముగా మనహృదయము లశ్రుక్షాళితములై పరిశుద్ధము లగును.

ముగింపు:—కవిహృదయము నుడికింపఁగలది ప్రేక్షకులను బూర్ణముగ నాకర్షింపఁగలదియుఁ గరుణరస మొక్కటియే. ప్రాచీనులు కరుణప్రధాన మగుకావ్యరచనమును నిషేధించినను "ఏకో రసః కరుణ ఏవ" యనఁగల కవులు లేకపోలేదు. ఆంధ్రవాఙ్మయమునఁ, గరుణ కాకర మగు పట్టులు భారతాది గ్రంథములయందు విరివిగ నున్నవి. ప్రబంధములయందంతగాఁ గరుణరసము లేకున్నను, ఇటీవలి వారు పాశ్చాత్యసంప్రదాయములఁ బురస్కరించుకొని పెక్కునాటకములను, నవలలను, ఖండకావ్యములను గరుణరసప్రధానములనుగఁ జేసియున్నారు. ఇప్పటికిని పూర్వాలంకారికులమతమునే యాధారముచేసికొని విషాదాంతముగఁ గథలను వ్రాయరా దనుట న్యాయము గాదు. నూత్న మన్నంతమాత్రమునను బ్రాచ్యము కా దన్నంతమాత్రమునను గరుణరసప్రధాన గాథ యందలి మాధుర్యము కొఱవడదు.

"పురాణ మి త్యేవ న సాధు సర్వం
న చాపి సర్వం నవ మి త్యవద్యమ్
సంతః పరీ క్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పర ప్రత్యయ నేయబుద్ధిః"

ఇతోఽధికముగఁ గరుణరసప్రధానకావ్యములు బయలుదేఱి సహృదయుల కానందప్రదము లగుఁగాక !

---

# గ్రంథస్వీకారము.

## (1) వాసవీవిలాసము.

ఇది పదియంకములనాటకము. విద్వాన్ సోంపల్లె కృష్ణమూర్తికవి గారు రచించినది. కథ శ్రీకన్యకాపరమేశ్వరినిగూర్చినది. ఈకథకుఁ బూర్వపురాణము లనేకము లాధారములు. ఇప్పటికవ్వరును బెక్కురు కావ్యనాటకాదులను రచియించిరి. వైశ్యులకుఁ గులదేవత యగుసీదేవి చరిత్రము పెనుగొండ మొదలగుతావులం గలయాలయములచేఁ బ్రసిద్ధమైయున్నది. ఈనాటకములోఁ గవిగారు కథకుమూలము లేయేతావులనున్నవో తెలిపిరి. విష్ణువర్ధనుఁ డనురా జెవ్వఁడను విషయము దీనిలోఁ జర్చింపఁబడినది. పలువురు వ్రాసినవిషయములు గొన్నియుక్తులతో ఖండింపఁబడినవి. కాని, యిప్పటి కెవ్వరికిని విష్ణువర్ధనునిస్థితి సరిగాఁ దెలియరాలేదు. కల్పితకథ లొకదానికొకటి యెట్లతుకును. కవిగారి యీనాటకముపైఁ బలువురు పండితు లభిప్రాయముల బాగుగ నిచ్చియున్నారు. కవిగారు "ఇతఃపూర్వప్రకటితములైయుండు గ్రంథములనెల్ల నేశ్రద్ధచనముగనై పఠించి యుచితము పరిగ్రహించి యనుచితము పరిత్యజించితి" మని వ్రాసిరి. ఈ మాటను బట్టియే యెవ్వరికిఁ దోఁచినది వారి కుచిత మగుకొనుటయే గా క్రనిక్కమిది యని గ్రహించుట కష్ట మని స్పష్టమైనది. నాటకములోని భాష పాత్రోచితముగా నున్నది. ఒక్కపద్యము చవిచూపుఁడు.

చ. గొనములప్రోవు దుష్టజనకుంజరసింహము దీనసంచయా
వనఘనసత్కృపామతి యపారయశఃపరిపాలకుండు పా
వనచరితాత్ముఁడున్ విమలవంశనిధానుఁడు భక్తియుక్తుఁడౌ
తనయునికంటె వైభవవితానము సౌఖ్యము వేఱకల్గునే. పుట 45.

వెల రు. 1—4—0 కవిగారియొద్ద అనంతపురముజిల్లా కొక్కంటిలో దొరకును.

(2) ఆంధ్రమేఘప్రతిసందేశము- కాళిదాసమహాకవికృత మేఘసందేశము తరవాయి—— సంస్కృతమున మహీశూరపురమహారాజాస్థాన విద్వాంసులు శ్రీ మండికల్ రామశాస్త్రిగారు రచించిరి. దానికిది బల్లారిమ్యునిసిపల్ హైస్కూలులో, ప్రధానాంధ్రోపాధ్యాయులు శ్రీ రావాడ వేంకటరామశాస్త్రిగారి తెనుఁగు. మూలము రెండుసర్గలింకు రెండాశ్వాసములైనవి. యక్షుఁడు మేఘునిచే వార్త పంపఁగా దానికి యక్షునిభార్య పంపిన ప్రతివార్తయే యిందలివిషయము. ఇందు యక్షదంపతులనామములు యక్షునియధికారము కుబేరక్రోధశాపాదులును వర్ణింపఁబడినవి. ఇటీవలి శ్రీ శంకరరామానుజవ్యాసరాజాదులు, విజయనగరమైసూరురాజులు, విద్యుద్దీపములు మున్నగువిషయములు వర్ణింపఁబడినవి. ఈ తెనుఁగుపుస్తకముపైఁ బలువురు ప్రసిద్ధపండితులు సదభిప్రాయములఁ నొసంగిరి. ఒకపద్యము మచ్చుచూడుఁడు.

చ. కుశలి భవత్ప్రియుం డనుచుఁ గూర్చి ముదంబు సుధాక్షరావళిన్
విశదముగాఁ బఠించిన ప్రియుప్రేముడి నింపగువార్త దైవస
ద్వశగతి వీరుల న్నిలిచి ప్రాణము నిల్పఁగ నచ్చి తిప్పడీ
దృశమగు నిక్క మస్మదఘతీవ్రత యించుక తగ్గె నెమ్మదిన్. 1-5.

మూలశ్లోకము:—

చిత్తోడాఖ్యం జయతి నగరం తైర్నృపైః పాల్యమానం
ఘోరే యుద్ధే వినిహతధవా విశ్రుతా వీరపత్న్యః
క్షుద్రాదిభ్యో నిజకులభయే శంకమానాశ్చ యస్మిన్
పాతివ్రత్యప్రవణమతయో బృంద శోగ్నిం ప్రవిష్టాః.

శాస్త్రిగారియాంధ్రపద్యము.

ఉ. పోఁడిమిరాజపుత్రనృపపుంగవపాలితమై చెలంగు చి
త్తోడపురం బనిన్ ధవులు తొల్త మృతింగన వీరపత్నులా
చేడెలు క్షుద్రశత్రువులఁ జేడ్పడు శీల మటన్న భీతిచేఁ
గూడి పతివ్రతాత్వమతి గుంపుగఁ జిచ్చునఁజొచ్చిరచ్చటన్. 2-25.

వెల రు. 0—10—0 కవిగారియొద్ద దొరకును.

(౩) ఈ క్రిందిపుస్తకములు-వ్యాసకుటీరమునుండి వెలువడిన యాంధ్రసేవాప్రసూనములు:-

1. రామనామం—చిన్న నాటిక (వ్యావహారిక భాష) రు. ౦-౧-౦.
2. శ్రీవివేకానందస్వామివారియతిగీతములు—కూచి నరసింహము పంతులుగారిచే నాంగ్లీకృతము. రు. ౦-౧-౦.
3. దివ్యవాణి—(ఒకహరిజనునికథ) కూచినరసింహముపంతులుగారు అమృతబజారుపత్రికలోని యొకయాంగ్లవ్యాసమునకుఁ దెనుఁగు.
4. రామనామం—ఇంగ్లీషు, ముద్దా విశ్వనాథముగారు.
5. ఆనందసామ్రాజ్యము—శ్రీరామతీర్థస్వామివారి యుపన్యాసమునకుఁ దెనుఁగు. ముద్దా విశ్వనాథముగారు. రు. ౦-౧-౦.
6. సంధ్య—(ఆఱడుగులనేల) టాల్‌స్టాయి విరచితమునకుఁ దెనుఁగు వచనము. రు. ౦-౬-౦.
7. శుభోదయము—సౌశీల్యనిర్మాణము దక్షమును సౌజన్యోత్తేజకమునగు నిప్పటికాలపుకథ-వచనము. రు. ౦-౩-౦.
8. గ్రిసెల్డా—శ్రీరామతీర్థస్వామివారి యుపన్యాసమునకాంధ్రము-వచనము, కూచి నరసింహముపంతులుగారు. రు. ౦-౧-౦.
9. ఆత్మజ్యోతి—(మానవసేవయే మాధవసేవ) కౌంటులియోటాల్‌స్టాయ్ వచనము. బడులలోఁజదువుటకు విద్యాధికారు లామోదించినది. ముద్దా విశ్వనాథముగారిది. శ్రీజయపురమహారాజావారు సంతోషించినది. రు. ౦-౮-౦.
10. ప్రేమాంజలి—(సుగుణసంపదగల పంచమదంపతులసుందరచరిత్ర) ముద్దా విశ్వనాథముగారి వచనము. రు. ౦-౫-౦.
11. తూలిక—ఇదియును బడులలోఁ జదువుటకు విద్యాధికారు లనుమతించినదియే. ముద్దా విశ్వనాథముగారిది. వెల రు. ౦-౧౦-౦.
12. జన్మభూమి—(కరుణరసభరితమగునాటిక) ఒక చిన్నకథ నాధారముగాఁ జేసికొని స్వదేశవిదేశకవుల భావములు కొన్ని చేర్చి ముద్దావిశ్వనాథముగారు రచించినవచనము. రు. ౦-౪-౧.

ఇవి యన్నియు స్వగృహముననే కూర్చుండి దేశమంతటను విఖ్యాతిని గడింపనున్న ముద్దా విశ్వనాథముగా రనునొక యువకునిచే రచియింపఁబడినవియుఁ బ్రకటింపఁబడినవియు. చక్కని చెన్నపురియచ్చు చిన్న చిన్న కథలు, హృదయంగమములు. పెద్దలు సంపన్నులు నీయువకుని సద్యత్నమునకుఁగానొక్కొక్కరొక్క "సెట్టు" కొనుటయే గొప్పసాయము. ఆతనివెట్టుబడి యాతనికి గిట్టినఁ జాలినంత యాంధ్రసేవ చేయుచున్నాఁడు. ఆశీర్వదింతుముగాక !

ఆంధ్రసేవాకార్యాలయము- ముద్దా విశ్వనాథముగారు, మెలుపాక, ఎలమంచిలితాలూకా, విశాఖపట్టణముజిల్లా, అని వీరివిలాసము.

---

(4) శ్రీమహాభారతనవనీతము:— ఆదిధార-ప్రథమాశ్వాసము. కవి, కీ. శే. ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారు. ఇది యాంధ్రీకరణయుగము. అనువాదములు పెక్కులు బయలుదేఱుచున్నవి. వ్యాసప్రోక్తమగు భారతము నాంధ్రమున వ్యాసప్రోక్త మనిపించుటకీ యాంధ్రీకరణ మొనర్పఁబడినయది. గ్రంథకర్తలు సుప్రసిద్ధపండితులు. పెక్కు గ్రంథములు రచించిరి. భారతమునఁ బదునేడుపర్వములను మాత్ర మాంధ్రీకరించి రఁట. శ్రీకృష్ణభారతము కంటె నిది యొకటి ప్రయత్నము. వీరి శిష్యులు విద్వాన్ ఓలేటి సీతారామశాస్త్రిగారిచే నీగ్రంథము ప్రకటింపఁబడినది. కాని, వారు భయపడినటులు నారికేళపాకమున రచింపఁబడలేదు. మిగిలిన గ్రంథభాగము త్వరలోఁ బ్రకాశిత మగునుగాక !

మ. ఒకనాఁ డాకపికన్య; దైత్యసుత తద్యోషాసఖుల్ క్రీడనో
 త్సుకలై వారివిహారముం జరిపి, సేతువ్యస్తవాతోద్ధతా
 వికచేలమ్ము లెఱుంగ కందినవి సావేగంబుగాఁ గట్టనో
 పిక వీడె న్భృగుకన్య; గాంచి దనుజప్రేష్ఠాత్మజ న్దోషిణిన్.

ఉ. కావుము పుత్త్రసత్యమును; గాపటికత్వము మాను; మించెడు
 న్బావిశతంబు కూపముల; బావుల నూఱిటి మిఱు జన్నమో
 భూవర ! నూఱుజన్నములఁ బోలు సుతుండు; శతాత్మజాధికం
 బౌ విను సత్యమే; సుకృత మన్యము సత్యసమమ్ము నున్నదే.

దీనితో 'నుతజలపూరితంబు లగునూతులు నూఱిటికంటె' నను నన్నయభట్టారకుని పద్యమును బోల్చిచూడుఁడు. 'తద్భారతముగ్ధవార్ధిఁ గొనెద న్నవనీతము మెచ్చ భూసురుల్' అనుటచే గ్రంథము శ్రీమహాభారతనవనీత మని పేరుం గాంచినది. ఆదిపర్వ మాదిధార యైనది. పాఠకులు గ్రంథప్రకాశకులకుఁ దగుసహాయ మొసఁగి మిగిలినగ్రంథభాగములను బ్రకటింపింతురుగాక.

---

(5) మేఘసందేశము—(ఆంధ్రీకృతము) శ్రీ మాడభూషి వఠం వేంకటాచార్యులుగారు- తిరుపతి. వెల రు. 0-8-0.

సుప్రసిద్ధసంస్కృతగ్రంథమున కిది మఱియొక భాషాంతరీకరణము. మూలమునందు వీరికిఁ గలయాదరమే దీనికిఁ గారణము. గ్రంథకర్తలు, ఋతుసంహారముఁ గూడ నిదివఱలో నాంధ్రీకరించిరఁట. వీరి యాంధ్రీకరణము పెక్కుస్థలముల మూలమును దలపించుచున్నది. కవిత్వశైలి యొకింత సరళముగ నుండిన బాగుగా నుండును. మహాకవి కాళిదాసుని కవిత యాంధ్రీకరించుట దుర్ఘట మనుట కీమేఘసందేశపు టాంధ్రీకరణములే నిదర్శనము. మచ్చునకొకపద్యము.

సరసం బా నడబావి గారుడశిలాసోపానమార్గంబుతో
వరవైడూర్యసమాననాళవికచస్వర్ణాబ్జసంఛన్నమై
యిర వానీటను గాంచి హంసములు నిన్నీక్షించియున్ మానసం
బరయం బోవు సమీపమయ్యు వగవాయం గాంచి యచ్చేరువన్.

---

(6) స్వప్నానసూయా—ఆకొండి రామమూర్తికవిగారు. వైద్యులు, విద్వచ్ఛిఖామణులు- పీఠికయందు పానుగంటి నరసింహారావుపంతులుగారు గ్రంథప్రకటనకారణమును, ప్రాశస్త్యమును దెల్పియున్నారు. వీరి యద్భుతకవితాగుంఫనము ప్రతిపదరమణీయము, రంజితకమనీయార్థగుణవిశేషము నఁట. వైశ్యశిఖామణు లొకరు తమభార్య సద్గుణాదికమును వర్ణింపఁ గోరఁగ గవిగా రీగ్రంథమును రచించిరి. ఆమెపే రనసూయ. స్వప్న

మునఁ గవి యామెను, అత్త్రిమహాముని భార్య యగు ననసూయాదేవిని
- చి, వారిసంభావణాదికము నే కృతిగా రచించె నఁట. ఇరువురచరిత
దభివర్ణితము.

ఉ. అబ్బురపాటుదోఁచు నయనాంబుజయుగ్మమునుండి పొంగిపై
కుబ్బుచు తళ్కులెల్లెడల నుత్పలమాలికలై చెలంగఁ ద
బ్బిబ్బుగ నట్టునిట్టుగని భీతియు నచ్చెరుపాటు వంతయుఁ గ్
రబ్బికొనంగ నప్పడుచు పైదలి సంభ్రమసంకులాత్మయై.

ఇది పెద్దనకవనమును స్ఫురింపఁజేయుచున్నది. అనసూయ పావన
చరిత వర్ణనమున స్త్రీల కుపదేశములు పెక్కు లీయఁబడినవి. ఇందలికవ
నము సులభగ్రాహ్యము. లలిత పదభూయిష్ఠము. మాదిరి కొకటి-

ఉ. వారలరూపసంపదయు వారియమానుషదివ్యతేజమున్
వారలభాగ్యచిహ్నములు వారివినూత్నవిలాసలక్ష్మిఁ గ
న్నారగఁ జూచి చూచి కడునబ్బురమందుచు నీవిసుంగు లె
వ్వారొకొ యాత్రిమూర్తులయు వైభవముల్ గనుపట్టు వీరికిన్.

---

(7) కవ్వడి కైవారము—తిరుమామిడి రామస్వామిశాస్త్రికృత
ము- బ్రహ్మశ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారిచే సంపాదింపఁబడి
ప్రకటింపఁబడినది. కవి పదునెనిమిదవశతాబ్దాంతమున జన్మించినటులఁ బీఠి
కయందుఁ గలదు. కిరాతార్జునీయమునందలి కథ కిది యాంధ్రీకరణము.
అచ్చ తెనుఁగు ప్రబంధము. అయినను తత్సమములు గలవు. దీనిని బ్రకటించి
ప్రకాశకు లాంధ్రమునకుఁ గొప్పయుపకార మొనర్చిరి. కవిత్వము రసవంత
ము. కాని వ్రాతప్రతినిసవరింపక యున్నదున్నట్లు ముద్రించి భాషకుఁ గొఱఁ
తఁ దెచ్చిరి. వలయువారు ప్రకాశకులకు వ్రాయవలయును.

చ. బలుజడి నించి తెల్లనయిబాసి మెరుంగుల రంగులుర్మివో
నలవడ క్రిందిమట్టలము నమ్మొగులం దెలిరెక్కలూనెనా
మలల మలంగు నేకలు మాటికిద్రోవగ రేవుద్రోవలం
గలబలు యొడ్లతమ్మిగమి గ్రమ్మిన నేరులు బారు మీరుచున్. (పు.26)

ముగా మకారాదివర్ణములను బోలియుండును. తెలుఁగులో దీనిని "గ్రుడ్డి గుఱ్ఱపుతాపు" అని వ్యవహరింతురు. వర్ధమానుఁడు గణరత్నమహోదధిలో దీని నిట్లు వివరించెను. ౩-౧౯౫. ఘుణోత్కీర్ణాత్ క్షతంచి న్నిష్పన్న మక్షరం ఘుణాక్షరం। తదివ య దకుశలేన దైవా న్నిష్పద్యతే తత్ ఘుణాక్షరీయకమ్.

## ౧౫. ఖలేకపోతన్యాయము.

"వృద్ధా యువానః శిశవః కపోతాః ఖలే యథామీ యుగపత్పతన్తి తథైవ సర్వే యుగపత్పదార్థాః పరస్పరే ణాన్వయినో భవన్తి". ముసలివి, పడుచువి, పిల్లలు నయిన నానావిధకపోతము లన్నియు నొక్కసారి యొకకళ్ళములో గింజ లేఱుకొని తినుటకు దిగును. అట్లే పదార్థముల కన్నింటికి నెచట నొక్కమారు అన్వయము సంభవించునో యచట నీన్యాయము ప్రవర్తించును. ఈన్యాయము సాహిత్యదర్పణము ౭౩౯ కారికలో నున్నది.

"సముచ్చయో య మేకస్మి న్సతి కార్యస్య సాధకే।
ఖలేకపోతికాన్యాయా త్తత్కరస్స్యా త్పరోపి చేత్."

## ౧౬. స్థాలీపులాకన్యాయము.

స్థాలీ=వండుకొనుపాత్ర- పులాక=పులగము. పాత్రయం దుడికిన యన్నములో నొకమెతుకును బట్టిచూడఁగా నన్న మంతయు నుడికినదియు లేనిదియుఁ దెలియును. ఆరీతిగా నేవిషయమునందైనను, ఏకదేశమును బరీక్షించి యంతయు సరిగా నున్నది, లేనిది, తెలిసికొనుట- పతంజలి మహాభాష్యములో ౧-౪ ౨౩. "పర్యాప్తో హ్యేకః పులాకః స్థాల్యా నిదర్శనాయ". శాబరభాష్యమందు- "లింగస్య పూర్వవత్త్వా చ్చోదనాశబ్దసామాన్యా దేకేనాపి నిరూప్యేత యథా స్థాలీపులాకేన."

## ౧౭. సూచీకటాహన్యాయము.

సూచీ=సూది. కటాహ=కాఁగు. సూది, యల్పాయాసముతో నల్పకాలములోఁ జేయఁబడును. కటాహ మట్లు కాదు. బహుప్రయాససాధ్యము. చాలకాలము పట్టును.

చిన్నపని పెద్దపని యొకమాఱు తటస్థించినపుడు మొదటఁ జిన్న పనిని జేసి పిదపఁ బెద్దపనిని నిర్వహించుటకుఁ బ్రయత్నింపవలె ననువిషయము నీన్యాయము తెలుపుచున్నది. కావ్యప్రదీపము చతుర్థోల్లాసప్రారంభమందు- ౬౬ పుట "లక్షణామూలవ్యంజనాయాః ప్రాఙ్నిరూపణాత్ ప్రావృత్తికం క్రమ ముపాదాయ సూచీకటాహన్యాయేన వా ప్రథమ మాద్య ముద్దిశ్య విభజతే."

## ౧౫. బిల్వఖల్వాటన్యాయము.

బిల్వము=మారేడుపండు- ఖల్వాట=బట్టతలవాఁడు- బట్టతల వాఁడు, ఎండచేఁ దపింపఁజేయఁబడినవాఁడై మారేడుచెట్టునీడకుఁబోఁగా దానిపండు వానినెత్తిపై నాకస్మికముగాఁ బడుటచేఁ దలపగిలినది. భాగ్యహీనుఁ డెచ్చటికిఁ బోయినను నాపదలు వానిని వెంబడించును.

## ౧౬. నష్టాశ్వదగ్ధరథన్యాయము.

ఇద్దఱుపురుషులు రెండురథములతో నొకగ్రామమునకుఁ బోయి రథములనుండి గుఱ్ఱములను విప్పివేసి గుఱ్ఱముల నొకచోటఁ గట్టి రథములను మఱియొకచోటఁ బెట్టి యొకమిత్రునియింటికిఁ బోయి సంభాషించుచుండిరి. అంతలో దైవికముగా నాగ్రామభాగ మగ్నిచే దహింపఁబడెను. ఒకని గుఱ్ఱములు మఱియొకనిరథము దహింపఁబడెను. అపుడు వారిరువురు నన్యోన్యాకాంక్షచే నొకరథమును జేసికొని యిష్టదేశమునకు బోయిరి.

విధి, అర్థవాదము నని వేదము రెండువిధములు. కర్మలను విధించు వాక్యములు విధివాక్యములు- జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత- చిత్రయా పశుకామః- ఇత్యాదులు- విధిని స్తుతించువాక్యము లర్థవాదవాక్యములు. విధ్యర్థవాదములు రెండును గలిసి యేకవాక్యతాపన్నములై కర్మ నిర్వర్తించుట కుపయోగించును. పూర్వోక్తమైనన్యాయ మిచటఁ బ్రవర్తించుచున్నది. ఈన్యాయము మిక్కిలి ప్రాచీనమైనది. పాణినిసూత్రమునకు ౧.౧-౫౦ వార్తికములో "సంప్రయోగే వా నష్టాశ్వదగ్ధరథవత్" అని చెప్పఁబడినది.

## ౨౦. దేహళీదత్తదీపన్యాయము.

దేహళి=గడప- గడపమీఁద నుంచినదీప మింటిలోనికిని బైటికిని కూడ వెలుఁగు నిచ్చును. ఏకకాలమందు రెండుపనులను జేయువస్తువును దెలియఁజేయు నీన్యాయము- ౧౨-౧-౩ జైమినిసూత్రమునకు శబరస్వామి రచించిన భాష్యములో "యథా ప్రాసాదే కృతః ప్రదీపః సన్నిధానాద్రాజమార్గే ప్యుపకరోతి." ఈన్యాయము "కాకాక్షిగోళకన్యాయము"-తోడను "జామాత్రర్థం శ్రపితస్య సూపాదే రతిథ్యుపకారకత్వమ్"-అను న్యాయముతోడను సరిగానున్నది.

## ౨౧. పాటచ్చరలుంఠితే వేశ్మని యామికజాగరణన్యాయము.

పాటచ్చర=దొంగ, లుంఠిత=అపహృతము-యామిక=పారావాఁడు.

ఇల్లు దొంగ దోఁచుకొని పోయినవెనుక పారాయిచ్చువాఁడు మేలుకొనుట. కార్యము నశించినపిమ్మట దానికిఁ బ్రతీకారము చేయుట. "దొంగలు చొచ్చిన యాఱుమాసములకుఁ గుక్క మొఱిఁగినది; "గతజలసేతుబంధనము" నీన్యాయముతో సమానములుగా నున్నవి. ఈన్యాయము శ్రీహర్షుఁడు వ్రాసినఖండనఖండఖాద్యములో ౪౫౯ వ పుటలో నిట్లుదాహరింపఁబడినది. "ప్రయోజనానుపయుక్తే కాలే తస్య స్వరూపతోఽవస్థానం పాటచ్చర లుంఠితే వేశ్మని యామికజాగరణవృత్తాంత మనుహరతి".

## ౨౨. పిష్టపేషణన్యాయము.

పిష్టపేషణము=నూఱినదే నూఱుట, చెప్పినదే చెప్పుట. ౯-౨-౩ జైమినిసూత్రమునకు శాబరభాష్యము- "నహి స్నిగ్ధస్య స్నేహనం శక్యం కర్తుం పిష్టస్య వా పేషణమ్."

## ౨౩. ప్రధానమల్లనిబర్హణన్యాయము.

ముఖ్యవీరుని వధించినచోఁ దక్కినవా రందఱు సులభముగా స్వాధీన మగుదురు- ౧-౪-౨౮ బ్రహ్మసూత్రములకు శంకరభాష్యము- "ప్రధానమల్లనిబర్హణన్యాయే నాతిదిశతి ఏతేన ప్రధానకారణవాదప్రతిషేధన్యాయకలాపేన సర్వేఽణ్వాదికారణవాదా అపి ప్రతిషిద్ధతయా వ్యాఖ్యాతా వేదితవ్యాః.

## ౨౮. బీజాఙ్కురన్యాయము.

బీజము లేకుండ నంకుర ముండదు. అంకురము లేక బీజ ముండదు. ఎచ్చట నిట్లు పరస్పర కార్యకారణభావమో యచ్చట నీన్యాయము ప్రవర్తించును. బీజాంకురప్రవాహ మనాది.

ఈన్యాయము- ౨-౧-౩౬ సూ. బ్రహ్మసూత్రభాష్యములో వ్యాఖ్యానింపఁబడినది. "న చ కర్మాన్తరేణ శరీరం సమ్భవతి న చ శరీర మన్తరేణ కర్మసమ్భవ తీతి । ఇతరేతరాశ్రయత్వప్రసఙ్గః । అనాదిత్వేన బీజాఙ్కురన్యాయే నోపపత్తే ర్నకశ్చి ద్దోషో భవతి."

## ౨౯. భక్షితేపి లశునే న శాన్తో వ్యాధిః-

నిషిద్ధవస్తు వగునుల్లిని భక్షించినను రోగము నిర్మూలింపలేదు. అనఁగా నకార్య మొనర్చినను లాభమును బొందలేదనుట. ఈన్యాయము వేదాంతసారము మొదటిశ్లోకమం దున్నది. "నను భక్షితేపి లశునే న శాన్తో వ్యాధి రితి న్యాయేన ప్రపఞ్చస్యా ధిష్ఠాన వ్యతిరిక్తత యా ప్రతీయమానత్వా కథ మద్వైతసిద్ధి రి త్యాశఙ్కాం తృణీకుర్వ న్నాహ । అఖణ్డ మితి."

## ౨౬. తక్రకౌణ్డిన్యన్యాయము.

విశేషశాస్త్రముచే సామాన్యశాస్త్రమునకు బాధయం దీన్యాయము ప్రవర్తించును. బ్రాహ్మణులకుఁ బెరుఁగు వేయుము- కౌండిన్యునికి మజ్జిగ వేయుము ఇందువలన, కౌండిన్యుఁడు కూడ బ్రాహ్మణుఁడని తెలియ వచ్చుచున్నది. ఈన్యాయము బృహదారణ్యకవార్తికములో ౧-౬-౭౧, పుట ౮౮౧) అభిన్నశబ్దస్య భేద నిషేధిత్వేపి నభేదస్య శూన్యతా సర్వత్ర ప్రాప్తస్య కారణే నిషేధార్థత్వో దధి దీయతామి త్యర్థోపాధౌ ప్రాప్తస్య దధ్నః తక్రం కౌణ్డిన్యాయేతి కౌణ్డిన్యే నిషేధేఽ. వ్యశూన్యతా వదిత్యాశ ఙ్క్యాహ తక్రేతి.

## ౨౭. కజ్జ్వలన్యాయము.

ఒక సొట్టవాఁ డొకగ్రుడ్డివాఁడు నొకనాఁటిరాత్రి దైవికముగా నొకసత్రమందుఁ గలిసిరి. మఱుచటిదినమం దుదయమున స్వగ్రామమునకుఁబోవఁదలంచి సొట్టవాఁడంధునిభుజముపై నెక్కి వాని నిటునడువుమటు

నడుపు మని ప్రవర్తింపఁజేయుఁగాఁ గొన కుభయులు స్వగ్రామమును జేరిరి. ఇట్లు ప్రవృత్తికార్యమునకు చేతనుఁడగు పురుషుఁడచేతనము వికరించునదియు నగుప్రకృతి నధిష్ఠింపఁగా జగత్సృష్టి జరుగుచున్న దని సాంఖ్యసిద్ధాంతము. "పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం తథా ప్రధానస్య। పఙ్గ్వన్ధవ దుభయోరపి సంయోగస్తత్కృతస్సర్గః" (అంధపంగు సంయోగమువలెఁ బ్రకృతిపురుషసంయోగముచే జగత్సృష్టి నిర్వహింపఁబడుచున్నది)

౭౮. చన్ద్రచన్ద్రికాన్యాయము.

ఈన్యాయ మత్యంతసిద్ధము లైన రెండువస్తువులను దెలియఁజేయును. చంద్రుఁడును వెన్నెల యొకదాని నొకటి విడిచి యుండదు. ఇది యానందగిరి వ్రాసిన శంకరవిజయమునులో ౧౨౮ పుటలో నున్నది. "అత స్సర్వదేవకారణస్య రుద్రస్య యా శక్తిః చన్ద్రచన్ద్రికాన్యాయేన తదుద్భూతరూపిణీ స్వాధీనవల్లభేతి ప్రసిద్ధా సైవ భవానీ".

౭౯. చోరాపరాధా న్మాణ్డవ్యనిగ్రహన్యాయము.

పురాణమం దిట్లు చెప్పఁబడియున్నది. దొంగలను బట్టుకొనుటకుఁ దిరుగుచున్న రాజభటులు మాండవ్యమునిసమీపమం దున్నయా చోరులను మునితోఁగూడఁ దీసికొనిపోయి రాజున కొప్పగించిరి. రాజు మునితోఁగూడ దొంగలకు శూలారోపణశిక్ష విధించెను. కాని యింతలో రాజతఁడు మహర్షి యగుట తెలిసికొని స్వాపరాధమును క్షమింపు మని వేఁడుకొని యతని విడిపించెను. అంతట నాముని యమునియొద్దకుఁ బోయి నా కిట్టిక్రూరశిక్ష విధింపఁబడుటకు నే నేమిపాపముఁ జేసితి నని యడిగెను. అందులకు యముఁడు "బాల్యావస్థలో నీవు తూనిఁగలను బట్టుకొని వానికిఁ జీఁపురుపుల్లలను గ్రుచ్చి హింసించితివి గావున నీ విట్టి క్రూరశిక్షకుఁ బాత్రుడవి" అని చెప్పెను. అందు కాముని కుపితుఁడై శైశవదశయందుఁ బిల్లలు చేసినపుణ్యపాపములకుఁ దల్లిదండ్రులు బాధ్యులు గాని పిల్లలు కారను ధర్మసూక్ష్మము నీకుఁ దెలియుటలేదు గనుక నీ వీపదవి కనర్హుఁడవు. నీవు శూద్రయోనిం బుట్టు మని శపింపఁగా నతఁడు విదురుఁడై పుట్టె నని పురాణకథ.

దుష్టులతోఁ జేరినసుజనుల కనర్థము వాటిల్లును.

ఈన్యాయము సర్వదర్శనసంగ్రహమందుఁ బూర్ణప్రజ్ఞాదర్శనము 23 పుటలో నిట్లుదాహరింపఁబడినది. "తస్మా న్న భేదప్రత్యక్షం సుప్రసర మితి చేత్తిం వస్తుస్వరూపభేదవాదినం ప్రతి ఇమాని దూషణాని యదుచ్యన్తే కిం వా ధర్మభేదవాదినం ప్రతి ప్రథమే చౌరాపరాధా న్మాణ్డవ్యనిగ్రహన్యాయా పాతః".

## ౩౦. ఛత్రిన్యాయము.

పదిమంది పోవుచుండఁగా వారిలో నైదుగురికి మాత్రమే గొడుగులుండి తక్కినయైదుగురికి గొడుగులు లేకపోయినను, అదిగో గొడుగులవారు పోవుచున్నా రని వ్యవహరింతురు. ఈన్యాయము- కఠోపనిషత్తు- తృతీయవల్లీప్రథమమంత్రము- "ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే" అనుదానికి శంకరాచార్యులవారు వ్రాసిన వ్యాఖ్యానములోఁ జక్కగా సమరి యున్నది. "ఋతం పిబన్తా వితి" "ఏకస్తత్ర- ఋతం కర్మఫలం పిబతి భుఙ్క్తే- నేతరః తథాపి పాతృసమ్బంధాత్ పిబన్తా విత్యుచ్యతే ఛత్రిన్యాయేన" ఈ శుత్యర్థమే శ్వేతాశ్వతరోపనిష చ్చతుర్థాధ్యాయములో మఱియొకశ్రుతిచేతఁ జెప్పబడినది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే॥ తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి"

## ౩౧. సుందోపసుందన్యాయము.

అన్యోన్యనాశ్యనాశకభావవిషయం దీన్యాయము ప్రవర్తించును. తొల్లి సుందోపసుందు లనునిద్దఱురాక్షసు లొకయప్సరసకొఱకుఁ గలహించి యన్యోన్యతలప్రహారములచే నుభయులు మడిసిరి. సాంఖ్యతత్త్వకౌముది ౧౩ "నను పరస్పరవిరోధశీలాగుణా సున్దోపసున్దవ త్పరస్పరం ధ్వంసన్త ఇత్యేవ యుక్తం ప్రాగేవ తేషా మేకక్రియా కర్తృతాయాః"

## ౩౨. దండాపూపికాన్యాయము.

దండము- అప్పములు. అప్పములు మూట గట్టి దండెమునకు వ్రేలఁదీయఁగా అప్పములమూట లేదు సరేగదా, దండెముకూడఁ గొఱికఁబడియున్నది. కఠినమైన దండెము కొఱికివేసిన యెలుకలకు మెత్తని

యప్పములమూట భక్షించుట యాశ్చర్యమా” ఇది కైముతికన్యాయ మువంటిదే.

“పర్వతముల నన్నముగాఁ దినఁగల బావగారికి తలుపు లప్పడముల క్రింద నాఁగవు.” “తల్లి చెవులు త్రెంచినవానికి పినతల్లి చెవులు బీఱపువ్వులు కావు.” తెనుఁగులో నీరెండుసామెతలు దీనితో సమముగా నున్నవి. కావ్యార్థాపత్త్యలంకారము కైముతికన్యాయసిద్ధము.

౩౩. న హి కఠోరకణ్ఠీరవస్య కురఙ్గశాబకః ప్రతిభటో భవతి.

పూర్ణముగాఁ బెరిఁగినసింహమునకు లేడిపిల్ల శత్రువు కానేరదు. బలహీనుఁడు బలవంతు నెదిరింపఁజాలఁడు. ఈన్యాయము సర్వదర్శన సంగ్రహములో నకులీశపాశుపతదర్శనములో నున్నది. “న హి పరీక్షా క్షమ మీక్ష్యతే న హి కఠోరకణ్ఠీరవస్య కురఙ్గశాబకః ప్రతిభటో భవతి.”

౩౪. న హి ఖదిరగోచరే పరశౌ పలాశే ద్వైధీభావో భవతి.

గొడ్డలి చండ్రచెట్టును నఱకుచుండఁగా మోదుగుచెట్టును భేదింపలేదు. రెండుపను లేకకాలమందు జరగ వని దీనితాత్పర్యము. ఈన్యాయము యోగభాష్యటీకలో నున్నది. “నను పురుషవృత్తి బోధః కథం చిత్తగతాయాః వృత్తేః ఫలం- న హి ఖదిరగోచరవ్యాపారేణ పరశునా పలాశే చ్ఛిదా క్రియత ఇతి.”

౩౫. కూపఖానకన్యాయము.

కూపఖానకుఁడు=నూతిని త్రవ్వువాఁడు. నూతిని త్రవ్వునాలివాఁడు తనశరీరమున కంటుకొన్న బురద నానూతిలో నూరిన నీళ్ల చేతనే కడిగికొని శుద్ధుఁ డగును. అట్లే తత్తద్విగ్రహావచ్ఛిన్నసర్వేశ్వరభేదబుద్ధి వలనఁ బొడమిన దోషము తత్తదుపాసనాజన్యసుకృతమహిమచే సమూలముగా నశించును.

పతంజలివ్యాకరణమహాభాష్యము- పస్పశాహ్నికమం దీన్యాయ మిట్లు ప్రశంసింపఁబడెను. “కిం పున శ్శబ్దస్య జ్ఞానే ధర్మః అహోస్విత్ప్రయోగే ఇతిబహుధా మీమాంసా ముద్భావ్య పున స్తుష్యతు దుర్జన ఇతిన్యాయేన అపశబ్దజ్ఞానస్య విపరీతత్వమాత్రేణ అధర్మసాధనత్వ మభ్యుపగమ్యాపి సమాధానా న్తర ముక్తం కూపఖానకవ దేత ద్భవిష్యతి కూ

యథానరః కూపం ఖనన్ యద్యపి మృదా పాంసుభి శ్చావకీర్ణో భవతి సో
ప్సు సంజాతాసు తత ఏవ తద్గుణమాసాదయతి యేన సచ దోషోనిర్హణ్య
తే భూయసా చాభ్యుదయేన యోగో భవతి.”

౩౬. భిక్షుపాదప్రసరణన్యాయము.

ఒకసన్న్యాసి కొన్ని వస్త్రాదులను సంపాదించుకొనుట కొకధనవం
తుని యింటిలోఁ బ్రవేశించి మెల్లగా నాగృహస్థునిపరిచయము సంపా
దించి క్రమముగాఁ దనయిష్టలాభములను బొందెను. అట్లే బుద్ధిమంతుఁ
డొకచోటఁ బ్రవేశించి క్రమముగా నందఱ పరిచయమును సంపాదించి
తనపనులను నెఱవేర్చుకొనును. వేదాంతదేశికులవారి తత్త్వముక్తాకలాప
ములో ౨౭౮ పుటలో నీన్యాయ మున్నది. “అస్త్వేవ మితిచే న్నభిక్షు
పాదప్రసరణన్యాయేన నిరీశ్వరవాదావతారా దతః క్రోధావశ్యంభావా
దీశ్వరస్యాపి దుఃఖావశ్యంభావః.”

౩౭. కూపయంత్రఘటికాన్యాయము.

నూతిలో మోటను బెట్టి యెడ్లచేఁ దోలింపఁగా నొకగూన
క్రిందికిఁ బోవును. మఱియొకటి నీళ్లుతీసికొని పైకివచ్చును. సంసారమం
దుఁగూడ నీరీతిగా క్రిందికి మీఁదికిఁ బోవుచు ననేకదుర్దశలను మనుష్యు
లొందుచుందురు. ఈన్యాయము సంసారస్థితిని దెలియఁజేయుచున్నది.
మృచ్ఛకటిక పదియవయంకములో నున్న ౬౦ వ శ్లోకములో నీన్యాయ
ము చెప్పఁబడియున్నది.

“కాంశ్చి త్తుచ్ఛయతి ప్రపూరయతి వా కాంశ్చిన్నయ త్యున్నతిం
కాంశ్చి త్పాతవిధౌ కరోతి చ పునః కాంశ్చిత్తరో త్యాకులాన్
అన్యోన్యం ప్రతిపక్షసంహతి మిమాం లోకస్థితిం బోధయ
న్నేష క్రీడతి కూపయంత్రఘటికాన్యాయప్రసక్తో విధిః”

౩౮. శాఖాచంద్రన్యాయము.

చెట్టుకొమ్మలమధ్య నున్నచంద్రుఁడు ఆకాశమందు చంద్రునిపై
మేఘము నడచుచుండఁగా నొకబాలకుఁడు చూచి భ్రాంతిచేఁ జంద్రుఁడు
నడచుచున్నాఁడని తలంచును. అప్పు డొకవృద్ధు వాని నొకచెట్టుక్రిందికిఁ
దీసికొనిపోయి రెండుకొమ్మలమధ్యను స్థిరముగా నున్నట్లు చంద్రుని
జూపి వానిభ్రాంతి నివారించును.

౨. ఉద్గతివృత్తము.
జగతి స్సజ-ల్జగణంబు
నగణసజగ-ల్నవీనధీ
నాగ భనజవగ-ణంబులతో
నొగి మంజుభాషిణిగ-నుద్గతం బగున్. ౭౭

3. మధురవృత్తము.
పరఁగఁగ మున్నుఁ బ్ర-భాతవృత్త మయ్యెన్
స్థిరమతి మఱి యుల్ల-స్ిల్లఁ బరాజతన్
స్మరరిపుసుత మూటన్-మాలిసీవృత్తరీతిన్
సరవి మధురన్ నసల్జజ-జంబు గ మా తురన్. ౭౮

౪. మణిదీపికవృత్తము.
పరఁగు నాదిపదము నభత్రయసగణబంధుర మయి రా
గరిమను సననలును సజభల్సకారముఁ ద్వపద మగుం
బొరిని మూఁడవయంఘ్రి నభ్రసము ల్నసయుగము జోడును దగునిడం
దరళ నాల్గవపాద మొందుచుఁ దా నగు స్మణిదీపికన్. ౭౯

చ. అలసమవృత్తరాజి నుదయం బగు వృత్తగణాక్షరంబులం
దులఁ గలవళ్లుఁ బ్రాసములును స్మతి తప్పకయుండఁ గూర్చినన్
వెలయుఁ జు మిట్టి యర్ధసమవృత్తములున్ విషమాఖ్యవృత్తముల్
బలయుత గోప్పదీకృతకబంధనిధీ కరుణాసుధానిధీ! ౮౦

మఱి పంచపాదివృత్తము.

ఉ. శ్రీధరదాసచంద్ర సమవృత్తమె మైనపదంబులైనఁ బా
దాధికమంచుఁ బంచపదియంచును బల్గఁగమించు నీక్రియన్
సాధుకవిస్తుతైకకృతిసంఘమునందునఁ గూర్చువృత్తమున్
సాధితదుష్టదైత్యచయసన్నుత గాయకనాయకా సదా
రాధితరాఘువేంద్ర విపినాటకులాంబుధిపూర్ణచంద్రమా. ౮౧

మఱియుఁ బ్రత్యయంబులు వివరించెద.

## — ప్రత్యయవివరణము —

క. నచుముగఁ బ్రస్తారము ల
ష్టయు, నష్టోద్దిష్టవృత్తసంఖ్యలు ను లగ
క్రియ, యధ్వము, నన షట్ప్ర
త్యయములు సుకవీంద్రు లెఱుఁగఁదగుఁ బ్లవగేంద్రా! ౪౯

గీ. వరుస గురుపంక్తి పైనిడి వానిదిగువ
చాళ్ల నొకఁడాది ఱెట్టి వొసంగఁ జూచి
గురులు లఘువులుఁ గ్రమమునఁ గూర్ప నందు
సర్వలఘ్వంత మైనఁ బ్రస్తార మయ్యె. ౫౦

క. సరికిని లఘు విడి బేసికిఁ
గురు విడునపు డొకటి దానఁ గూడినలెక్కల్
పరఁగఁగ నర్థించినచో
వెరవొప్పఁగ నష్ట మైనవృత్తము వచ్చున్. ౫౧

గీ. ఒకటి మొదలుగ ఱెట్టిడి యున్నలెక్క
లందులోపల(లఘువుల) క్రిందిలెక్క
లన్నియును దీసి వెరసిడి యందునొకటి
గలయ నుద్దిష్టవృత్తంబు గనఁగవచ్చు. ౫౨

క. ఛందోగణాక్షరంబుల
క్రిందట నొకఁ డాదిగాఁగ ఱెట్టింపఁగ నం
దొందు తుదలెక్క యినుమడి
యందంబుగ వృత్తసంఖ్య యగు సామీరీ. ౫౩

క. ఎక్కువ ఛందోక్షరముల
యొక్కట్లవి చేర్చి దాన నొక్కటి మీఁదం
జెక్కి యుపాంతముతుదలం
జిక్క లగక్రియకుఁ గూర్పఁజెలగుఁ గపిమణీ. ౫౪

గీ. అమరువృత్తసంఖ్య యది ద్విగుణముచేసి
యందు నొకటి మాని యంగుళములు
ప్రస్తరించుచోటఁ బ్రకటించులెక్కలే
యధ్వ మనఁగఁ దనరె ననిలపుత్ర. ౫౫

— దండకాదివృత్తములు —

క. అల యిరువదియాఅక్షర
 ములకగ్గలమైన పాదములఁ గలవృత్తం
 బులు నుద్ధురమాలికలును
 నలరు లయగ్రాహి దండకాను లనిలజా. ౧౯౮

లయగ్రాహి.
 ముందు భజసల్ నగణ మింపు నిరుచోటులను
 నొంద భయ లంపుపయిఁ జెందఁగ లయగ్రా
 హిం దగువిరామములు చెందవుసుమీ పవన
 నందన సురౌఘమునిబృందనుతశౌర్యా! ౧౯౯

అందు లయవిభాతి.
 మునుపు ననసత్రయము కొన ననగ లుంచినను
 నెనయుచును గావ్యములఁ జను లయవిభాతి
 గ్గననగుచు వళ్లెడలి తనరు నలుప్రాసముల
 వనచరకులాంబురుహవనజకులమిత్రా! ౨౦౦

అందు లయహారి.
 నగణములు పదియు నొకటగుచుఁ దదుపరి మఱియు
 సగణమును గురువు నిడఁ దగును లయహారిం
 దగిలి నలుపదములను నిగుడవు విరమణములు
 సుగుణనుతమతికలిత నగచరవరేణ్యా! ౨౦౧

అందు త్రిభంగి.
 మును బుతునగణములను ససభమసగలను
 బొసఁగఁగ యతి డిందం గృతిఁజెందం బ్రాసము నొందం
 బెసఁతురు సుకవులు నిసుఁ బొగడెదు నెడ విను
 హనుమా శుభసంగీ మృదుభంగీ వేడ్కఁ ద్రిభంగీ. ౨౦౨

— దండకవిధములు —

క. దండకవిధములు పెక్కులు
 దండిగఁ గల వవి చతుష్పదస్ఫురితములై

యుండెడి వనేకపదముల
నుండెడివిఁ వాని విను సమున్నతచరితా. ౬౧

అందు చండవృష్టిదండకము.

నగణయుగముమీఁదటం దేడు రేఫల్ దగఁ జండవృష్ట్యాఖ్యతోఁ
దండకం బౌ హరీ. ౬౨

నగణములు ౨ రగణములు ౭.

అర్ణమనుదండకము.

నయుగముపయి రాష్టకం బైనచో నర్ణమం దండకంబొప్పు నోయంజ
నాకంజనేత్రాత్మజా ! ౬౩

నగణములు ౨. రగణములు ౮.

అర్ణవదండకము.

మొదట ననలమీఁదటం దొమ్మిదా రేఫ లున్నంగ నా దండకం బర్ణ
వం బండ్రు శ్రీరామభద్రాగ్రణీ. ౬౪

నగణములు ౨. రగణములు ౯.

అందు వ్యాళదండకము.

బుధులఘువులపైని రేఫల్ పది న్నిల్వఁగా వ్యాళనామంబుతోఁ దండ
కం బౌనయా జంబుమాలిప్రధూమధ్వజా ! ౬౫

నగణములు ౨ రగణములు ౧౦.

జీమూతదండకము.

గుహాముఖలఘువుల్ రము న్రేఫ లీరైదు జీమూత మన్దండకం బయ్యె
నోనక్రచక్రస్థలీశాపజీమూతఝంఝానిలా ! ౬౬

నగణములు ౨. రగణములు ౧౧.

లీలాదండకము.

రసలఘువులమీఁదఁ బండ్రెండు రేఫల్ దనర్పంగ లీలాకరంబన్న
యాదండకంబున్దగు న్ధారుణీం గంపనాంభోధికుంభీసుతా ! ౬౭

నగణములు ౨. రగణములు ౧౨.

ఉద్దామదండకము.

నయుగళమును రేఫము ల్రేఫ లీరాఱు నుద్దామమం దండకంబౌ ను
బాలస్వ్యశాసూహతాజిస్థలీలక్ష్మణప్రాణసంరక్షణోద్యద్దయా! ౧౮
నగణములు ౨. రగణములు ౧౩.

శంఖదండకము.

నయుగళిపయి నెన్నఁ బద్నాల్గు రేఫల్ క్రమంబొప్పఁగా నుండిన శ్శం
ఖమం దండకం బెందు నందంబగుౘ శంఖహస్తాంఘ్రిపేరేజ భృంగాయ
మానా ఘనా! నగణములు ౨. రగణములు ౧౪.

నగణయుగముతోడ నీరీతితో రేఫలే డాది గాఁగా గణంబంఘ్రి కొక్కొక్క
టెక్కించినౘ చండవృష్ట్యాదులౌ దండకంబుల్ దగుౘ వీని నేకోనసా
హస్రపర్యంతమై యేకపాదంబులం గూర్పఁగా వచ్చుఁ గాకుండెనే
నిం జతుష్పాదయుక్తంబుగాఁ జేయఁగావచ్చు నీలాగున న్నద్వయం
బాదిగాఁజేసి యాపైఁబయో దేవతం బౌగణశ్రేణియే డాదిగా నేపదం
బందునొక్కొక్క టెక్కించియేకోనమైనట్టి వేయింటిసంఖ్యల్ప్రవర్తిల్లఁగా
దండకంబు ల్వినిర్మింపఁగావచ్చు నద్వంద్వము న్మాని యాదిన్న భోదైవ
తంబౌ గణంబుంచి యెంతే తకారంబులు న్నిండనస్వేచ్ఛగాంతంబుగా
నుంపఁగావచ్చు నింకొక్కటౌ దండకంబు న్సనవ్లాంబుతో నాదిగాఁబెట్టి
మీఁదం దకారంబు లెన్నైన నిచ్ఛాగతి న్గూర్చి గాంతంబుగా నిట్లు
గావింపఁగా వచ్చు నోయాంజనేయా జయోపాయ విద్వత్ప్రవిగ్రామ
ణీగేయ నిర్భేదితానేకదైతేయ కీశాన్వయాంభోధిచంద్రోదయా! ౨౦

— ఆర్యలపేళ్లు —

క. జాతులు మాత్రాసమకము
లాతతగతిఁ గృతులయందు నగు నార్యలు త
ద్గీతులు కందము లాదిగ
వాతాత్మజ వినుము వానివరలక్షణముల్. ౨౧

క. గగభజసనలము లేనునె
యుగు వీనికి నొండుగణము లమరవు జేసిౘ

జగణము గా దిలలో నా
అగు నెడ నలమైన జగణమైన న్నిలుమీ. ౭౨

క. కపివర పథ్యయు విపులయుఁ
జపలయు ముఖచపల జఘనచపల లివై ద
చ్చపుటార్యలు; గీత్యుద్గీ
త్యుపగీత్యార్యాఖ్యగీతు లొనరు న్నాల్గుఁ. ౭౩

౧. పథ్యార్యాలక్షణము.
కుఱుచదుగులఁ ద్రిగణంబులు
నెఱయుచుగు చతుర్గణగలు నిలిచినచో
మఱి తుదయఱలో షడ్గణ
మురువటు లఘువిడుదు రొగిని బథ్యార్యన్. ౭౪

క. వడి పథ్యకు నేడగుగణ
మిడుచో మొదలరను నంధ్రకృతిఁ జెందున్
గడయఱ నాఱవగణమున
కిడు లఘువుమీఁద నెసఁగు యతుల్. (ఇది పథ్యాలక్షణము)

౨. విపులార్య.
అమరేశుపథ్యను చోరుపా
దములు సమాంఘ్రులను గూర్పఁ దగియుల్లన్
క్షమలో విపులార్యాహ్వా
య మిది యగును దెలియంగాఁ బవనసుతా. ౭౬

౩. చపలార్య.
సరిచరణామల జగణం
బు రాఁగ నిర్వంక గురువుఁ బొందింపన్
బరఁగుఁ జపలార్య కృతులఁ
మరుత్సుత రవిజమంత్రివరా. ౭౭

౪. ముఖచపలార్య.
అల ముఖచపలకుఁ జపలం
దలిర్పుఁ బూర్వార్ధమాదిఁ దత్పరమై

నిలుచు నపథ్యాంతార్ధము
జలనిధిలంఘనజవశాలీ. ౭౮

౫. జఘనచపలార్య.
మునుబథ్యాపూర్వార్ధము
గను మొదలర్ధమయి చపలగలతుదయం
టును జఘనచపలకు తుదం
గనద్వచోజితకద్రూజా! ౭౯

౬. గీతి.
వెలయఁగఁ బథ్యాపూర్వా
ర్ధలక్షణము రెండరలను రాఁజేయ
న్నలలితమతులగు సుకవులు
పలికిరి యది గీతియనుచుఁ బ్లవగపతీ. ౮౦

౭. ఉద్గీతి.
తుదపథ్యార్ధము మొదలుగ
మొదలర్ధము తుద మొనసినఁ దా
నది యుద్గీతికిఁ బేరగు
సదాగతికుమారవర్య జయధుర్యా. ౮౧

౮. ఉపగీతి.
ధరఁ బథ్యార్యకుఁ గలిగిన
చరమార్ధమె రెండుసగములం
బరఁగిన నుపగీతి యగుఁ
సురగిరిసమధైర్య శుభచరా. ౮౨

౯. ఆర్యాగీతి.
గీతియరలరెంటితుద
న్ఖ్యాతిగ నొక్కొక్కగురువు నట మెక్కింపన్
రీతివహింపఁగ నార్యా
గీతియగు స్కంద మిదియె కేసరిపుత్రా. ౮౩

— కందపద్యలక్షణము —

క. కందంబులు బహుగతులను
నందంబగుఁ గుఱుచకంద మన నిడుదయనే
కందంబా ద్వివిధకందము
నంచుఁ జతుష్ఛందమాది యైనవి పెక్కుల్.

క. కందం బార్యాగీతియొ
యందలిప్రాసములు యతులు నమరిచి గణము
ల్పొందుగ మూటను నైదిట
నందెనుపదములను గలిగి యర్థములైనన్.

క. హరివర ముప్పదినాల్గ
క్షరములకందంబు కుఱుచకందంబన ని
ద్ధరఁ దగు నఱువదిరెండ
క్షరములకందంబు నిడుదకందం బయ్యెన్

కుఱుచకందలక్ష్యము.
లంకాగ్రావస్థోద్య
ట్టంకా, రక్షోవనీకుఠారా, జేజే
శంకాదూరా, దుష్టా
తంకాంభోదాశుగా యుదంచత్కీర్తీ.

నిడుదకందలక్ష్యము.
కసిమసఁగి మెసవఁదలఁచిన
మొసలిని దునిమితివి బళిరె మునినుతచరితా
బిసరుహభవముఖరులకును
వసమగు భవదసమబలము వసుమతిఁ బొగడన్.

ద్వివిధకందలక్ష్యము.
క. చదువఁగ నేయర్థము వలె
నది మొదలుగఁ జనువఁ గ్రియకు నమరెడుక్రియకై
తుదయర్థము మొదలర్థము
కదియక వేఱైన ద్వివిధకంద మనఁదగున్.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు; పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహసభావర్గము.

## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ, బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు. ఎం. ఏ, బి. ఎల్.

వింజమూరి వెంకన్న పంతులుగారు. ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు,(కోశాధ్యక్షులు)
పెద్దాడ రామస్వామిగారు, ఎం, ఏ. „
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. „
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు. „
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ.; ఎల్. టి
దర్భా వేంకటశివరామరాసుగారు, బి ఏ., బి. యల్.
అళక్కి వేంకట్రామయ్యగారు.
కేశవరపు రామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

—ప్రథమ భాగము—

ఇది బహువిధముల నాంధ్ర నిఘంటువు లన్నిటికంటె మిక్కిలి శ్రేష్ఠమైనది. సంస్కృత పదములకు, తెనుఁగుపదములకు వానిప్రయోగములకుఁ దడవికొనవక్కఱ లేదు. విద్యార్థులకుఁ గవులకు నీనిఘంటు వనేకవిధముల సమస్త సహాయమును జేయును.

సాదాప్రతి రు 5 లు- ఆర్టుపేపరు ప్రతి రు 7 లు.

---

# రఘునాథరామాయణము.

ప్రథమ భాగము.

తంజావూరు రఘునాథభూపాలుఁడు రచించినదానిలోని కొంత భాగము. ఈభూపాలునికే చేమకూర వేంకటరాజకవి విజయవిలాసము సంకితము చేసినది. ఈరాజకవి కవిత్వము మృదుమధురమైనది. కల్పన లతి మనోహరములు, పాఠకలోక మీతని ద్విపదనలచరిత్రమును, వాల్మీకి చరిత్రమును జదివియేయుందురు కావున మేము వేఱుగఁ జెప్ప నక్కఱ యుండదు.

వెల రు 0-8-0.

---

## ఆంధ్రసాహిత్యపరిషత్తు

# రజతోత్సవసంపుటము.

ఇం దిరువది యైదుసంవత్సరములలోని పరిషచ్చరిత్రము గలదు. అనేకులు పండితులు, కవులు, ప్రభువులు వ్రాసిన యాంధ్రగద్యపద్య వ్యాసములును, ఇంగ్లీషు వ్యాసములును గలవు. రాజులు, మహారాజులు, తదితరుల ఫొటోలును గలవు.

దీనివెల రు ౧-౦-౦.

పరిషద్వృత్తాంతము ౦-౮-౦.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ.

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada.

కేమి భంగము వాటిల్లునో యను వదంతులును గొన్నిగలవు. నిష్పక్షపాతులగు విద్వాంసులకు సత్యాసత్యముల గుర్తెఱుఁగఁగల బుద్ధిమంతులకును, యుక్తులచే సిద్ధాంతపూర్వపక్షములఁ జేయఁ జాలిన పండితులకు విమర్శకతానైపుణి వాస్తవ మిది యని, యిది యవాస్తవ మని యూహించు కోవిదులకుఁ జనశ్రుతులలోని సత్యాసత్యములు తెలియక పోవు. సాధారణుల పయి నెట్టి యపనిందలు వచ్చిపడినను మన కంతగా నిబ్బంది యుండదు, గాని, పెద్దలు, పండితులు, కవులు, రాజులు, మహాప్రభులు- ఇట్టి వీరిమీఁదికి వచ్చిన నిందలను మన ముపేక్షించి యుండ రాదు. అది యెంతవఱకు నిజము, నిజ మనుట కెట్టి గట్టి యాధార మున్నది; కా దనుట కేమి నిదర్శన మున్నది, యని నిర్ణయించి, లోకమున కావిషయ మిపుడు కా దనిన- పెద్దనష్టము వాటిల్లినను, ఇదివఱకున్న నిందయే చాలు నిఁక మీఁద నట్లు విశ్వసింపరా దని జనుల హృదయములలో దృఢముగ నాటుకొనున ట్లొనర్చుట పండితులవిధి. సాధారణులపై నైనను నిందలు మోపుట న్యాయమా, కావున, నిక్కమారసి యీ క్రింది వదంతులు వదంతులో నిక్కములో కనుఁగొని యీపరిషత్పత్రికాముఖముననే లోకోపకార మొనర్పఁ నేను బ్రార్థించుచున్నాఁడను.

౧. నన్నయభట్టు-అథర్వణాచార్యుని భారతమువిషయమై చేసినాఁడనిన యకార్యము. ౨ భీముని ఛందమును గోదావరిలోఁ గలుపుట.

౩. సారంగధరుఁ డెవ్వరు, చిత్రాంగివృత్త మెట్టిది. ఇది రాజమహేంద్రవరములో జరిగినదా.

౪. పోతరాజకవి దున్నుకొనుట శ్రీనాథుఁడు సవారి యెక్కి వెళ్లుట వారికిఁ గల బంధుత్వము.

౫. శ్రీనాథునిపైఁ గలసందేహములను నే నిదివఱకు గోరినవి.

౬. కృష్ణదేవరాయలు తిమ్మరుసు కుఁ గావించిన కృతఘ్నత.

౭. తిక్కనకు మంచముచాటునఁ బసుపుముద్దలతో నీళ్లు పెట్టి పోసికొమ్మనుట. ౮. నన్నయభట్టేమయినాఁడు, నారాయణభట్టేల భారతమును బూర్తిచేయలేదు.

౯. ఇంకను నాకుఁదెయని యిట్టివి.

# ఆంధ్రజయము.

—కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ.—

శ్లో॥ నిధే స్సంజాయతే రత్నం నికషా ల్లభతే రుచిమ్
కవే స్సంజాయతే కావ్యం విమర్శా దశ్నుతే యశః॥

తిక్కనార్యుని విరాటపర్వమును గూర్చి మాయన్నగారు బ్రహ్మశ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు విపులముగా విమర్శించుచునే యున్నారు. అయినను శ్రీ కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ. గారు, ఆంధ్రభారతకవితా విమర్శమునఁ బ్రదర్శించిన సాహిత్యవిమర్శనసరణి ననుసరించి, తిక్కన కవీంద్రుని భారతాంధ్రీకరణమునందలి కొన్నిరంగములపై వినోదార్థము కొంచెము ముచ్చటింప నెంచితిని. సాహిత్యచర్చ వివేకానందసాధన మగుటచే నే నీవ్యాపారమును సాగింపఁ గుతూహలి నైతిని. కావున సహృదయు లగుసోదరు లాగ్రహావేశములకు లోనుగాక, శాంతభావముతో నావాదముల నాదరింపఁగోరుచున్నాను.

తిక్కయజ్వ విరాటపర్వమునఁ బాండవులు మాఱువేసములతో విరాటునికోటలోఁ జేరుసమయమునఁ గవ్వడి వడిపేడిన పేడినడపులతోఁ దనకడకు వచ్చుటను గాంచి, యాపార్థివుఁ డప్పార్థుని నీ వెవ్వండ వని యడుగ నే బృహన్నలనామధేయుఁడ నాట్యకలాకోవిదుఁడ నిను సేవింప వచ్చినాఁడ నన నామత్స్యభూపాలుఁ డుత్తరయనుతనకూఁతు నాతనికడఁ జదివింపఁ దలంచి తనతనయఁ బిల్వఁబుచ్చెను.

ఇటఁ దిక్కనకవివరుఁ డుత్తరను రాజసభాభవనమున నవతరింపఁ జేయుచుఁ జేసిన రాజకుమారీయౌవనవైభవవర్ణనమును గాంచినచోఁ బుంస్సంధానమందిరమునఁ బ్రవేశించి, ప్రియునితో సరస మాడ నర్హ మగు కామినీశృంగారభావము పొడకట్టుచున్నది. కాని విద్యాభ్యాసమునకై పాఠశాలాసదనమునకుఁ బోయి యాచార్యునికడ విద్యలఁ బఠింప నభిలషించువిద్యార్థినికి నుండఁదగువినయాదిగుణసంపద స్ఫురింపదు.

తిక్కనార్యుఁడు నిజకావ్యరంగమున యువతీసౌందర్యసౌభాగ్యము నవతరింపఁ జేయుట కిదియే నాంది. ఇప్పట్టునఁ దిక్కన యొనర్చిన యుత్తరావయోవర్ణనము మృదుపదసుందర మగు ద్రాక్షాపాకమునఁ బడక, క్లిష్టపదబంధుర మగు నారికేళపాకమునఁ బడినది. మధుమాసమాకందసుమసౌరభముచందమున సుందర మగు లేఁబ్రాయంపు సోయగము సొంపు, సుఖావగతి మగునట్టులు గోమలపదవిన్యాసములతో సాగింపవలయును గాని, ప్రయాసబోధ్యము లగుశబ్దాడంబరములతో నడపింపరాదు. తిలకింపుఁ డాపద్యమును,

"సీ. అల్లఁదనంబున నడుపు మైకొనఁ జూచు
నడపుకాంతికి వింతతోడవు గాఁగ
వెడ వెడ నూఁగారి వింతయై యేర్పడుఁ,
దారనివహములలో నారు నిగుడ
నిట్టలఁ బ్రోఁచుచు నెలవులుకలమేర,
లెల్లను జిగి మెక్కి యేర్పడంగఁ
దెలుపును నలుపును వెలయంగ మెఱుఁ గెక్కు,
తారకంబులఁ గ్రిక్కితసముదొడరఁ
జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపుచుండ నుత్తర చనుదెంచె
నలరువిలుతుపువ్వుటమ్ముఁ బోలె."

ఈపద్యము పాఠకుల కనాయాసముగా బోధపడుట కనువగు పదములతో నడచుట లేదు. నైఘంటుకసాధ్య మగుశబ్దధ్వానముతో భావన మొనర్చుచున్నది పఠింపుఁ డేయఁగు వారి పద్యంపు సొంపును.

ఉ. ఇంచుక ముద్దులేనగవు నింక కనవ్యవిలాససూక్తుల
భ్యంచితలోలదృష్టియు నవారుణపల్లవమూడవాబు ని
ర్తించు సలీలయానములు మేలుగ యౌవనలక్ష్మితోడ న
ర్తించుమృగాక్షిచంధము లతిప్రమదంబు ఘటింపఁ జాలవే.

ఈపద్యమునందలి పదలాలిత్యము తిక్కనవ్రాసిన పైపద్యమునం గానరాదు. మఱియుం గవివరుం డుత్తరసౌందర్యమును బాదాదినేత్రాంతము వర్ణించియున్నాఁడు. ఇట్లు మానవస్త్రీలయౌవనసౌందర్యము నారోహణాక్రమముగా వర్ణించుట ధార్మికమర్యాదావిరుద్ధము. ఇది దేవతావనితల వర్ణించునపుం డనుసరింపందగినమర్యాద. మానవాంగనల వర్ణించునపుడు శిరోజములనుండి పాదములవఱకు నవరోహక్రమముగా వర్ణింపవలయును. ఈధర్మమును మల్లినాథసూరి కుమారసంభవమున బార్వతీవయోవర్ణనసందర్భమునం దెలిపియున్నాఁడు కనుఁడు.

"దేవతానాం రూపం పాదాంగుష్ఠప్రభృతి వర్ణ్యతే మానుషాణాం కేశాదారభ్యేతి ధార్మికాః" తిక్కయజ్వ కుమారసంభవవర్ణిత మగు పార్వతీరూపవర్ణనము ననుకరించుచు నుత్తరరూపమును జిత్రించి నట్లు తోఁచెడిని. అదు "కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం" అను భావమునే "అలరు విలుతు పువ్వుటమ్ముఁబోలె" అని నుడివెను.

ఈయుత్తరావయోవర్ణనము వ్యాసభారతమున లేనే లేదు. ఇది క్రొత్తగాఁ దిక్కనార్యునిచే సృజింపఁబడినది. అసలిట నీయువతీవయోవర్ణనప్రస్తావన యొందులకు ?

పోనీ యీసోయగమును విజయునకు వినిపించి యింపొదవించు తలంపుతో వ్రాయఁబడిన దందుమా ! ఇది తిక్కనసోమయాజివచనము కాని కథావస్తువుతో సంబంధించిన ప్రసంగము కాదు. ఇఁక బిల్హణీయమున—

"మోమఖిలంబు గన్నుఁగవ ముచ్చట మీఱఁగ వక్షమంతయున్
గామిడిచన్నుదోయి కసుగాను సమస్తము మిన్ను చూడఁగా
హేమము తత్తనూవిభవ మీరుచిరాంగికి విద్య చెప్పఁగా
నీమహి నెవ్వఁడోపు స్మరియించినమాత్రనె భ్రాంతిపుట్టఁగన్.

అనియచటిమంత్రులు తలంచిన ట్లీమంత్రివరుఁడు బృహన్నల విద్య నేర్పు సమయమున నిట్టి నిండువయసు గాని నంటకుండుట యెట్లను తలంపుతో సర్వాంగీణయౌవనసౌందర్యమును వర్ణించె నందుమా ! ఇదియుం బొసంగదు. ఏమందురా ? ఇట విద్య నేర్పవచ్చిన బృహన్నల

బిల్హణీయమునందలి యుపాధ్యాయునివలె రూపగరిమ గలయువకుఁడు కాఁడు. పరిపూర్ణనపుంసకస్వరూపుఁ డగుపేడివాఁడు. ఇట్టి వానియందు మందయానలరూపసంపద యడవినిగాసిన చందమామ వెలుంగు చంద మగును గాని చిత్తవికారకారణము కానేరదు.

ఇంతయె కాదు. కిరీటి కుత్తర భావిబాంధవముచేఁ గోడలగుటను, ప్రస్తుతసంబంధముచే శిష్య యగుటను, పుత్రికగా భావింపఁ దగియున్నది. కావున నిటు శృంగారరసోచిత మగువయోవర్ణనమును దాండవింపఁ జేయుట యంత యుచితముగాఁ దోఁపదు.

ఇఁక సభ కేతెంచినయుత్తరను గాంచి తత్తఱపాటుతో విరాటుఁడు ప్రదర్శించిన ప్రేమకలాకలాపములఁ జూడఁ జిరకాలము పుత్రికావియోగ పీడితుఁ డగుజనకుఁడు హఠాదాగత యగు నందన నవలోకించినపుడు చెందుభావోద్రేకము ప్రకటిత మగుచున్నది, కాని, యనుదినావలోకిత యగుతనయను గాంచి యింతటియనురాగమును వెలిపుచ్చుట యంత రసవంతముగాఁ గోచరించుట లేదు — చూడుఁడు.

చ. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ మోపుఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం బొరింబొరి న, పూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పగుమృదుమౌళి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు సద్గిలిన్.

నిజ మారయ నీపద్యము దీర్ఘవియోగసంద్రుష్ట యగు నాయిక యెడ నాయకుని యనురాగచేష్టలు తెలుపునదిగాఁ జూపట్టుచున్నది, కాని, తండ్రి కూఁతుపైఁ బ్రకటించు వాత్సల్యకృత్యముల నంతగా స్ఫురింపఁ జేయుట లేదు.

ఇదియునుం గాక విరాటమహారాజేల పేరోలగమున నీలీల బాలికపై నింతటిమక్కువను బ్రకటింప నెంచె? తనకుఁ గొమరితపైఁ గల యల్లారుముద్దును బృహన్నలకుఁ జూప సమకట్టెనా? ఈమురిపెపుచేతలు మూలమున మృగ్యములు.

వేఱొకసంగతి — తిక్కన యాక్రిందివచనమున విరటుఁడు కిరీటితోనుత్తరను గూర్చి ప్రసంగించినజాలును జిత్రించియున్నాఁడు.

వ. "ఇవ్విధంబున గాదిలికూఁతు నుపలాలించి, బృహన్నలదెసం గనుంగొని, సాదరదరస్మితరుచిరాననుండై యిమ్ముగువ నీకు నాటగఱపం దగుపాత్రంబగునే యని యడిగి తత్ప్రతివచనంబులయందలి నాగరకత్వం బునకుఁ జిత్తంబు రంజిల్ల మధురసల్లాపంబు సేసి, కర్పూరసహితం బగు తాంబూలంబు వెట్టి, చిత్రంబు లగుచీనాంబరంబు లిచ్చి, మణిమయంబు లగునాభరణంబు లొసంగి, సంభావించి, యవ్విభుండు"

కవివరుఁడిటఁబొందుపఱిచిన "సాదరదరస్మితరుచిరాననుండై" అను సమాసవిశేషణముచే నేమివిశేషము స్ఫురింపఁ జేయనెంచెనో? బృహన్నల పేడిమూతినిఁ గాంచుటచేతనా! యీదరస్మిత ముదయించుట? అట్లగుచో సాదరపదము గోదావరిపా లగునుగదా! ఆచార్యునకుఁ దన తనయను విద్యాభ్యాసమునకై యొప్పఁజెప్పుసమయమున గౌరవభావము వెలిపుచ్చుట యుచిత మగును గాని, ఈచిఱునగ వెందుల కుపయుక్త మగును? ఇద్ది వెకిలిచేఁతను వెల్లడించును గాని, గురుగౌరవమును బ్రకటింపదే? మఱియు నిట విరటుఁడు గవ్వడితో నాడినమాటల వాలకము చూడ నీప్రసంగము మహారాజగాంభీర్యమునకుఁ దగియున్నట్లు కన్పట్టదు. పరికింపుఁడు."ఇమ్ముగువ నీకు నాటగఱపందగుపాత్రం బగునే?" ఈయడుగుట మోటుగా నున్నది. కాని మహారాజున కను వగు నాజూకు చూపుటలేదు. ఉత్తరనుగూర్చి నిజవాత్సల్యప్రకాశక మగుపదమును వాడవలయును గాని, "ఇమ్ముగువ = ఈయాఁడుది" అని తెలుపుట సున్నితముగా లేదు. నిజముచే నుత్తరశీలగుణాదుల వెల్లడించి, యీనాబిడ్డ నీకు శిష్య యగుట కర్హయా? యనియో, యీబాలిక నీయొద్ద విద్యార్థినిగాఁ జేరఁ దగునా? యనియో, లేక యీపట్టికి నీకడఁ జదువ యోగ్యత కలదా? యనియో ప్రశ్నించిన నాజూకుగా నుండును గాని "యాటగఱపం దగుపాత్రం బగునే?" యని యడుగుట యంత గొప్పగాఁ జూపట్టుట లేదు.

యోగ్యోచితేత్యాదిపదము లుండ వానిని వాడక, యీపాత్రమును జేకొనుట మంత్రిపుంగవుఁడు సోమయాజి యగుటచే యాగసమయమున శ్రోత్రియు లగు ఋత్విజు లుచ్చరించిన స్రుక్స్రువాదిపాత్రములు

శ్రుతిపుటములఁ బడి ధ్వనించుచుండుటచే నిట నీపాత్రమును బ్రస్తరించె నేమో? ఇంక నొకవింత తన ప్రశ్నలకు సవ్యసాచి యెట్టి సమాధానమును దెలిపెనో వెల్లడింపకయే "తత్ప్రతివచనంబులయందలి నాగరకత్వంబునకుఁ జిత్తంబు రంజిల్లె" నని యుపన్యసించుట యెంత సొంపుగా నున్నదియో యోజింపుఁడు. ఇట విజయుఁ డాడిన మాటలయందలి జాణతన మేదియో చక్కఁగాఁ జిత్రించి, యాపైని దనకుఁ గల్గినసంతసమును వెల్లడించిన బాగుగా నుండెడిది. సాహిత్య మన మంజులాలాపములకు నిలయముకదా!

మఱియు బృహన్నల తన్నుఁ గూర్చి చెప్పికొన్న "ఆఁడుఁదనంబు నిక్కముగ నారసి చూచిన లేదు పుంస్త్వము" అను పద్యభావమును బట్టి చూడ నీతఁడు శుద్ధడబిద్ధుఁడు గాఁ బొడకట్టుచున్నాఁడు కాని, చతురాలాపనిపుణుఁ డగు నాగరకుఁడు గాఁ జూపట్టుట లేదు. బృహన్నల యితరులకు ననాగరకుఁడు గాఁ గన్పట్టుచున్నను విరటునితో నపవారితముగాఁ దననాగరకతను వ్యక్తము చేసెనేమో?

సందేహము లేదు. అటులే నడచి యుండును. కావుననే యీ రంగమున విరటునివాగ్ధోరణి యల్లునకుఁ బిల్ల నప్పఁజెప్పుచొప్పు నుల్లసిల్లఁజేయుచున్నది. పరికింపుఁడు:—

"గీ. నీవు చతురమతివి నీకు నిక్కన్నియ
నప్పగింప నేల యైన నాదు
హృదయ మలరు దీనియెడఁ గడునార్ద్రమై
యుండుఁ గానఁ జెప్పకుండరాదు.

క. నెచ్చెలులతోడ నెంతయు
మచ్చికఁ దనయిచ్చ నాడమరగినయది యై
విచ్చలవిడి నింతకు ము
న్నిచ్చేడియ మెలఁగు శిశు వెఱుఁగదు సుమ్మీ.

గీ. బాలకేలిమీఁది భరము క్రమంబున
విడువఁ గళలయందు వేడ్క సొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు నీవ కాదె."

మఱొకవిశేషము-పైనివ్రాయఁబడినపద్యములలో రెండుమూఁడు పద్యములభావమును బట్టిచూడ నుత్తర చిన్నబొట్టెగాఁ బొడకట్టుచున్నది కాని "అల్లఁదనంబున ననువు మైకొనఁ జూచు" అనుపద్యమునఁ దిక్క కవీంద్రుఁడు వర్ణించిన ప్రౌఢయువతిభావము గోచరింపదు. ఉత్తరకడఁ బ్రౌఢభావము కల దని యెవరు చెప్పి రందురా? తిక్కనార్యుఁడే; కనుఁడు- "కదిసి ప్రౌఢవనితకైవడి ముద్దియ మ్రుగ్గువడ్డఁ దనకు మ్రొక్కుటయు" నని కవివరేణ్యుఁ డుత్తర తండ్రికి మ్రొక్కినవైఖరినిఁ జూపెఁ బ్రౌఢవనితా ప్రాగల్భ్యము గోచరించు చున్నట్లు వర్ణించి యున్నాఁడు.

అన్న ట్లన్నలారా! పితృపాదములకు వందన మొనర్చునపుడు భక్తి వినయములు వెల్లడింపఁ బడవలయును గాని, యీప్రౌఢిమ యెందులకు? లేక ప్రౌఢవనితానమస్కారము లనియు, ముగ్ధనారీవందనము లనియు, వృద్ధస్త్రీనమస్కృతు లనియు వేఱువేఱు లక్షణము లెవ్వియేని గలవా? ఇదేమి కావ్యనిర్మాణమా? రాజకార్యనిర్వహణమా? ప్రౌఢతఁ జూపుటకు-నమస్కారాచరణమే! ఇందుఁ బ్రౌఢి యేమిటికి ?

ప్రౌఢవనిత యన నెట్టిదో లక్షణజ్ఞులు వివరించి యున్నారు, పరికింపుఁడు, లక్షణమును,

"స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా" అని-
ఇందులకు లక్ష్యముఁ జూడుఁడు- కొక్కోకమున-

చ. కులుకుమెఱుంగుఁజూపులును గొండెపుఁజేఁతలుఁ డియ్యమాటలున్
జిలిబిలిపాటలుం గలికి చిత్తము మన్మథబంధభేదముం
దలకొనుచుంబనంబులును దాటవపేటవభూషణవ్రజం
బలుకలుఁ గల్గిపైకొనుచు నాసలఁ దేల్తురు ప్రౌఢభామినుల్.

మఱియుఁ బదునాఱేండ్లలోపు వయసు కలది బాల యనియును, ముప్పదియేండ్లదితరుణి యనియు నేఁబదియైదేండ్లవఱకుఁ బ్రౌఢయనియును, నాపైవయసుది వృద్ధ యనియు వయోనిర్ణయము కలదు. కావున నుత్తర వయసుముదిరినముదితవలెఁ దండ్రికి నమస్కరించిన దన్నమాట-పదముల వాడునపుడు ప్రకరణౌచిత్యమును గమనింపవలదా ? పిడుగునకు బియ్యమునకు నొకటే మంత్ర మన్నట్లు శబ్దముల నుపయోగింపనగునా?

కాదు కా దిక్కనేదియో కావ్యకల యంతర్లీనమై యుండును. లేకు న్నమంత్రివరుఁడు ప్రౌఢపదమును వాడియుండఁడు. కావున శ్రీరామకృష్ణయ్యగా రీప్రౌఢవనితవైపు దృష్టిని ద్రిప్పి యిట విలసిల్లుచున్న కావ్యకలా దృష్టిని బాఠకసోదరులకుఁ బ్రకటీకరింపఁ గోరుచున్నాను.

ఇఁక నొకసంగతి. విరటుఁడు కిరీటికడ నీచేడియ కిదివఱ కుపాధ్యాయునియొద్ద విద్య నభ్యసించుజాడయే తెలియ దని, నుడువుటచేత నిద్దియే విద్యాభ్యాసమునకుఁ బ్రాథమికదివస మని విదిత మగుచున్నది. కనుక నే చదువు లేక నెచ్చెలులతో మచ్చికగా నాడుకొను ననియు ను, బాలకేళి మీఁదిభరము క్రమముగా వీడునట్లు కళల శిక్షింపు మనియుఁ బార్థునితో మత్స్యభూపాలునిచేఁ జెప్పఁబడినది.

ఇఁక దిక్కనచేసిన వయఃప్రాగల్భ్యవర్ణనమును విరటునిమాటలను సమన్వయించి చూచినచో నుత్తరకుఁ బదునాలేండ్లు వయసు వచ్చువఱకుఁ జదువు రా దని తేలును. కాని, యిది యసంభవవిషయము. సామాన్యముగా ద్విజబాలికలకుఁ జిన్ననాఁడే విద్యాభ్యాసముఁ జేయింపఁబడును. అందులో మహారాజపుత్రికలకుఁ బదునాలేండ్లదనుక గురుశిక్ష లేక యుండునా ! ఇదంతయు నేదియో చిక్కుదారినిఁ బడినది కాని, చక్కఁగా సాగినట్లు తోఁపదు.

ఈచిక్కుత్రోవ వ్యాసభారతమునఁ గానరాదు. ఆట విరటుఁడు బృహన్నలతో నుత్తరకు నృత్తమును నేర్పు మనియెనే కాని, మాగుంట తోడిబొమ్మలతో నాడుకొనుటయే కాని గురుశిక్ష యన నెట్టిదియో యెఱుఁగదు సుమ్మీ యని తెలుపలేదు-పైనుఁ డాభాగమును,

"దదామి తే హంత వరం బృహన్నలే సుతాం చ మే నర్తయ యాశ్చ యాదృశీః" దీనిచే నిదివఱకే యీయలివేణి నాట్యకల వినా మిగతవిద్యల నాఱితేఱిన నారీమణియే యని చెప్పనొప్పు.

మఱియు విరటుఁ డుత్తరహస్తమును బృహన్నలకరమునఁ గదియించి, పుత్త్రికతో నిట్లు తెలిపెను.

గీ. ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును
 జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు

గురువ యింక నొక్క కొఱఁతయు లే దిందుఁ
జేరి బ్రతుకు బుద్ధిగౌరవమున.

ఈపద్యమున వివరింపఁబడిన బోధలు—ఇల్లువిడిచి, చుట్టాలఁ బాసి దూరమున నుండు గురుకులమునకుఁ బోవు ముద్దియల కనువు కాని, ముప్పొద్దులఁ గూ డారగించి మిద్దెలలో నెచ్చెలులతోఁ ముచ్చటగాఁ దండ్రి కజ్జ దిరుగాడు పూఁబోండ్ల కీసుద్దులు సరిపడునా ?

వేఱొకవింత—యింత ప్రసంగము సాగినను సవ్యసాచికి నుత్తర విరటునిచెల్లెలో, మఱఁదలో, కూఁతురో, కోడలో లేక మనుమరాలో తెలియ నవకాశము చిక్కదాయె. విరటుఁడు కిరీటితో నుత్తరను గూర్చి మాటలాడినపుడు "ఇమ్మగువ, ఇక్కన్నియ, ఇచ్చేడియ, నెలఁత, బోటి" అను స్త్రీసామాన్యవాచకములే వాడఁబడినవి కాని, పుత్రి, తనయ, నందన, లోనగుపదము లుపయోగింపఁబడ లేదు. అందుచేతఁ బార్థున కుత్తరావిరాటుల బాంధవ మెట్టిదో తెలిసికొనుటకు సాధ్యము కాదు. ఉత్తర విరటునినందన యనుసంగతి కవిపాఠకులకుమాత్రము విదిత మగుచున్నది.

విరటుఁడు కవ్వడితో "బాలకేళిమీఁది భరము క్రమంబున విడువఁ గళలయందు వేడ్క సొనిపి" అని చెప్పెను గాని పార్థుఁ డాపార్థివుని ప్రార్థనమును నెఱవేర్పఁ జాలఁ డాయెను. కనుఁడు:—

"కురువీరుల గెలిచి తదంబరములలోఁ జిత్రవర్ణభాసురములుగాఁ, దర మెఱిఁగి లోచనోత్సవకరములుగా బొమ్మపొత్తికలకుం దెండీ" అని యుత్తరగోగ్రహణవారణసమయమున నుత్తరునితో నుత్తర తెలిపినది. దీనిచే నుత్తరకు బొమ్మలాటపై మిక్కుట మగుమక్కువః కలదు, కాని, యాయుబలాట మెంతమాత్రము తొలఁగ లే దని విదిత మగుచున్నది.

అసలు తిక్కయజ్వ చిత్రించిన "అల్లఁదనంబున"ననుపద్యము మొదలు "మనయింట నిచ్చట" అనుపద్యమువఱకుఁ గల గ్రంథము సంస్కృతభాగమున లేదు. ఇది యంతయుఁ దిక్కనార్యుఁడు క్రొత్తగా నల్లిన కయితయే కాని వ్యాసమునివిరచిత మగుకవిత కాదు. మంత్రివరుఁ డీయపరూప మగుమార్పు నెట్టినేర్పుఁ జూపసృజించెనో తెలియవచ్చుటలేదు.

మఱియు నీఘట్టమున విజయుఁడు తనకుఁ దెలియునన్న దండలాస్యాదివిద్యలు సంస్కృతభారతమునఁ దెలుపఁబడి యుండలేదు. "గాయామి నృత్యా మ్యథ వాదయామి భ ద్రోస్మి నృత్యే కుశలోస్మి గీతే" అని తెలుపఁ బడినది.

మన తిక్కనమంత్రివరుఁడు నాటకకలాచతురుఁ డగుటచేత నీదండలాస్యాదినాట్యవిద్యలఁ జేర్చొనినాఁడు. అంతియే కాని యివి బృహన్నలకుఁ బోధపడినట్లు పొడకట్టదు.

మఱియొకనూత్నవిషయము—తిక్కన భారతమున నర్జునుఁడు—

"ఆఁడుఁదనంబు నిక్కముగ నారసి చూచిన లేదు పుంస్త్వముం
బోఁడిమి తప్పియున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్యమై
వాఁడిమిగల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మభాగ్య మే
వాఁడును నేర్చునే తొలఁగ వైవఁగ నోర్వకపోవవచ్చునే"

అని నిండుసభలోఁ దనస్వరూపస్వభావముల వెల్లడించుకొన్నట్లు వ్రాయఁబడినది. విజయుఁ డిట్లు పేరోలగమునఁ దనశాపరూపముల వర్ణించుకొనునా?

ఇవి కేవలము తిక్కనచే సృష్టింపఁబడిన కవ్వడినుడులు కాని, వ్యాసమునివర్ణితుఁ డగుధనంజయునిపలుకులు కావు. వ్యాసగాండీవిని విరటుఁడు నీ కీక్లీబరూపము రాఁ గారణ మే మని యడుగ నాతఁ డిట్లు తెలిపెను.

"ఇదం తు రూపం మమ యేన కిం తవ ప్రకీర్తయిత్వా భృశశోకవర్ధనమ్। బృహన్నలాం మాం నరదేవ విద్ధి సుతం సుతాం వా పితృమాతృవర్జితామ్॥"

అనఁగా- నా కత్యంతదుఃఖహేతు వగునపుంసకత్వాదికారణవివరణముతో నీ కేమిప్రయోజనము- అని గోప్యముగాఁ బలికెను. కాని, మనయమాత్యశేఖరులకవ్వడి వివరించి నట్లు "ఆఁడుఁదనంబు నిక్కముగ నారసి చూచిన లేదు పుంస్త్వముం" అని నిజావమానరూపమును వర్ణించుకొన లేదు.

వ్యాసభారతమున విరటుఁడు బృహన్నలమాటల నమ్మక, యతని స్వరూపస్వభావాదులఁ గూర్చి కైతవనిపుణు లగు తనమంత్రివరులతో సంప్రతించి వెంటనే నెఱజాణ లగునలివేణులచేఁ బృహన్నలను బరీక్షింపఁ జేసి, వారివలన నిజస్థితిని దెలిసికొని, నపుంసకుఁడే యనువిషయమును స్థిరీకరించి, పిమ్మట నుత్తరయంతిపురమునఁ బ్రవేశింపఁ జేసెను.

"సంమంత్ర్య రాజా వివిధైః స్వమంత్రిభిః
పరీక్ష్య చైనం ప్రమదాభి రాశు వై
అపుంస్త్వ మ ప్యస్య నిశమ్య చ స్థిరం
తతః కుమారీపుర ముత్ససర్జ తామ్"

వ్యాసభారతమున నీరీతి నున్నది. పరిశీలింప నిదియే సమంజస మగురచన కాని గాండీవి తననపుంసకత్వాదిదోషముల వెల్లడించె ననుట యుచితము కా దని తోఁచెడిని.

తిక్కనసోమయాజి కభిమానస్థాన మైనయీవిరాటపర్వములో నర్జునుఁడు పేడిరూపమున విరాటునిఁ గొల్వవచ్చినయీఘట్టమున నెటనెట నద్వైతదృష్టియుఁగావ్యకళాదృష్టియుఁ బుష్కలములైయున్నవియో విమర్శకు లగుశ్రీరామకృష్ణయ్యగారు వివరముగాఁ దెలుపఁ గోరుచున్నాను.

మఱియొకవిన్నపము-తిక్కనార్యుఁడు "ఇవ్విధంబున గాదిలికూఁతు నుపలాలించి"యనువచనభాగమున "ఆభరణంబు లొసంగి, సంభావించి" యని శ్రోత్రియార్హ మగుసంభావనక్రియను వాడుటచేఁ దిక్కనమంత్రివరునకు వైదికదృష్టిదోషము సోఁకిన దేమో కనుంగొని, మేధానిధు లగు విమర్శకులు తన్నివారణమునకుఁ దగుప్రతిక్రియఁ జేయఁ బ్రార్థించుచున్నాఁడను. విన నున్నాఁడను సరసములగు సమాధానములను.

# ఆంధ్రము—అనువాదవాఙ్మయము.

జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ., కొవ్వూరు.

---

ఆంధ్రవాఙ్మయ మనువాదముతోనే ప్రారంభ మైన దనునది సువిదితము. పిమ్మటఁ గూడఁ గొన్ని యనువాదగ్రంథములు బయలు దేఱినవి. నేఁటికిఁ గూడఁ గొన్ని యనువాదములు బయలుదేఱుచున్నవి. ఈయనువాదములు భాషాగౌరవమును దగ్గించుననియు స్వతంత్రరచనలే భాషాగౌరవాపాదకము లనియుఁ దలఁచునాంధ్రులు కొందఱు కలరు. కాని వా రొక్క సంగతిని గుర్తింపవలెను. జ్ఞాన మనునది యొకరి సొత్తు కాదు. అది వివిధకాలములలో వివిధదేశములలో వివిధభాషలలో వెలువడుచుండును. భాష యనునది జ్ఞానమున కుపాధియే కాని భాషయే జ్ఞానము కాదు. మఱొకకాలములోనో మఱొకదేశములోనో బయలు దేఱిన వాఙ్మయమును ద్వేషించువా రెట్టివారో మఱొకభాషలో బయలుదేఱిన వాఙ్మయమును ద్వేషించువారును నట్టివారే. వీ రందఱును నాయాదేశకాలభాషలను ద్వేషించువారు మాత్రమే కాక విజ్ఞానమును ద్వేషించువారు కూడ నగుచున్నారు. ఇరువదవ శతాబ్దిలోనివారికిఁ బదుమూఁడవ శతాబ్దిలోని వాఙ్మయ మెట్లు సమాదరణీయమో యట్లే యొకఖండములోనివారికి మఱొకఖండములోనివారి వాఙ్మయమును సమాదరణీయమే; మఱియు నట్లే యొకభాష మాటలాడువారి కింకొక భాష మాటలాడువారి వాఙ్మయమును సమాదరణీయమే. కాని మన మల్పమేధస్కుల మగుటచే నన్నిభాషలను నేర్చి యన్నివాఙ్మయములను జదువలేము. కనుకనే మనలోని కొలఁదిమంది బహుభాషాకోవిదులాయాభాషలలోని విజ్ఞానమును మనభాషలోనికి దింపి మనము దానిని గ్రహించునట్లు చేయుచున్నారు. అంతర్జాతీయమైనవిజ్ఞానమహానిధిని విశ్వమానవకోటికి సామ్యవాదపద్ధతిని బంచి యిచ్చుచున్న యీమహానుభావులకు మన మెంతయు ఋణబద్ధులమై యున్నాము. మానవులకు యోగక్షేమము లపేక్ష్యములు. యోగ మనఁగా మనకు హితమైనది వచ్చిపడుట. క్షేమ మనఁగా మన కున్నమంచి నశింపకుండుట.

విశ్వమానవకోటిలో భాగమై యున్న యాంధ్రదేశసంభూతులకు వైజ్ఞా
నికక్షేమము కావలె నన్నచో జ్ఞాన మేదేశములో నేకాలములో నేభా
షలో బయలుదేఱి యున్నను వారు దానిని భద్రపఱచుకొనవలసి యు
న్నది. భగవంతుఁడు, ఇంగ్లండులో షేక్స్పియరును జనింపఁజేసినాఁడు.
వానిద్వారా ప్రపంచములో నొకకొంతజ్ఞానమును వ్యాపింపఁజేయుటకు
ను గళను వికసింపఁజేయుటకును భగవంతుఁ డుద్దేశించియుండెను. వానిని
గాని యట్టివానిని గాని భగవంతుఁడు మనదేశములో జనింపఁజేయ
లేదు. ఏమన నట్లు జనింపఁజేయుట, సారస్వతములోఁ బునరుక్తి యెట్టి
దోషమో, సృష్టికళలో నట్టిదోషమే యగును. మానవహృదయమును
స్తనశల్యపరీక్ష గావించి మానవప్రకృతి యెన్నెన్నిత్రోవలఁ ద్రొక్కుట
కవకాశ మున్నదో యన్నిటిని బ్రదర్శించిననాటకకర్త షేక్స్పియరు. ఈతని
నీవిషయమున మించినవారు మఱొక్కరు లేరు. పరమేశ్వరసృష్టిని మన
ము సార్థకము చేయవలె నన్నచో నాషేక్స్పియరుద్వారమున బయటకు
వచ్చిన వాఙ్మయమును మన మాంధ్రములోని కనువదింపవలదా? విశాల
హృదయు లెవ్వరును నిట్టిభాషాన్తరీకరణమును నిరసింపరు. సరికదా
మన మాతృభాషలో ననువాదవాఙ్మయ మింతతక్కువ యున్నదేయని చిం
తింతురు.

అన్నిభాషలలోని యనువాదములకును నేయేచిక్కులు గల్గు
చున్నవో యట్టిచిక్కులే మనభాషలోని యనువాదములకును గల్గినవి.
ఆంధ్రవాఙ్మయములోఁ ద్రిమూర్తు లని చెప్పఁదగిన నన్నయ తిక్కన
యెఱ్ఱాప్రెగడలకుఁ గూడ నీచిక్కే గల్గినది. వారి యనువాదములు
యథామూలములు కాక కొన్నిచోట్లను సరళములుగను గొన్నిచోట్ల
ననుకరణములుగను గొన్నిచోట్ల స్వతంత్రములుగను నుండుట కీచిక్కే
కారణ మని నాయభిప్రాయము. ఆచిక్కేదన- కవిత్వమునకు భావోద్రే
కము (Emotion) అవసరము. భావోద్రేక మనునది యౌరసపుత్రుని
వలె మనలోననుండి జనింప వలసినదియే కాని దత్తపుత్రునివలెఁ దెచ్చి
పెట్టుకొనఁ దగినది కాదు. ఈభావోద్రేకము లేనిదే కవిత శోభింపదు.
భాషాన్తరీకర్త కీయుద్రేకము గలుగుట యసంభవప్రాయము. భావో

ద్రేక మొకవిధ మయిన హృదయానుభూతి. అనుభవము లేకుండఁగ బయటకు వచ్చుమాటలలోఁ బటిమ తక్కువగ నుండును. కనుకనే యనుభవవాఙ్మయ మెక్కుడును ననువాదవాఙ్మయముకంటె మేలుగ నుండును. అనుభవవాఙ్మయమునకును ననువాద వాఙ్మయమునకును నడుమ ననుకరణ వాఙ్మయము గలదు. ఇంకఁ గవికిఁ గొంత యనుభూతి కల్గుటకు వీ లున్నది. కావుననే తమ కావ్యము శుష్కకాష్ఠమువలె నుండక సజీవముగ విలసిల్లవలె నని కోరు ననువాదకర్తలు కొంతవఱ కనుకరణధోరణిలోనికి దిగుచుందురు. నన్నయాదు లవలంబించినపద్ధతిని దిలకింపుఁడు. వారు మహాకవులు; వారు సంస్కృతభారతమును దెలుఁగులోనికి యథామూలముగ దింపవలె ననియే కోరుచో వారికిఁ గల కవితాశక్తి కేమియు వినియోగ ముండదు. అపుడు వారిశిల్పచాతుర్యము మాత్రమే బయటఁ బడును. మూలములోనిపదమునకుఁ దగినపదము వేయుట, మూలములోనిలాలిత్యమును గాని గాంభీర్యమును గాని, తెలుఁగులోఁ గన్పఱచుట మున్నగున వన్నియు శిల్పికృత్యములే కాని కవితాకృత్యములు కావు. ఇవి కవికృత్యములే యని చెప్పినపుడు కవికూడ శిల్పియే యని మన మంగీకరించుచున్నా మని యర్థము. నిజమైన కవిత్వము రసపోషణలో నుండును. అలంకారములను బెట్టుటలో నుండును. ధ్వని, వ్యంగ్యము మున్నగుశోభలను దెచ్చుటలో నుండును. కేవలానువాదకర్తకు మూలాదృష్టములైన వీనిని గావించుట కధికారము లేదు. ఇట్లు యథామూలానువాదముఁ గావించువారికి శిల్పచాతుర్యమునే కాని కవితాకౌశలమును గన్పఱచు నవకాశము గలుగదు, కావుననే, నన్నయాది మహాకవులు తమకవితను గూడఁ బ్రదర్శించుటకై యథామూలముగఁ బోవుపద్ధతిని విడిచిపెట్టిరి. ఇది వారియహంభావమును సూచించు నని తలంపరాదు. వారికి మనపైఁ గల యపారప్రేమయే వారి నిట్లు చేయఁ బ్రోత్సహించినది. మన మందఱము వారి కావ్యములను జదివి యానందింపవలె నన్నచో వానిలో జీవ ముండవలెను. జీవ ముండవలె నన్నచో నవి భావోద్రేకము ~ధారముగఁ జేసికొని బయలుదేఱవలెను. అట్లు కావలె నన్నచో వారు కొంతవఱకుఁ దమకవితావిహంగమును తన

రెండుఱెక్కలను విప్పి విహరించుట కవకాశమును గల్గింపవలెను. పంజ
రములోని పిట్టవలెనే యథామూలానువాదకుని కవితావిహంగమము
ను రెండుఱెక్కలను విప్పి విహరింపంజాలదు. ఇట్టి విహారావకాశమును
గొంతవఱకుఁ గల్పించుకొనుటకే నన్నయాదులు కొంతవఱకు స్వతంత్ర
మార్గమును ద్రొక్కిరి. కాని ముఖ్యవిషయములలో వారు మూలభారత
మునకుఁ గట్టుపడకపోలేదు. గాటకుఁ గట్టఁబడి యుండుగోవే విధముగఁ
గట్రాట కనతిదూరములోనే యుండి తన కంటఁబాఱైనంతమేరలో
యథేచ్ఛముగ మేఁత మేయునో యట్లే యీకవిపుంగవులును మూల
విరాట్టగు పంచమవేదమునకుఁ గట్టువడి యుండి దాని కనతిదూరము
లోనే తిరుగుచుఁ దమకవితాశక్తినిఁ గన్పఱచియున్నారు.

ఈపద్ధతికి భిన్నమైనపద్ధతిలో నేఁడు కొంతయనువాదవాఙ్మయ
ము బయలుదేఱుచున్నది. కీ. శే. వావిలికొలను సుబ్బారావుగారి రామా
యణము యథామూలముగనే వ్రాయఁబడినది. అట్లే మహామహోపా
ధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారును నించుమించుగ యథా
మూలముగనే భారతము నాంధ్రీకరించిరి. ఋషిప్రోక్తములైన గ్రంథము
లలోని ధర్మముల నెఱుఁగఁ గోరువారికిని జారిత్రకపరిశోధకులకును నీ
గ్రంథము లుపయోగించును.

ఇంతవఱకును నాంధ్రములోనికి వేద మనువదింపఁబడక పోవుట
మిగుల శోచనీయము. కొందఱు పూర్వాచారప్రియులు వేదము నాం
ధ్రీకరించుటను బ్రతిఘటించుచున్నమాట వాస్తవమే, కాని, యీప్రతిఘ
టనలో న్యాయము గన్పట్టదు. ఇట్లు ప్రతిఘటించువారు మూఁడుకారణ
ములను దెల్పుదురు. (1) వేదమును దేటతెల్లముగ వ్రాయుచో జను
లకు దానియందలి గౌరవము తగ్గును. (2) వేదార్థమును గ్రహించి వివ
రింపఁ దగినవా రిపు డున్నారో లేరో యనునదియే సందేహాస్పదము.
కనుక నసర్హులచేత వేదము ననువదింపఁజేయవలసియుండును. (3) వేద
మాంధ్రములోని కనువదింపఁజేయఁబడుచో వేదార్థశ్రవణాధికారము
లేనిస్త్రీశూద్రాదులుకూడ వేదార్థమును జదువుకొనుటకు వీలగును.
ఈ మూఁడాక్షేపణములలో నొక్కటియు నిలుచునది కాదు. (1) వేద

ములో నున్న ఘనవిషయములను దెలిసికొనినపుడే ప్రజలకు దానియందు నిజమగు గౌరవము గల్గును. (2) ఆంగ్లము మున్నగు భాషలలోనికి వేదము లిదివఱకే యనువదింపఁబడియున్నవి. ఆయనువాదములను బ్రజలు చదువుకొనుచున్నారు. తెలుఁగులోఁ గూడ నాయాయవసరములను బట్టి వేదమంత్రముల కెవరికిఁ దోఁచిన లేక, యెవరికి వీ లైన, యర్థములను వారు వ్రాయుచున్నారు. ఇం దెవరుచెప్పెడియర్థము గ్రాహ్యమో పాఠకులకుఁ దెలియుటకు వీలులేదు. కనుక సర్వజనవిదితమైన వైదికపాండిత్యముఁ గలమహావిద్వాంసులచే వైదికవాఙ్మయమున కంతకును నాంధ్రములో ననువాదము వ్రాయించి ప్రచురింపవలసినయావశ్యకత నేఁడెంతయో కలదు. ఇట్టిపనిని జేయించుట కాంధ్రసాహిత్యపరిషత్తువంటి మహాసంస్థలే సమర్థములు. (3) గ్రంథము లేనాఁడు ముద్రితములు కాఁజొచ్చినవో యానాఁడే విజ్ఞాన మంతయు విశ్వప్రజాధీన మైనది. వేదముల యాంగ్లభాషాన్తరీకరణములను మ్లేచ్ఛులు మొదలైన యన్యమతస్థులే చదువుచుండఁగా వేదస్థవిషయముల స్త్రీశూద్రాదులకుఁ దెలియనీయకుండ యత్నింపవలె ననుట హాస్యము. కావున వేదముల యనువాదము లేకుండుట యాంధ్రసారస్వతమున కొకగొప్పలోటు.

షట్ఛాస్త్రములు, షడ్దర్శనములు, స్మృతులు మున్నగుసమస్తార్యవాఙ్మయమును గూడ నాంధ్రములోని కవతరింపవలసియున్నది.

మొదట మనము సంస్కృతగ్రంథముల ననువదించుకొంటిమి. పిమ్మట నాంగ్లగ్రంథముల నెత్తికొంటిమి, తరువాతఁ గొంతవఱకు బంగాళాగ్రంథములవైపుఁ దిరిగితిమి. ఇపుడిపుడు హిందీపుస్తకములను బరివర్తన చేయుచున్నాము. భారతదేశములోని వివిధరాష్ట్రములవా రొకరి భాషనుండి వే ఱొకరు గ్రంథములను బరివర్తనముఁ జేసికొనుచో వివిధరాష్ట్రములనడుమ నున్నయంతరము తగ్గి పరస్పరావగాహన మేర్పడి సామరస్యము గల్గును. కాన నట్టిభాషాన్తరీకరణము లత్యావసరము. వివిధరాష్ట్రసారస్వతవిషయములను బ్రచురించి భారతదేశములోని వివిధప్రాంతముల నున్నసారస్వతసేవకులలోఁ బరస్పరావగాహనమును వ్యాపింపఁజేయుటకుఁ బూనుకొనిన "హంస" "Indian PEN" అను రెండుపత్త్రికలును నభినందనార్హములు.

అనువాదకుఁడు మూలరచయితయొక్క భావములను బూర్తిగాఁ దెచ్చుటయే కష్టము. మూలరచనలోని భాషాసౌందర్యమును దెచ్చుట మఱింత కష్టము సంస్కృతగ్రంథములను దెనిఁగించువా రెన్ని తత్సమపద ములను వేసినను మూలగ్రంథమాధుర్యమును దేలేకున్నారు. అంతియే కాక సంస్కృతశ్లోకములలోని వృత్తములమాధుర్య మసమానము. ఆమా ధుర్యమును దెనుఁగుపద్యములలోనికిఁ దెచ్చుట యసాధ్యము. మేఘ సందేశమును దెనిఁగించువా రెవరైన నామందాక్రాంతావృత్తమాధుర్య మును దెనుఁగులోనికి దింపఁగలరా యనునది పెద్దప్రశ్నయము. శ్రీ అనం తపంతుల రామలింగస్వామిగారు కాళిదాసకృతమేఘసందేశమును బాట లరూపమున ననువదించియున్నా రనివినుచున్నాను. అదియునొక నూతన పక్కియే.

మొత్తముపై ననువాదవాఙ్మయవిషయములో నాంధ్రము హిందీ, బంగాళీ మున్నగుభాషలకంటె వెనుకఁ బడి యున్న దనుట నిస్సందేహ ము. సంస్కృతవాఙ్మయములోని ప్రధానగ్రంథముల నైనను మన మింత వఱకు నాంధ్రీకరించుకొనలేము. శాకుంతలనాటక మాంగ్లములోనికి 1790 వ సంవత్సరములోనే యనువదింపఁబడినది. దానికి నొకశతాబ్ది పిమ్మటనే కాని మన మానాటకరత్నము ననువదించుకొనలేము. ఇట్టివిష యములు మనకు లజ్జావహము లేకదా! నేఁటికిఁ గూడ వివిధశాస్త్రముల లోనిపాఠ్యగ్రంథము లాంధ్రములోనికి రాలేదు.

తెనుఁగులో గ్రంథములు వ్రాయఁబడి ముద్రింపఁబడినను దానిని గొనువారు చాలఁ దక్కువగ నుండుటచే రచయితలకుఁ గాని, ప్రకాశ కులకుఁ గాని, యార్థికముగ లాభము గల్గుటలేదు. అందుచేనను గ్రంథ ము పెద్దదై విలువ హెచ్చుగుచోఁ గొనువారు మిక్కిలి యరుదు. కను కనే యుద్గ్రంథములకుఁ గూడ నాంధ్రములో సంగ్రహానువాదములు వెల్వడుచున్నవి. అనువాదమే మూలమునకు సాధారణముగ నన్యాయ ముఁ జేయును గదా! అందుచేత సంగ్రహానువాద మెంత మూలదూ రముగ నుండునో వేఱుగఁ జెప్పవలెనా? ఒక్కొక్కప్పు డీసంగ్రహానువా దములు మూలగ్రంథకర్త ప్రతిష్ఠను దగ్గించునవిగఁగూడనుండును. కావున సాధారణముగ సంగ్రహానువాదపద్ధతి ననుసరించుట సమంజసముకాదు.

# ముష్టాముష్టిప్రయోగ విచారము.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ.

---

నన్నయభట్టారకుఁడు మహాభారతారణ్యపర్వమున (ఆశ్వా. 3-395) 'భీమాసురవీరుల ముష్టాముష్టిరణచ్ఛటాచ్ఛటశబ్దం బుద్దామంబై' యని ప్రయోగించెను. దీని నిటీవల భారతిలో (ఈశ్వర- మార్గశీర్ష సంచిక) బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు నిరంకుశమని యధిక్షేపించిరి. ఇందులకు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు నాంధ్రపత్రికయందు నన్నయ యథేష్టము గాఁ బ్రయోగించి యుండలే దనియు నది సంప్రదాయసిద్ధమే యనియు సమాధానమును వ్రాసియున్నారు. ముష్టాముష్టిశబ్ద మసాధు వని పలువు రింకను సంశయించుచున్నారు. శ్రీనాథుని కాశీఖండమున (5-150)

కం. ఆహవముచేసి రంగజ
మోహాంధులు గడిమి మెఱసి ముష్టీముష్టిన్
బాహాబాహిఁ గచాకచి
సాహసముఁ జలంబు దివిజసంఘము పొగడన్.

అని వావిళ్ళవారి ప్రతిలో ముద్రితపాఠము (పు 269) కాని యాపుటలోనే 'అన్నిమాతృకలలో ముష్టాముష్టిన్ అని యున్నను ప్రమాద మని సవరింపఁబడినది' యని పరిష్కర్తలు వ్రాసియున్నారు. సాహిత్యపరిషద్భాండాగారమునఁ గలప్రతులలో ముష్టాముష్టి యనియే కలదు. దీనినిబట్టి పరిష్కర్తలు పొరపడి గ్రంథము నెట్లు దిద్దిరో విశదమగుచున్నది. హరవిలాసమున (ఆశ్వా 7-86) ముష్టీముష్టిరణంబు చేసిరి యసన్యోన్యప్రకారంబులన్- అని ముద్రితము. ఇదియు వావిళ్ళవారిచేఁ బరిష్కృతమే. రెండుగ్రంథములకును బరిష్కర్త లొకరే. హరవిలాసపు వ్రా. తప్రతులఁ గూడ ముష్టాముష్టియే యుండు ననుకొందును. పండితు లవలోకింతురుగాక.

ముష్టాముష్టి ప్రయోగమును గూర్చి సిద్ధాంతకౌముదియందు 'తత్ర తేనేద మితి సరూపే'(2 2-27)అన్యేషా మపి దృశ్యతే(6-3-137) అను సూత్రముల వ్యాఖ్యానమున 'దీర్ఘ ఇత్యనువర్తతే కేశేషు కేశేషు గృహీ త్వేదం యుద్ధం ప్రవృత్తం కేశాకేశి- దణ్డైశ్చ దణ్డైశ్చ ప్రహృ త్యేదం యుద్ధం ప్రవృత్తం దణ్డాదణ్డి- ముష్టీముష్టి' అని కలదు. అందులకుఁ దత్త్వబోధినీకారులు వ్యాఖ్యాన మొనర్చుచు 'ఆత్వంవానచి' ఇత్యుక్తమ్- తత్ర ఆత్వం వా ఇ త్యపాణినీయమ్. ముష్టాముష్టీత్యుదాహర ణ మప్యప్రామాణికమేవ అతఏవ ఏతచ్చ మనోరమాయాం స్పష్టమ్." అని వివరించిరి. ప్రాచీను లిటులు వ్రాసియుండ నవీనులు పొరపడి రనుట వింత కాను. వైయాకరణమతములు పెక్కులుగలవు. శాకటాయనస్య, శాకల్య స్య మొదలగునవి యష్టాధ్యాయియందు మనకుఁ బరిచితములే. ఆయా సంప్రదాయములను భిన్నమతములను గమనింపక మనము కవులను నిరం కుశు లనుట సమంజసము కాదు.

విశ్రామశబ్ద మపాణినీయ మని శంకించి 'తత్రవిశ్రామహేతోః' అను మేఘసందేశప్రయోగమును జాంద్రవ్యాకరణముచే మల్లినాథ సూరి సమర్థించుట మనకు విదితము. అటులే 'అవతరావచాయశబ్దయో ర్దీర్ఘహ్రస్వవ్యత్యాసో బాలానామ్' అని వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి. (5-2-48) కాని మహాకవి కాళిదాసుఁడు రఘువంశమున 'మాభూత్ పరీవాదనవావతారః' అని ప్రయోగించెను. ప్రౌఢిమాది శబ్దములు నట్టివే.

ముష్టాముష్టిశబ్దము నిఘంటువుల కెక్కిన దనియును నందులకుఁ బ్రమాణము బోపదేవుఁ డనియు శ్రీలక్ష్మీపతి శాస్త్రిగారు వ్రాసిరి. శబ్ద కల్పద్రుమమున నిట్లు కలదు:—

'ముష్టీముష్టి- ముష్టాముష్టి- ముష్టిభి ర్ముష్టిభిః ప్రహృత్య యద్యు ద్ధం వృత్తం తత్- కిలాకిలి ఇతి భాషా ఇతి ముగ్ధబోధవ్యాకరణమ్' ముగ్ధబోధ పదియవశతాబ్దమున కిటీవలిగ్రంథము. దానిచే నన్నయా దుల సమర్థించుటకు వీలుకాదు. శాకటాయన సూత్రముల 'ఆదిజాతే'

అనుసూత్రము కలదు. (పుట 88 సమాససంగ్రహః సూ. 38 శాకటా యనవ్యాకరణము Edited by Gustev Oppert 1893.) దానిపై నభయచంద్రసూరి తనప్రక్రియాసంగ్రహ మను వ్యాఖ్యానమున నిట్లు వ్రాసెను. 'ఇజంతే ఉత్తరపదే పూర్వపద స్యాద్ భవతి। కేశాకేశి దణ్డాదణ్డి ఏవం ముష్టాముష్టి ఖడ్గాఖడ్గి ప్రభృతయః । బహులాధికా రాత్ క్వచిదా కారో నభవతి' దీనిబట్టి ముష్టాముష్టిప్రయోగము సాధువే యగునుగదా. ఇజంత ముత్తరపద మైనచోఁ బూర్వపదమున కాత్వ మీసూత్రమువలన సిద్ధించుచున్నది. ఈశాకటాయనుఁడు క్రీ శ. 7, 8 శతాబ్దములవాఁ డనియుఁ బాణినీయమున నుదహరింపఁబడిన శాక టాయనుఁడు కాఁడనియుఁ దోఁచుచున్నది.

హేమచంద్రుఁడు తన సిద్ధహేమచంద్ర మను వ్యాకరణంబున నిట్లే విధించె ననియు నంగుల కుదాహరణముగాఁ దన ద్వ్యాశ్రయకా వ్యంబున 'యష్టాయష్టి యష్టీయష్టి యను ప్రయోగాంతరముల నిచ్చెన నియు శ్రీవల్లె పూర్ణప్రజ్ఞాచార్యులవారు తమ భారతలఘుటీకయందు వ్రాసిరి. అందే పాణినీయమతానుసారముగ ముష్టాముష్టిప్రయోగము సాధింప నగు ననియును, తత్ర తేనేద మితి సరూపే అనుసూత్రమున తేన + ఆ + ఇదమ్ అని విభజించి, యాకారమును బ్రశ్లేషించినఁ గొన్ని చోటులఁ బూర్వపదంబున కాత్వము వచ్చు నని ముష్టాముష్టిప్రయోగ మును శ్రీనాగేశభట్టు తనభాష్యప్రదీపమున నుదహరించె ననియు వీరు వ్రాసిరి. కాని భాష్యప్రదీపమున నిదియపాణినీయ మనియును నటులు ప్రశ్లేషించుట భాష్యకారకైయటులకు సమ్మతము కాదనియును, నస్యాసీ త్యాదుల నిది యప్రసజ్ఞ మనియు వ్యాఖ్యాన మొనర్పఁబడినది. ముగ్ధ బోధయందును, బాలమనోరమయందును నపాణినీయ మని నిరాకరింపఁ బడినది.

బాహాబాహిప్రయోగమును ముష్టాముష్టివంటిదే. పూర్వపదం బున కాత్వమును విధింపనిచో నిది బాహయాబాహవి యనవలసివ చ్చును. గాని బాహాబాహి యనునది కూడ సుప్రసిద్ధప్రయోగమే! పైశ్రీనాథుని కాశీఖండపద్యమున్నఁ నిదియుఁ గలదు. ఈసందర్భమునఁ

కర్ణాటభాషాసంప్రదాయముకూడ నట్టిదనుటకు శబ్దమణిదర్పణభాగము నుదాహరించి శ్రీలక్ష్మీపతిశాస్త్రిగారు బోపదేవుఁడే ప్రమాణ మని ముగించిరి. శాకటాయనమతము నుదాహరించి యుండలేదు. సంస్కృత సారస్వతమున నీప్రయోగము క్వాచిత్కముగఁ గలదు. నిర్ణయసాగర ముద్రిత మగుమహావీరచరితమున ముష్టీముష్టి యనియే కలదు.

ముష్టీముష్టి కచాకచి ప్రహరణ ప్రక్షేప మూర్ఛాత్మభిః.
(అంక 6-31.)

కాని తోడరమల్లుగారిచేఁ బెక్కువ్రాఁతప్రతుల యాధారమునఁ బ్రకటింపఁబడిన గ్రంథమున (Oxford University Press 1928) ముష్టాముష్టి యనియే ముద్రింపఁబడినది. అంకులకుఁ బాఠాంతరము లున్నటులు వ్రాయఁబడియుండలేదు అదియే సరియగు పాఠ మని తోఁచెడిని.

సంస్కృతముననే కాక యాంధ్రమునఁ గూడ నీప్రయోగ మచటనచటఁగలదు. నన్నయశ్రీనాథుల ప్రయోగములు మీఁదనుదాహరింపఁబడినవి. భాగవతమునఁగూడ నీప్రయోగము ప్రాచీనముద్రణములఁ గల దనియు నది యిటీవల మార్పఁబడిన దనియు శ్రీరావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులవారు వ్రాసియున్నారు. వావిళ్లవారు 1912 లో ముద్రించిన భాగవతమున 'ముష్టాముష్టి' యనియే ముద్రించి యిటీవల ముష్టీముష్టి యని దిద్ది ప్రకటించిరి. కాని శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసినటు లీప్రయోగ మాంధ్రభాషాస్వభావానుసారముగ వచ్చియుండలేదు. చెకాచెకి, ఎగాదిగ వంటిది కాదు. సంస్కృతభాషాసంప్రదాయసిద్ధము. శాకటాయనభిన్నమతానుసారము సాధువే యగును. అసాధువు కాదు. ఈప్రయోగము నన్నయ నిరంకుశత్వమును సూచింపదు. ఇంకను సంస్కృతాంధ్రసారస్వతములఁ బ్రయోగాంతరములు లభ్యమగుచో ముందుఁజూపుదును.

# గ్రంథస్వీకారము.

---

## 1. అనర్ఘరాఘవము.

మురారికవిరచిత సంస్కృతమునకుఁ దెనుఁగు.

కీ. శే. సత్యవోలు కామేశ్వరరావుగారిచే రచియింపఁబడినది. ఐదంకములు మాత్రమే. ఒకవిశేషము- పాఠకులకు మూలవిషయము గూడఁ దెలియుటకై యెడమప్రక్కను సంస్కృతమును గుడిప్రక్కను దెనుఁగును జేర్చి ముద్రింపఁబడినది పాఠభేదములు దేశభేదములచే మూలగ్రంథమున వివిధరీతులఁ గొన్ని ప్రతులలో నున్నవి. వానిని విడిచి చూచినచో నిందుఁ గొన్ని సాధారణలోపములు గనఁబడుచున్నవి. మూలములోఁ బ్రాకృతమునకు మాఱు ఛాయ సంస్కృతముననే ముద్రించినారు. వేదములోఁగూడఁ బ్రసిద్ధుఁడైన శునశ్శేఫుఁడు మొదలగు పేరులు- ఈ కవిగారి కసహ్యముగాఁ దోఁచి హ్రస్వబాహుఁడు, వక్రనాసుఁడు, నని మార్చిరి కవిమాత్ర మేమంత చక్కఁగా నున్నవో; నైజముగ వారట్టి వారా యనుసంశయము కలుగును. అజామీళుఁ డనుపేరు నేమిచేయుదురోగదా !

"స్వస్తి భగవతే సపరివారాయ" (పుట 23) దీనికిఁ దెనుఁగు లేదు. 'విహాస్య' (పుట 90) నన్వయ లేదు. ఇతియథోచిత ముపవిశతః (పుట 96) దీనికిఁ దెనుఁగు లేదు. ద్వితీయాంకములో (పుట 98)

యాతోఽస్తమేష చరమాచలచూడచుమ్బీ
పఙ్కేరుహప్రకరజాగరణప్రదీపః
ఆః సర్వతః స్ఫురతు కైరవమాః పిబన్తు
జ్యోత్స్నాఙ్కురవ్ఛ ముదరమ్భరయశ్చకోరాః.

ఈశ్లోకము గనఁబడదు. అనుబంధములోఁ జేర్పఁబడలేదు.

"సర్వతోఽవలోక్య. వత్సలక్ష్మణ-" అనువాక్యమునుగొంత (పుట 98-99) క్రిందిపద్యములోఁ గలిపివేసినట్లున్నది. (పుట 104-105) "ఆలకించి సాభిప్రాయముగా" అని తెనుఁగులో నున్నది. దానికి మూలము లే

డు. (పుట 108) "జగద్గురో గాధినందన" దీనికిఁ బెరుఁగులేదు. వశిష్ట, వసిష్ట, వసిష్ఠ, వశిష్ఠ-ఇట్టు నియమరహితముగు పొరపాట్లు కొన్నిగలవు. (పుట 90-91) "కథం రజనీచరవినాశోత్త్రాణవిసంస్థుల మార్యహృదయ మతి దీర్ఘదర్శినం కౌశిక మపి న సమ్భావయతి" ఇది ప్రసక్తపుస్తకము లోనిది-బొంబాయి ప్రతిలో-"కథం రజనీచరచక్ర వినాశోత్త్రాణవిసంస్థుల మార్యహృదయ మదీర్ఘదర్శినం భగవన్తమ్ కౌశికమపి సమ్భావయతి." దీనిలో నౌచిత్య మేదో విచారింతురుగాక.

ఈపుస్తకమునకు శ్రీజయపురమహారాజు "లాశయము"ను రచించిరి. శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ, "అవతారిక" రచించిరి. దానిలో మురారికవినిగూర్చి విశేషములు తెలియఁగలవు. శతావధాని బ్ర॥ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగా రుపోద్ఘాతమును రచించిరి. దానిలో ననర్ఘరాఘవము దాని యాంధ్రీకరణములు నితర కవుల యాంధ్రీకరణముల తారతమ్యములుం దెలియవచ్చును.

కీర్తిశేషు లగు కామేశ్వరరావుగా రిదివఱ కెన్నో గ్రంథములను రచించుటవలన విఖ్యాతపురుషులు. వీరికొమాళ్లు శ్రీలక్ష్మీసత్యనారాయణరావుగా రీగ్రంథము నచ్చువేయించి లోకోపకార మొనర్చిరని సంభావించుచున్నారము.

దీనివెల రు ౧. సత్యవోలు లక్ష్మీనారాయణరావు,
బి. ఏ, బి. యల్. గారికి-కాకినాడ వ్రాయవలయును.

---

## 2. అమరుకకావ్యము.

శిష్టు సర్వశాస్త్రి ప్రణీతము—ఆంధ్రవాచస్పతి కొట్రా శ్యామల
కామశాస్త్రిగారు ప్రకటించినది.

కవి దీనిని "అమ్రుగ" కావ్యమన్నాఁడు. అమరుక, అమ్రుగనామముల భేదమెఱుంగఁదగినది. ఇట్లే చంపూకావ్యము జంబూకావ్యములం గూర్చి వేత్తల నడుగవలసియున్నది. "ఎలమి రచింపవేడ్పడి యెన్నిక నీయమ్రుగోక్తకావ్యమింపలర"-అని 14 వ పద్యములో వాడఁబడినది. ఈ చిన్నిమనోహరకావ్యమున కిదివఱ కెన్నో యాంధ్రీకరణములు ప్రకటిం

పఁబడినవి. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి కుమారుఁడు రచించుటచే నిది యొక ప్రశస్తాంధ్రీకరణ మగుచున్నది. ఇట్టిదానిలోఁ దప్పు లమితములుగాఁ బడినవి. అవి, కేవలము వ్రాఁతప్రతిలో నున్నది యున్నట్లుగా నచ్చువేయుటచే వచ్చిన పెద్దలోపము. గుజలీప్రతులవలెఁ దప్పులు దిద్దకుండఁగనే యచ్చువేసి రనవచ్చును.

ఈ గ్రంథమునకు శ్రీనిడుదవోలు వేంకటరావు బి. ఏ. గారు విశేషానుభవమున ౧౨ పుటల పీఠికను వ్రాసి గ్రంథముఖమున కలంకారము సమర్పించిరి. దీనిలోఁ బూర్వాంధ్రీకర్తలనుగూర్చియుఁ గవివంశాదికముఁ గూర్చియు విశేషముగఁ జర్చింపఁబడినది. ప్రారంభము గాన మరల నిపుడే చక్కగా దిద్ది ప్రకటించినఁ జాలఁ బ్రశస్తముగా నుండును.

దీనివెల రు 0-4-0. ప్రకాశకులయొద్ద- కాకినాడ సమీపములోని కరపలో దొరకును.

## 3. The Oriental Literary Digest.

Edited by Dr. S. M. Katre, M. A. PH. D., Poona.

This is a very useful monthly started in Poona by the above Editor in collaboration with scholars like Sukthankar, De, Gode and others. The object is to review from time to time the new books published on oriental subjects in a critical manner. We are sure the Journal will become very popular with all students of Indology and other branches of oriental learning. The annual subscription is Rs. 3/-

ఈ పత్త్రిక పూనాలో ప్రాచ్యగ్రంథ విమర్శనమునకై నూతనముగ స్థాపింపఁబడినది. మాసమున కొకసారి వెలువడును. మనదేశమునఁ బండితులగు సుక్తంకరు, డే, మొదలగువారి సహాయమున నిది నడుపఁబడుచున్నది. ప్రాచ్యపరిశోధనావిషయములను గూర్చిన గ్రంథములను వాని ప్రామాణ్యమును గ్రహింపఁబోవువారి కిది మిక్కిలి యుపయోగకరము.

చందా సంవత్సరమునకు రు 3-0-0.

### 4. దశమస్కంధము.

తాండవకృష్ణభాగవతము- బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిచే రచింపఁబడినది. వెల రు. 4-

గ్రంథకర్తలు సుప్రసిద్ధులు- దత్తమండల కవీశ్వరులు- కావ్యస్మృతి తీర్థ బిరుదాంకితులు- బ్రహ్మాండపురాణాదిబహుగ్రంథనిర్మాతలు, శ్రీమద్రామాయణాంధ్రీకరణానంతరము శ్రీకృష్ణచరితమును రచియింప సంకల్పించి మూలగ్రంథమునఁగల విశేషవిషయములఁ జేర్చి సారమును గ్రహించి మూలమును వదలక శ్రీమద్భాగవతమున దశమస్కంధము నాంధ్రీకరించితి మని పీఠికలో వ్రాసియున్నారు. భాగవతార్థరహస్యములను వివరించుటయే వీరియాశయము. వీరికవిత్వశైలి నాతికఠినము. పోతనభాగవతముతో నిట్టిగ్రంథములఁ బోల్పఁ జనదు. పూర్వకవుల యాంధ్రీకరణోద్దేశము వేఱు. మూలగ్రంథమునందలి విషయమును గ్రహించి కొన్నిఘట్టముల విడిచి రసపోషకము లగువానిని స్వకవితానుగుణ్యముగఁ బెంచి యాంధ్రీకరించిరి. పోతనభక్తిపారవశ్యరసపోషణాదికములు మనకు మైమఱపు పుట్టించి తన్మయ మొనర్చును. గ్రంథకర్తలును దమశక్త్యనుసారము లలితకవనమున శ్రీకృష్ణచరితమును మూలగ్రంథవ్యాఖ్యానానుసారముగ వ్రాయుటయు యుక్తమే. రామకృష్ణచరితముల ననేకులు రచించుచుండుటకు వారిగుణోత్తరతయుఁ బూజ్యతయుఁ గారణములుగదా. "స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం, కవీనాం కో దోషః" అనుజయదేవునిసూక్తియిప్పట్టుల సార్థకమగుచున్నది. శ్రీశర్మగారు బాల్యమున, తాండవకృష్ణాభిధానులఁట. అందుననే యీగ్రంథము తాండవకృష్ణభాగవతమనఁబడినది. గ్రంథమును కృష్ణాంకితము. మచ్చున కొకపద్యము—

చ. గలగల మ్రోగు నందియలకాంతుల నగ్రతలంబు గ్రమ్ముచున్
వెలికిని బాఱుచుండ నొకవింతగఁ బాదము లూఁది మోపుచున్
లలితమరాళరాజగతులన్ మఱపించు గతుల్ చెలంగ గా
లలనయు శ్యామనాఁ దగి విలాసము మూర్తిధరించినట్లుగన్.

5. సర్వమంగళాపరిణయము—శ్రీకావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మగారిచే రచింపఁబడినకావ్యము. బ్రహ్మపురాణమునఁ గలపార్వతీవి

వాహఘట్టమును గైకొని పెక్కుమార్పులతో రచియింపఁబడినది (అధ్యా 32,33,34). మూలకథ శివునియాధిక్యతను దెలుపుటకై పార్వతీస్వయంవరంబునఁ బార్వతియంకమున నున్న బాలుని శివుఁడు తక్క నొరు లెత్త నశక్తులై రనియు, శివుఁడు దేవతలకు స్వమాహాత్మ్యముచే బాహుస్తంభన మొనర్చుటయుఁ, బార్వతి యతనివరించి పాదములఁ గుసుమమాలిక నర్పించుటయు వర్ణితము. శర్మగారు హరిహరాదుల యైక్యము నెఱింగింప, నారదునిఁ బడరానిదుర్దశల ననుభవింపఁజేసి పార్వతిని వరింప శ్రీహరిని బయన మొనర్చి కథాభాగమును మార్చిరి. నారదుఁ డిం దనుభవించిన దుర్దశలఁ గాంచినఁ బగతురకేనియుఁ గరుణ కలుగక మానదు. మార్పుఁ జెందిన కథాభాగముల రసపోషణము కొంత కొఱవడియున్న దనవలసి యున్నది. హరిహరాముల యైక్యమును గవిగారు వారిచేతనే పలికించిరి. శ్రీ నాగపూఁడి కుప్పుస్వామయ్య గారు వివిధవిషయములఁ జర్చించి విపులమగు పీఠికను రచించిరి.

6. మనుచరిత్రహృదయావిష్కరణము-కవి-శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు మనుచరిత్రము ప్రబంధములలో నుత్తమస్థానము వహియించిన దగుట సద్దానిని విమర్శించి పెక్కువిషయముల మన కీగ్రంథమునఁ దెలిపియున్నారు. వారితోఁ గొన్నివిషయముల మన మేకీభవింపఁజాలకున్నను, వారిప్రయత్నము శ్లాఘాపాత్ర మనఁ దగి యున్నది. పెద్దన జన్మస్థానాదికములు, పాఠభేదములు మున్నగునవి వివరింపఁబడినవి. కృతిపకాలప్రశంస సమర్థింపఁబడినది. గ్రంథకర్త 'లాకాశరామన్నపంచాంగము'లను వదలి ముఖ్యవిషయములనే చర్చింపఁబూనిరి కాని కొన్నిస్థలముల నవియే దొరలినవి. 'దోసెఁడుకొంపలోఁ బసులఁ ద్రొక్కిడి' (పుట 16) 'వరుఁడు చెఱఁగుపట్టుకొని...' (పు. 30) పీఠికి సంబంధించిన గాథలు పుక్కిటిపురాణములు. విశ్వాసార్హములు గావు. మార్కండేయపురాణమునఁ గలమూలకథ వచనరూపమునఁ దెలుపఁబడినది. 'మారనగ్రంథమును జెంత నునుచుకొని యందలిచమత్కృతుల సంగ్రహించి వ్రాసెనన్న వాదము నిస్సార' మని తెలుపఁబడినది. మారన ననుకరించెనన్నను బెద్ద

నకు గౌరవలోప ముండ దనియే మానమ్మకము. శ్రీనాథుని నెన్నిస్థలములఁ బెద్దన తనగ్రంథమునఁ దలపింపఁజేయుటలేదు? మహాకవుల పోకడలఁ గైకొనిన నది స్వన్యూనతాపాదకము గానేరదు. మనుచరిత్రమునందలి మొదటిమూఁడాశ్వాసముల కథాభాగ వివరణములో విశేషార్థము లీయఁబడినవి. 'అస్మద్గృహంబు పావనము చేసి' యనుచో గృహమనఁగా దేహమనియు, నర్మగర్భముగాఁ బలుకు యువతి యగుట 'నాదేహము పావనము చేసి......' అని స్ఫురింపఁ బల్కె ననుట సరసముగా లేదు. ప్రతిపదమునకును ధ్వన్యర్థములఁ దెలుపఁ బూనిన నట్టియర్థములే వచ్చును. 'చిగురుకొమ్మేఁజేవ' 'రేవణంనౌను నెసిరజేక్షణా' మొదలగువాని కీయఁబడు నర్థములు తప్పని సరియగు నర్థము లొసఁగఁబడియున్నవి. 'సతులనూయల్' అనుచో సతీశబ్దమును (పు. 123) గూర్చి వీరు వ్రాసినది సరికాదని తలఁతుము. అది 'చెలులమాయ లని' దిద్దనవసరము గాన్పింపదు. కవి దానిని బతివ్రతావాచకముగఁ బ్రయోగించియుండ లేదు. 'బాహుమూలరుచు' లనుచో వీరువ్రాసినది విమర్శనీయము. పెక్కువిషయము లీగ్రంథమున వివరింపఁబడినవి. ఇట్టి వివరణములు ముఖ్యములగు ప్రబంధములకును భారతిభాగవతాదికములకును రచింపఁబడవలయును. పుక్కిటిపురాణముల విడిచి రసపోషణాదికములనే యింకను విపులముగఁ జర్చించి, సాహిత్యప్రపంచముల నాయాకవుల ప్రాధాన్యమును నిరూపింపవలయునని మాయాశయముఁ దెలుపుచు శర్మగారి ప్రయత్నమును శ్లాఘించుచున్నాము. వెల 0-12-0 వావిళ్ల వారిచేఁ బ్రకటితము:

7. తిమ్మరుసుమంత్రి:-కవి, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు-వెల రు ౧ ౦-౦. ఆర్యపుస్తకాలయము-రాజమహేంద్రవరము.

ఈగ్రంథము చరిత్రచతురానన బిరుదాంకితు లగు గ్రంథకర్తలచేఁ జిరకాలము క్రిందటనే రచింపఁబడి మరలఁ బ్రకటింపఁబడినది. సకలకర్ణాట రక్షావిచక్షణుఁ డగు తిమ్మరుసుమంత్రిని గూర్చియును, నాఁటివిజయనగర రాజులనుగూర్చియు, విశేషించి కృష్ణరాయనిగూర్చియుఁ బెక్కువిషయము లిందు వివరింపఁబడినవి. కృష్ణరాయని నిధనకాలము, తిమ్మరుసు కారా

గృహావాసమరణములను గూర్చి సహేతుకముగఁ జర్చింపఁబడినది- పెక్కుస్థలముల గాథలపై నాధారపడి గ్రంథము వ్రాయఁబడినది. విమర్శనాఫలితము లగు చారిత్రకవిషయములనే గయికొని వీ రీగ్రంథమును రచించిన నింకనుపయోగకరముగ నుండియుండును. మహాపురుషుఁడగు తిమ్మరుసుజీవితము నీగ్రంథరూపమున నాంధ్రలోకమున కందిచ్చిన శ్రీపంతులుగారు ధన్యులు అట్టిమహాపురుషులజీవితములే లోకమున కాదర్శప్రాయములు

8. ప్రత్యూషము - కవి, శ్రీ కొమరవోలు వేంకటసుబ్బారావుగారు బి.ఏ. కాకినాడ- వెల 1-0-0.

ఆంధ్రసారస్వతమున నూతనమార్గముల నిరూపింపఁ బ్రాచీనపద్ధతులఁ గలమెఱుఁగులను గ్రహించి తా మీగ్రంథమును రచించితి మని గ్రంథకర్తలయాశయము. జనపురసార్వభౌమున కంకితము ఆంగ్లమున నిట్టిగ్రంథమును ‘Allegory’ అందురు. ప్రకృతివిషయముల గ్రహించి వానికిఁ బాత్రత్వమును ఘటిల్లఁజేసి గ్రంథకర్త లీగ్రంథమును రచించిరి. పాఠకులకు సుగమముగ బోధపడుటకై పీఠికయందుఁ గథాసంగ్రహమును నంతరార్థప్రశంసయుఁ గావింపఁబడినది. ‘కవి భావమయశరీరమున సంచరవీథి’ నెగయుచు వ్రాసినటులఁ గలదు. పాఠకులును నామార్గముననే విహరించి యీప్రబంధమును జదివి యానందింపవలయును. గ్రంథము ప్రత్యూషమగుట నిం ద్వైమసుకేములు గలవు. విషయ మస్పష్టముగ నుండుటచేఁ గవితయుఁ గొంతనడినది.

9. సత్యభామాసాంత్వనము—లింగనమఖి శ్రీ కామేశ్వరకవికృతము. శృంగారకావ్యగ్రంథమండలియందుఁ బ్రచురింపఁబడినది. పదునేడవశతాబ్దమునాఁటి కవిత్వము. తంజావూరు మధురరాజుల కాలమునాఁటి యితర ప్రబంధములవలె శృంగారభూయిష్ఠము మధురనాయకుఁ డగు ముద్దళఘునకంకితము. విపరీత మగుశృంగారవర్ణనలచే నీకాలపుకవు లాంధ్రమున కపయశస్సును జేకూర్చియున్నారు.

౩౯. క్షీరం విహా యారోచకగ్రస్తః సౌవీరరుచి మనుభవతి.

అరోచకగ్రస్తః=ప్రతివస్తువునందును నరుచిగలవాఁడు-సౌవీరం=బియ్యపుకడుగు.

ప్రతివస్తువునందు నరుచి గలవాఁడు పాలువిడిచి కడుగునీళ్లయం దాసక్తుఁ డగును. ఈన్యాయము సర్వదర్శనసంగ్రహములో నక్షపాద ప్రకరణమం దుదాహరింపఁబడినది. "నను సుఖాభివ్యక్తి ర్ముక్తి రితి పక్షం పరిత్యజ్య దుఃఖనివృత్తి రేవ ముక్తి రితి స్వీకారః క్షీరం విహా యారోచకగ్రస్తస్య సౌవీరరుచి మనుభవ తీతి త దేత న్నాటకపక్షపతితం త్వాదృ చ ఇ త్యుపేక్ష్యతే॥"

౪౦. కూపమండూకన్యాయము.

మహాజనశ్లాఘనీయమైన యొక పదార్థముయొక్క గొప్పతనమును మూర్ఖుఁ డెఱుఁగఁజాలఁడు.

Home keeping youth have ever homily wits.—
*Two gentlemen of Verona.*

ప్రసన్నరాఘవములో నీన్యాయ ముదాహరింపఁబడినది. "కథం మామపి దశదిగ్విలాసినీకర్ణపూరీకృతకీర్తిపల్లవం త్రిభువనవీరనామధేయం కూపమండూక ఇవ సాగర మవిఖ్యాత మపదిశసి.-ఉపమితి భావప్రపంచము- ౪౨౪ పుట.

"యో న నిర్గత్య నిశ్శేషాం విలోకయతి మేదినీమ్
అనేకాశ్చర్యవృత్తాన్తాం స నరః కూపదర్దురః"

౪౧. కాకదంతపరీక్షాన్యాయము.

ఈన్యాయము వ్యర్థమైన పనిని దెలియఁజేయుటకుఁ బ్రవర్తించును. కఠోపనిషత్తులో- "నచికేతో మరణం మానుప్రాక్షీః" అనుమంత్ర వ్యాఖ్యానములో శంకరాచార్యులవారీన్యాయమును వాడుకచేసిరి. "నచికేతో మరణం మరణసంబద్ధం ప్రశ్నం ప్రేత్యాస్తి నాస్తీతి కాకదన్తపరీక్షారూపం మానుప్రాక్షీః".

౪౨. ఏకవృన్తగతఫలద్వయన్యాయము.

ఒకతొడిమకు రెండుపండ్లు వ్రేలాడుట. ఒకశబ్దమునకు రెండర్థములు. దీనిని బహుళముగా నాలంకారికులు వాడిరి. దండి కావ్యాదర్శ

ము ౨. ౩౧౦ కారికవ్యాఖ్యానమును జూడుఁడు. శ్లిష్టమిష్ట మనేకార్థ మేకరూపాన్వితం వచః తదభిన్నపదం భిన్నపదప్రాయ మితి ద్విధా.

శ్లో. అసా వుదయ మారూఢః కాన్తిమాన్ రక్తమణ్డలః రాజా హరతిలోకస్య హృదయంమృదుభిః కరైః- కావ్యప్రదీపనవమోల్లాసము దు- "వాచ్యభేదభిన్నా య ద్యుగపద్భాషణస్పృశః శ్లిష్యన్తి శబ్దాః శ్లేషోఽసా వక్షరాదిభి రష్టధా" ఈకారికా వ్యాఖ్యానమందు- "అక్షరాదిభి రితి వర్ణపదలిఙ్గభాషాప్రకృతిప్రత్యయవిభక్తివచనభేదాదష్టధా శ్లేష ఇత్యర్థః.

౪౩. కాకతాళీయన్యాయము.

కాకి తాటిచెట్టుమీఁద వ్రాలినది. ఆక్షణమందే తాటిపండు పడి దానితల పగిలినది. ౫-౩-౧౦౬ పాణినిసూత్రముపై కాశికావృత్తిలో "కాకతాళీయము, అజాకృపాణీయము, అంధకవర్తకీయము, ఈమూఁడును సమానార్థము లని. అత్రైతౌ పతనము, కాకాగమనము, యాదృచ్ఛికము- తాళఫలపతనము, అట్లే

౪౪. అజాకృపాణీయన్యాయము.

అజ=మేఁక-కృపాణ=కత్తి. ఆకస్మికముగా మేఁకమీఁదఁ గత్తిపడఁగా మేకపీక తెగి చచ్చిపోయెను.

ఇది యును గాకతాళీయన్యాయతుల్యమే; కాని దానికిని దీనికి నన్నభేద మిది. కాకతాళీయన్యాయ మతర్కితముగా సంభవించిన యిష్టానిష్టలాభములను దెలియఁజేయును- అజాకృపాణీయము కేవలానిష్టప్రాప్తినివేదనమునకుఁ బ్రవర్తించును.

౪౫. అంధగోలాంగూలన్యాయము.

ఒకగ్రుడ్డివాఁ డరణ్యమందొంటరిగా నిస్సహాయుఁడై తిరుగుచుండఁగా నొకదుష్టుఁడు వానిని వంచింపఁ దలంచి వానియొద్దకుఁ బోయి "ఓయీ! నీవు పాపము చాలఁ గష్టపడుచున్నావు. నీ కెవ్వరు సహాయులు లేరు. నాతో రమ్ము, నీవుమీగ్రామమునకు సురక్షితముగాఁ బోవున ట్లొకయుపాయముఁ జెప్పెద"నని వానిని దీసికొనిపోయి యొక పెంకెయావుతోఁకను వానిచేతి కిచ్చి దీనిని గట్టిగాఁ బట్టుకొనుము; ఇది నిన్ను నీయింటికిఁ దీసికొనిపోవు నని చెప్పి యథేష్టముగాఁ జనెను. అంత

నా యంధుఁడు వానిమాటను నమ్మి యయ్యావుతోఁకఁ బట్టుకొని పోవు చుండఁగా నది దానియిష్టము వచ్చినట్లు ముండ్లు, డొంకలు, గోతులు మొదలగువానిలోని కీడ్చుకొనిపోయి వానిని మృతప్రాయునిఁ జేసెను. దుష్టులమాటల నమ్మినవారికి మహాదుఃఖము సంభవించును.

౪౬. న హి నిన్దా నిన్ద్యం నిన్దితుం ప్రవర్తతేఽపి తు విధేయం స్తోతుమ్—

నింద నింద్యమైనవస్తువును నిందించుటకుఁ బ్రవర్తింపదు. మఱేమనఁగా, విధేయమును స్తుతించుటకుఁ బ్రవర్తించును. ఎట్లనఁగా; శుభలక్షణలక్షితవిగ్రహవిశిష్టుఁ డగుప ర్వేశ్వరునిధ్యానమును స్తుతించుటకుఁ దదితరవిగ్రహావచ్ఛిన్నేశ్వరధ్యాన మపకృష్ట మని నిందించుట- నిందయందుఁ బ్రయోజనము లేదు. విధేయప్రాశస్త్యమునుఁ దెలియఁ జేయుటయే ప్రధానము.

౪౭. కి మార్ద్రకవణిజో వహిత్రచిన్తయా.

అల్ల మమ్ముకొను వర్తకున కోడలను గుఱించి యాలోచించుటెందులకు- క్షుద్రునికిఁ గొప్పవస్తువులతో నేమిపని?

౪౮. కుఠారచ్ఛేద్యతాం కుర్యా న్నఖచ్ఛేద్యం న పణ్డితః-

గొడ్డలితో ఛేదింపవలసినదానిని పండితుఁడైనవాఁడు గోళ్లతో ఛేదింపఁగూడదు. తనకంటె బలవంతుఁడైనశత్రువును సులభముగా జయింపఁగల నని తలంపఁగూడదు-"నో పేక్షణీయం దేవేన తస్మా దేతత్ప్రయోజనమ్। కుఠారచ్ఛేద్యతాం కుర్యా న్నఖచ్ఛేద్యం న పణ్డితః." అని యుపమితిభావప్రపంచము.

౪౯. శతేపంచాశన్న్యాయము.

వ్యాపకసంఖ్యలో వ్యాప్యసంఖ్య యంతర్భూతమై యుండును. నూఱు వ్యాపకసంఖ్య- ఏఁబది వ్యాప్యసంఖ్య. సముద్రమందు నదీసమూహ మంతయు నిమిడియున్నది. సర్వవ్యాపకుఁడైనపరబ్రహ్మమందు జగత్తంతయు నంతర్భవించియున్నది

౫౦. న హి సుశిక్షితోఽపి నటవటుః స్వస్కన్ధ మధిరోఢుం పటుః.

ఎంత బాగుగా శిక్షితుఁడైన నటుఁడును దనభుజముపైఁ దానెక్క లేఁడు, ఎంతబుద్ధిమంతుఁడైనను దుర్ఘటమైనకార్యమును జేయ లేఁడు.

౫౧. న హి భిక్షుకా స్సన్తీతి స్థాల్యో నాధిశ్రీయన్తే, న చ మృగా స్సన్తీతి యవా నోప్యన్తే.

యాచకులు వత్తు రని వంట మానుకొందురా? మృగములు చేను భక్షించివేయు నని వ్యవసాయము మానుకొందురా? విఘ్నములు వచ్చు నని భయపడి మనము చేయవలసినపనులు మానఁగూడదు-

౫౨. వృశ్చికభియా పలాయమానః ఆశీవిషముఖే నిపతితః.

తేలువలన భయముచేఁ బాఱిపోవుచున్నవాఁడై సర్పముఖమందుఁ బడెను. ఈన్యాయము న్యాయవార్త్తికతాత్పర్యటీక ౫౩ పుటలో నిట్లున్నది. "తథా చ దుఃఖహేతో ర్హేయవర్గ స్యాభావా న్నతద్ధానాయానేన ఘటితవ్యమ్ నచాఘటమానో న్యాయం హాతు మర్హతి సోఽయం వృశ్చికభియా పలాయమాన ఆశీవిషముఖే నిపతితః.

౫౩. కాంస్యభోజిన్యాయము.

కంచుపాత్రలో భుజించువాఁడు. ౧౨-౨-౩౪ జైమినిసూత్రము పైని శాబరభాష్యములో నీన్యాయ ముదాహరింపఁబడినది. "కాంస్యభోజివత్ । తద్యథా । శిష్యస్య కాంస్యపాత్రభోజిత్వనియమ ఉపాధ్యాయస్యానియమః యది తయో రేకస్మి న్పాత్రే భోజనమాపద్యతే ఽముఖ్యస్యాపి శిష్యస్య ధర్మో నియమ్యేతి మాభూ ద్ధర్మలోప ఇతి".

౫౪. కుడ్యం వినా చిత్రకర్మ.

గోడలేని చిత్రకర్మ. ఇది శశవిషాణతుల్యము- న్యాయమంజరి ౧౦౩ పుటలోఁ జూడుఁడు-

శ్లో. "ప్రసఙ్గసాధనం నామ నా స్త్యేవ పరమార్థతః
తద్ధి కుడ్యం వినా తత్ర చిత్రక ర్మేవ లక్ష్యతే".

౫౫. కరవిన్యస్యబిల్వన్యాయము.

చేతిలో నున్న మారేడుపండు- ఇది కరతలామలకము వంటిదే- ఇది సురేశ్వరాచార్యుల వార్త్తికమం దున్నది.

"అతోఽనుపేత మేవ త్వాం కరవిన్యస్యబిల్వవత్
బ్రహ్మవిజ్ఞాపయిష్యామి యద్ జ్ఞానే సర్వవి ద్భవేత్॥"

౫౬. ఉష్ట్రలగుడన్యాయము.

ఉష్ట్రము=లొట్టిపిట్ట- లగుడ=దుడ్డుకఱ్ఱ- లొట్టిపిట్ట యేకఱ్ఱను మోయుచున్నదో యాకఱ్ఱచేతనే దానిని గొట్టుట- స్వమతమందుఁ బరులేదూషణములను జెప్పిరో యాదూషణములచేతనే పరులమతమును ఖండించుట- ఉష్ట్రలగుడన్యాయము.

౫౭. ఇషుకారన్యాయము.

ఇషుకారుఁడు=బాణములు చేయువాఁడు- వీఁడు తనపనియందే బద్ధదీక్షుఁడై యితర మేమియును గ్రహింపక యుండును.

శ్లో. "ఇషుకారో నరః కశ్చి దిషా వాసక్తమానసః
సమీపే నాపి గచ్ఛన్తం రాజానం నావబుద్ధవాన్"

శాంతిపర్వము ౧౭౮ అ- బ్రహ్మసూత్రము ౩-౨-౧౯ "ముగ్ధేఽర్ధసమ్పత్తిః పరిశేషాత్" అనుదాని భాష్యమందు శంకరాచార్యులవా రిట్లు వ్యాఖ్యానము చేసియున్నారు. "ఇషుకారన్యాయేన ముగ్ధో భవిష్యతి య థేషుకారో జాగ్రద పీ ష్వాసక్తమనస్తయా నా న్యా న్విషయా నీక్షతే"

౫౮. ఆమ్రాన్ పృష్టః కోవిదారా నాచష్టే-

మామిడిచెట్ల నడిగినఁ గోవిదార (సంపెంగ) వృక్షములను జెప్పుచున్నాఁడు. ఒకటి యడిగిన మఱి యొకటి చెప్పుట. "అల్ల మున్నదా? కోమటీ యని యడిగిన బెల్ల మున్నఁ దని చెప్పినట్లు.

భామతి ౧-౧-౨౨ సూత్రము. "ఆకాశ స్తల్లి ఙ్గాత్" దీనివ్యాఖ్యానములో "య ద్య ప్యాకాశపదం ప్రధానార్థం త థాపి యత్పృష్టం త దేవ ప్రతివక్తవ్యం న ఖ ల్వనుస్మర్తః ఆమ్రా స్పృష్టః కోవిదారా నాచష్టే".

౫౯. ఆమ్రసేకపితృతర్పణన్యాయము.

మామిడిచెట్టునకు నీళ్లుపోయుట పితృదేవతలకుఁ దర్పణముఁ జేయుట- ఒకపనివలన రెండుఫలములు. మహాభాష్యము- పశ్పశాహ్నికము- "కథం పున రేకేన యత్నేనోభయం లభ్యం-లభ్య మి త్యాహ। కథం-

ద్విగతా అపి హేతవో భవన్తి- తద్యథా-ఆమ్రాశ్చ సిక్తాః పితరశ్చ ప్రీణితాః ఇతి"

౬౦. అహిభుక్కైవర్తన్యాయము.

అహిభుక్= నల్లమందు తినువాఁడు. కైవర్త=జాలారి వాఁడు, అహిఫేనశబ్దమునకు నల్లమందు దరము."అఫీమ్"కు మొకటిరూపము. అహిశబ్దమునకు మాదకద్రవ్యవిశేషమర్థమని కొందఱు నిఘంటుకర్తలు వ్రాసియున్నారు.

తొల్లి నల్లమందు తినువాఁడొక డొక నావలోపలికి నెక్కెను' అచ్చట ననేకజను లుండుటను జూచి తాను మార్పుఁజెందుదు నని తలంచి తనకాలి కొకత్రాడు కట్టుకొని యోడలో నిద్రించెను. అంత నొక జాలరి వానిని బరిహాసించుట కాత్రాడు విప్పి తనకాలునకుఁ గట్టుకొనెను. ఇంతలో నావ యవతలియొడ్డునకుఁ జేరఁగా వాఁడు లేచి కాలిత్రాడు లేకుండుటను జూచి "నీవు నేనయిపోతివి- నేను నీ వయితిని" అని కలహింపసాగెను ఈన్యాయ మొకపిచ్చిదెబ్బలాటను దెలియఁజేయును.

౬౧. న హి శ్యామాకబీజం కరికర్షసహస్రేణాపి కలమాఙ్కురాయ కల్పతే.

చామగింజ పాఁతి వేయి దోహదములు చేసినను వరిమొక్క పుట్టదు. ఎన్నిప్రయత్నములు చేసినను నశక్యమైన పని చేయఁబడదు. భామతిలో "న హి జాతు పటాఙ్కురః కుటజబీజా జ్జాయతే" (మఱ్ఱిమొక్క యంకుడువిత్తువలనఁ బుట్టదు.)

౬౨. మండూకతోలనన్యాయము.

తోలనము=తూఁచుట. కప్పలను దెచ్చి త్రాసునఁ బెట్టి తూఁచఁబోయిన నొక్కొక్కటి పాఱిపోవును. ఐకమత్యము లేని మనుష్యులవ్యవహారమందీ (కప్పలతక్కెడ) న్యాయము ప్రవర్తించును.

౬౩. చర్మతన్తో మహిషీం హన్తి.

ఇచ్చట: చర్మత-తుశబ్దముల మున్న సప్తమి నిమిత్తార్థమును వచ్చినది. "చర్మణి ద్వీపినం హన్తి" అన్నట్లు చర్మరజ్జువును జేయుటకు నుగేదె

జంపుట- అల్పముకొఱకుఁ బెద్దవస్తువును నశింపఁజేయుట, యను నర్థ మం దీన్యాయము ప్రవర్తించును. రఘువంశము- ద్వితీయసర్గలో-దిలీపునితో సింహము చెప్పుమాట-"అల్పస్య హేతో ర్బహు హాతు మిచ్ఛ న్విచారమూఢః ప్రతిభాసి మే త్వమ్"

౬౪. అంధచటకన్యాయము.

అంధునిచేతిలో నాకస్మికముగాఁ బడినపిచ్చుక నంధుఁడు పట్టుకొనె నని లోకము తలంచును. దైవయోగముచే లభించిన స్వాభీష్టము తన యిష్టదేవతచే నియ్యంబడిన దని వ్యవహరింతురు. ఈన్యాయము ఘుణాక్షరన్యాయమువంటిదే.

౬౫. ఏకం సన్ధిత్సతో౽ పరం ప్రచ్యవతే-

ఒకగిన్నెలో రంధ్రమున్న దని దానిని మాటించుటకు యత్నించుచుండఁగా మఱియొకచోట నొకముక్క పోయినది. ఇట్లే యొకయింటిని 'మరమ్మతు' చేయుచుండఁగా దానిలో మఱి యొకచోట నొకదూలమో వాసమో విఱిగిపోవుట, యిత్యాదులయం దీన్యాయము ప్రవర్తించుచున్నది.

౬౬. కైముతికన్యాయము.

కిమ్ + ఉత- ఈరెండును గలపఁగా కిముత-దానిభావము కైముత్యము లేక కైముతికము.

శ్లో. "కైముత్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే
సజిత స్త్వన్ముఖేనే న్దుః కా వార్తా సరసీరుహామ్"

కైముత్యన్యాయముచే నెచట నర్థము సిద్ధించునో దానికిఁ గావ్యార్థాపత్త్యలంకార మని పేరు. అప్రసిద్ధుఁ డైనచంద్రుఁడే నీముఖసౌందర్యముచే జయింపఁబడినపుడు పద్మములసంగతి చెప్పెడి దేమి. అనఁగాఁ బద్మములు తిరస్కరింపఁబడిన వని వేఱే చెప్ప నేల? తర్కశాస్త్రములో నొకయర్థాపత్తి కలదు. అది యనుమానాంతఃపాతి. అది యెట్లనఁగా; 'పీనో దేవదత్తః దివా న భుంక్తే' (దేవదత్తుఁ డనువాఁడు బలిసి

యున్నాఁడు. పగలు భుజింపఁడు) "పీనత్వా న్యథానుపపత్త్యా" రాత్రి భోజనమును మన మూహించుకొనవలెను. ఈయర్థాపత్తినుండి వేఱు చేయుటకుఁ గావ్యార్థాపత్తి యని పేరిడిరి.

౬౭. అకాలే కృత మకృతం స్యాత్.

యుక్తకాలమందుఁ జేయఁబడని పని చేయఁబడనిదియే, యని తలంపఁబడును. ఇది మాధవీయన్యాయమాలావిస్తర మందు(౧౧-౧-౧) ఉదాహరింపఁబడినది. "కిం చతుర్థాకరణా దూర్ధ్వం ఆవాహ్యాతే క్రియా ప్రయాజేభ్యః పురా నాద్యః అకాలే కృత మకృతం స్యా దితి న్యాయే నావాహనస్య నిరర్థకత్వాత్.

౬౮. అగ్నిహోత్రన్యాయము.

ప్రాతస్సాయంకాలములయం దగ్నిహోత్రములో నాహుతుల నర్పించి హోమముచేయుట. జైమిని-పూ మీ. ౬.౨.౨౩-౨౫ సూ. లలో "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" అను విధి పూర్ణముగాఁ జర్చింపఁబడినది. గృహస్థుఁడు తాను జీవించి యున్నంతకాలము నగ్నిహోత్రమందు హోమము చేయ వలయు నని పూర్వపక్షి యర్థము నుఁ జెప్పెను బ్రాహ్మణుఁడు తాను గృహస్థాశ్రమమందుఁ బ్రవేశించినది మొదలుకొని యగ్నిహోత్రహోమమును జేయుచుండవలెను. ఒక దినమందైన విచ్ఛేదముండఁ గూడదు. ఇది యాద్యునికి ధర్మము. ఈకర్మయే యజ్ఞమునకు నంగము కాదు. అది స్వతంత్రకర్మ.

౬౯. అఙ్గుళిదీపికయా ధ్వాన్తధ్వంసవిధి.

అంగుళిపరిమాణము గలదీపముచేఁ జీఁకటిని నశింపఁజేయుట. అనఁగాఁ జిన్నసాధనముచేఁ బెద్దకార్యమును సాధింపఁదలంచుట. ఆత్మతత్త్వవివేకమం దీన్యాయము చూపింపఁబడినది. "న చాస్మాక మివ తవాప్యత్ర మూకత్వైవ శరణం సర్వథా వచనవిరోధే హ్యుదాసీనస్య సా శోభతే। న చాత్ర విధౌ విరోధః క్వచిత్ । న చ త్వ ముదాసీనః ప్రయోజనే ప్రవృత్తత్వాత్ । తస్మా దల మఙ్గుళిదీపికయా ధ్వాన్తవిధ్వంసనవిధి మనుష్ఠాయ.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు; పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.
కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ. బి. ఎల్.

### కార్యదర్శులు

కిడాంబి రాఘవాచార్యులుగారు. ఎం. ఏ., బి ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు. ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు,(కోశాధ్యక్షులు)
పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ ,,
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ ఎల్. టి.
దర్భా వేంకటశివరామరాసుగారు, బి ఏ. బి. యల్.
అళక్కి వేంకట్రామయ్యగారు
కేశవగపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు
ఒలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

rPinted by N. Achutaramiah at theCocanadaPrintingWorks,Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౧౬. | ఈశ్వరనామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. | సంచిక ౬.



కాకినాడ

కొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక, రు. ౦-౮-౦.

1928 ఫిబ్రవరి, మార్చి.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము. ౨౬ | ఈశ్వరనామసంవత్సరము.<br>మాఘఫాల్గునమాసములు. | సంచిక ౬. |
|---|---|---|

## స్వవిషయము.

పాఠకమహాశయులారా!

పరిషత్పత్రిక యీ 6 వ సంచికతో నీశ్వరసంవత్సరము పూర్తి యగుచున్నది. ఇరువదియేడవ సంపుటము బహుధాన్యనామసంవత్సరముతోఁ బ్రారంభ మగుచున్నది. పత్రికాగ్రాహకులు తాము దయచేయవలసిన పైకమును ద్వరలోఁ బంపియుఁ దమ మిత్రులఁ బ్రోత్సాహ మొనరించి చందాదారులుగఁ జేర్చియుఁ బరిషత్తునకుఁ జేయూఁత యొసంగఁ గోరుచున్నాము.

కార్యదర్శులు.

---

## మనవి.

— కొత్తపల్లి సూర్యారావు, కాకినాడ. —

నాప్రార్థనం బట్టి లోకమునకుం దెలియునిది లేను హ్రస్వదృష్టితో- "తుముకీబాయిలబాయి రే ములికి" యని యూరకుంటిని. నాయభిప్రాయము-అట్టిపద్యములు రెంటికిఁ బూర్ణముగా నర్థము సెబవిం డనియే.

మ. సమరక్షోణిని గృష్ణరాయలభుజాశాతాసిచేఁ బడ్డ దు
ర్దమదోర్దండపుళిందకోటి యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి శబా సహో హరిహరంగాఖూబుఖోడాకితే
తుముకీబాయలబాయి రేములికి యంను ర్రింటికిం బోవుచుణ్.

ఇది కవిజీవితపాఠము- ఆంధ్రకవులచరిత్ర పాఠము "తుముకీబాయి లబాయిదే." అని- ఇం దేది యుచితమో తెల్పఁ గోరెదను.

శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూరఖడ్గాహిచేఁ
గాయం బూడ్చి కళింగదేశనృపతుల్ కానిర్ఝరీపోషణీ
మాయాభీకుమఃటాకులోకుహుటురే మాయాసటాజాహిరే
మాయా న్రేయమడే యటండ్రు దివి రంభాజారునిఁ యక్షునిఁ.

ఇది కవిజీవితపాఠము. కవులచరిత్రములో "మాయాభీకుమఃటూకులోటుకుహుటూమాయాసటాజాహరే మాయాగ్రేయమడే" యని యున్నది. ఇం దేది సరియైనదో- విచారింపుఁడు.

పుళిందఃలు యవనులతో ననుమాటలు కావున మొదటిపద్య ములోని భాష పుళిందభాషయో యవనభాషయో కావలయును. రెండ వదానిలోఁ గళింగదేశనృపతు లనినమాట- ఇది కళింగభాషయే కావల యునుగదా !

"శివదో" యనఁగా-అదో యిదో వంటిదేనా: "రా" యనుట కు గ్రామ్యముగా 'దా' యందురు. మాప్రాంతములలో బిడ్డలను "దా దా" యని పిల్తురు. కుక్కలను "దూ దూ" యని పిల్తురు. పందులను "దో దో" యని పిల్తురు. ఇట్టిది గ్రామ్యరూపము వాఁడునా. లంకావిజ యములో "మునిజనంబు చేరువను సంచరించుచు నందువకుల"దా"మ హోన్నతముగ"నన్నచోట శ్లేషలో నున్నను దానిని గ్రామ్య మని పరి ష్కర్త లనిరి. ఇట్టియెడ శివదో యని కవి గ్రామ్యమును వాఁడునా ! అదో, ఇదో యనుటలో ద్రావిడులు, తొందరగా-"దో" అనుట కలదు. అంతనే సిద్ధ మెట్లు. "శివద" శుభముల నిచ్చువాఁడా యనుదానికి సంబో ధనమునవచ్చు నోకారమును "ఎన్నాళ్లనోయుండి"వలె-చివరఁ జేర్చి వాఁ డుట కలదా ! ఈవిషయమై శైవసంప్రదాయజ్ఞుల యభిప్రాయముఁదెలి యఁగోరుచున్నాఁడను.

---

# కీ. శే. వడ్డాది సుబ్బారాయఁడుగారు.

రాజమహేంద్రవరపుకవిత్రయములోని వడ్డాది సుబ్బారాయఁడుగారు తమసహస్రమాసోత్సవానంతరము తమస్వగృహమున 1938 సంవత్సరము మార్చినెల ది 2 తేదీని స్వర్గస్థులయిరని వ్రాయుటకుఁ గడు వగచుచున్నారము.

సీ. పుట్టుక పాసెర్లపూఁడిలంకను, దండ్రి
బందుగులింట నానందయందు
మెత్తని పొత్తుల నత్తమిల్లుట శైశ
వక్రీడ, పదొకొండు వత్సరముల
ప్రాయంబుదనుక, నౌరంగమా కోరంగిఁ
గన్నవారల వియోగంబు నటనె
యక్షయమొదలు పరాన్న మేడేండ్లు దొ
డ్డమ్మపేఁటదివాణముఁగన్; శ్రీము
ఖాబ్దమున సొంతకాఁపుర మక్కాటికనె
ప్రథమజాయావియోగహృద్వ్యథయు, భావ
రాణ్మహేంద్రంబునందు నాంధ్రంపుటొజ్జ
పదవి వసురాయచరితంబు ప్రథిత మవల.

మొన్నటియానందగాక యాపైయానందసంవత్సరమున శ్రావణశు ౫ వీరి జననము.

ఉ. గౌతమిఁ గట్టి కాలువలు కాటను ద్రవ్వినకాలమందు సం
భూతుఁడ నైనవాఁడఁ బదుమూఁడగునేఁడుల యీడుతల్లికిన్;
మాతకు లేమిఁ బాలచట మంటిని మోసెడు నుప్పరమ్మ తే
ప్రీతిని నన్నుఁ జన్గుడిపి పెంచి రఁటేమి ఋణానుబంధమో.

అను వీరిస్వవిషయపద్యములు వీరిబాల్యాదులను దెలుపుచున్నవి. వీరురచించిన గ్రంథము లిరువదింటికిమీఁదఁ గలవు గాని వానిలో

వేణీసంహారమునకును, భక్తచింతామణికిఁ గలిగిన కీర్తి తక్కిన పెక్కింటికి లేదు. పెక్కుముద్రణములం హాటవలననే యాంధ్రలోకమున వానికిఁగల ప్రచారము, గౌరవము మనకుఁదెలియ నగును. మల్లికామారుతము మొదలగు సంస్కృతనాటకాంధ్రీకరణములు- ఉత్తమపరీక్షలకుఁ బఠనీయ గ్రంథము లయినవి. వార్ధకమునందును గవితాపాటవమును వీడక వీ రార్తరక్షామణిశతకమును రచించిరి. 22వ సాహిత్యపరిషత్సభకు రాజమహేంద్రవరమున నగ్రాసనాధిపత్యము వహించిరి. సూక్తివసుప్రకాశము, భక్తచింతామణి మొదలగు గ్రంథముల వీరికవిత్వము సరళతను గాంచినది. తమయౌవనమున వేణీసంహారనాటకమున ధర్మరాజాశ్వత్థామ పాత్రములను సభారంజకముగ నభినయించుచు నాట్యకళను బోషించుచుండిరి. రాజమహేంద్రవరమునఁ గళాశాలయందుఁ బెక్కువత్సరములు సంస్కృతాంధ్రోపన్యాసకులుగ నుండిరి. వీరి మృతిచే నాంధ్రభాషకు గొప్పకొఱఁత వాటిల్లినది. తమజీవితమంతయు నాంధ్రభాషామతల్లికి సేవలొనర్చుచుఁ బండితజనాదరణమును వడసిన శ్రీసుబ్బరాయకవిగా రాంధ్రులకు మార్గదర్శకు లగుదురు గాక- భగవంతుఁడు వీరి యాత్మకు శాంతి నొసఁగుఁగాక—

---

# బాలకవిశరణ్యము

—వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, అమలాపురము—

ఇయ్యది రావుసాహేబు మహామహోపాధ్యాయ గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారిచే విరచితమై శ్రీయుత తెలికిచెర్ల వెంకట రత్నంగారిచేఁ బ్రకటింపఁబడిన వ్యావహారిక భాషానుశాసన మగుగ్రంథము. ఇందు సంపాదకీయభూమికయందు "శ్రీ పంతులుగారు 25 సంవత్సరముల క్రిందట ఈగ్రంథము రచించుటకు ప్రయోగములు సేకరించినారు. కూతురిని, కూతురికి మొదలగునవీ, చేతురు, కోతురు మొదలగునవీ-ముద్రితములయినవి. మిగిలిన ప్రసంగములు పంతులుగారు వ్రాసి ఉంచిన ప్రయోగములు, నోట్సు ఆధారము చేసికొని వారిపెద్దకుమారులు శ్రీ సీతాపతిపంతులుగారు రచించినవి." అని యుండుటఁ బట్టి శ్రీరామమూర్తి సీతాపతిపంతులుగార లుభయులును నీగ్రంథమునకుఁ గర్తలు. శ్రమ మంతయు రామమూర్తిపంతులుగారిదే కావున వారిపేరనే యీ గ్రంథము వెలువడుట న్యాయ్యమే. ఇందు శ్రీపంతులుగారి భాషాపరిశోధనపాటవ ముద్దీపించుచున్నది.

సంపాదకీయభూమికయందు "వ్యావహారిక భాషను పునఃప్రతిష్ఠితము చేయడానికి సుమారు పాతికసంవత్సరములనుంచి చేస్తూఉన్న వాదములో ప్రధానముగా నాలుగు మార్గములు గోచరిస్తున్నవి." అని యు నందు "నాలుగోమార్గము:—ప్రాచీనకవులకావ్యము లన్నీ సమగ్రముగా పరిశీలించకపోవడమువల్ల వ్యాకరణకర్తలూ, కోశకారులూ, పండితులూ తప్పులుగా భావించి లక్షణవిరుద్ధము లనీ, గ్రామ్యము లనీ నిందించినరూపములు వందలకొలఁదిగా కవులకావ్యములలో ప్రయుక్తములై ఉన్న వనిన్నీ, వ్యాకరణము ప్రయోగమూలము కావడమువల్ల కవిప్రయోగము లక్షణముకంటె బలవత్తరమైన దనిన్నీ కవులు ప్రయోగించినరూపములు లక్షణములో చెప్పకపోతే లక్షణమే అసమగ్రమూ దుష్టమూ అవుతుంది కాని ప్రయోగములు నింద్యములు కావనీ నిరూపించి అట్టిరూపములకు ప్రతిపక్షులు ఎదురాడుటకు వీలు లేనట్టుగా-

కవులకావ్యములనుంచి వందలకొద్దీ ప్రయోగములు చూపి నిరుపపత్త్వ మాపాదించడము'' అనియు నీనాలుగవమార్గముననే యీబాలకవి శరణ్యము రచింపఁబడినట్లును గలదు.

ఈభూమికయందే 'ఇదియొకక్రొత్తవ్యాకరణ' మనియు- ప్రాచీనవైయాకరణులూ యిప్పటిపండితులూకూడా లక్షణవిరుద్ధములనీ గ్రామ్యములనీ నిందించినవీ, వాఙ్మయము ఆమూలాగ్రముగా పరిశీలించకపోవుటచేత వ్యాకరణములలో గతి కల్పించనివీ, వందలకొలది రూపములు ఈనూతన వ్యాకరణములో సాధింపఁబడినవి.' అని యుండుటవలన నియ్యది కవిప్రయుక్తమగు వ్యావహారికాంధ్రమునకు ననుశాసనము కావలయును. వీరి యాశయము కవిప్రయోగము ననుసరించి వ్యాకరణ ముత్పన్నము కావలయునే కాని వ్యాకరణానుసారముగాఁ గవులు రచింప నక్కఱ లే దని. అదియుఁగాక లాక్షణికు లితరులను శాసించి, తాము తప్పుగాఁ బ్రయోగించుచు వచ్చిరి కావున నాలక్షణము లప్రమాణము లనియును దెలియుచున్నది. తెనుఁగునకు సరియైన లక్షణము పుట్టలేదు పుట్టలే దని యనువారే కాని యిట్లుండఁదగు నని పరిపూర్ణముగా వ్రాసి చూపిన వారు లేరనుట సర్వవిదితము. నేఁడు వీరు కొన్ని ప్రయోగముల నెత్తి చూపినమాత్రమున నాకొఱఁత తీఱినదా ? లేదు. వెనుకటిలాక్షణికులయం దప్రామాణ్యము కలిగించుటకుమాత్ర ముపయోగించిన నుపయోగింపవచ్చును. నన్నయ మొదలు చిన్నయ దాఁక నుండు లాక్షణికుల నందఱను దెగడిన వీరు ''అదుగెంటక, తలపెట్టు'' అను ప్రథమ వ్యంజనలోపవ్యాసమున నంతప్రమాదమగు సిద్ధాంతములను జూపినప్పుడు వీరివ్రాఁతలు మాత్ర మెట్లు గ్రాహ్యము లగును ? సర్వవిమర్శనములను గ్రోడీకరించుచు వ్రాసివిమర్శించు నీవ్యాకరణముననే యంతటి ప్రమాదము లుండఁగాఁ దమతమతోఁచిన యభిప్రాయములను వెల్లడించు ప్రాచీనలాక్షణికులగ్రంథములం దెచటనేని లోప మున్నంతమాత్రమున సర్వము నప్రామాణిక మనుట న్యాయమా? మఱి యొకసంగతి- గ్రాంథికాంధ్రము కావలె నను నేఁటిపండితులు గ్రాంథికాంధ్రము వ్రాయుచున్నారా ? అని వారిగ్రంథములయందుఁ దప్పు లెత్తి విశేషముగాఁ జూపియున్నారు.

అట్టి తప్పు లెత్తి చూపి వారిని సవరించుకొనుఁ డని చెప్పవచ్చునే కాని వారిమాట సర్వథా యగ్రాహ్య మనుటయు నంత న్యాయముగాఁ దోఁపదు. 'ప్రమాదో ధీమతా మపి' యను నార్యోక్తి కగ్గము కాని వా రెచటనే నున్నారో లేరో సందియము. అట్లని యీనియమము లేల యనుట తగునా? శిష్టులభాష గ్రాహ్య మనిరి. శిష్టు లెవరో నిర్ణయింపఁ బడ లేదు. ఇందు ముఖబంధన మందు వీరు వ్రాసిన ౪౮ పద్యములందలి భాషను బరికింపఁగాఁ బద్యరచనమున నట్టిభాష యుండవలె ననియా? ప్రాచీను లిట్టి నిరుపయోగనియమముల, నాశ్రయించి భాష నంతయు భ్రష్ట మొనర్చి రని చూపుటకా? లేక గ్రాంథికాంధ్ర మన మాకుఁ దెలియ దనుకొనుచున్నా రేమో మేమును రచింపఁగల మని తెలుపుటకా? యెందులకో తెలియుట లేదు. పద్యమందలి భాష యంత నియమయుక్తమై యుండవలసినప్పుడు వచనమున నేల యుండరాదు? ఈ ముఖబంధనమునం దున్న పద్యములన్నిటియందును సలక్షణగ్రాంథికాంధ్రము వాడఁబడినప్పటికి నడుమనడుమ ముద్రణప్రమాదమో లేక యట్టి సంస్కారము వాంఛించియో కాని గ్రాంథికదృష్టిని బ్రమాదములు పెక్కు గలవు. ౨లో, లోకయాత్రకొఱకు 'కొఱకు' అని యుండుట న్యాయ్యము. వీరు రేఫనియమ మీపద్యములఁ బాటింపనివారు కారు. ౪లో, శబ్దసిద్ధితెలియ శాస్త్రాలు కొఱ గావు. అనినారు, దూఱుట, కఱపి, మఱుచుట, ఉఱునె (?) కొఱఁత, ఎఱిఁగి, మీఱి, కాచుకొఱకు, ఏఱు, పాఱు, తెఱఁగు, మాఱు, మాఱుపు, (నడుమ మారుచుండు) మఱచు, మఱిమఱి, విశదపఱతు మున్నగునవి కలవు. ఇట్టిదీక్ష వహించియు 'మారుచుండు' నని రెండుతావుల సాధురేఫముతోను, 'కొరకు' అని యొకతావున సాధురేఫముతోను వీరు ప్రయోగించిరి. మఱియు సానుస్వారములపట్లను నిట్టి దీక్షను వహించియుఁ గొన్నితావుల వదలినారు. పెరిగితి ౧౧. మెలకువ ౧౩. ఇక గలుగనిదానికి ౩౧ పుట్టె, గాక. ౩౫. మాట లెల్ల పరమ. ఎల్లకుత్సితముల ౩౬. తెలుగులో ౪౧. లేకుండ కావ్యరచనయందు ౪౮. మున్నగునవి. శకటరేఫానుస్వారముల విషయమున వీ రెఱుఁగ రనుకొన వలను పడదు. కాన నిందలి తప్పులు

ముద్రణప్రమాదములు కావలయును. కాని యిట్టిప్రమాదము లితరు లవి 'ముద్రణప్రమాదము లని రెండవకూర్పులో సవరించుకొనఁబడినవి.' అని వీరు పలుతావుల నుద్ఘాటించుచు వచ్చిరి. "ఇట్లే అగ్రామ్యభాషాపోషకు లందరూ ఒక్క పుటలోనే ఒకమాటే, ఇక్కడొకలాగున, అక్కడొకలాగున వ్రాసి సాధు వేదయితే అది తాము వ్రాసిన దనిన్నీ, తక్కినది అచ్చువేసినవారి దనిన్నీ చెప్పజూస్తారు" అని యుపోద్ఘాతము 3 వ పేజీలో వీరు వ్రాసినదానికి నిది యుదాహరణముగా నిచ్చి లక్ష్యలక్షణసమన్విత మొనర్తురు గాఁబోలు.

మఱి యొకవింత. "శాస్త్రకర్తలు మనుజులు; శాస్త్రమునకుఁ బార మేర్పర్ప మనుజు లేపాటివారు!" అనిన వీరి నేఁటి యీశాస్త్ర మెంత దాఁకఁ బ్రమాణమో! వీరి యీవ్యాకరణము "పూర్వులవ్యాకరణ నియమములు పనికిరానివి." అని యొక్కసూత్రము చేసినయెడల గతార్థ మగుచుండ, ఎవరివో నామరూపములు లేని కవుల యవకతవకలును నేకదేశపతితము లగుకొందఱి లాక్షణికులప్రమాదములు నెత్తి చూపి శాస్త్రరీతిగా సాధింప మొదలిడుట యెందులకు? వ్యాకరణశాస్త్ర మనిన మాకును దెలియు నని చెప్పుటకే యైయుండ నోపు.

ముందు మన తెలుగుబాసలో సందుగొందు<br>
లెవరు వెదకిరి? మర్మంబు లెవరు గనిరి?<br>
వాఙ్మయం బెల్లఁ జూచినవార లెవరు?<br>
బాస యెల్లను బండితుల్ బాపుకొనిరె?

అని ముఖబంధనమున వీరు సెలవిచ్చినది నిజము కావచ్చును. పండితులు వాఙ్మయం బెఱుఁగరఁట. అపండితులకు సాధ్యము కాఁబోలును. ఎందుల కీయహంకారప్రదర్శనము! వ్యాకరణము రచించినపండితులు వేఱును, కావ్యకర్తలు వేఱని వీరియాశయము కావచ్చును. కావ్యకర్తలే వ్యాకరణముల రచియించి తమకావ్యములందలి లక్ష్యములకు బాధకములుగాఁ గూడ శాసనము చేసి యున్నారుగదా! వారి యాశయ మేమైయుండును? స్వకృతమైనను బరకృతమైనను రసాస్వాదమునకు భంజకములగు శబ్దము లపశబ్దములే యని వారి యాశయము కావచ్చును. వ్యాకరణము సుశబ్దా

పశబ్దములను వేర్పఱుచుటకేకదా ! సుశబ్దములను బ్రయోగింపనియెడల రసభంగము కలుగు నని ప్రాచీనులయభిప్రాయము.'సావా గ్యా రసవృత్తిః సాధ్యో హి రసోయథాతథం కవిభిః' అను పూర్వులశాసనముయొక్క పరమోద్దేశ మదియేకదా ! చ్యుతసంస్కారదోషజుష్టము లగు శబ్దములు రసభంజకములుగాన నవి విడువఁదగినవి యనియు నట్టివానికి సరియగుసంస్కార మొనరించి యుపయోగింపఁ దగుననియు నాలంకారికుల యభిప్రాయానుసారముగా వైయాకరణులును సమ్మతించిరి. అంతియ కాని జనులు మాటాడిన దెల్లను వ్యవహారమున నున్న దెల్లను గ్రాహ్య మగుచో నుత్తరములు, దస్తావేజులు, శాసనములలోని వచనఖండములు గూడఁ గావ్యములు గావలసి వచ్చును. పండితులు భాష నెఱుఁగరఁట. సమగ్రముగా భాష నెఱింగినట్లు వీరిశోధనవలనఁ దేలినట్లు భూమికయందలి వాక్యములుదెల్పుచున్నవిగదా ! వానినిబట్టి వీరు పండితులా ? కారా ?

మఱియుఁ "బుస్తకాలలోన ప్రుచ్చినమాటలు, ప్రాఁతవైనదానిఁ ద్రవ్వి యెత్తి, నేఁడు నెల్లవారు వాడఁగా వలె నన్న గొంతు కడ్డపడదె క్రొత్తమాట" అని సెల విచ్చిన వీరు మొదటిపద్యమున "వాయర్చుచు" అని ప్రయోగించుట యేటికో ? ఇట్టి మాట గొంతు కడ్డపడనిది. 'నిత్యవిధులు మఱుచు టుఱునె' ౮. ఇందలి ఉఱునె పుస్తకాలలోన ప్రుచ్చిన మాట కాదుకాఁబోలును. వీరు ప్రయోగించుటచే దానిపుప్పి పోయినదేమో ? ఈ"ప్రుచ్చిన" అనుపదము ప్రుచ్చినదా ? ప్రువ్వినదా ! ఇట్టిపదములు కూడ వనుచు వాని నేల వీరు వాడినారో ! ప్రాచీనభాష యిట్లుండు నని చూపుటకు, ఇచట వాడినను, "మఱచుట, ఉఱునె?" ఈ 'ఉఱు' ధాతుప్రయోగము యమకమున కాసించియా ? ఇట్టిపదముల వాడి నేఁటికవులు కవితను బాడుసేయుచుండి రని చూపుటకా? ఎందులకో; క్రొత్తపదమైనచో గొంతు కడ్డుపడునఁట. ఎవరికో గొంతుకడ్డపడుట వివరించినారుకాదు.

శిష్టులభాష ప్రమాణ మని సర్వత్ర చాటుచు-

గీ. మాలమాట గాని మాదిగమాట లేని
నాఁటి దేనిఁ గాని నేఁటి దేని
ఈడ దైననేమి యాడ దైనను నేమి
ఏడదైనఁ జెల్లు వాడికయిన. 32

ఇట్లు వ్రాయుటలో సంగతి యెట్లో తెలియదు. గ్రామ్యభాష కాక శిష్ట వ్యవహారభాషయే దేశభాష యని చిట్టచివర 348 వ పొరటలోఁ జెప్పి యుండియు, మాలమాట యైనను, మాదిగమాట యైనను వాడికలో నున్నఁ జాలు ననినారే. ఇట్టియసంగతి గ్రంథమునందు సర్వత్ర గలదు.

వీరియనుశాసనము వ్యావహారికాంధ్రమునకుఁ గాని గ్రామ్యభాషకుఁ గా దని యిందుఁ బెక్కుతావులఁ దెలిపి యున్నారు. వ్యావహారికాంధ్రమే 'జీవద్భాష' యనినారు. జీవించుచున్న భాష యని దీనికర్థము. గ్రామ్యభాష యెట్టిదో 348 వ పుటమొదలు గ్రంథాంతమువఱకు నిర్వచించియున్నారు. అది వీరికిని బరిహార్యమే యనినారు. అట్లనియు ముఖబంధనమున "గ్రామ్య మన్న నేల కటకటఁ బడుదురు?" అని యడుగుచున్నారు. ఇయ్యది పారిభాషికంపుఁబదమఁట. తుదిని జెప్పిన దిది యగునో కాదో! తాము వాడవలె నన్నది గ్రామ్యము కాదఁట, గ్రామ్యభాషయు వీరే కాని యింక నెవరును బనికిరా దనఁగూడ దఁట. వీరు చూపిన సంస్కారము గ్రామ్యభాషకుఁ గా దని కాఁబోలును. కాకపోవచ్చును. కూకో, కూకుని, మొదలగు పదములు గ్రామ్యము లని తెగడుటకు వీరికి మాత్ర మధికార మెచటనుండి వచ్చినదో తెలియదు. కూకో అని వాడుకొనువారిలో నెవఁడేని 'గ్రామ్య' మన్న నేల కటకటఁ బడుదురు? అని వీరినే యడిగిన వీ రేమందురు? ఎవరిదో గ్రామ్యమని పూర్వులు నిందింప గ్రామ్యము వాడని వీరి కీబాధ యెందులకు? గ్రామ్యమో యగ్రామ్యమో లోకము నిర్ణయింపవలసినదే కాని యెవరి నెవరు తిట్టినను లాభమేమి?

మొత్తముమీఁద ముఖబంధనపద్యములలోని సారాంశము:—
శాస్త్రకారులు పూర్ణముగ శాసింపఁజాలకపోయిరి. కావునఁ గవులప

లుకు గ్రామ్యమగుఁ గాక యగ్రామ్యమగుఁ గాక! గ్రామ్యమే కాని త్యా
జ్యముకాదని, మాకును గ్రామ్యము త్యాజ్యమే యని కడపట విశద మొన
ర్చియు, నచట నీరీతి వ్రాయుటలో వీరియూహ తెలియరాకున్నది. కవి ప
ద్యమందు గ్రామ్యము వాడినచో వ్యావహారికాంధ్రమై, జీవద్భాషయగుచుం
డు నని వీరిసిద్ధాంతము. ఛందోబద్ధమగునేని గ్రామ్యపదమునకును గ్రామ్య
తాదోషము తొలంగుననివీరిమతము. కాని కవి వాడని యగ్రామ్యపద మొ
కటియుమిగులనివిధముననే కవి వాడనిగ్రామ్యపదమును నొకటియు మిగు
ల దేమో యనిపించుచున్నది. చాలనీ(జల్లెడ)న్యాయమున వ్యాకరణము
కవిప్రయుక్త పదములలోని సుశబ్దాపశబ్దములనే వేర్పఱచి రసమును గా
పాడయత్నించునది. అట్టిరసభంజకశబ్దములను నెంతటివాఁడు ప్రయోగించి
నను నిరోధించునే కాని జనులు మాటాడుకొనుచుండు నానాముఖప్ర
త్యయవిశిష్ట మగుభాషను గూర్చి యేమియు ననఁజాలదు. వ్యావహారిక
భాషయందు రసాస్వాదమునకుఁ దావులేమి-తత్సంస్కార మశక్యముగాన
దానింగూర్చి వ్యాకరణము తలపెట్టదు. ఎవ్వఁడేని యొకకవి భ్రమప్ర
మాదవశుఁడై పద్యమున నొకయపశబ్దము వాఁడినచో నాంధ్రవ్యాక
రణ మంగీకరింపవలసినదే యనుట న్యాయ్యమా? సంస్కృతపదములకు
ను వీ రీగతియే కల్పింతురు కాఁబోలును. దానిని గూర్చి యిం దేదియు
బ్రసంగింపఁ బడలేదు. కాని వీరిమతము ననుసరించి సంస్కృతమునకు
ను నిట్టిస్థితియే రావచ్చును. అట్లు వచ్చినఁ గాని బాలకవులు భయము
వదలి యథేష్టముగాఁ గవిత్వము చెప్పఁజాలరు. కావున వీరీవ్యాకరణము
రచించుట భాష కేవ్యాకరణమును నక్కఱ లేదనుటయే యనవచ్చును.
వైయాకరణులు తప్పని యెత్తిచూపిన పదముల కన్నిటికిని బూర్వోత్త
రాంధ్రకవులం దెచటనో యొకచోటఁ బ్రయోగము చూపి, బాలకవు
లారా! వ్యాకరణభీతి వల దని యీశరణ్యము సార్థకతఁ గాంచుచున్నది.
ఇట్టి యీ గ్రంథమును గూర్చి తెలుపుచు సంపాదకులుగూడ లక్షణకర్త
లను లక్షణములను జేతనైనంతవఱకుఁ దూలనాడుటయేకాక ఉత్త
రాంధ్రకవులు ఎట్లు స్వతంత్రించి స్వేచ్ఛగా ప్రయోగించినారో బుజువు

చేయడమువల్ల ఇప్పటికవులు తమకు సుపరిచితమైన భాషయథేష్టము
గా వాడుకొని సరసకావ్యములు రచించుటకు ఉత్సాహముకలుగుతుం
ది. అని యేయనుశాసనము నక్కఱ లేకయే యథేష్టముగావ్యవహరిం
పవచ్చు ననినారు. గ్రంథకర్తచేఁ బేర్కొనఁబడినట్టియు, సంపాదకులచే నా
మోదింపఁబడినట్టియు నాయుత్తరాంధ్రకవులను గూర్చి ముందువ్యాస
మునఁ గొంచెము పరిశీలింతము.

---

## పాల్కురికిపాత్రసృష్టి.

—యామిజాల పద్మనాభస్వామిగారు- విజయనగరము.—

---

పాంచభౌతిక మగుతత్త్వమును సూక్ష్మముగఁ బాఠకులకు బోధిం
చువారిలో నగ్రతాంబూలము పాల్కురికి సోమనాథునకే సర్వాంధ్ర
ప్రపంచము నర్పింపవలసియున్నది. వాఙ్మనసగోచర మగుహృదయతత్త్వ
మును విపులముగ గోచరింపఁజేయుశక్తి సోమనకు వెన్నతోఁ నలవడిన
విద్య యనఁ దగు. గురూపదేశమున కకుంఠితత్వమును, అప్రమాణవస్తు
వునకుఁ బ్రామాణ్యమును నాపాదించుట సోమనకుఁ జిన్ననాఁటియుగ్గు
పోఁత. మతము వీరశైవమే యైనను బాత్రసృష్టి సర్వజనసమాదర
ణీయ మనుటకు విప్రతిపత్తి కలుగనేరదు. దానికి జానుఁదెనుఁగుపైఁ
గలయభిమానము వర్ణనీయము. అందును ద్విపదరచన గణనీయము.
దానను ఛందస్స్వాతంత్ర్యము ప్రశంసనీయము. మనోహరణీయ మగు
పలుకుతోఁ బ్రతిభను బ్రకటించుకొనుచుఁ బాత్రతత్త్వమును బాఠకుని
కందిచ్చుట యెన్నినచోఁ గవిబ్రహ్మ యీతనితెక్కలో ద్వితీయుఁడు.

కేవలశాస్త్రాభ్యాసవశంవద మగుసంస్కారముచే లౌకికజ్ఞాన మల
వడినను హృదయరంజకత్వమును బాత్రాధీనకర్మాచరణత్వమును నలవడ
వనుట యీతనివలను గాదు. గడుసుఁదనము నేర్చుకొను విద్య కాదు.
వైదికజడుఁ డనిప్రసిద్ధి కెక్కినభారతసంహితారచనబంధురుఁడే పాత్ర

రచనములో నాంధ్రులకు మొదటివాఁడై యాంధ్రకవులకుఁ బ్రథముఁడై పదునొకండవశతాబ్దిమొదలుకొని నేఁటివఱకును స్మృతమును నేర్చికొని యాంధ్రతత్త్వముఁ దెలిసిన ప్రతిపండితునిచేత ను గీర్తింపఁబడుచుండ నాతని తరువాత రెండువందలయేండ్లనాఁటిసోమనాథునింగూర్చి నే నననేల ?

భూగర్భమున నడఁగి యున్నంతకాలమును రత్నమునకు వన్నె రానేరదుగదా ! బసవపురాణమునకు జననకాలమందే యాంధ్రదేశమున వీరశైవేతరమతాభినివిష్టపండితమ్మన్యులవలనఁ బ్రచారనిరోధము కల్గిన దనుటకు నాఁటినుండి నేఁటివఱకు నేకచ్ఛత్రాధిపత్యముగ సంఘరాజ్యము నేలుచున్న యద్వైతమతచక్రవర్తియే సాక్షి. బసవపురాణమున నేమి? అది యెవరు రచించిరి? ఏనాఁటిది? అని ప్రశ్నించునాంధ్రుల నెందఱినో నే నెఱుంగుదును. భారత మట్టియపకీర్తిపాల్పడ లేదు. "ప్రకృత మనుసరామః!"

ఈతనికథలలోఁ జాలవఱకు మాహాత్మ్యమే పొడసూపును. అమాయిక మగువిశుద్ధభక్తిని బ్రకటించుటలో సోమనాథుఁ డందెవేసినచేయి. ఆయాస్థలములఁ జల్లఁగా జాలువార్చినముద్దుపలుకులు సుధావర్షమును గురియుచు నవస్థాంతరమునఁ గన్నీటిజడివానఁ గురిపించు ననుట యతిశయోక్తి కానేరదు. మతమునం దాతని యభినివేశము కూడ నట్టిదియే. ఆతనిమతముం గూర్చి నేను వ్రాసిన "పాల్కురికి మతరహస్యము" అను వ్యాసము చదివినచో నయ్యది తెలియఁగలదు. ఆతనిపాత్రములు వందలకొలంది యేండ్లును పూండ్లును గడచినను సజీవములు. ప్రాచీనాంధ్రవాఙ్మయపారిశ్రామికుల కది విదితచరమే యని నాయూహ. భక్తునకును, భగవంతునకును, దల్లికిని బిల్లకును గలసంబంధ మెఱుంగవలె నన్నఁ బాల్కురికి పాత్రలు మనకే కాకు విధిసృష్టికే యాచార్యపాత్రము లగు నంట కబ్బుర మంద నక్కఱలేదు. ఒండు రెండు పాత్రములను నాయోపిన కొలంది విమర్శించి పాఠకులయెదుట నిల్పుచున్నాఁడను. దోషములను, అసామర్థ్యమును నాకే విడిచి మన్నింతురుగాత యని పాఠకలోకమునకుఁ బ్రణతులు.

కన్నప్ప:—ముగ్ధభక్తులలో మొదట లెక్కింపఁ దగినవాఁడు కన్నప్ప. పుట్టినది యెఱుకుకుల మైనను మెట్టినది యూర్ధ్వరాస్థానము, పట్టినది శ్రీకంఠపదము. కలఁగని నిక్కలగా భావించి, వేఁట విడిచి లింగదేవుని దర్శించినాఁడు. ఇఁక నాతని పరివేదనమో? "జడలకు నొడలికి సవతులు పోర, నుడుపఁ జాలక వచ్చి యడవిఁ జొచ్చితివా? లేక నాతోడి మోహంబునన నన్నుఁ బ్రోవ, నేతెంచితో వేడ్క మెసఁగ నిచ్చటికి?" అని శివుని బలుకరించినాఁడు. ఎంతలో నెంతమార్పు!! కొండలలోన నొక్కండవ వీవిట్టు లుండంగ వెఱవవా? ఖండేందుమౌళి! మృగములు నురగముల్ మితి మేఱ లేవు" అని పాప మాజుంజురుజుట్టువాఁడు రోదింప నారంభించినాఁడు. శివుఁడు మృగహంత యనియు, నురగభూషణుఁ డనియుఁ గన్నప్ప విమర్శింపలేదు. తా నొకపరిపాలకుఁడ ననియు, శివుఁడు పరిపాల్యుఁ డనియు నాతనియూహ. ఇప్పపూవు తేనె యిచ్చెద మాపల్లెకు రమ్మని మొఱ్ఱ పెట్టినాఁడు. ఆఱాయి చలింపలేదు. తుద కక్కడే యుపచారములు చేయ నారంభించినాఁడు. ఇంపారి, నునుపారి, కంపుసొంపారి, పెంపారి చాల నొప్పెడిబిల్వపత్త్రిని దనజుంజురువెండ్రుకసజ్జలోఁ దాల్చి, మొగలేటిసదమలోదకములను, బుక్కిళ్ళఁ బట్టి దాపలికరమునఁ జాపము, శరములును, వలచేతఁ దా రుచిచూచి తెచ్చినమాంసపుదొన్నెను బట్టి కన్నప్పఁ డేతెంచుచున్నాఁడు. ఆయెఱుకును జూడుఁడు. చెప్పుకాలితో శివునితల తుడిచి, పుక్కిటినీట మజ్జనం బొర్చుచున్న యాకిరాతముగ్ధుని గాంచుఁడు. తనతలపై నున్న పత్త్రిని శివుని తలపై రాల్చుచున్న యా యర్చకుని నాహ్వానించుదమా? శబరివలెఁ జవి చూచి తెచ్చినమాంసమును నివేదించుచున్న యాపూజారిని బరికింపుఁడు. గుణదోషవిచారణము కావించుట కిది యదను కాదు. మానసికప్రవృత్తి పరిశీలనమే మనకు వలయును. శిల్పము భక్తిరాగముతో బాగుగఁ బూయఁబడుచుండుట సోమన్నలో నొకయద్భుతముదావహకళానర్తనము. కన్నప్ప కృతార్థుఁ డయినాఁడు. ఊడ్పాళ్ళపై భక్తికల పూజారి కాఁడు. డాంబికకృత్యములతో జేగంటలు వాయించునట్టి యీబాహ్యప్రపంచదార్జన్యము

కన్నని ముగ్ధనయన బాష్పవారాశిలోఁ దొప్పదోఁగించినను ముక్తి నొంద
నేరదు. ఆపైఁ గన్నప్ప శోకవిషమఘట్టము సమీపించినది. ఏ మది ?
ఉవ్వెత్తుగా శివునికంట నీరు కాఱుచున్న దేలొకో ? మ హేభక్తుఁ డేని
నైనచో నే "జేమ్ను" నారికేళాంజనమో శివునికణతలకు రుద్దువాఁడే.
మాకన్నప్ప యేమిచేయునో చూడుఁడు. నాయనా ! "నీనింద విని గౌరి
నీ వైననాఁడు తా నించు కేనియుఁ దడి కంట లేదు, జనకుచేఁ దన
యునిఁ దునిమించునపుడు కనికరంబున నీరు గ్రమ్మదు కంట; ఆలుబిడ్డలఁ
బాసియడవుల గిరులపా లైతి నని దుఃఖపడి యేడిచెదవా ? ఏకాకి నైతి
నిం కేక్రియఁ బ్రోతు లోకంబు లని ధృతి లేక యేడ్చెదవా" అని తా
నును గన్నీటమున్నీట మునుకలు వైచుచు నడుగవలసిన విధముగా నడి
గియే తీఱినాఁడు. "కడుపు కాలంగ నాఁకటి కోర్వలేక యేడ్చుచున్నా
వా" యని తోఁ గారణ మెఱుంగ లేక "కారణం బేమి కన్గంట పుట్టిం
డు నీరు కాఱంగ" నని పలవించుచున్నాఁడు. పాపము నిజముగాఁ గార
ణము చెప్పినచోఁ దీర్చెద ననియే కన్నవానియుద్దేశము. కరతలాంగుళ
ములఁ గ న్నొత్తి నెఱ సున్న దని పాఱ నిష్ఠించి యూఁదినాఁడు. నాలు
క గుడ్డుపైఁ ద్రిప్పిత్రిప్పి యొరయుచు నొరయుచు నొయ్యనఁ జూచుచు
న్నాఁడు చీరావిచే కన్నద్దినాఁడు. కంటికిఁ జేయఁ దగినయుపచారప్రక
రణము నిష్ఫలముగా ముగిసినది. ఏప్రమథు లింతపిచ్చిపడఁగలరు ? ఇది
భక్తునివిధి. ఇఁకఁ జేయవలసిన దేమి? ఆఁగ లేక నెట్టన దుఃఖించు, బిట్టు
వాచఱచు, మనోనయనములను జెదరనీయక కన్నప్పస్థితిఁ గమ
నింపుఁడు. భావపరివర్తనముతో సోమనాథుఁడు మనల నెక్కడికో లాగు
కొనిపోవుచున్నాఁడు. అడుగులఁ బడి మ్రొక్కు, అంజలి యొగ్గు, అడలు,
నిల్చును, నిల్వఁబడి లేచు, చూచును. విద్యుచ్ఛక్తివలె నింద్రియవ్యాపా
రము గాయేన, వాచా, మనసా, నిర్వంచకముగ నడచుచున్నది. పౌర
కప్పెనో? మాద తెవులో? రోగములపే రెఱుఁగును గాని ప్రతిక్రియ
యెఱుఁగఁడు. "ఏనికి మందు మాకే నే మెఱుంగ నోయీ నాథా !
సర్వాంగసుందరా ! శంకరా ! నాయన్నా ! నాతండ్రీ ! నాసఖుఁడా !"

యని నో రెత్తి యానిర్ఘృణ మగునటవీగర్భము మార్మ్రోఁగ, నారాయి
దగ్గఱ విలపించుచున్నాఁడు. ఆతని యెడంద యెంత కుతకుతమని యుడి
కిపోవుచున్నదో గదా ? అంతలోఁ జిన్నయలుక- "కురూపివై యున్న
చో భక్తులిహీ యని నవ్వరా" యనుచున్నాఁడు. భగవంతునిపై భక్తుఁ
డలుగుటయు నాతని కొక చెలువమే.

అదృష్టవంతులకు నిముసములోఁ దనంతటఁ దాను క్రొత్తదారి
ఫలసిద్ధికి లభించును. యోగు లట్టివారు. ప్రపంచపరిస్థితి యెప్పుడైనను
బాంచభౌతికమే. తత్పాశభేదనము పుణ్యభాక్కులకుఁ ద్రుటిలో సాధ్య
మగును. సర్వమునకు నాథుఁడు శివుఁ డనియును, నంతయు నతనికర్పిం
చినచో ముక్తి నాతఁడే సుకరముగ నర్పించు ననియును కన్నప్ప మన
స్సులో నంతర్వాహినిగఁ బ్రవహించుచున్న యొకక్రొత్తపొంగు, చరాలు
నఁ గంటిని గోయించినది. అయ్యది శివునికంట నతికినాఁడు. మ తేము
న్నది, కన్నప్ప కృతకృత్యుఁ డైనాఁడు. కాని యాకంట నీరు గాఱుచున్న
ది. దానికి నట్టే ద్వితీయనయనప్రదాన మైనది. ఇంతతో నుమాకాంతు
నకు సర్వేంద్రియతర్పణ మైనది. కన్నప్పకు నాపాదశిరఃపర్యంతము
బాహ్యాంతరజగతీశాంతి చేకూరినది. ఇంతచేసినఁ గాని శివునికి జాలికలు
గలేదు. కాలి చెప్పుతోఁ దల తుడిచినదానికిని, నోటినీటితో స్నాన
మాడించినదానికిని, దనతలమీఁదిపూలతోఁ బూజించినదానికిని, నెంగిలి
మాంసము నివేదించినదానికిని శిక్ష యిది కాని, యాశీనముగా శివు
నకుఁ గాళహస్తిలోఁ గన్నప్పనిర్మాల్యమే ప్రథమపూజాపుష్పము. కన్నని
యెంగిలిప్రసాదమే నివేదనీయము. ఆతఁడు భక్తుఁడు, ముగ్ధుఁడు. ఈ
తఁడు గడసరి, లింగదేవుఁడు. భక్తపరాధీనుఁ డంటకు మాత్రము సంది
యము లేదు. అక్కతననే బెజ్జమహాదేవికడ పాలపోఁతలు, బాలభోగము,
ననుభవించినాఁడు.

---

# ఉత్తరాపరిణయము

—కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ.—

---

తిక్కనార్యుఁడు వైరాటమున నుత్తరాపరిణయమును లోకోత్తరముగాఁ జిత్రించె ననియు, నట్టి విన్నాణమును నన్నపార్యుఁడు ద్రౌపదీపాణిగ్రహణరంగమునఁ బ్రదర్శింప నేరఁడాయె ననియు, నుత్తరావివాహవర్ణనవైభవము నాటకకలాశోభితమై తనరారుచున్న దనియు యాజ్ఞసేనీపరిణయములో నట్టిదృశ్యకలాసౌందర్యము కానరా దనియుఁ గొందఱు సోదరులు పలుకుచున్నారు

నే నీవాదమునందలి సారము నరయుటకై పరిణయద్వయమును సావధానముగాఁ బఠించితిని. ఇంచుమించుగా నీరెండుపెండ్లిండ్లును నొక్కపక్కనే చిత్రింపఁబడియున్నవి గాని, మనసోదరులు తెలిపినట్లొకటి గగనరంగమునకును వేఱొకటి పాతాళకుహరమునకును బ్రయాణము సేయుటలేదు, సరియకదా ! ఉత్తరావివాహమున విమర్శనమున కవకాశమొసంగు విషయములు చూపట్టుచున్నవి. కావునఁ దిక్కనకవివిరచిత మగు నుత్తరాపరిణయమును గూర్చి కొంచెము చర్చింప నెంచితిని. సోదరులాదరభావముతోఁ బరీక్షింతురుగావుత !

—అనవసరవిషయకల్పనము.—

తిక్కనసోమయాజి యుత్తరాపరిణయఘట్టమున మొట్టమొదట విరటుఁడు పాండవులనిజస్థితిని దెలిసికొని, సంతుష్టాంతరంగుఁడై స్వతనయను విజయున కిచ్చి, గౌరవింప నెంచి మంత్రులతోఁ గుమారిక నలంకరించుకొని తెండని, నియోగింపఁ బ్రియంబునం జని తత్కార్యశ్రవణప్రీత యగు సుదేష్ణయనుమతంబున నుత్తరను సింగారింపఁజేసి, యయ్యమాత్యులు విరటునికడకుఁ దోడ్కొనివచ్చిరి. అపుడా రాజకన్నియ కెదురువోయి పురోహితులును బంధుజనంబులుం దానునుం బొదివికొని ధర్మజున కెదుట నిలిపి, నిజతనూజం జూపి, ఇమ్ముద్దియను గాండీవి కీయఁదలంచితి నన, విజయుఁ డాయువతిని బరిగ్రహింప నొల్లక. తత్తన

యున కిమ్మని తెలిపెను. అంత మత్స్యమహీకాంతుం డత్యంతసంతు
ష్టాంతరంగుం డై యుత్తరచేఁ బంచపాండవులకుఁ గ్రమముగా మ్రొక్కిం
చి, యాయువతి నంతఃపురమునకుఁ బంపె నని యున్నది.

అస లీభాగము వ్యాసభారతమున లేదు. ఈయది తిక్కకవివరు
నిచేఁ గ్రొత్తగా సృష్టింపఁబడినది. అందు లేకున్నను బసందుగా నుండు
టచే దీసి నిందుఁ బొందుపఱచె నందుమా! అట్టియంద మేదియుఁ బొ
డకట్టుట లేదు. పైఁగా నీకల్పన మనవసరప్రసంగముగాఁ జూపట్టుచున్న
ది కాని వస్తుపోషక మగుసంగతిగాఁ గన్పట్టుట లేదు.

ఉత్తరను గిరీటికిఁ జూపిన మోహితుఁ డగు నని, యాపేఁడు త
లంచె నందునా! సంవత్సరకాలము నృత్యము నేర్పిన కివ్వడి కుత్తర
క్రొత్తది యగునా? ధర్మరాజాదులకుఁ జూప నెంచె నందుమా? వా
రాయిందుముఖియందము నింతకుముందు బహువారము కన్నులారఁ
గాంచినవారె. కావున నుత్తర నిటకు రప్పించుట వట్టితత్తఱపాటు కాని
మఱెట్టి ప్రాశస్త్యమును గానరాదు.

ఇదియుంగాక రాజాంతఃపురముల నుండు యువతులను ముస్తా
బుచేసి, ముత్తయిదువలో లేక కులపరిచారికలో తోడ్కొని వత్తురు
గాని, మంత్రిపుంగవులు పిలిచికొని వత్తురా? మత్స్యదేశమున నృపాల
కన్యకల మంత్రు లలంకరింపఁజేసి రాజసభకుఁ దోడ్కొనివచ్చుట మర్యా
దయై యుండునా? ఇఁక నొకవింత- మంత్రు లాసుదతినిఁ దోడ్కొని
వచ్చిరే కాని తిరుగఁ దీసికొని వెళ్ళలేదు. పాండవానుజ్ఞాత యై యుత్తర
రాజసభనుండి సపరివారముగ వెడలిపోయెను. తీసికొనివచ్చునపు డాద
రమును, బంపునప్పు డనాదరమును సొంపుగా నుండునా?

అంతఃపురయువతుల నలంకరించుటయు, వివాహమండపములకుఁ
గొనివచ్చుటయు రాణివాసపుఁ జేడియలపని కాని రాజకార్యాసనాసీను
లగునమాత్యసింహులపని కాదు. కాని యమాత్యకులాలంకారుఁ డగు
కవివరుఁడు రాణివాసంపుఁదీఁగఁబోఁడుల సింగారింపఁజేసి మంత్రులురచ్చ
కుఁ దోడ్తెచ్చి రని తెలుపుచుండ వేఱువితర్కములతోఁ బనిలేదు.

శిరీషసుమసమశరీర యగు పూఁబోఁడిని దీసికొనివచ్చుటకుఁ బ్రజ్ఞ గల యొక్కప్రెగ్గడ వెడలినఁ జాలదా ? మంత్రివరు లందఱుఁ బయిగిడ నేల ? మంత్రు లనఁ బ్రభుతుల్యు లగు నుద్యోగులు గాని పల్లకిని మోయుబోయీలు కారే ? మఱి వీ రంద ఱెందులకుఁ బోయిరో ?

నన్నపార్యుఁడు కన్య కానయనమును మంత్రులశిరమున నిడలేదు. నిపుణ లగు నలివేణులతలలపయి నిడినాఁడు. "అధికవిదగ్ధపుణ్యాంగనావిరచితలలితప్రసాధనాలంకృతాంగి కాంతాసహస్రంబుతోఁ జనుదెంచె" అని తెలిపినాఁడు. దీనింబట్టి చూడ మాత్స్యామాత్యులవలెఁ బాంచాలమంత్రులు రాణివాసముల కేఁగి ప్రౌఢకన్యలఁ దోడ్కొని వచ్చుట కంగీకరింప రేమో ?

తిక్కనసోమయాజి మొదట నుత్తరను మంత్రులు సభకుఁ దోడ్కొనివచ్చినట్లు తెలిపి, మంత్రివరుల కావని యర్హముకా దని తలంచి కాఁబోలు, పాణిగ్రహణసమయమున నాకన్యామణి నలంకరించి తీసికొనివచ్చుటకు విరటుఁ డుదాత్తాభరణాదివస్తుతతి యొసంగి, చెలికత్తియలఁ బుచ్చె నని వాక్రుచ్చెను గాని మొదటియట్లు మంత్రులను బంపినట్లు వర్ణింపలేదు. అపు డుత్తరను దోడ్తెచ్చుటకు నమాత్యుల నంపిన విరటుఁ డిపు డేల చెలికత్తియుల నంపెనో తెలియకున్నది ? ఉదాత్తాభరణాదివస్తుతతి నీయవలసియుండుటచే మంత్రుల విశ్వసింపకయా యీ చెలికత్తియలఁ బంపుట ?

ఉత్తచేతులతో నుత్తరకడకు సచివోత్తముల నంపి, అమూల్యాభరణములతోఁ జెలికత్తియల నంపుట యెట్టిమర్యాదయో ! ఇందు వైదికదృష్టి కగోచర మగుకావ్యకలయో నాటకకలయో లీనమైయుండును.

——అమంగళపదప్రయోగము.——

పదౌచిత్యమర్యాదల నెఱింగిన కవివరులు కళ్యాణసమయమున శుభదము లగుపదముల వాడుదురే కాని పైతృకకర్మలందు వాడఁదగిన నుడువుల నిడరు. ఏకారణముననో కాని యీతిక్కనమఖి యుత్తరాకళ్యాణములో సాంవత్సరికపదమును బెట్టెను, చూడుఁడు:-"సాంవత్సరికదత్తక్షణ

లకళావిశేషంబుల మంగళతూర్యంబులు సెలంగ నత్తెర యెత్తించి-" ఇటఁ బ్రదర్శింపఁబడిన కార్య మెద్ది యన వధూవరుల నడుమ తెరను దీసివేయుట. ఈచిన్నపనిని వర్ణించుటకు సాంవత్సరికపదసౌభాగ్యసుందరమగు నొకదీర్ఘవాక్యము ప్రకటీకరింపఁ బడినది.

ఇప్పట్టున నింతటి దీర్ఘవాక్య మెందులకు ? "మంగళతూర్యంబులు సెలంగ నత్తెర యెత్తించిన" అనిన మంగళముగా నుండునే ? అపుడీసాంవత్సరికకార్య మెత్తిగిలునే ? పోనీ, ఈసాంవత్సరిక మేదియేనియ పూర్వభావసౌభాగ్యమును గాని, మనోహరశ్లేషార్థసంపదను గాని సమకూర్చుటకు వాడఁబడిన దందుమా ? అట్టిరుచిరార్థసంపద యేదియుస్ఫురించుట లేదు.

ఇఁక నీసాంవత్సరికపదలలిత మగు సమాసరాజమున కర్థమునుఁ జూతము. ఈపదమునకుఁ గల లోకప్రసిద్ధార్థమును బట్టి చూచినచో నిట్టియర్థము తేలును:—సాంవత్సరిక=ఆబ్దికమునందు; దత్త=ఈయఁబడిన; కాల=నల్లని; కళా=పదియాఱవభాగముయొక్క (అనఁగా, అణాకాసుయొక్క) విశేషంబుల=అతిశయములచే నని యర్థ మేర్పడును. ఇఁకఁ బ్రకృతశుభకార్యమున కనుకూలముగా సాంవత్సరికపదము నన్వయించుచో, సాంవత్సరిక=కాలజ్ఞులచే; దత్త=ఉంచఁబడిన; కాల=ముహూర్తమునందలి; కళా=శోభయొక్క, విశేషంబుల=అతిశయముల, అని యర్థము చెప్పవలయును. ఈయర్థమున సాంవత్సరికపదమునకు జ్యోతిషికుఁడనికదా యర్థము చెప్పవలయును ? కాని శబ్దవ్యుత్పత్తిచే నట్టియర్థము రానేరదు. 'సంవత్సరే భవః సాంవత్సరికః' భవార్థమున ఠఞ్ ప్రత్యయము. అందుచే నీపదము సంవత్సరాంతమున జరుగు పితృకర్మను దెలుపును గాని 'సంవత్సరం వేత్తీతి సాంవత్సరికః' అని జ్ఞానార్థమున వచ్చు అణ్ ప్రత్యయాంత మగుశబ్దము కాదు. అందువలన సాంవత్సరికపదమునకుఁ దద్దిన మర్థ మగును గాని సిద్ధాంతి బోధితుఁడు కాఁడు.

సాంవత్సర పదమునకు దైవజ్ఞుఁ డనునర్థము కలదు. "సాంవత్సరో జ్యోతిషికో దైవజ్ఞగణకావపి" అని యమరసింహుఁడు, దైవజ్ఞ

పర్యాయములలో సాంవత్సరకపదమును జేర్చియున్నాఁడు, గాని, సాంవత్సరికపదమును జేర్చి యుండలేదు. ఏదో యతిప్రయాసముచే నీసాంవత్సరికపదమునకు దైవజ్ఞార్థమును సాధించినను, ఆపదమునకు లోకమునఁ గలప్రసిద్ధార్థమును నివారింప శక్యము కాదు. లోకవ్యవహారప్రసిద్ధములగుపదముల యౌగికార్థము నాధారముగాఁ జేసికొని, ప్రకరణవిరుద్ధముగాఁ బ్రయోగింపరాదు. శ్రాద్ధ మన నుత్పత్త్యర్థముచే శ్రద్ధతోఁ జేయఁబడుకార్యము. కాని యీపదము పైతృకకర్మలయందే ప్రసిద్ధమగుటచే నిద్దాని నాబ్దికాదిపితృకర్మలయందే వాడనగును గాని శ్రద్ధతో నాచరించుకార్యములయం దంతటను వినియోగింపరాదు. అందువలన "వివాహశ్రాద్ధకాలదత్త మంగళతూర్యనాదంబులు చెలంగ" ననుట యమంగళావహము. అటులే సాంవత్సరికపదమును శుభసమయమునఁ బ్రయోగింపరాదు. సాంవత్సరికపదమునకు వాచస్పత్యమున నిట్లర్థ మీయఁబడినది. "సాంవత్సరికః=ప్రతివర్షం మృతాహకర్తవ్యే శ్రాద్ధభేదే" అని. శబ్దరత్నాకర మిట్లు తెలుపుచున్నది. సాంవత్సరిక=ఆబ్దికము, సంవత్సరాంతమున జరుగునది" అని.

పరిశీలింప నిట సాంవత్సరికపద మవసరము లేదు ఇంతకుము న్నీకవిసింహుఁడు "మాహూర్తికాదిశిష్టజనులు పరివేష్టింప నుండి లగ్నం బాసన్నం బగుచు వచ్చె నని ధర్మరాజున కెఱింగింపఁ బంచిన" నని సుముహూర్తము సమీపించినట్లు తెలిపియుఁ దిరుగ నీసాంవత్సరికకాలవివరణ మెందులకొనర్చెనో వెల్లడి యగుట లేదు.

మంగళపదసంపదలఁ దళుకొత్తింప ననువగు కళ్యాణసమయమున నశివార్థస్ఫోరకము లగుశబ్దముల నిడఁదగునా ? కాని మఱతిక్కనమంత్రిపుంగవుఁ డుత్తరకరమును సౌభద్రుఁడు గ్రహించె నన్నతావునఁ బ్రయోగించిన పదము కూడఁ గొంచె మశుభావహముగాఁ జూపట్టుచున్నది. "కుమారుఁడు తీగఁబోఁడిమృదుపాణిగ్రహించె." ఇటఁ బోఁడిపదమంత శ్రీమంతముగా లేదు. బోఁడిపదమునకు లోకములో గుండుకల యని యర్థము ప్రసిద్ధము. "బోడి=ముండితము, ముండిత" అని శబ్దరత్నాకరము. కావు

నఁ బదసన్నికర్షముచే బోఁడిపాణి యన ముండితకర మని బోధపడును. కావునఁ గవివరుఁ డీబోఁడి నుడిని వీడి వే తేలతాంగినైనఁ దోడికొనివచ్చి పెండ్లిపీఁటపైఁ గూర్చుండఁబెట్టి సౌభద్రునిచే నాశుభాంగికరమును బట్టించిన సౌభాగ్యముగా నుండెడిది.

—అసమయశృంగారభావవర్ణనము.—

ఈవివాహమున వే ఱొకవింత చూపట్టుచున్నది. ప్రధానహోమసమయమునం దుత్తరాభిమన్యు లొత్తుకొనుచు నొక్కపీఁటపైఁ గూర్చుండి నెఱపిన శృంగారవిలాసవైభవములను బట్టి చూడ వధూవరులు భక్తిశ్రద్ధలతో నగ్నిదేవు నారాధించిన జాడఁ జూడరాదు. శయ్యాగృహమున నొక్కపర్యంకమున నాయికానాయకులు సాగించు సింగారము చూపట్టుచున్నది. వధూవరు లెంతటి ప్రణయోద్రేకము కలవారైనను వ్రతసమయముల స్థిరమతులై భక్తితో నుండవలయును గాని రతిపతిమోహపరవశులై శృంగారకలాకలాపముఁ బ్రకటింపఁ జనదు. వినుఁడా హోమసమయశృంగారంపు హొయలు:—

సీ. కోర్కులుగెడగూడుకొని పారమెద్దిన చిత్తంబులూటఁజిగుళ్లులొత్తఁ
బులకాంకురములకుఁదలతాఁకుడై యిరుమేననుమవ్వంబుమిగిలిపొదలఁ
దఱివేచినంబోయి తడఁబడి మూర్తివడి మాపు లాదట బయలుపఱుపఁ
జెమటలతావులు తమలోనఁగలసి వేఱొక్కసౌరభమునై చొక్కసేయ

తే. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి
హోమసమయకృత్యంబుల నొదవుసౌఖ్య
రసము పెన్నిట్ట పొరిఁ బొరిఁ గ్రమ్ముదేర
సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు.

ఇది వధూవరులకుఁ బ్రధానహోమసమయమున నడచిన కర్కశలాపకళాసౌభాగ్యము.

న్యాయముచేఁ బ్రకరణౌచిత్యానుకూలముగా శృంగారంపురంగులం బ్రసరింపఁజేయ వలయును గాని శృంగారవిరుద్ధము లగు దేవతారాధనసమయములఁ గాదు. సత్యనారాయణవ్రతమో, వేంకటేశ్వరదీపా

రాధనమో, సహస్రనామార్చనమో, సాగించునపుడు దంపతు లొత్తి కొని జంటగా నొకపలకపై నున్నమాత్రాన మనోజలీలల వివరింప నర్హమగునా? ఆర్యదంపతుల కత్యంతాదరాచరణీయ మగు ప్రధానహోమ సమయమున వధూవరుల భక్తిశ్రద్ధల వర్ణించుట భావ్యము కాని భావజచేష్టల వివరించుట మర్యాద గాదు. ఈశృంగారకార్యకలావర్ణనముచే వధూవరులు ధీరోదాత్తు లగు నాయికానాయకులు కారనియు దేశకాల పాత్రౌచిత్యము నెఱుంగని మూఢ కాముకు లనియు విదితమగును. పోనీ యటులే తలంతు మన్న మున్ను తిక్కనపండితుఁడు వర్ణించిన యభిమన్యు గుణవర్ణనవైభవము నమ్మగును-వినుఁడు:—

"మ. హరిమేనల్లుఁడు బాహువీర్యకటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరుఁ డాచారపవిత్రుఁ డంచితకళాదక్షుం డుదారుండు గా
తరసంరక్షకుఁ డార్యసమ్మతుఁడు విద్యావైభవోల్లాసి య
త్యురు తేజుండు వరించుఁగాక యభిమన్యుం డీసరోజాననన్."

ఈవర్ణనమున నభిమన్యుఁడు చలచిత్తుఁడు కాఁడనియు, నాచార పవిత్రుఁడనియు, నార్యసమ్మతుఁ డనియుఁ బైఁగాఁ గాతరసంరక్షకుఁ డని యుఁ గీర్తింపఁబడినాఁడు. అట్టిధీరుఁ డంతటిమర్యాదాకోవిదుఁడు, నటువంటి యార్యసమ్మతుఁడు భక్తితో నగ్నిదేవు నారాధింపవలసిన పావన హోమసమయమునఁ, దిక్కముఖి వర్ణించినరీతి నాతఁడు నాతిం దాఁకిన మాత్రమున నౌచిత్యదూర మగుచిత్తజవికారమునకు లోనగునా ?

—వివాహవిధిప్రశంస.—

ఈయుత్తరపెండ్లిలో వేఱొక క్రొత్తవింత కానవచ్చెడిని—అ దేదందురా ?

"క. వైదికలౌకికవిధి, సంపాదిత వివిధార్హవస్తుభరితత్వమునన్
వేదికపొలుపగునట్లుగ మోదమునఁబురోహితుండు మునుకొనిచేయన్"

అని మనమంత్రివరుఁడు వైదికలౌకికవిధుల రెంటినిఁ బురోహితున కంటఁగట్టెను. అసలు వివాహసంస్కారము వైదికవిధినిబద్ధమా? లేక లౌకికకార్యసమ్మతమా? గృహ్యసూత్రనిబంధనమునుఁ బట్టి చూడఁ బరి

ణయము వైదికవిధిప్రధానము కాని లౌకికతంత్రప్రధానము కాదు కావు
ననే పురోహితుఁడు వివాహసమయమున నడిపించు కన్యావరణము, కన్యా
దానము, అక్షతారోపణము, కంకణబంధము, ప్రధానహోమము లోన
గు కార్యము లన్నియు వైదికమర్యాదలతో నలరారుచున్నవి.

ఇంకఁ బందిళ్లు వేయుట తోరణములు కట్టుట, లోనగు పనులు
రాజసేవకకృత్యములు. పెండ్లిలెక్కల వ్రాయుట, యాఁగళ్లనుండి బండ
ములఁ గొని తెచ్చుట లోనగు కార్యములు రాజకీయోద్యోగులపనులు.
బంధుమిత్రాదుల నాదరించి విందులు సేయుట, పారితోషికము లొసం
గుట మొదలగు సత్కారములు కన్యాబంధుకృత్యములు ఈలౌకిక కా
ర్యములు పురోహితునకు సంబంధించినవి కావు. కావున వైదికలౌకిక
విధిద్వయమును బురోహితుఁడు సాగించె ననుట తగదు.

వైదిక లౌకికవిధు లన వైదికులయొక్కయు లౌకికులయొక్కయు
విధు లందురా? అట్లగుచో వివాహమున లౌకికులు సేయువిధు లెయ్యవి?
వ్యాసభారతమున నీరీతి విధిద్వయసమ్మేళనము లేదు. "తతో వివాహో
వవృధే మత్స్యపార్థయోః" అని మాత్రము తెలుపఁబడినది. శ్రీకృష్ణ
భారతమునఁ గూడ లౌకికవైదికవిధులు లేవు. "పరిణయోచితవస్తు పరి
కరంబులతోడ" అని తెలుపఁబడియున్నది. పరికింప నిట నీవైదికలౌకికవి
ధి పద్యమే యవసరము లేదు. ఏమందురా? ముందు-
'తే. విహితపరిపాటితో విప్రవృద్ధజనులు, పుణ్యకర్మపరంపరఁ బూనినడప"
అని తెలుపఁబడియుండుటచే-

—: ఉపమానవైపరీత్యము. :—

తిక్కనకవిసార్వభౌముఁడు:—

"తే. చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు
తెఱఁగు దోఁపఁ గెంపారెడు తీఁగఁబోఁడి
మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్ర
హించెఁ బల్లవాలంబి మత్తేభలీల."

అనుపద్యమున నభిమన్యుఁ డుత్తరపాణిపల్లవమును గ్రహియించె

ననుటకు నుపమానముగాఁ జూపిన సాదృశ్య మంత సరసముగా లేదు. "పల్లవాలంబిమత్తేభలీల" అనఁగా మదకరి వల్లీపల్లవము నందికొనినట్లు విజయతనయుఁడు తీఁగఁబోఁడి పాణిపల్లవమును గ్రహించె నని భావము.

ఈయుది యుపమానాభాసము గాని సరియగు నుపమానము కాదు. మత్తేభము లేఁదీఁగ చిగుళ్లఁ దొండముతో మృదువుగా నందికొని, సరసముగా నాస్వాదింపదు. ఆతీఁగను సమూల ముగాడఁబెఱికి, ధ్వంసముసేయును. కావున రసికుఁ డగు వరుఁడు సుకుమారి యగురాకొమారి లేయఱచేతిచిగురును సరసముగాఁ బరిగ్రహించుటకు నుపమింపఁదగదు. మదవారణములు పద్మాకరములఁ జొచ్చియు, నుద్యానవాటికలఁ జొరఁబడియుఁ బద్మినీలతికలను లేఁదీఁగజొంపములను గుదురంట నూడఁబెఱికి నశింపఁజేయు నని కవిసింహులు వర్ణించిరి కాని మదాంధము లగుదంతావళములు లలితలతాసంతతుల సంతోషముతో నందికొని, చాతుర్యముతో ననుభవించినట్లు చిత్రింపలేదు. ఈకవియే కీచకుఁడు ద్రౌపదిని బట్టఁబోవు సమయముఁ జిత్రించిన యుపమానము జూడుఁడు:— "సమదవారణము జంగమలత వెనుకొని సరభసంబునఁ బట్టఁ జనువిధమున—"

మఱియు నిట నుపమాన ముపమేయముతో సరిపోల్చి చూచిన సమాన మగునన్వయానుకూలత గానరాదు. కనుఁడు:—కుమారుఁడు తీఁగఁబోఁడిపాణిపల్లవము గ్రహించెను. ఎట్లు? మత్తేభము లతాపల్లవమును గ్రహించినట్లు, అని తెలుపవలసియుండ నట్లుసేయక "పల్లవాలంబిమత్తేభలీల" యని "పల్లవాలంబి" పదమును మత్తేభమునకు విశేషణముగాఁ జేయుటచే నీపదము విశేష్యముతో నన్వయించి పల్లవమును గ్రహించు మత్తేభము చిగురుచందికొనున ట్లని తిరుగఁ బల్లవమును గర్మనుగాఁ జేకొనవలసివచ్చును. అందుచే నుపమానోపమేయములకుఁ బోలిక సరిపడలేదు.

పాణిపల్లవగ్రాహికుమారుఁడు పల్లవాలంబిమత్తేభమువలె ననిన సరిపోవును. మఱియు నీపద్యమున "గ్రహించె" అనుక్రియకు "మెలపు

మై" అనువిశేషణ మొందుకలదు, మెలపున్మై = మెల్లఁగా - కావున మద పుటేనుఁగు చిగురుటాకును మెల్లగా గ్రహించునట్లు కుమారుఁడు తీఁగఁ బోఁడిపాణిపల్లవమునుఁ జల్లగా గ్రహించె నని, యుపమానసాదృశ్యము ను దెలుపవలయును గదా! ఎన్నఁడేని మదకరీంద్రము చిగురుటాకును సున్నితముగాఁ జేకొనునా? అనన్యసామాన్యకావ్యకలానిర్మాణనిపుణుఁ డగు తిక్కనసోమయాజి ప్రకటించిన పల్లవాలంబి మత్తేభసాదృశ్యము సుకుమారుఁ డగు సుభద్రాకుమారుఁ డొనర్చిన పాణిగ్రహణకృత్యలాలిత్యమునకు వ్యతిరేకముగాఁ జూపట్టుచున్నది, గాని, యనుకూలముగాఁ గానవచ్చుట లేదు. ఉపమాన ముపమేయగుణ సంపదకనుగుణమై యుండవలయును గాని యపగుణమై యుండరాదు. కల్లుపాక మండినట్లు కర్పూరహారతి వెలింగె ననరాదు.

—నాటకకలాదృష్టి.—

ఉత్తరాభివాహము నాటకకళానుకూలముగా వ్రాయఁబడి యున్న దనియు, ప్రౌఢదీపదీపయు మట్టిమూపకపాకమునఁ బడలే దనియుఁ, గొందఱు సోదరులవాదము; కాని, విమర్శింప నీవాద మంతధీమంతముగా లేదు. కవివరులు శ్రవ్యకావ్యముల దృశ్యకళలను, దృశ్యకావ్యముల శ్రవ్యకళలను, గద్యకావ్యములఁ బద్యకళలను బద్యకావ్యముల గద్యకళలను జిత్రింతురా? వాదమునకై సృష్టింతు రనుకొందము; నన్నయకవితలో నాటకకళ లే దనియును, దిక్కయకైతలో నది కల దనియు వాదించుటకుఁ గల హేతువు లెయ్యవి? ఈకవిత్వములు రెండు నేకమర్యాదాపథముననే యేఁగుచున్నవి కాని, భిన్నమార్గమున నడచుట లేదే?

తిక్కన నన్నయవలెనే భారతమును శ్రవ్యకావ్యమును గా రచించెను గాని, దృశ్యప్రబంధమునుగాఁ జిత్రింపలేదు. వినుఁ డీపద్యమును—

"ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొందియుండ నం
దాది దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

అని నన్నయరచనాశైలి నుగ్గడించి పిమ్మటి పర్వములఁ బదియే నింటఁ దెలుఁగుబాస రచియింతు నని తెలుపుటచేఁ దిక్కన నన్నయవలెనే శ్రవ్యకావ్యనిర్మాణమునకుఁ బూనుకొనెను గాని దృశ్యప్రబంధసాంప్రదాయముల వెల్లడించుటకుఁ బ్రయత్నింప లే దని విదిత మగును.

శ్రవ్యకావ్యములయందలి యితివృత్తములఁ దీసికొని కవివరేణ్యులు దృశ్యకావ్యములఁ జిత్రింతురు కాళిదాసుఁడు వ్యాసభారతమునందలి శకుంతలోపాఖ్యానమును జేకొని శాకుంతలనాటకమును వ్రాసెను. అటులే నన్నపార్యుని భారతమునందలి నలోపాఖ్యానమును దీసికొని శ్రీ ధర్మవరము కృష్ణమాచార్యులవారు చిత్రనళీయమను రూపకమును విరచించిరి. కావున నన్నయభారతము నాటకకలావిరహిత మనియుఁ దిక్కనభారతము నాటకకలావిలసిత మనియు, విభాగింపఁ బూనుట పక్షపాతయుత మగుమాట కాని పండితసమ్మత మగు బాట కాదు. ధీశాలి యగు కవివరునకు నాటకకల కానరాని తావు లేదు. మందబుద్ధి కెందును రూపకరూపము గోచరము కాదు.

—వివాహద్వయసామ్యము—

అట ద్రౌపదీపరిణయ మెట్లు వర్ణింపఁబడినదియో యటులనే యిట నుత్తరాపాణిగ్రహణము చిత్రింపఁబడినది, కనుఁడు.

| ద్రౌపదీపరిణయము. | ఉత్తరాపాణిగ్రహణము. |
|---|---|
| కదళీస్తంభములు | మణిస్తంభములు. |
| ఆమ్రాశ్వత్థపల్లవములు | భూరుహపల్లవములు. |
| చందనోదకసిక్తప్రాంగణరంగవల్లీకృతకర్పూరమౌక్తికప్రకరములు | చందనముచేఁ బరిణయాగారమ లికించి ముత్తెపుముగ్గు వెట్టించి. |
| వరాంగనానృత్యము | పుణ్యాంగనాసమూహములు. |
| వేణువీణారవమ్ములు | శంఖ విజయ ఘంటాపణవాది నిక్వణంబులు. |
| సుహృద్బాంధవజనంబులు | సమస్తబంధుజనంబులు. |
| భూసురేంద్రపుణ్యాహములు | వృద్ధజనపుణ్యకర్మసంపదలు. |

| | |
|---|---|
| మంగళగీతములు | మాగధగానంబులు. |
| విచిత్రవివిధవితానములు | విచిత్రవితానములు. |
| మౌక్తికకుసుమమాలలు | ముక్తాదామతోరణములు, కుసుమమాలికలు. |
| ప్రత్యగ్రపల్లవశాల్యక్షతాంచిత కాంచనపూర్ణకలశములు | మణిగణంబులు, నంబరనికరంబులు పుష్పపుంజంబులుఫలప్రచయములు. |

మఱియు, నన్నయ, ద్రౌపదిని "పుష్పసాయకు కుసుమేతరంబయిన యాఱగు సాయకంబు" అని వర్ణించియుండఁ, దిక్కన, యుత్తరను "పదనికి రాఁ బులు గడిగిన మదనాస్త్రరేఖ గలిగి" యని వర్ణించియున్నాఁడు.

ఈరీతిగా, నన్నపార్య తిక్కనార్యకవితలకు సోదరీభావము చూపట్టుచుండఁ గొందఱు విమర్శకులు తిక్కన నన్నయభారతమునుఁ జూచి యెఱుఁగఁ డనియు, స్వయముగా నపూర్వపర్వసృష్టిని సాగించినాఁడనియు వాదించుచున్నారు. ఇది సత్యదూరము. ఇంకను ననేకనిదర్శనములు కలవు. నిజముగా, తిక్కన, నన్నయను గొనియాడుటకుఁ గారణ మామహాత్ముని నిరుపమానకావ్యసుమసారభాస్వాదనమే.

తిక్కనకవివరేణ్యుఁ డీపరిణయమున నుత్తరాభిమన్యులు "వినులఁ దియ్యమ్మెక్క మును విన్నిఁ బరస్పర రాగవృత్తిలో" అను పద్యమున నొండొరులఁ గూర్చి విన్నవా రగుటచేఁ బరస్పరరాగవృత్తి కలవారై రని వర్ణించియున్నాఁడు. ఈవధూవరు లిరువురు నిజగుణసంపదల నెపుడు వినిరి? అట్టివినికికి ననువగు నద నేరీతిగా సమకూరె? ఈవినుట పాండవాజ్ఞాతవాసమునకు మున్నా, లేక యజ్ఞాతవాససమయముననా?

రుక్మిణీవాసుదేవులు పరిణయమునకుఁ బూర్వమే గృహాగతులగు పండితులవలన నన్యోన్యగుణములను విని యొకరి నొకరు ప్రేమించి రని తెలుపఁబడినది. ఇట నట్టి గుణశ్రవణప్రసక్తి వ్యాసభారతమునఁ గానరాదు. భారతకథ నంతను గన్నులారఁ గాంచిన వ్యాస మహర్షికి గోచర

ముకాని రహస్యములు గూడఁ దిక్కనమంత్రివరునకుఁ గరతలామలకము లగుచున్నవి? ఉత్తరాభిమన్యులు వివాహమునకుఁ బూర్వమే ప్రణయపరవశులై యున్నారని తెలుపుటకుఁ గారణము—అర్జునుఁడు "హరిమేనల్లుఁడు బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి" అని నుతించిన పద్యము నుత్తర వినియుండుట యందురా? ఈపద్యము నిన్నఁటిది కాని మున్ను చదివినది కాదే? పోనీ దీనినే మున్ను విన్నిగాఁ దలంతము. మఱి యభిమన్యుఁ డుత్తరను గూర్చి విన్నదెప్పుడు?

ఉత్తరాభిమన్యు లొం(?)రుల సౌందర్యాదిగుణముల మున్ను విన్నవారనుట నిరాధారము.

---

# ఘడియారము—ఘటిశాసి.

— కందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ. కాకినాడ. —

---

ప్రాచీనాంధ్రశాసనములలో ఘడియారము, ఘడిశాసి యనుపదములు గాంచనగును. ఆపద ప్రయోగములు గలశాసనముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౩౨౬ అగు నేంటి తారణ శ్రావణ శు ౧౧ గు శ్రీసర్వపుర శ్రీ భావనారాయణపెరుమాళకు గోలి సోమారెడ్డింగారు ఘడియారము వెట్టి ఆబ్రాహ్మలు బొభలొఝు సింగాఓఝుంగారి జీతాలకు తూపుర్వటాను (ఖ) ౧౧ న ౧౦ చేను పడమటిపొలాన ఖ (౭) న౧౦న్ను వె(ర)శి ౧౧ చేనికై ట ౧౦౦ ంకాలు సమర్పించిరి. యిఘడియారము ధర్మము ఆచంద్రార్కస్థాయి కైంకర్యమున ఎవ్వరు విరోధించినాను (త)మ శే(శి)నసుకృతాలు (సె)డును. ఘడియారం బ్రాహ్మలగోత్రాలకు (ప్రి)త్రిషన్ను (ప)రయా ఎవ్వరు గొనందలచిన బ్రాహ్మణిం జంపినదోషానం బోవారు." *[1]

౨

'శ్రీమన్మహామండలేశ్వర చోడెరాజు శకవర్షముల్ ౧౦౧౪ గు నేంటి యుత్తరాయణసంక్రాంతియందు మహాజనమునకు నాదెండ్ల నిచ్చిన వ్రిత్తులు వెన్నభట్ల ఖ ౨ కొమ్మనభట్ల ఖ ౧... వేవనభట్ల ఖ ౨ శెబ్బనఘడియశాసుల ఖ ౨......'' *[2]క

3

"ప్రతిదివసమున్ను జలక మోకకావడి తెచ్చుటకు నిబ(ం)న్ధ ౧ ను కాండవశాఖ తైత్తిరీయశాఖలు చదవించ్చేటి ఘడిశాసులైన బ్రాహ్మణుల కిద్దఱకు నిబన్ధాలు మూండును పురాణవ్యాకరణకావ్యనాటకాభిధానాలు వదిపించ్చేటి విద్వత్ బ్రాహ్మలు మువురకు నిబన్ధాలు ౧"ను.

---

*[1] South Indian Inscriptions Vol. V. No. 10.
సర్వవరశాసనము. త్రుటులు —

*[2] South Indian Inscriptions Volume IV. No. 667.
నాదెండ్లశాసనము.

దీనికి సంస్కృతభాగము.

"శ్రీమత్ పుణ్యపురాణకావ్యనికరాలంకారసన్నాటకచ్ఛందో
వ్యాకరణాభిధాననిచయవ్యాఖ్యానహేతోః పునః । సేనానాథనృసింహ
దాసవిబుధస్సత్ పండితానాం త్రయం తేషామత్ర నిబద్ధమట్ట మపి చ
శ్రీమన్నృసింహాలయే। అత్యుత్ కృష్ణయజుశ్శ్రుతే రహరహః స్వాధ్యాయ
సత్రద్వయ స్థిత్యై కాండపత్తైత్తిరీయకలసత్ శాఖాద్వయస్య క్రమాత్
అత్రాధ్యాపకవిప్రయోరపి పున ర్విత్తైర్యనిబద్ధత్రయం శ్రీమత్ ధన్య
వదాన్యమాన్యచరిత శ్యామంత్రమాడామణిః" *[3]

దక్షిణహిందూదేశమునందలి ప్రాచీనపల్లవశాసనములలో ఘటికా
ప్రశంస కలదు. మూఁడవవిజయనందవర్మ వేలూరుపాలెముశాసనములో
స్కందశిష్యుఁడు సత్యసేనునికడనుండి ఘటికను సాధించినట్లును, రెండవ
నరసింహవర్మ బ్రాహ్మణుల ఘటికను పునరుద్ధరించినట్లును వ్రాయఁబడినది *[4]
ప్రాచీనకదంబరాజు శాసనములో ఘటికాస్థానప్రశంసయుఁ గలదు.

'యః ప్రయాయ పల్లవేన్ద్రపురీం గురుణాసమం వీరశర్మణా
అధిజిగాంసు ప్రవచనం నిఖిలఘటికాం వివేశాశు తర్కకః *[5]

ఈఘటికాపదమునకు శాసనసంపాదకుఁడైన రైసు (Rice)
దొర పుణ్యతీర్థము (Religious Centre) అని యర్థ మిచ్చిరి. ఆసంద
ర్భమునందే పాఠక్ పండితుఁడు నదియే యర్థ మిచ్చె ననియు కీలుహారన్
(Dr. Kielhorn) పండితుఁడు 'బ్రహ్మపురి' యని యర్థ మిచ్చె ననియు
సూచించిరి. *[6]

---

*[3] South Indian Inscriptions Vol. VI. No. 904.

*[4] South Indian Inscriptions Vol. II. Pages 510–511.

*[5] Epigraphia Carnatica Vol. VII. Part I. P. 8,200.

*[6] Mysore and Coorg by Lewis Rice P. 210.

"An interesting term is that of Ghatika-sthana which seems to indicate a place of public assembly of Brahmans. It has been translated by Professor Pathak as 'religious centre' and Professor Kielhorn has written an article suggesting that it was something like a Brahmapuri. The name occurs in Sk. 176, where Mayura-sarma, after going to the Pallava Capital for completing his studies, is said to have frequented every Ghatika. In Si 23 of 1167, the

ఈ ఘటికాపదమునకు శాసనపరిశోధకులును, కొందఱు చరిత్రకారులును, విద్యాపీఠము, కళాశాల, యనునర్థము లిచ్చియున్నారు. అవి యన్నియు నిచ్చట నేకరువుపెట్టుట యనవసరము. కాని రెం డుదాహరణము లిచ్చి విరమింతును. కాంచీపల్లవులు (The Pallavas of Kanchi) యనుగ్రంథములోఁ దద్గ్రంథసంపాదకు లగు శ్రీ మాఁకృష్ణస్వామి అయ్యంగారు ఘటికయనఁగా కేంద్రసంస్కృతవిద్యానిలయమని (Centre of Sanskrit learning) యర్థమును జెప్పిరి *[7]. ఘటిక యనఁగా కళాశాల (College) యని శాసనపరిశోధకు లొకానొక నివేదికలో వ్రాసిరి. *[8].

ఆంధ్రవాఙ్మయములో ఘటశాసి, ఘటికాశాసి ప్రయోగము లున్నవి. పాల్కురికి సోమనాథకృత బసవపురాణములో (ఏడవయాశ్వాసము. పుట 216.)

(1) "శ్రీధరభట్టిలు సిద్ధునఁ గలసె
మాధవప్పన యిల్లు మంటపాలయ్యె
గుడ్డిగోవిందుని గుడిసెయుఁ గమరె
దొడ్డభాస్కరునిల్లు దొడ్డిఁ దొడ్డిఁ గాలె
కొమ్మనఘటశాసికొంపయుఁ గమలె."

తత్కవికృతపండితారాధ్య చరిత్రములో:—

(పరిషత్పుస్తకభాండాగారములోని తాళపత్త్రప్రతిననుసరించి)

---

Nonambeswara temple is said to be the great Ghatika-sthana of the city of Henjeru. On the other hand, Sk. 197 of 1182 describes Ghatika-sthanas as supports to Dharmma and mines for enjoyment (Bhoga). Cn 178 of 1442 contains the statement that a Ghatika was established in a certain place in accordance with the saying of Uttanka in the Samaveda."

*7 The Pallavas of Kanchi. Page 24.

*8 Para 19 of the Epigraphical Report of Madras Presidency 1916—1917.

ఘటికాసామాన్య=Member of Ghatika. (College)

(2) హేమయాజులపెద్ది వామనభట్టి
దామోదరప్పన వామనకూచి
కేశవుఘటశాసి కేమనచిన్ని
పాశమెమైలారుభట్టు పాద్యాలు (సూరసానికథ)

వినుకొండ వల్లభామాత్యుని క్రీడాభిరామములో,

(3) వ. అనుచో మధుమావతీదేవిభవనంబు వెల్వడి కట్టాయితంబైన ఘటశాసిపుంగవుండు నింగి చెఱంగు మొనవ్రాలిన పతంగబింబంబు గను గొని టిట్టిభ! యదెచూడు, పుట 84.

శ్రీకృష్ణరాయప్రణీతము, ఆముక్తమాల్యదలో (సప్తమాశ్వాసము పద్యము 3.)

(4) ఉ. ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గళల్ పదునాల్గు నేర్చి, వా
క్ప్రౌఢిమఁ జర్చగెల్తు ఘటశాసుల, శ్రోత్రులఁ దప్పవట్టుకుం
ఖండల ముష్టివిప్పఁ గని సవ్వడు, వెండి ప్రయోక్తలన్ సుధీ
మండలి గ్రాంథికత్వ మవధూతము సేయుదు జల్పవాదినై.

ఈఘటశాసిపదమునకు శబ్దరత్నాకరమునందు తార్కికుఁ డను నర్థమును, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు క్రీడాభిరామపీఠికలో 'శాస్త్రిపర్యాయము' అనునర్థమును, కళాప్రపూర్ణ శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులుగారు 'తార్కికులు' అనునర్థమును నిచ్చియున్నారు. కిట్టెల్ (Kittel) కన్నడనిఘంటువులో ఘటియనుపదమునకు సభ (Assembly) యను నర్థమీయఁబడెను. ఈఘటశాసిపదమే కొన్ని ప్రాచీనశాసనములలో ఘళిశాసి యనియున్నట్లు తెలియుచున్నది. *9

హైదరాబాదు ప్రభుత్వమువారు ప్రచురించిన చాళుక్యుల నాగాయి శాసనములలో నచ్చోట ఘటికాశాలను నెలకొల్పినట్లును, ఆఘటికాశాలకు నార్గురపుస్తకభాండాగారపర్యవేక్షకుల యధికారమున నొక భాండాగారము గలదనియు సూచింపఁబడినది. * 10

---

*9 The Early History of the Deccan.—Bhandarkar Page 158.

*10 Hydrabad Archaeological Series. No. 8. P. 7.

ఘటిక, ఘటికాస్థానము, ఘటికాశాల, ఘడియారములు పర్యాయపదము లనియు, ఘడెశాసి, ఘడిశాసి, ఘడియశాసి, ఘటశాసి, ఘళిశాసి యనునవి యొకయర్థమిచ్చుపదము లేయనియుఁ దెలియనగును. మొదట వ్రాసిన తెలుఁగుశాసనములో 'ఘడియారము' రెండుమూఁడు శాసనములలోని ఘడిశాసి, సంస్కృతభాగములోని అధ్యాపకప్రయోగస దర్భము ననుసరించియు, పైని సూచించిన తదితరశాసనములలోని పదార్థము ననుసరించియు, ఘడియార మనఁగా వేదపాఠశాల గాని, సంస్కృతపాఠశాలగాని యనునర్థమును, ఘడిశాసి, ఘటశాసి యనఁగా, తత్తచ్ఛాలయందు నియోగింపఁబడిన పండితుఁడనిగాని యుపాధ్యాయుఁడనికాని యర్థములును స్ఫురించుచున్న వని నామనవి.

నిఘంటుకారులు ఘటశాసి యనఁగాఁ దార్కికుఁ డనునర్థమును, తర్కపరిభాషలోఁ, నుదాహరణార్థము ఘటము, తార్కికులు చెప్పుదురు గావున, ఘటశాసి యనఁగాఁ దార్కికులకు వాచక మని, చూపించిరి. ఘటశాసి యనఁగా, ఘటిక, ఘటికాశాల, ఘడియారము, అనెడిసంస్థ (Institution) లో శాసియన నధ్యాపకుఁ డని యర్థమే చెప్పుకొనుట సమంజసముగా నుండును. శాసి యనఁగా గురువు. (శాసితుమ్ = To instruct-శాసి = Instructor - అధ్యాపకుఁడు) ఘటపదము తర్కపరిభాషకుఁ జెందినది గాక యొక విద్యానిలయమునకుఁ జెందినమాట యనియే యెంచుకొనవలెను.

# నవనాథచరిత్రము.

(ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునకుఁ బంపఁబడినది.)

---

గౌరనకృత మగుద్విపద కావ్యము - క్రీ. శ. 14 వ శతాబ్ది—మదరాసువిశ్వవిద్యాలయాంధ్ర గ్రంథమాల, 7. పరిష్కర్త శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు, ఎమ్. ఏ., ఆంధ్రోపన్యాసకుఁడు, ప్రాచ్యపరిశోధనసంస్థ - మద్రాసువిశ్వవిద్యాలయము—1937. పుటలు (281+XXXIX వెల రు. 3—0—0 లు.

ప్రాచీనాంధ్రకవి యగుగౌరనకృత మగుహరిశ్చంద్రచరిత్ర ద్విపదను నీవఱకుఁ దెలుఁగువా రెఱుఁగుదురు రసవత్తర మగుద్విపదరచనకుఁ బేరుగాంచిన గౌరనరచిత మగు మఱియొకద్విపదకావ్యము ప్రకటింపఁబడి యాంధ్రవిద్వల్లోకమున కందుఁబాటులో నుండుట యెంతయు సంతసింపఁదగిన విషయము.

నవనాథచరిత్ర యనఁగా రాజయోగమార్గమున సిద్ధిఁ బొందిన తొమ్మండుగురు సిద్ధులచరిత్రమును దెలుపునది. ఇం దైదాశ్వాసములు గలవు - అచ్చటచ్చట గ్రంథపాతములు గలవు - ఇది గౌరన శ్రీశైలమున భిక్షావృత్తి మఠాధీశ్వరుఁ డగుముక్తిశాంతరాయనికి సంకితము గావించి యున్నాఁడు. శ్రీనాథమహాకవి శివరాత్రిమాహాత్మ్యము కృతిగాఁ జెప్పిన దీశాంతరాయనికే - కావున గౌరన శ్రీనాథు లిరువురు సమకాలికు లని మనకుఁ దెలియుచున్నది

గౌరనరచితగ్రంథములలో నింకను ముద్రింపఁదగినది లక్షణదీపిక; పరిషత్పుస్తకభాండాగారమునఁ బ్రతిగలదు - ఇది సంస్కృతగ్రంథ మైనను బ్రాచీనాంధ్రచ్ఛందస్సులనుండి తెలుఁగుపద్యము లిం దుదాహరింపఁబడి యున్నవి - గౌరన నవగ్రహస్తవమును దెలుఁగునఁ జంపకోత్పలములతో రచియించి యున్నాఁడు - జగ్గన తనప్రబంధరత్నాకరమున దానినుండి రెండుపద్యము లుద్ధరించినాఁడు - ప్రబంధరత్నావళిలో వానినిఁ జూడన

గాను- శ్రీరంగమాహాత్మ్యమును, రత్నశాస్త్రమును రచియించినభైరవకవి యీతనిపుత్త్రుఁడా? ఈభైరవకవిపుత్త్రుఁడు మనుమంచిభట్టు హయలక్షణసారమును దెలుఁగున రచియించినవాఁడా? యనువిషయములు పీఠికయం దింకను బ్రస్తావింపఁదగి యున్నవి-

గౌరననవనాథచరిత్రము *శ్రీగిరిరచిత మగు పద్యకావ్యమునకు ద్విపదానువాదము. దీనిఁ గూర్చి గ్రంథకర్తయే గ్రంథావతారికలోఁ జెప్పినాఁడు. శ్రీగిరికవి, శ్రీరంగమాహాత్మ్యము, నవనాథచరిత్రము, శ్రీగిరిశతకమును రచియించిన మహాకవి. ఈతనికృతు లేవియు నిపుడు లభించుట లేదు. పైవానిలో శ్రీరంగమాహాత్మ్యమునుండి నాలుగుపద్యములు పరిషత్తువారి యుదాహరణగ్రంథమునఁ గలవు- క్రీ. శ. 1420 సంవత్సరప్రాంతమున విలసిల్లిన మడికి సింగన తనసకలనీతిసమ్మతమున శ్రీగిరిశతకమునుండి పద్యముల నుదాహరించినాఁడు. శ్రీగిరితండ్రి చెన్నమల్లు. ఈతఁడు శైవకవి- పీఠికాకారులు శ్రీరంగమాహాత్మ్యమును శ్రీగిరిశతకమును రచించిన శ్రీగిరికవి నవనాథచరిత్ర పద్యకావ్యమును రచించిన శ్రీగిరికవి యని యంగీకరింప లేదు- ప్రాచీనాంధ్రకవులలో మఱియొకశ్రీగిరి మనకుఁ దెలియవచ్చుట లేదు- మఱియు శైవుఁ డగుకవి శ్రీరంగమాహాత్మ్యమువంటి వైష్ణవగ్రంథమును వ్రాయునా? యని శంకించిరి- మనకు లభ్య మగుచున్న శ్రీరంగమాహాత్మ్యమును వ్రాసినభైరవుఁడు శైవుఁడు- నిరోష్ఠ్య సీతా కల్యాణమును రచియించిన పిడుపర్తి బసవన శైవుఁడు. పరమభక్తాగ్రేసరుఁడై, విష్ణుభక్తిప్రతిపాదక మగు భాగవతము రచించిన పోతన శైవుఁడు. కావున శ్రీగిరియు నట్టివాఁడే కావచ్చును- మఱియుఁ బ్రబంధరత్నావళియం దుదాహృత మైన యీ క్రింపద్యమును పీఠికాకారులు ప్రకటించి, యీపద్యము రామాయణకథకు సంబంధించినదిగా నున్నది యని వ్రాసినారు-

"సంతోషంబునఁ బొందిఁ దేలె విమలస్వాంతున్ మహాదానవ
ధ్వాంతవ్యూహవిదారణోజ్జ్వలవివస్వంతుఁ యశఃపూరితా

* ఇతనిఁగూర్చి వ్యాసకర్త ధాత జ్యేష్ఠ భారతి (జూను 1936) యందుఁ బ్రకటించినవ్యాసమునుఁ జూడుఁడు- ప. అ.

శాంతున్ సాహసవంతు, నిర్భరజయాయత్తైకవిఖ్యాతు ధీ
మంతున్ భర్గనగేంద్ర కాంతుని హనూమంతున్ జనాత్యంతునిన్."

పైవిధముగ శ్రీరాముఁడు హనుమంతుని బంటుగా నేలినట్లు భైర
వకవి శ్రీరంగమాహాత్మ్యమున నీక్రిందిపద్యముగలదు—

"చ. పరిచరుఁ గాఁగ నేలె నిరపాయచరిత్రుని శత్రుకానన
స్ఫురదురువీతిహోత్రుని సముజ్జ్వలమేరుసమానగాత్రునిం
బరమపవిత్రు సన్మునిసుపర్వతతిస్తుతిపాత్రుఁ గా మనో
హరఫలశేముషీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్." ద్వి. ఆ. 359

ఈపద్య మప్పకవీయమునం దుదాహరింపఁబడి యున్నది. ఇది రామా
యణకథకు సంబంధించినదే గాక శ్రీరంగమాహాత్మ్యమునకు సంబంధించి
నది. అందు ద్వితీయాశ్వాసమునఁ రామాయణకథ ప్రసక్తమైనది. హను
మంతునిఁ గూర్చిన ప్రత్యేకవర్ణన కట్టా వరదరాజకవి శ్రీరంగమాహాత్మ్య
మున లేదు-కావున భైరవకవి శ్రీగిరినే యనుసరించుటస్పష్టము-కావునఁ
దొలిపద్యము శ్రీగిరిశ్రీరంగమాహాత్మ్యములోనిదే యగుట స్పష్టము -
ప్రాచీనాంధ్రవాఙ్మయమున మఱియొక శ్రీగిరి లభించుటకు నిదర్శన మొ
క్కటియే యని చెప్పనొప్పును- తండ్రి నవనాథచరిత్రమును ద్విపదగా రచి
యింపఁ బుత్త్రుఁడు భైరవకవి యాతని శ్రీరంగమాహాత్మ్యము ననుసరించి
ప్రబంధము రచియించిన ట్లూహింపఁదగి యున్నది- శ్రీగిరి ప్రఖ్యాతాంధ్ర
కవియని తెలియఁదగియున్నది-

ప్రాచీనాంధ్రద్విపదకావ్యములలో నవనాథచరిత్రమువంటిది భా
షావాఙ్మయచరిత్రమున కెంతయేని యుపయోగించును - గౌరన ద్విపద
రచనమునఁ బాల్కురికి సోమనాథు ననుసరించినాఁడు. సోమనాథునివలె
ద్విపదలోఁ బ్రాసయతిఁ గూర్పనిష్టములేనివాఁ డయ్యె (చూ. పీఠిక. 37
పుట) నవనాథచరిత్రమున నీక్రిందిచోటులఁ బ్రాసయతిఁ గూర్చినాఁడు-

పుట. 36* పొలుచు జవ్వాది లప్పలు సోఁకుముట్ట

*గ్రంథమున ద్విపదకుఁ బదిపంక్తులకైన సంఖ్యలేకుండుటచే పుటలనే యాకరము
లుగా గ్రహింపవలసివచ్చినది-

విరులరేకులును జుంజురువెండ్రుకలును

పుట. 200- జనకజఁ జెఱఁ గొన్న చనటిరాక్షసుని-

ఇచట-చెనఁటి, అనురూపమును గవి వ్రాసినచో, ప్రాసయతి-నేఁడు 'చెనఁటి' అను నెత్వరూపమే గాని 'చనఁటి' అని యత్వరూపము లేదు- అచ్చెరువు- అచ్చరువు మొదలగువానివలె దీని కంగీకరించిన నిది ప్రాసయతి కాఁజాలదు.

గౌరన వ్యావహారికపదములను బెక్కింటిని గ్రంథస్థము గావించియున్నాఁడు. ఇందుఁ గొన్ని పదములు నిఘంటువులఁ జేర లేదు. వ్యవహారసిద్ధములగువాని నీతఁడు యతిస్థానముల నుపయోగించి వానికి గ్రాంథికతావస్థఁ గల్పించినాఁడు-

చాయనేర్చినరీతి సరసమై తనర

చాయింపవలె పూర్వశారీరి గాను.—ఇవి చేయనేర్చిన, చేయింపవలె ననుమాటలకు నుపయోగింపఁబడినవి. వ్యవహారమున 'చేసిచాయంగలవిఃన్నపము' లని యందుము.

"పరువడి నటమీఁద- పండ్రెండో యేట"-దీనికిఁ బ్రాచీనరూపము పండ్రెండగునేఁట, లేక పండ్రెడవునేఁట, తరువాతిరూపము పండ్రెడవయేఁట, పండ్రెండో యేట, పదహారో పదిహేడో, ఇత్యాదులయందు వ్యవహారమున 'అవు' లోపము-

ఒనరిస్తి మోకు, బ్రాహ్మలు, రుగ్మత మొదలగు శబ్దములిట్లే కవి వాడినాఁడు- మహారాష్ట్రమునకు మహరాష్ట్ర మని, వాడుట శైవసంప్రదాయము.

వెఱచుంటి- నిత్యతెసఁగు- చూడామణున్న- శంకణుమాత్రము, ఎల్లందు- మొదలగుసంధులనీకవివిశృంఖలముగా వాడినాఁడు- ఆవర్తనము, ఆవర్తమునకు; చంపలు- 'చెంపలు' అనుశబ్దమునకు- (చంపలు చించి భుజంబులు చెండి) మొదలగుపదజాల మిందుఁ బ్రయుక్తమైనది- 'అనువుగా నాగార్జునఁడు చెప్పినట్లు' అని దుఃఖాన కుత్వవిధానముఁ జెప్పక యత్వవిధానముఁ జెప్పినాఁడు ఇది ప్రాచీనసంప్రదాయము- కేవల ముచ్చారణ

ననుసరించి- ధృ-ద్ర మొద లైనవానికి యతిఁ గూర్చినాఁడు. గౌరన శైవకవిసంప్రదాయజ్ఞుఁడు, గావున, 'పుడమిఱేఁడు' 'ప్రవిమలపోగులు' మొదలగుశబ్దములను యథేచ్ఛముగ వాడినాఁడు. పావురమునకు, పాయిరము- అనురూపాంతర మిందుఁ గలదు.

గౌరనలాక్షణికుఁ డైన మహాకవి. నవనాథచరిత్ర, మంతకుముందున్నది, మహాప్రౌఢప్రబంధ మగుటచే ద్విపదలలో సర్వజనసులభ గ్రాహ్య మగురీతిని దీనిని రచియించుటచే గ్రంథము రసవంతము గావించినవాఁడు.

పదములలో నిఘంటువులఁ జేరనివియుఁ, జేరినవానికిఁ గొన్నిప్రాచీనప్రయోగములును నవనాథచరిత్రమునఁ గన్పట్టుచున్నవి.

1. అంతస్తము=హృదయము.

　　నిను నిక్కముగ నిదానించి యొం డైన
　　నంతస్త మెఱుఁగ ని న్నరయ నాతరమె
　　వింతె నీజాడ యెవ్విధమున నింక—పుట. 223.

　అందే. మదిఁ ద మ్మెఱుఁగనిమందబుద్ధులకు
　　నెదిరియంతస్తము నెఱుఁగుట దలఁపఁ
　　జీకు దర్పణము వీక్షించినయట్లు—(పైపుటయే-)

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువున 'అంతస్త' మనఁగా రహస్యమని కలదు- రహస్యమునకుఁ దావు హృదయమే గదా! వ్యవహారమున నుదారస్వభావము గలవారినిఁ గూర్చి చెప్పునపుడు. 'వాఁడి చాలా గొప్ప యంతస్తు' అనిచెప్పుదురు-('అంతస్తు' అనఁగా మేడయంతస్తు గాదు)

2. అపసడి=అపనింద-

　　లోకు లెఱింగిన లోకంబులోన
　　నపసడి వచ్చును నమ్మరు పెంపు—195 పుట.

అచలించు=ఉత్సహించు-

　　అచటఁ జిత్రాంగియు నంగజుకేళి
　　కచలించుతనకోర్కె కా దని సుతుఁడు-

ఆహికంబులు=ఆహికములు-

ఊహింప నీరాజ్య మొకగచ్చకాయ
ఆహికంబులు వెట్టి, యక్షులువార
వృద్ధి కొసంగుదు —153 పుట.

నిఘంటువుల 'ఆహాకము' అని కలదు- ఆయకము అని రూపాంతరము- 'కుదువఁబెట్టు' అని యర్థము- ఇచట- ఆహికము అని యుండఁదగు- 'ఆహివెట్టు'- అనుక్రియ దీనికి సంబంధించినది గావలయును-'ఆహివెట్టు' నిఘంటువులలో లేదు- ఆధివెట్టు* అని కలదు-కుదువఁబెట్టు అనునర్థము గలదు- ఈశబ్దమునుగూర్చి పరిశోధనము జరుగుచున్నది. అపసడి, అచలించులకుఁ కవి యఖండయతి నుంచినాఁడు.

నింట=వెలువ-

సురతంబులకు నింట- సొబగులపేంట

నింట యనునది నిట్ట యనుదానికి రూపాంతరముగా గ్రహియించి యున్నారు- నింట యనుపదము వ్యస్తముగా నిండుఁ బ్రయోగింపఁబడినది- తిక్కనవిరాటపర్వమున నుత్తరావివాహసందర్భమున—

గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి
హోమసమయకృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నింటఁ బొంగారె గ్రమ్ముదేర—5-402.

ముద్రితప్రతులలో పెన్నిట్ట యని కలదు-పెన్నింట వ్రాఁతప్రతులలోఁగలదు- త్రిపురాంతకోదాహరణము- 'పెన్నింట' అని ప్రయోగము గలదు- 'నింట' యను పదము హలాదియే యనుటకు నెట్టన యీ క్రిందిప్రయోగము తెలుపుచున్నది-

"అంటినఁ గందు మేనుఁ బసనారెడుజవ్వనమున్ రసంబుపె
న్నింటలఁగూర్చు గామమును నిబ్బరమైనమదంబునై మనం"
హరి. 6 ఆశ్వాసము-173 పుట-

ఇది నిఘంటువులలో లేదు- 'నిండు' అనుధాతువునకుఁ గృదంతరూపము 'నింట అనియు- వండు, వంట, మండు, మంట మొదలగు

*ఆహివెట్టు- ప్రయోగము క్రీడాభిరామమునఁ గలదు-

వానివలె నేర్పడిన దనియుఁ దలఁపనగును. ఇందు='పూర్తియగు'- పొంగి పొరలుట పూర్తియైనవెనుకనే గావునను వెల్లువ యట్లగుటఁ బట్టియు దీని కీయర్థము వచ్చియుండును-

బరిసెనము=స్పర్శనము-

'తిరముగా దేవభూదేవసన్నిధిని, బరిసెనంబున దిబ్బవట్టించి గాని-'

ఈయర్థము నిఘంటువులలో లేదు- కిట్టెలుదొరవారి కన్నడనిఘంటువున బరిసెనము స్పర్శనమునకుఁ దద్భవ మని కలదు- ఇచట, కథాసందర్భమున నేరము చేసినవాఁ డానేరము తాను జేయలే దని యెఱ్ఱగాఁ గాలిన యినుమును స్పృశియించుట, అగ్నిఁ ద్రొక్కుట మొదలగుపనులు చేయవలసి యున్నట్లు రాజుతోఁ జెప్పుఘట్టమునఁ గలదు. సత్యాసత్యపరీక్షణమునకై యిట్టివి జరుగుట సంప్రదాయసిద్ధమే-

పాదఱి=అధముఁడు, నీచుఁడు-

తాపికాఁ డైనపాదలిమందడీఁడు-

ఇచట, పాదఱి యని యుండఁదగును-'ఱి' ప్రాసస్థానమున శివతత్త్వసారమునఁ గలదు-

"వెఱవక నీగుడిలోపల
గుఱుకొని యాలాపువెట్టుకొని యుండెడిపా
దఱి జనుదూతలు గుక్కలఁ
గఱపింతురు మూటగట్టి మహేశా.
23 పుట=289-పద్యము-(మూ. లఘుటీక. పుట 43).

కట్టువర్గంబులు=కట్టుకొనుబట్టలు-

వేఁటాడఁ జయ్యన విచ్చేయు మనిన
మాటకు విలసిల్లు మనుజవల్లభుఁడు
వానికిఁ దనకట్టువర్గంబు నిచ్చి—35 పుట.

వ్యవహారములో 'మీరిచ్చేయీపాటికట్టువర్గములు తప్పిపోతాయనా రమ్మన్నారు' అని కలదు-

గాతి- ఘాతిరూపాంతరము-కడుపు.

గాతికి నీరాక కలకాల మెల్ల—154 పుట.

వ్యవహారమున వీడిగాతి కొత్తైనా చాలదు. పతారము - నగరు లోపలిభాగము- పటారము- అని శబ్దరత్నాకరమునఁ గలదు-

మఱియు- 'కోయిల- కోవెల- (విరహులమంట కోవిలగమిపెంట) పయ్యెద, పయ్యద-(అన్నిలవేణి పయ్యదవాయదివిసి) మొద లగుశబ్దస్వరూపములను దెలిసికొనుటకు నవనాథచరిత్ర యుపయుక్తమగుచున్నది- ఏతద్రితము, సుదకొమ్మలు-మొద లగువాని కథునాతన గ్రంథములకన్న నిఘంటువులఁ బ్రాచీనమగునీగ్రంథప్రయోగముల నిచ్చుట సమంజసము- ఎచరించు, ఊలమాలగుచు, బొతళించు, అటి (అట్టిరూపాంతరము) పట్టకనడురేయి మొద లగుశబ్దముల ప్రయోగమున కిది యొకటియే యాధారముగా నిఘంటుకారులు గ్రహించినారు-ఇందలిపదము లకారాదిగా నేర్పఱిచి, యర్థము, సాధ్యమైనంతవఱకు వ్యుత్పత్తులు వ్రాసిన భాషాచరిత్రమున కెంతయేని యుపయుక్తముగ నుండును.*

నవనాథచరిత్రమున, మనయాంధ్రదేశమున జనసామాన్యమున నెక్కుడువ్యాప్తిలో నున్న సారంగధరునిఁ గూర్చినకథ ప్రథమద్వితీయాశ్వాసములఁ గలదు- ఈకథ యాంధ్రదేశమునకు సంబంధించినది గాదని యు క్రీ. శ. 1656 సంవత్సరమున నుండిన యప్పకవి కల్పిత మనియుఁ బరిష్కర్తలు పీఠికలో విపులముగాఁ జర్చించి యున్నారు.

ఈకథ యాంధ్రదేశమునకు సంబంధించినది గాదనియు, మాళవదేశమున జరిగిన దనియు మున్నగువిషయములు నవనాథచరిత్ర యాధారముగాఁ గొని బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు పదునైదేండ్లక్రిందట సవిమర్శముగఁ బ్రకటించి యున్నారు- అప్పకవికి నూఱేండ్లకు ముందీకథ ప్రచారములో నున్నట్లు రామకృష్ణయ్యగారు పీఠికలోఁ బ్రకటించిన దోనేరు కోనేరుకవి ద్విపదబాలభాగవతమునుండియే తెలియుచున్నది- కావున (నాతఁడు) నిది కేవల మప్పకవి కల్పించినది గాక కొంత వాడుకకథను మార్పు చేసె నని యూహింపఁ దగి యున్నది- పీఠిక (23 పుట) లో నుద్ధృత మగు నంశమును బరిశీలింపఁగా దోనేరు కోనేరునాథుఁ డీకథను నాంధ్రదేశమునకు ముడిపెట్టినవాఁడుగాఁ దోఁచు

*ఇట్టిపని వ్యాసకర్తయే పూనుకొనుట యుక్తమని తలఁచుచున్నాము. ప. అ.

చున్నాఁడు. ఆతఁడు పశ్చిమచాళుక్యచక్రవర్తులను వర్ణించి, చాళుక్యుఁడగుటచేతను నాంధ్రభారతకృతిభర్తయగు రాజరాజనరేంద్రుని (మాళవదేశాధీశుఁ డితఁడే యని భావించి) తనగ్రంథమున వ్రాసినట్లు కనుపట్టుచున్నది.

సారంగధరుఁడు చౌరంగి యనుపేర సిద్ధుఁ డయ్యె నన్నవిషయ మీనవనాథచరిత్రమునుండి కోనేరునాథకవి గ్రహించియుండును. సారంగధరచరిత్రమును క్రీ. శ. 1630 సంవత్సరప్రాంతమున రచియించిన చేమకూర వేంకటకవికి నవనాథచరిత్రయే యాధారమై యుండనోపును. కావున నాతఁడు రాజనరేంద్రుఁడు మాళవపతి యని చెప్పినాఁడు. అప్పకవి నన్నయభట్టుతో నీసారంగధరునకు సంబంధము కల్పించి యుండును. ఇవి యన్నియుం బరిశోధింపఁ దగినవిషయములు. ప్రథమాంధ్రకవి యని వందలకొలఁది యేండ్లనుండి కీర్తింపఁబడుచున్న నన్నయతో సంబంధించినది గావున నీసారంగధరుని వృత్తాంతము మనమింకను బరిశీలింపఁదగినదియే.

నవనాథచరిత్రముకథ మహారాష్ట్రదేశమునకు సంబంధించినది. ఈనవసిద్ధులఁ గూర్చిన చారిత్రకవిషయప్రశంస పీఠికయందుఁ గానరాదు. ఇందు, మీననాథుఁడు, చౌరంగి (సారంగధరుఁడు) గోరక్షుఁడు, మేఘనాథుఁడు, విరూపాక్షుఁడు, నాగార్జునుఁడు, ఖణికుఁడు, వ్యాళి, గోరక్షుఁడు ననువారిచరిత్రములు గలవు. ఇందు, చౌరంగి (సారంగధరుని) తండ్రి. రాజనరేంద్రుఁ డేలినమాంధాతపురము నేఁడు నర్మదానదీతీరమునఁ గలదు. అచ్చట సిద్ధేశ్వరాలయము గలదు. నాగార్జునుఁడు సుప్రసిద్ధ బౌద్ధాచార్యుఁ డగు నాగార్జునుఁడు గాక యాపేరుగలవాఁ డగునో కాఁడో పరిశీలింపఁదగినది. సిద్ధనాగార్జునతంత్ర మనుపేరు గలగ్రంథము రసవాదమునుఁ గూర్చినది గలదు. ఇందు, పంచమాశ్వాసమున నీరసవాదప్రశంస గలదు. ఈనాగార్జునుఁడు మీన(మత్స్యేంద్ర)నాథుని శిష్యుఁ డని నవనాథచరిత్రమునఁ గలదు. మీననాథుని కాలము క్రీ. శ. 1100 సంవత్సరప్రాంతము కాఁ దగును. క్రీ. శ. 1275-1296 ప్రాంతముల విలసిల్లిన జ్ఞాననాథుఁడు తన 'దీపిక' యనుగ్రంథమున గురుపరంపరనిట్లు తెలుపుకొనినాఁడు.

ఆదినాథుఁడు, మత్స్యేంద్రనాథుఁడు, గోరక్షనాథుఁడు, గగననాథుఁడు- నివృత్తినాథుఁడు, జ్ఞాననాథుఁడు. జ్ఞాననాథుఁడు క్రీ. శ. 1276 ప్రాంతమువాఁ డగుటచే మత్స్యేంద్రనాథుఁ డంతకుముందు నూఱేండ్లవాఁడు కాఁ దగును.- అతనిశిష్యుఁడు నాగార్జునుఁడు క్రైస్తవశతాబ్దారంభమున విలసిల్లిన యాపేరు గలసుప్రసిద్ధబౌద్ధాచార్యుఁడుగాకవే అని యూహింపఁదగియున్నది. ఈసంప్రదాయమునకు మహారాష్ట్రమున నాథపథీయ మని పేరు-

ఇం దల్లమప్రభువు గోరక్షకుని సమకాలికుఁ డని కలదు- అల్లమప్రభువు, క్రీ. శ. 1160 సంవత్సరమున విలసిల్లిన వీరశైవమతసంస్థాపకుఁ డగు బసవనసమకాలికుఁడు- గోరక్షుఁడు మీననాథుని శిష్యుఁడుగదా? దీనిననుసరించినను మీననాథుఁడు క్రీ. శ. 1100 సంవత్సరప్రాంతము వాఁ డని తెలియుచున్నది- చారిత్రకము నీరీతి నవనాథచరిత్రము పరిశీలింపఁదగును.

గౌరన తనకాలమునాఁటి యెఱుకులవేషములు - పురోహితుని వేషములు- పురోహితునికృత్యములు- భోజనసంభారములు- బ్రాహ్మణులయింటిపేరులు, పేరులు, పశురోగములు- మొదలగువానిని విపులముగ వర్ణించి యున్నాఁడు- విమర్శకులు శ్రద్ధతోఁ బఠింతురుగాత!

నిడదవోలు వేంకటరావు, బి. ఏ.

# బహుధాన్య.

— శ్రీ మత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులుగారు, కాకినాడ. —

---

సీ. అన్నమో రామచంద్రా యను మర్త్యబా
            ధలఁ దీర్పు వడి బహుధాన్య వగుదు
నీశ్వరుఁ దిగఁద్రొక్కి యిక్కట్లు పెకలింపఁ
            గా బహుధాన్యవై గణనమొందు
సూరులసుఖశక్తి శోభిల్లఁ గళ్యాణ
            దాయిని వగు బహుధాన్య మొంది
పూర్వోత్తరపరీక్షఁ బుస్తకాదృతి లేక
            బహుధాన్య తరియించి పటుత చూపు
నీయుగాది పూర్వము బుధనిహితవార
మై మఱువుఁగాంచె శుక్రాప్తి నాది యిప్పు
భయ మొదవకుండఁగఁ బరార్థపరతను బలి
సాహసంబును జూపుము సమయనిష్ఠ.

మ. త్రిజగన్మోహనసస్యయుక్తఘనధాత్రీరాజముల్ పెంపునన్
విజయాకాంక్షివిశేషమానధనులన్ వేవేగమే లేపుచున్
యజమానా! బహుధాన్యమా! తమసువృత్తాదుల్వెలింబుచ్చుచున్
గజధాత్రీపతిమంత్రులట్ల ప్రజఁ జక్కంబెట్టఁగా నొప్పుమా !

మ. రమలం జూపుము గేస్తులం దనరి సద్రోచీయుగాద్యావళిన్
వచియింప న్నుహస్రుక్తి కర్షకకవివ్రాతంబు పూజింపఁగా
విచలద్వేగపరీతవై వెలయు చుర్వి న్నీవు ధాన్యంబుల
న్నచలార్యాఖిలమందు రాసు లిడి సర్వాశాకృతిం జూపుమా !

గీ. సర్వసామాన్య మగునట్టిచలము ద్రుంచి
చక్రరక్షకఘటికారసరణి నున్న
కులమత ప్రపంచంబు దుష్టులత మాపి
మాన్య ! మంగళ మిడు బహుధాన్యవర్ష !

---

# జయదేవకవి—అష్టపదులు.

వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు.

---

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, ఈశ్వర మార్గశిర పుష్యమాసముల సంచికయందలి నావ్యాసమును గూర్చి మహారాజశ్రీ శ్రీ ఉయ్యూరి రాజాగారగు శ్రీ వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు తమయానందమును బ్రకటించి తెలిపినందులకుఁ గృతజ్ఞుఁడను. శ్రీవారు జయదేవ కృతాష్టపదుల నాంధ్రీకరించిన కవులఁగూర్చి పేర్కొనలే దని తెలిపిరి. నావ్యాసమం దాయాయంశములకుఁ దావు గలుగకపోవుటచే నా ప్రశంస వదలితిని. శ్రీవారు రచించిన యాంధ్రగీతగోవిందము చూచుటకు నాకును ముదావహము. వారు తీసికొనిన రాగములు తాళములు నిప్పు డనుసరణీయములు గాఁ గాక, పూర్వపు కవుల మతము ననుసరించి యున్నయవి. దక్షిణమున శ్రీజయదేవకవియష్టపదులను గానము సేయురాగములు తాళములు నావ్యాసమునఁ దెలిపియుంటిని. ఆంధ్రలోకము వీరి తెనుఁగుటష్టపదులను బాడునప్పు డిప్పుడు వాడుకలో నున్న జయదేవుని యష్టపదుల రీతిఁ బాడిన బాగుగా నుండు నని నా తలంపు.

నావ్యాసమునందు సూచించిన తత్త్వార్థము నా తెలియురీతి విపులముగా వ్రాయుట కుద్యుక్తుఁడనై యున్నాఁడను. ప్రాజ్ఞులు తోడ్పడఁ బ్రార్థితులు. శ్రీవారును దమ రేమైనఁ దత్త్వవిషయములను సంగ్రహించి యుండిరేని దయతోఁ దెలుప వేఁడుచున్నాఁడను.

---

# ప్రాస్తావిక శ్లోకములు.

— కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు —

శ్లో. వందేతాం భారతీం దేవీం సారస్వతనికేతనామ్
కాకినాడపురారాధ్యాం నూత్నసంస్కారశోభితామ్.

శ్లో. సారస్వతసమాజేస్మిన్ సభ్యాభేదవివర్జితాః
ఏవం ప్రేమకలాబద్ధా విహరంతి పృథ క్పృథక్.

శ్లో. పాణౌ పేకాం వసుచయవరాం జ్ఞానవిజ్ఞానదాత్రీం
బాహౌ బాటుం ఘనపిడియుతాం బంతిహంత్రీం సురంధ్రామ్
హస్తే సుక్యూం పాడ.గుకలితాం బల్లబాలుం నయంతీం
చేతో గ్లాసుం మధురసకలాం మానసం హ్లాదయంతీమ్.

శ్లో. వక్త్రే చుట్టాం బహుపొగయుతాం వీతిహోత్రాభిరామాం
తాలౌ ఖిల్లీం జరదరజసం స్తోకుపత్రాంతహృద్యాం
ఘ్రాణే నస్యాం చిటికపుటికాభాసమానం ప్రశస్యాం
ధృత్వా నిత్యం విహరతి ముదా సాహితీసంఘసభ్యః.

శ్లో. పాయాద్వో భగవా న్నిత్య మకలంకదయానిధిః
భ్రాతృభావధనారోగ్యం దత్వా సంతానసంపదః.

ఓం తత్సత్.

# గ్రంథపరిచయము.

1. చిత్రవిద్యాధరము—గ్రంథకర్త బ్ర. శ్రీ. జయంతి పట్టాభిరామ శాస్త్రిగారు. దీని మూలకథ కథాసరిత్సాగరములోనిది. ఇటీవల నాగానందాదుల నిది ప్రసిద్ధమైనది. విద్యాధరచక్రవర్తియగు జీమూతవాహనుఁడింటఁ గథానాయకుఁడు. శాస్త్రులవారు మూలకథంగొని నవలాపద్ధతిని కళాపూర్ణోదయమువలెఁ జమత్కరించి పద్యములుగా రచియించి చిత్రవిద్యాధరమని పేరిడిరి. ఆఱాశ్వాసములు, 240 పుటలు. శాస్త్రిగా రుభయభాషాపండితులు, వ్యాకరణశాస్త్రవిశారదులయ్యు, ముఖ్యముగా-ఆకుండి వ్యాసమూర్తి దేశికుల శిష్యులయ్యును రేఫద్వయమైత్రి నంగీకరించుట యటుసున్నల గమనింపకుండుటయుం గని విచారించుచున్నారము. అర్థవివరణమునకై తోడ్పడు నీరెంటి నసడ్డ చేయుటయేల. ఉభయభాషాంబుల కవి యేమూలనడ్డుకొనును. విరాగియుఁ ద్యాగశీలుఁడు నగువానికథకు శృంగారాది రసములు తప్పింపవలసినపుడు సుమతికథను గల్పించి గ్రంథమును బెంపఁ గలిగినవారు చేతియభ్యాసమున వావియంతన యవివచ్చినపుడు రేఫద్వయాదులను విడనాడి పాఠకులకుఁ గొంత యసంతృప్తిని గలిగించినారు. పూర్వప్రబంధలక్షణము లన్నియు ననుకరించిన శాస్త్రిగారేలకో వీనిని వదలిరి ? విద్వదభిప్రాయములోఁ గూడ నీలోపము చూపింపఁబడినది.

ఈకృతిని జమీందారు లగు మ. రా. శ్రీ బీరవోలు రామచంద్రారెడ్డిగారికంకితము చేసియున్నారు. ఈజమీందారుల వంశము గ్రంథారంభమున విరివిగ వర్ణింపఁబడినది.

శా. ఆకృష్ణాతట మానిజాంధరణి మధ్యంబందు ధాత్రీధవా
నీకంబుం బఱికింతు వారు కవితానిర్నిద్రధారాగతో
ద్రేకస్ఫూర్తిని గాంచి మెచ్చి వినయాతివ్యక్తపుష్పాంజలుల్
నాకుం గానుకగా నొనర్తురు సముల్లాసంబు దీపింపఁగన్.

అని స్వయముగాఁ దమ సామర్థ్యమును జెప్పుకొనినారు. దీని వెల ౧—౮—౧. అమలాపురములో అడ్డాల కృష్ణమ్మగారియొద్దను నైజాములో దేశాయి ఆత్మకూరు కాశ్రేపల్లి వీరరాఘవయ్యగారియొద్దను గావలసినవారికి దొరకును.

2. శబరి—ఇదియును బై బ్ర. పట్టాభిరామశాస్త్రులువారిచే రచియింపఁబడినదే. అయిదంకములు. భక్తిరస ప్రధానమైనది. శబరి చిరకాలము నిర్గుణ బ్రహ్మోపాసనముచేసి కృతార్థురాలు గా నేరక మతంగమహాముని యుపదేశమున సగుణాత్మక బ్రహ్మస్వరూపుం డగు శ్రీరాము నుపాసించి వైకుంఠప్రాప్తి నొందిన ట్లిందు వర్ణింపఁబడినది. దీనివెల రు ౦-౧౨-౧. ఈ నాటకమును చిత్రవిద్యాధరము దొరకు చోటనే దొరకును.

3. రకారాదిరామసహస్రనామస్తోత్రమ్. బ్రహ్మయామిళాంతర్గత మగు దీనిని శ్రీ పాటమళ్ల కృష్ణంరాజుగారు ప్రకటించిరి. సంస్కృతము ౧౮ వ శ్లోకమునుండి ౧౭౦ శ్లోకము చివరవఱకు రకారాదిరామసహస్రనామములు. లోకానుగ్రహకాంక్షచే నుమామహేశ్వరులు సంవాదరూపమున వ్యక్తపఱిచినది. భక్తులు దీనిని దప్పక పఠింపందగును. ఇంకొక ప్రతినిగాంచి యందందుఁ గల ప్రమాదములను సవరించి ప్రకటింపవలసినది. ద్వితీయముద్రణమున సవరింపఁగోరుచున్నారము. తూర్పుగోదావరిజిల్లా, పిఠాపురముపోస్టు, చంద్రమపాలెములో- ప్రకాశకులయొద్ద దొరకును. వెల ౧ అణా.

4. ఆంధ్రగీతగోవిందము—రచయిత శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు (ఉయ్యూరు సంస్థానాధీశులు). ఇరువదినాలుగష్టపదులకును బద్యములు, పదములును రచియించిరి.

చ. కువలయపీడమన్ గజము కుంభము లొత్తుచు పోరువేళ తా
ప్రవిమలరాధికాస్తన శుభ స్మృతిమై క్షణమే చెమర్చి కన్
దివియుచు మూయ కంసముఖవీరులు చూచియు ఓడెనోడెమా
ధవుఁడను గెలిసంభ్రమము దార్చెఁ గృష్ణు డొసంగుమోదముల్.
(దశమసర్గాంతపద్యము.)

తుద నాంధ్రరచనా ప్రశంస యని పదేడుపద్యములఁ జేర్చిరి. వానిలో-

"గీ. పీఠపురిమహారాజులు "భేషు" యనిరి
వారికొమరులు యువరాజు "వహావ" యనిరి

సోదరులు మఱిదండ్రును "షోకె" యనిరి
సతియు హితులును పెద్దలు "సరిమె" యనిరి".

అను పద్యము కలదు. దీనిని వినిన కలువు రాసెూదించి రనుట యాశ్చర్యము గారాదు. తెనిఁగింపు సరిగా నుండనిండు, భేద ముండందుఁ గలుగనిండు, వేఱుగా దీనినిమాత్రము చదువునపు డుత్సాహము కలుగకమానదు. రాజ్యకార్యభారమగ్నులయ్యు శ్రీవా రిట్టి యనేకకావ్యముల నపుడపుడు రచించి లోకోపకార మొనర్చుచుండుట ప్రశంసార్హము.

5. జవాహర్లాలు వ్యాసములు.

గ్రంథకర్త: కొమాండూరి శఠకోపాచార్యులుగారు ఎం. ఏ., బి. యల్. కాకినాడ.

గ్రంథకర్త లిదివఱలో సుప్రసిద్ధులగు వెల్సుగారి గ్రంథము జగత్కథ నాంధ్రీకరించియు, తాతాచరిత్రము, నెహ్రూచరిత్రమును రచించియు, నాంధ్రులకుఁ బరిచితులు. వీరి స్వదేశాభిమానము, భాషాభిమానమును వీరిని బురికొల్పి తిరుగనీగ్రంథమును రచింపఁజేసినవి. నేఁటి రాజకీయరంగమున సుప్రసిద్ధహైందవనాయకులును, కాంగ్రెసు ప్రెసిడెంటు నగు జవాహర్లాలుగారి యుపన్యాసములు, వ్యాసములు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంధ్రీకరించి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులయిరి. మూలమును జదివినపాఠకులు వీరి పరిశ్రమమును గుర్తింపక మానరు. జవాహర్లాలుగారి యాంగ్లభాష ననువదించుట కష్టసాధ్యము. అట్టి సందర్భమున నీగ్రంథము రచించుటచే గ్రంథకర్తలు ప్రశంసనీయులు. ఈగ్రంథమున భాషాసమస్య (The problem of language) అను వ్యాసము ముఖ్యమైన వానిలో నొకటి.

హిందూస్థానీభాషను మనదేశమునందు ముఖ్యభాషగ నంగీకరింపవలయు నని వీరియభిప్రాయము. హిందీ, ఉర్దూ విద్యలను రెంటిని నంగీకరించిరి. జాతీయైక్యతకొఱకు దాక్షిణాత్యులు దమభాషలలో నేదేని యొక దానిని సామాన్యభాషగా నంగీకరింపవలయునని వీరు సూచించిరి. విద్యా

విధానమున స్వభాషయే ముఖ్య మనియు, నాభాషయందే కళాశాలల వఱకును విద్యను బోధింపవలయు ననియు వీరు హెచ్చరించుచున్నారు. విదేశీయభాషలను నిర్బంధముగ నేర్పరా దనియు, నన్నిభాషలనుండియు వివిధగ్రంథములను సేకరించి, మనభాషల భాషాంతరీకరణ మొనర్పవలయుననియు వీరు వ్రాసియున్నారు. 'మనసాహిత్యము' అను చివరివ్యాసమున నేయేవిషయములలో మనసాహిత్యము వృద్ధిని గాంచవలయునో వీరు సూచించిరి. వీరి కాంగ్రెసు ఉపన్యాసములు, మన గమ్యము, (Whither India) మున్నగువ్యాసములును గలవు. వెల 6 అణాలు. గ్రంథకర్తయొద్ద దొరకును.

6. సుభాష్ చంద్రబోసు జీవితము ఉపన్యాసములు.

ఇదియు శ్రీ కొమాండూరి శఠకోపాచార్యులుగారిచే రచియింపఁ బడినదే. 1938 సంవత్సరము హరిపురకాంగ్రెసున కధ్యక్షుండైన బోసు గారి జీవితచరిత్రము బెక్కుగ్రంథములనుండియును, వార్తాపత్రికలనుండియు గ్రహించి శ్రమపడి గ్రంథకర్త లీ గ్రంథమును రచించిరి. హరిపురమున వీ రిచ్చినయుపన్యాసమునుగూడఁ జేర్చిరి ఇట్టి గ్రంథము లాంధ్రమున నింకను రచింపఁబడవలయును ఆంధ్రయువకుల హృదయమున స్వదేశభాషాభిమానము నుద్రేకించుట కిట్టి జీవితచరిత్రములు ముఖ్యములు. ప్రపంచమున విఖ్యాతినొందిన మహాపురుషుల జీవితచరిత్రకరమున నే యున్నతాదర్శములు మనకుఁ గలుగుచున్నవి. గ్రంథకర్త లింకను దమశక్తిని వినియోగించి యుత్తరోత్తరాధికముగ దేశసేవయు, భాషాసేవయు నొనర్తురుగాక యని కోరుచున్నాము.　　　　గ్రంథకర్తలకు వ్రాయవలయును.

7. సాహిత్యకల.

సాహిత్యవిశారద శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచే రచింపఁ బడినది. వీ రిదివఱలో శ్రీరామవిజయమున రెండుకాండలను, శ్రావణవిజయము, సుకృతవిజయమునను నుపాఖ్యానములను రచించిరి. ఈనూతనగ్రంథమునఁ బ్రథమభాగమున సాహిత్యనిర్వచన మొనర్చి ద్వితీయమున

నాధునికాంధ్రసారస్వతమున నెట్టి నీతిబాహ్యములును, నర్థశూన్యము లునగు రచనములు వెలువడుచున్నవో వీరు సూచించియున్నారు. సంగీతసాహిత్యములకుఁ గల పరస్పరసంబంధము సూచింపఁబడినది. ఉత్తమ సాహిత్యమునకుండవలయు విషయములు పెక్కులు వివరింపఁబడినవి. గ్రంథాంతమున వీరిచ్చిన గద్యపద్యభాగములఁ గాంచినచో నాధునికసారస్వత మెట్టిదుర్దశ గాంచుచున్నదో వ్యక్తమగును. శాస్త్రిగారి కల మాయాతావుల నిశితఖడ్గసాదృశ్యమును గాంచినది. సాహిత్యాభివృద్ధిని గోరినచో నిట్టి విమర్శనములు నావశ్యకములే. దీనినిబట్టి శ్రీ శాస్త్రిగారికి నవ్యసాహిత్య మనినఁ గిట్ట దనుట పొరపాటు. అందును నుత్తమకవిత యందందుఁ గలదని వీరి యాశయము. కాని దోషములఁ జూచినకొలఁది, నీతిబాహ్యమున రచింపఁబడిన వ్రాతలఁగనినకొలఁది వీరి హృదయావేదన మీగ్రంథరూపమును దాల్చినది. ఆధునికకవిమిత్రు లిందలి విషయముల సద్భావమున గ్రహింతురుగాక. కావ్యము నీతిబోధకముగ నుండవలయునా యనువిషయమున- ప్రాచ్యపాశ్చాత్యులకు నభిప్రాయభేదము కలదు. హైందవసారస్వతముల నీపద్ధతి పాశ్చాత్యసారస్వతసంఘట్టనము వలనఁ గలిగినది. సాహిత్యమున నీతి, యున్నతాదర్శము లుండవలయు ననియే ప్రాచీనభారతీయుల యభిప్రాయము. నేటిభాషయు నర్థముకాని విచిత్రవర్ణనములతోడను, పదజాలముతోడను రాజిలుచున్నదని గ్రంథకర్తలు వ్రాసిరి. కవిత కనుకరణము మాత్రము ప్రధానము కాదు. పాశ్చాత్యభాషలనుండి మనభాషల వివిధవిషయములను గ్రహించు టుచితము కాని యందలి దోషములను గైకొనరాదు. ఈ గ్రంథము శ్రీజయపురాధీశ్వరుల కంకితము.

వెల ౧ అణాలు గ్రంథకర్తలకు, కాకినాడ వ్రాయవలయును.

---

౭౦. అఙ్గుళ్యగ్రం తే నైవాఙ్గుళ్యగ్రేణ స్పృశ్యతే.

చిటికెనవ్రేలు కొన తన్నుఁ దాను ముట్టుకొనలేదు "A man cannot mount his own shoulder" అను నింగ్లీషుసామెత కిది సరిగా నున్నది. "The edge of a sword cannot cut itself." అనునది కూడ నిట్టిదే.

ఇది న్యాయవార్తికతాత్పర్య టీకలో నున్నది. ౪౬౬ పుట— "యథాఙ్గుళ్యగ్రం తేనైవాఙ్గుళ్యగ్రేణ స్పృశ్యతే. ఏవం జ్ఞానం న తేనైవ జ్ఞానేన గ్రహీతుం శక్యతే".

౭౧. అఙ్గుళ్యగ్రే హస్తియూథశత మస్తి.

వ్రేలికొనను వందలకొలఁది యేనుఁగుగుంపు లున్నవి. ఇది యొక దుర్ఘటకార్యమును దెలుపును. చిత్సుఖి—అధ్యాయము-౩ ౨.

ఉక్తం చైతత్ దమ్బకేన—"య దాప్తోఽపి కస్మైచి దుపదిశతి న త్వయాననుభూతార్థవిషయం వాక్యం ప్రయోక్తవ్యం" యథాఽఙ్గుళ్యగ్రే హస్తియూథశత మాస్త ఇతి."

౭౨. శ్లో. అత్యన్తబలవన్తోపి పౌరజానపదా జనాః
దర్బలై రపి బాధ్యన్తే పురుషైః పార్థివాశ్రితైః

పౌరజానపదులు బలవంతులైనను రాజాశ్రయణము గల దర్బలులచే బాధింపఁ బడుచున్నారు.

"యత్ర నిర్బలే నాపి ప్రబలసహాయేన ప్రబలో బాధ్యతే తత్ర "అత్యన్తబలవన్తోపి పౌరజానపదా జనాః దుర్బలై రపి బాధ్యన్తే పురుషైః పార్థివాశ్రితైః." అని మీమాంసాన్యాయప్రకాశికలో నున్నది.

౭౩. మరణాయ గృహీతోఽఙ్గచ్ఛేదం స్వీకరోతి.

వధకుఁ బట్టుకొనఁబడినవాఁ డంగచ్ఛేదమున కొప్పుకొనును. ఈ న్యాయము బోధిచర్యావతారము (౬-౭౩) లో నున్నది. "మారణీయః కరం ఛిత్వా ముక్తశ్చేత్ కి మభద్రకమ్ మనుష్య దుఃఖై ర్నరకాన్ముక్తశ్చేత్ కి మభద్రకమ్."

౭౪. మాలతీగన్ధగుణవిన్న దర్భే రమతే హ్యాళిః.

మాలతీకుసుమగంధము నెఱింగిన తుమ్మెద దర్భయందుఁ బ్రీతి కలది కాదు. ఇది ఉపమితిభావప్రపంచకథయందు (౧౦౩౧)న్నది.

"అతఏవాగమజ్ఞస్య యా క్రియా సా క్రియోచ్యతే
ఆగమజ్ఞోపి యస్తస్యాం యథాశక్త్యా ప్రవర్తతే
చింతామణిస్వరూపజ్ఞో దారిద్ర్యోపహతో నహి
తత్ప్రాప్త్యుపాయవైచిత్ర్యే సత్యన్యత్ర ప్రవర్తతే
నచాసౌ తత్స్వరూపజ్ఞో యోన్యత్రాపి ప్రవర్తతే
మాలతీగన్ధగుణవిన్న దర్భే రమతే హ్యాళిః".

౭౫. మాషరాశిప్రవిష్టమషీన్యాయము.

మినుములకుప్పలోనున్న మసి-రెండును నల్లగానుండును గావున రెండింటికి భేదము తెలియదు. ఇది శూద్రకుని మృచ్ఛకటికనాటకము (౪౦ పుట) లో నున్నది. "భావబలవత్యన్ధకారే మాషరాశిప్రవిష్టేవ మషీగుటికా దృశ్యమానైవ ప్రణష్టా వసంతసేనా"

ఉదయనుని కిరణావళిలో (౭౯ వ పుట) "న తు మాషరాశిప్రవిష్టమషీవన్మహాప్రకాశసమాహారా న్నేక్ష్యతే".

౭౬. మిథిలాయాం ప్రదీప్తాయాం నమే కిఞ్చిత్ప్రదహ్యతే.

మిథిలాపురము గాలిపోవుచున్నను నాదియేమియుఁ గాలిపోలేదు.

ఇది శాంతిపర్వము (౧౭౮వ) అధ్యాయములో—"అనన్తం బత మే విత్తం యస్య మే నాస్తి కిఞ్చన, మిథిలాయాం ప్రదీప్తాయాం నమే కిఞ్చిత్ప్రదహ్యతే"—శంకరాచార్యుల బృహదారణ్యకోపనిషత్తులో (౧-౪-౧౫) నున్న "న హాస్య కర్మక్షీయతే" అను వాక్య వ్యాఖ్యానములో నీ వాక్య ముదాహరింపఁ బడినది. "న హాస్య కర్మక్షీయతే కర్తా భావాదేవేతి నిత్యానువాదః యథా విదుషః కర్మక్షయలక్షణం సంసారదుఃఖం సన్తతమేవ నతథా తదస్య విద్యత ఇత్యర్థః "మిథిలాయాం ప్రదీప్తాయాం న మే దహ్యతి కిఞ్చనేతి యద్వత్" ఖండనఖండఖాద్యమునఁ గూడ నీవాక్యమే చెప్పఁబడినయది. "తథాహి మిథిలానాథో ముముక్షు ర్ధర్మః పురా, అహేదం మిథిలాదాహే నమే కిఞ్చనదహ్యతే".

### ౭౭. ముణ్డితముణ్డో నక్షత్రాన్వేషణమ్.

క్షౌరము చేయించుకొన్నపిదప నేఁటినక్షత్రము క్షౌరమునకు మంచి దగునా కాదా యని యడుగుట. ఇది న్యాయమంజరి ౧౭౧వ పుటలో నున్నది "యత్పునః కాలాన్తరే తన్నిశ్చయకరణే దూషణ మితరేతరాశ్రయత్వం వా ముణ్డితశిరో నక్షత్రాన్వేషణవ ద్వైయర్థ్యం వేతివర్ణితం తత్ర దృష్టే విషయే ప్రామాణ్యనిశ్చయ పూర్వికాయాః ప్రవృత్తే రభ్యుపగమా న్నేతరేతరాశ్రయం చక్రకం వా" "న హి వివాహానన్తరం వరపరీక్షా క్రియతే"—"కృతే కార్యే కిం ముహూర్తప్రశ్నేన" అను నీ రెండును దీనితో సమానముగా నున్నవి.

### ౭౮. మూషాసిక్తతామ్రన్యాయము.

కరఁగించి మూసలోఁ బోసిన రాగి.-"చక్షురాది ద్వారా బహిర్నిస్సృతస్యాన్తఃకరణస్య మూషాసిక్తతామ్రన్యాయేన విషయాకారతా భవతి. తదుక్తం భగవత్పాదైః—

శ్లో. మూషాసిక్తం యథా తామ్రం తన్నిభం జాయతే తథా
రూపాదీన్వ్యాప్నువచ్చిత్తం తన్నిభం దృశ్యతే ధ్రువ-మితి.

శంకరాచార్యులవారి యుపదేశసాహస్రి ౧౪-౩. ఈ న్యాయము బ్రహ్మసూత్రభాష్యమందుఁ (౧-౧-౧౨) గూడనున్నది. "మూషానిషిక్తద్రుతతామ్రాది ప్రతిమావత్"

### ౭౯ మూషికభక్షితబీజాదా వఙ్కురాదిప్రార్థనా.

ఎలుక కొఱికిన గింజలనుండి మొలకలు పుట్టవలె నని కోరుట ఇది సర్వదర్శనసంగ్రహములో బౌద్ధదర్శనమం దున్నది. "ద్వితీయే స్థాయిత్వవృత్త్యాశా మూషికభక్షితబీజాదా వఙ్కురాది జననప్రార్థనా మనుహరేత్"

### ౮౦. మృతం కుణ్డలిన మాసాద్య కాకోపి గరుడాయతే.

చచ్చిన క్షుద్రసర్పమును బట్టుకొని కాకికూడ గరుడునివలె నగును. ఇది బోధిచర్యావతారములో ౭-౨౨ మొదటి యర్ధశ్లోకము "ఆపదా బాధతేఽల్పాపి మనో మే యది దుర్బలమ్"

౮౧. యః కారయతి స కరో త్యేవ.

ఒకనిచే నొకపని చేయించువాఁ డొకనిని జేయువాఁడే.

శంకరాచార్యులు ముండకోపనిషత్తును వివరించుచు నిట్లు వ్రాయుచున్నారు. "ఏవ మేకే నాపి పిబతా ద్వా పిబంతా వుచ్యేతే జీవ స్తావ త్పిబ తీశ్వర స్తు పాయయతి పాయయ న్నపి పిబ తీ త్యుచ్యతే పాచయిత ర్యపి పక్తృత్వప్రసిద్ధిదర్శనాత్."

౮౨ య త్కృతకం త దనిత్యమ్.

ఎద్ది కృత్రిమమో యది యనిత్యము. అనఁగా నెద్ది యాది కలదో యది యంతము కలది. కాని నైయాయికుల ప్రధ్వంసాభావమునకు మాత్ర మాది కలదు గాని యంతము లేదు. ఈన్యాయము న్యాయబిందువు ౧౦౮ పుటలో నున్నది. "అతో య త్కృతకం తదనిత్య మిత్యాది న్యాయానుసారేణానిత్యత్వాదికం మోక్షస్య ప్రాప్నోతి."

౮౩. య దశ్వేన హృతం పురా త త్పశ్చా ద్గర్దభః కేనోపాయేన ప్రాప్తుం శక్నుయాత్.

మొదట గుఱ్ఱముచేఁ దీసికొని వెళ్లఁబడిన దానిని గాడిద యే యుపాయముచే నతిక్రమింపఁ గలదు. దీనిని తంత్రవార్తికమునుండి తీసి గ్రంథకర్తలు న్యాయమంజరియం దుంచిరి. (౨౦౨ పుట) ఇది శ్రుతిస్మృతిప్రామాణ్యతారతమ్యవిమర్శయందు వినియుక్తమైనది. ఈవిషయము తంత్రవార్తికములో వాక్యద్వయముచేఁ జర్చింపఁబడినది.

౧. న చ శ్రుతిజనితప్రత్యయస్య స్మృతిజనితో బాధకత్వం ప్రతిపద్యతే, స్మార్తస్య బాధక శ్శ్రౌతో బలవత్త్వా త్ప్రతీయతే। ప్రత్యక్షే చానుమానే చ ప్రాగేత ద్వ్యవధారితమ్.

౨. యో హి ప్రథమం శ్రుతి మశ్రుత్వా స్మృతి మేవైకాం పశ్యతి త స్యాప్రతిహతశ్రుత్యనుమానే వృత్తేఽన పశ్చా చ్ఛ్రూయ శ్వ ణాపి శ్రుతి స్సా త్ప్రతిబంధికా గర్దభే నాపనీతం హి హరే న్నామాశ్వరా ద్గతః."

౮౪. రాజపుత్రవ్యాధన్యాయము.

రాజపుత్రుఁడు వ్యాధునియింటిలోఁ బడి తన్ను వ్యాధునిగాఁదలంచుకొనియెను.

శంకరాచార్యు లీకథను బృహదారణ్యకోపనిషద్భాష్యములో ౨-౧-౨౧ నిట్లు వ్రాసెను. "తలిదండ్రులచే విడువఁబడిన రాజపుత్రుఁ డొకఁడు వ్యాధునిచేఁ బెంపఁబడెను వాఁడు యౌవనము వచ్చువఱకు వ్యాధగృహమందే యుండి తన్ను వ్యాధపుత్రునిగాఁ దలంచుచుండెను. ఇతలో యాథార్థ్యమెఱిఁగినయొకదయాళువు వానినిఁ జూచి "అయ్యా! నీవు వ్యాధపుత్రుఁడవు గావు. మహారాజపుత్రుఁడ వని బోధించి వానిని వానితలిదండ్రులయొద్దఁ జేర్చెను.

సురేశ్వరాచార్యులు తనవార్తికమం దీన్యాయము ననేకపర్యాయము లుదాహరించెను. "త చ్చావిద్యా నిరాస్యైవ వ్యాధభావనయా ఞ్చితః। రాజసూనోః స్మృతిప్రాప్తౌ వ్యాధభావో నివర్తతే"-౭౧ పుట.

౮౫. రుధిరసంకర్కవతో విషస్య శరీరే ప్రసర్పణమ్.

రక్తముతోఁ గలిసిన విషమువలెఁ జెడ్డపని శీఘ్రముగా వ్యాపించును. ఇది బోధిచర్యావతారము ౭-౬౯ పుటలో నున్నది

శ్లో. "విషం రుధిర మాసాద్య ప్రసర్పతి యథా తనౌ
తథైవ ఛిద్ర మాసాద్య దోష శ్చిత్తే ప్రసర్పతి"

౮౬. రుమాక్షిప్తకాష్ఠన్యాయము.

ఉప్పుకఱ్ఱలోఁ బడవేసినకఱ్ఱ—ఉప్పుకఱ్ఱలోఁబడిన యేవస్తు వైన నుప్పయిపోవును. ఇది తంత్రవార్తికము ౧౩౨ పుటలో నున్నది.

శ్లో. యథా రుమాయాం ꣳ వణాకరేషు
మేరౌ యథా వోజ్జ్వల రుక్మభూమౌ
యజ్జాయతే తన్మయ మేవ తత్స్యాత్
తథా భవే ద్వేదవి దాత్మతుష్టిః.

రుమయనఁగా లవణఖనిభూయిష్ఠదేశవిశేషము.

౮౭. రూఢి ర్యోగ మపహరతి.

రూఢి యోగమును బాధించును. వివరణప్రమేయసంగ్రహము ౧౩౮-౧౩౯ పుటలలో నీవిషయము చర్చింపఁబడినది. జిజ్ఞాసాసూత్రమందు "నను జిజ్ఞాసాశబ్దః విచారే రూఢః భాష్యకారాదిభి స్తత్ర

విచారవివక్షయా ప్రయుక్తత్వాత్ అతో రూఢి ర్యోగ మపహర తీతి న్యాయేన అవయవార్థస్వీకారో న యుక్తః తతోఽథ శబ్దోఽ స్యధికారార్థో భవిష్య తీతి విచారస్య ప్రారబ్ధుం శక్యత్వా దితి చే న్నైవం రూఢి ర్యోగ మపహర తీతి న్యాయ స్యా త్రాఽప్రసరాత్.

## ౮౮. రేఖాగవయన్యాయము.

రేఖాకారముగానున్న గవయమృగము—రఘునాథవర్మ యీన్యాయము నిటు వివరించెను. గవయమృగ మెట్టిదని గ్రామవాసి యడుగఁగా నొక యారణ్యకుఁడు వ్రాసి యిట్లుండు నని చెప్పెను. వాఁడు ఋజుబుద్ధిగలవాఁ డగుటచే నదియే గవయ మనుకొనెను. తరువాత కొంతకాలమునకు వాఁ డరణ్యమునకుఁ బోయి గవయమృగమును బ్రత్యక్షముగాఁ జూచి రేఖాగవయబుద్ధిని విడిచిపెట్టె నని యొక లౌకికగాథ కలదు. ఆరీతిగా "ఏష పురుషః" ఇత్యాది శ్రుతితాత్పర్య మెఱుఁగని వాఁ డనాత్మ నాత్మనుగాఁ దెలిసికొనును.

వేదాంతకల్పతరుపరిమళమందు ౩౬౩ వ "పుటలో యథాతాత్త్వికారున్ధతీప్రతిపత్త్యుపాయతయా నానాపురుషైః కల్ప్యమానాయాం తత్రాపి చోద్యదీచ్యాది నక్షత్రరూపాయాం స్థూలారున్ధత్యా యథా వా రేఖాగవయన్యాయేన నిత్యశబ్దప్రతిపత్త్యుపాయతయా నానావ్యాకరణైః పరస్పరభిన్నప్రకృతిప్రత్యయవిభాగేన కృత్రిమశబ్ద ఇతి భావః."

మహాభాష్యవ్యాఖ్యాన మైన కయ్యటమందు ౧-౧-౪౬. దీనికి మఱియొక యుదాహరణము-"అసత్యప్రకృతిప్రత్యయోపదేశేన సత్యస్య పదస్య వ్యుత్పాదనం క్రియతే రేఖాగవయే నేవ సత్యగవయస్య".

## ౮౯. లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః.

ప్రత్యక్షాదిప్రమాణములచేతను లక్షణములచేతను వస్తుసిద్ధి. యథాగంధవత్త్వాదిలక్షణములచేతనుప్రత్యక్షప్రమాణముచేతను పృథివ్యాదిసిద్ధి. రఘునాథవర్మ యీన్యాయము నీదిగువవాక్యము నుదాహరించెను. "ఏవ మగ్నీంద్రాదిత్యేశ్వరవాదా అపి త న్మాహాత్మ్యోపపాదకశ్రుతి

తిహాసపురాణవచనా న్యాశ్రిత్య త త్రైవ ప్రపంచితా జ్ఞేయాః తత్తద్వ క్తా అపి సర్గాది హేతుత్వరూపేశ్వరలక్షణం శ్రుత్యాదిప్రమాణం చ తత్రతత్ర దర్శయన్తో లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధి రితి న్యాయేన ఈశ్వ రత్వం సాధయన్తి".

### ౯౦. లాఙ్గలం జీవనమ్.

నాఁగలియే జీవనము- అనఁగా దున్నుకొని బ్రతుకుట- ఈన్యా యము సురేశ్వరాచార్యుని సంబంధవార్తికము (౯ పుట) లో నున్నది.

" యథో క్తవిద్యాబోధిత్వా ద్గ్రంథోపి త దభేదతః
భవే దుపనిషన్నామా లాఙ్గలం జీవనం యథా".

### ౯౧. వధూమాషమాపనన్యాయము.

కోడలిచే మినుములు కొలిపించుట. ఈన్యాయముతో నొకకథ సంబంధించి యున్నది. లోభి యగు నొకవృద్ధబ్రాహ్మణుఁడు కురూపి యగుతనభార్యచే ననుదినము భిక్షుకులకుఁ బిడికెఁడేసి మినుముల నిప్పించుచుండెడివాఁడు. ఆబ్రాహ్మణుఁడు కొంతకాలమునకుఁ దన కుమా రునకిఁ జక్కనికన్యక నొకదానిని వివాహము చేసి దానిచేత నీయాచకు లకు మినుముల నిప్పించుట మొదలిడియెను. సుందరి యగు నాచిన్న దానినిఁ జూచుటకై మినుము లక్కఱ లేనివారుకూడ వానియింటికి వచ్చు చుండిరి. మునుపటికంటె మినుములు హెచ్చువ్యయమయ్యెను.

ఈన్యాయము శ్రీశంకరుని యాత్మతత్త్వవివేకము ౧౭౭వ పుటలో నున్నది. "న చా నవస్థా అవశ్యవేద్యత్వా నభ్యుపగమా న్నిశ్చయవ దన్యథాత్వ నిశ్చయనిశ్చితస్య నాద్యనిశ్చయో పి సిద్ధ్యేత న చాసావాత్మ న్యనిశ్చయ ఇతి త దిదం వధూమాషమాపనవృత్తాంత మనుహరతి."

### ౯౨ వనసింహన్యాయము.

సింహము వనమును రక్షించును. వనము సింహమును రక్షించు ను. పరస్పరము సహాయమును చేసికొను రెండువస్తువులవిషయమై యీ న్యాయము ప్రవర్తించును. ఇదియును హ్రాదనక్రన్యాయమును సమాన

ములు. ఈరెండున్యాయములు వేదాంతకల్పతరుపరిమళములో ౧౦౦ వ పుటలో నున్నవి. "సోయం వనసింహప్రాదనక్రన్యాయః. కిరాతైర్హ్వాంతుం శక్యోపి సింహో మహద్వనం శరణం ప్రవిశ్య దురాధర్ష స్తేభ్యో న బిభేతి. వనం చ తత్సింహాధిష్ఠా నానుగృహీతం తైర్దుష్ప్రవేశం భవతి" ఈన్యాయ ముద్యోగపర్వములో ౩౮ వ అధ్యాయములో ౭౭వ శ్లోకముందున్నది.

"న స్యా ద్వన మృతే వ్యాఘ్రో వ్యాఘ్రా నస్యుః ఋతే వనాత్
వనం హి రక్ష్యతే వ్యాఘ్రైః వ్యాఘ్రాన్ రక్షతి కాననమ్".

౯౩. వృక్షప్రకమ్పనన్యాయము—చెట్టును గదల్చుట.

ఒకమనుష్యుఁడు చెట్టెక్కెను. మఱికొందఱు దిగువ నున్నారు. దిగువ నున్నవారిలో నొకఁడీకొమ్మను గదల్పు మని వ్రేలితోఁ జూపెను. మఱికొందఱు మఱికొన్ని కొమ్మల నూఁపుమని కోరిరి. అందుపై నా చెట్టుమీఁదనున్నవాఁ డొక్కమాఱా చెట్టు నంతయును గదలించి వారి కోరికలను నెఱవేర్చెను. రఘునాథుఁ డీన్యాయప్రవృత్తి నిట్లు కనపర్చెను. "యత్త్రైకస్య వస్తునో మతభేదేన బహూని రూపాణి తత్తచ్ఛాస్త్రేషు ప్రతిపాద్యమానా న్యుపలభ్య క్రియా హి వికల్ప్యతే న వస్త్వితి న్యాయాత్ వస్తుని వికల్పాసమ్భవం మత్వా విరుద్ధానాం సముచ్చయస్యా ప్యసంభవేన తే ష్వేకమతప్రతిపాదితం సర్వావిరుద్ధం వస్తు స్వీక్రియతే తత్ర వృక్షప్రకమ్పనన్యాయః ప్రవర్తతే."

౯౪. అశ్వతరీగర్భన్యాయము.

గాడిదవలన నాఁడుగుఱ్ఱమునకుఁ బుట్టినదానికి నశ్వతరియని పేరు. తెలుఁగున వేసడ మని పేరు.

ఇది కడుపుతో నుండి యీనినవెంటనే మృతి నొందును. రఘునాథుఁడు దీని నిట్లు వివరించుచున్నాఁడు. "న స్వజ్ఞానకార్యాంతఃకరణవృత్త్యాత్మకం జ్ఞానం కథం స్వకారణీభూతజ్ఞాననాశాయ స్యా దుపజీవ్యవిరోధా దితి చే దశ్వతరీగర్భన్యాయా దిత్యవేహి."

చతుష్ఖండలక్షణము.

క. నలజములం దొక్కటి వ
 ర్తిలి కడుచదుగులను గగము రెండవయదిగా
 వెలయుఁ జతుష్ఖండం బది
 యలఘుపదము పంచమగణ మాదిగఁ జనువన్. ౯౦

నలచతుష్ఖండమును, జగణచతుష్ఖండమును.

క. నల మది రెండవగణమై
 తొలఁగక యుఱనున్న నలచతుష్ఖండ మగున్
 వెలయఁగ నటువలె జగణము
 తొలఁగక యుండిన జగణచతుష్ఖండ మగున్. ౯౧

౧. నలచతుష్ఖండము.

క. తనర న్వినుతులు చేసెద
 ఘనుని న్బలసహితవజ్రకాయు న్బలదున్
 వినయున్ జయనయభద్రున్
 హనుమన్ దళితాసురేంద్రు నధిపుం జెలువున్. ౯౨

౨. జగణచతుష్ఖండము.

క. కొలుతుం గపీంద్రు సొంపునఁ
 దలతున్ శ్రీరామభక్తిధనుని స్థిరున్
 నలినాప్తకోటితేజః
 కలితు న్శైలోపమానకాయున్ శూరున్. ౯౩

వ. వెండియు నృత్తగర్భిత దండకంబులు, భాస్వరవిలసితకందద్వయముఁ, గ్రౌంచపదకందద్వయము, మణిగణనికరకందముఁ, బ్రమితాక్షరకందము, నాదిగాఁ బెక్కు విధంబులు గలవు- వానిలక్షణంబులు లక్ష్యముఖంబుల సుప్రసిద్ధంబులై యుండు- నిది యార్యాకరణం బింకఁ దెనుంగున విషమగీతిత్రయంబును సమగీతిద్వయంబును గలదు, తత్పంచగీతిలక్షణంబులు వివరించెద. ౯౪

గీ. వరఁగ నెత్తుగీతి, పవడగీతియు, మేల
 నాఖ్యగీతి, యివి త్రయంబు విషమ

గీతులగును; తేటగీతి, యాటవెలంది
కృతుల రెండివి సమగీతు లగును. ౯౫

౧. విషమగీతులయందు నెత్తుగీతి.

యతులుఁ బ్రాసములు నమర
పతియొకనిపయి పద్మ
హితు లిద్దఱుగను నిడినఁ
గృతిఁ దగు నెత్తుగీతి. ౯౬

౨. పవడగీతి.

పవడగీతి యగును బ్రాసంబు లొనగూర్చి
రవులు మువురు నమరరాజు లిద్ద
ఱవల నేగురర్థు లర్ధంబులై నమూఁ
డవగణంబు యతులఁ బవనతనయ. ౯౭

3. మేలనగీతి.

శైలసంఖ్య హగణ మైనఁ జాలు నగణ మైనఁ
జాలు నల్లు నహాలు గలసి చరణ మైనఁ జాలు
నాలుగింటిపైని వల్లు నయముమీఱఁ గూర్ప
మేలనాఖ్యగీతి యనఁగ మెఱయుఁ బ్రాస మొదవి. ౯౮

సమగీతులందు తేటగీతి.

౧. ఇనుఁ డొకఁడు నిద్దఱింద్రులు నినయుగమును
గ్రమము దప్పక నాల్గుపాదముల నుంచి
త్రిగణములమీఁద యతులురాఁ దేటగాఁగ
రీతితోఁగూర్ప నిది తేటగీతి యగును ౯౯

అందు, ఆటవెలఁది.

౨. ఇనులు మువురు నిద్దఱింద్రులు బేసియం
ఘ్రులను సర్వనైదుగురును రవులు
పూని యతులు మూఁటిపైనిడఁ గా నది
యాటవెలఁదిగీతి యంఘ్రి కృతుల. ౧౦౦

వ. ఇది గీతిప్రకరణం బగు నింకఁ గొన్ని యక్కరజాత్యాదిలక్షణంబులు వివరించెద. ౧౦౧

క. అక్కర లనఁదగు నైదు మ
హాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, మఱి య
ల్పాక్కర యు, నంతరాక్కర
యెక్కువ సత్కవులు కృతుల నిడుదురు వీనిన్. ౧౦౨

౧. ఇందు మహాక్కర.
ఇనుఁడు మున్నుగాఁ దరువాత వాసవు- లేగురు చంద్రుఁ డొక్కరుఁడు పైని
యొనర నంఘ్రికి నేడుగణంబులై -యుండు రెండవచోట నాల్గింటను
వనజహితగణంబైన వచ్చి- వరుసతో నెడసొచ్చు నిట్టురాఁగ
హనుమనాల్గవగణముపై వళ్లురాఁగ-నగుమహాక్కరపేర నిదికృతుల.

౨. మధ్యాక్కర.
సురవరద్వయి సూర్యుఁగూడ- జోడించి మృదురీతితోడ
గరిమతో నాఱేసియైన- గణముల నొక్కొక్కయంఘ్రి
విరచించి ప్రాసముల్ గూర్చి- విరతి గణత్రయముపైని
సరవి నుంచిన నొప్పుఁ బవన-జాత మధ్యాక్కరంబునకు. ౧౦౪

3. మధురాక్కర.
ఇనుఁడు నింద్రత్రయంబును-నింనుతోఁ గూడుకొని
యొనయ నొక్కొక పాదమై-యేనుగణములతోడఁ
బెనఁచి మూఁటిపై వళ్లుంచి- బెరయఁ బ్రాసము లిడిరఁ
దనరు మధురాక్కరం బన-దనుజాహినీలకంఠ. ౧౦౫

౪. అల్పాక్కర.
ఇరువు రింద్రులు నొక్క-మృగధరుండు
పరఁగ నంఘ్రిని నిల్వఁ-బ్రాసంబుతో
విరతితో ద్విగుణము-వెలయఁజేయ
ధరణి నల్పాక్కర-దగు హరీంద్ర. ౧౦౬

౫. అంతరాక్కర.
రవియు నిద్ద ఱమర్త్య-రాజులును రాజు
పవనపుత్ర యీనాల్గు-పాదముల రాఁగఁ

నవని విరచింప నంత-ర్యాక్కర యనంగ
నవును ద్రిగణాంతవర్ణమ-య్యతులుగాఁగ. ౧౦౭

వ. వైతాళీయజాతివృత్తంబులందు, వైతాళీయంబును, నౌపచ్ఛందసంబును, నాపాతళికయు, దక్షిణాంతికయు, నుదీచ్యవృత్తియుఁ, బ్రాచ్యవృత్తియుఁ, బ్రవర్తకంబును, బరాంతికయుఁ, జారుహాసినియు నన నివి మొదలుగాఁ గలవృత్తంబు లనేకవిధంబులం బ్రవర్తిల్లు నందు వైతాళీయలక్షణంబు లెట్టు లనిన. ౧౦౮

గీ. జరగుఁ గృతుల వైతాళీయజాతులందు
రగడభేదంబు లందు నేర్పఱచియున్న
గురులు రెండేసి లఘులుగాఁ గూర్పవలయు
లక్షణజ్ఞులసంజ్ఞచే నక్షయారి. ౧౦౯

గీ. అసమపదముల లఘుషట్క మైనమీఁద
సమపదంబుల లఘ్వష్టకమున కవలఁ
బెనపవలయు వైతాళీయమునను వల్లు
ప్రకటకరుణానివాస శ్రీరామదాస. ౧౧౦

౧. వైతాళీయము.

ఋతుగజలర్ రేఫవంబు లా
యతమై యసమ సమాంఘ్రు లంటి సం
మితమై లలు మీఁద రాక పా
లితయశ వైతాళీయవృత్తమా. ౧౧౧

౨. ఔపచ్ఛందసము.

ధర లఘువుల్ దవ్వుకర్ రయంబుల్
జరణంబుల పై సంధిలం గవీంద్రుల్
విరచింపఁగ వింత లై తలిర్పన్
సరవిని నౌపచ్ఛందసంబు మించున్. ౧౧౨

(ఇందులకే మఱియును)

అలఘు లఘువు లాఱు నెన్నిదింటం
గల వి స్లెసఁగఁగ నయంబు లొప్పన్

అల జేసి సమాఁప్తి శేషమిట్లన్
చలిపిన నౌపచ్ఛందసంబు మించున్. ౧౧౩

3. ఆపాతళిక.

అవుఁ దల్లఘు లట్ల భకారం
బవలం గాతో నంటుకొనం ద
ర్చ విరతి నాగస్థయుతుల్ రాఁ
బవనసుతా యాపాతళికాఖ్యన్. ౧౧౪

౪. దక్షిణాంతికము.

వళుల్ లము ల్వచ్చు టట్లనై
రలన్ గముల్ పైరాన్ ద్వితీయంబులం
ద్రిలముఁ బూన్చ(దీజి)యంఘ్రులం
దలిర్చు మారుతి దక్షిణాంతికాఖ్యన్. ౧౧౫

౫. ఉదీచ్యవృత్తి.

తగ న్మనన్ దక్షిణాంతికా
ఖ్యగయుక్పద మది యంటకుఁడ రీ
తిగా నగు నుదీచ్యవృత్తి మె
చ్చుగ వాతాత్మజ సూరిసన్నుతా. ౧౧౬

౬. ప్రాచ్యవృత్తి.

అయిదవలఘు వంటి క్రింద మా
త్రయొసఁగ న్సరులఁ బ్రాచ్యవృత్తిఁ బొ
ల్చియు వైతాళీయజాతినొం
ది యిది యొప్పగున్ దేవ మారుతీ. ౧౧౭

౭. ప్రవర్తకము.

స్థిర న్మోద లుదీచ్యవృత్తియుం
బరఁగ సల్లఁ దగఁ బ్రాచ్యవృత్తియుం
జొరంగ యతిఁ జూడ నిట్లయె
వరుసతో నిడఁ బ్రవర్తకం బగున్. ౧౧౮

౮. పరాంతికము.

వ. వన్నె మీఱఁగఁ బ్రవర్తకాఖ్యతో
నున్న దాన సర్వ నుండులక్షణం
బన్ని యంఘ్రులను నంటఁగూర్పఁ దా
నెన్నఁగాఁ దనరు నీపరాంతికన్.

౯. చారుహాసిని.

కీ. కవు ల్పొగడఁగాఁ బ్రవర్తకా
ఖ్యవృత్తమునఁ గల్గుజేసి పా
దవై ఖరు ల్దాల్చు నంఘ్రులన్
జవాంచితా చారుహాసినిన్.

౧. చౌపద.

కీ. కదిసిచతుర్లఘుగణములలోను
బదము త్రిగణమై భానునితోను
దుదమొదలను బ్రాల్ దోలఁగకరాను
జదువఁగ నీయది చౌపది యౌను.

౨. వితాళమను చౌపదము.

రవియుగము చతుర్లఘుగణయుగము
నవులను నొకలఘు వై పదపదము
దవిలిన నదియె వితాళము క్రమము
జవర నౌను విశ్రమ మీవిధము.

౨. 3. కర్ణాటచౌపదము.

తగఁ బంచలఘుగణత్రయము రవిడాయ
మొగిఁ బుదలఁ బ్రాసముల్ మును గల్గఁజేయ
జగతి నిది కర్ణాటచౌపదచ్ఛాయ
యగు గణద్వయముపై యతి యాంజనేయ.

(౯ఁ ర్ష. షట్పద.

ప్రాసము ల్రా వర్లఁ బాసి యర్ధంబుల
వాసవష ట్కంబు పైశశియు

భాసిల్లఁ బాదంబు లేనూటి తోనుండఁ
జేసిన షట్పద దగుఁ గవీంద్ర. ౧౨౪

౫. త్రిపద.

౧౧౯

సురపతు ల్నాదల నల్వురు నిల్వ రెండవ
చరణ మింద్రద్వయి రవియుఁ
బరఁగుఁ ద్ర్యంఘ్రియు నట్ల త్రిపద. ౧౨౫

౬. ద్విపద.

సురపతు ల్మువ్వురు సూర్యుతోఁ గూడఁ
జరణ మొక్కొక్కట సమకూర్చి యతులు

౧౨౦

రెండింటిమీఁదఁ జేర్చినఁ దగు ద్విపద
దండితశాత్రవదైతేయ వీర. ౧౨౬

౭. మంజరి.

శ్రీ హనుమంతు సుస్థిరకీర్తిమంతుఁ
గపిలోకవరు స్వామికార్యార్థపరుని

౧౨౧

నుతియించుచోఁ బ్రాస యతు లిట్లు నడక
చరణాంతములనంటు శబ్దంబు లిడక
తెలిసి ప్రాసము లేని ద్విపద యై యుండ
నమరింప గానవిద్యాశాలి యైన
పవనజుం డెపుడుఁ జేపట్టు మంజరుల

౧౨౨

మార్గిఁ జేపట్టు నీమంజరు లలర. ౧౨౭

వ. మఱియు రగడ లన్నవి వైతాళీయభేదంబులఁ బెక్కులు గల వందు హయప్రచారము మొదలుగాఁ గల రగడలు ప్రసిద్ధంబు లైనవి నవ విధంబుల నుదాహరణాదిచాటుప్రబంధంబులందుఁ బ్రవర్తిల్లుచునుండు నవి యెయ్యవి యంటేని. ౧౨౮

౧౨౩

క. హరివర విను హయచారము
సరణి తురగవల్గనంబు జయమంగళముల్
ద్విరదగతియు జయభద్రమ
ధురగతి హరిహరిణవృషగతులు గృతులఁ దగున్. ౧౨౯

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు; పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు. ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు. ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు, (కోశాధ్యక్షులు)
పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ ,,
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ; ఎల్. టి.
దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. ఎల్.
ఆళక్కి వేంకట్రామయ్యగారు.
కేశవరపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మేంద్రరావునాయఁడుగారు.

# సగము వెల.

ఆంధ్రసాహిత్యపరిషత్తులోఁ బ్రచురింపఁబడిన నిఘంటువుతప్ప తక్కిన గ్రంథములును పరిషత్సంచికలును సగము వెలల కీయఁబడును. పుస్తకముల పట్టికకై వ్రాయుఁడు- పోస్టు రైలు ఖర్చులు వేరు.

---

## శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

—ప్రథమభాగము—

ఇది బహువిధముల నాంధ్రనిఘంటువు లన్నింటికంటె మిక్కిలి శ్రేష్ఠమైనది. సంస్కృతపదములకుఁ, దెనుఁగుపదములకుఁ వానిప్రయోగములకుఁ దడవికొననక్కఱలేదు. విద్యార్థులకుఁ గవులకు నీనిఘంటు వనేకవిధముల సమస్తసహాయమును జేయును.

సాదాప్రతి రు 5 లు. ఆర్టుపేపరు ప్రతి రు 7 లు.

## రఘునాథరామాయణము.

ప్ర థ మ భా గ ము.

తంజావూరు రఘునాథభూపాలుఁడు రచించినదానిలోని కొంత భాగము. ఈభూపాలునికే చేమకూర వేంకటరాజకవి విజయవిలాసము నంకితముచేసినది. ఈరాజకవి కవిత్వము మృదుమధురమైనది. కల్పనలతి మనోహరములు, పాఠకలోక మీతని ద్విపదనలచరిత్రమును, వాల్మీకిచరిత్రమును జదివియేయుందురు, కావున, మేము వేఱుగఁ జెప్పనక్కఱయుండదు.

వెల రు. 0-8-0.

ఆంధ్రసాహిత్య పరిషత్కార్యదర్శులు, కాకినాడ.

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.